# శ్రీ గీతా భావార్థ చంద్రిక





గ్రంథకర్త :

(శ్రీ. శే.) గరికపాటి లక్ష్మీకాంతంగారు
ఉపాధ్యాయ శిక్షణా కళాశాల (గుంటూరు) ప్రధానాచార్యులు

అర్జున ఉవాచ :

"శ్లో॥ యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః।
ధార్తరాష్ట్రా రణేహన్యు స్తన్మే క్షేమతరం భవేత్॥"
(అర్జున విషాద యోగః-అధ్యా 1, శ్లో. 46)



శ్రీ భగవాన్ ఉవాచ :

"శ్లో॥ కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్।
అనార్య జుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున॥"

శ్లో॥ క్లైబ్యం మాస్మగమః పార్థ। నైతత్త్వ య్యుపపద్యతే।
క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప,"
(సాంఖ్య యోగః-అధ్యా 2; శ్లో. 2-3)

# శ్రీ గీతా భావార్థ చంద్రిక



THIS BOOK IS PUBLISHED WITH THE FINANCIAL
ASSISTANCE OF TIRUMALA - TIRUPATI DEVASTHANAMS
UNDER THEIR SCHEME AID TO
PUBLISH RELIGIOUS BOOKS

కృతికర్త :

(కీ.శే.) గరికపాటి లక్ష్మీకాంతం గారు

(ఉపాధ్యాయ శిక్షణా పాఠశాల ప్రధానాచార్యులు)

గుంటూరు

ప్రచురణ కర్త :

గరికపాటి దక్షిణామూర్తి (జ్యోతిష - వాస్తు విద్వాంసులు)

మల్కాజిగిరి-500 047 (రంగారెడ్డి జిల్లా-ఆం.ప్ర.)

1994 ప్రచురణ

వెల : రూ. 60-00





1000 ప్రతులు

ఈ గ్రంథము తిరుమల-తిరుపతి దేవస్థానము వారిచే
రూ. 15,000 ఆర్థిక సహాయము పొంది ప్రచురించబడినది.



ముద్రణ :
చారీ అండ్ కంపెనీ
9-4-9, ఛార్లెస్ స్ట్రీట్,
సికింద్రాబాదు.



శ్రీశ్రీశ్రీ జగద్గురు శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య వర్యేత్యాది సమస్త
బిరుదావళీ విరాజమాన శ్రీ పుష్పగిరి పీఠాధీశ్వరులు శ్రీమదభినవోద్దండ
శ్రీ విద్యానృసింహ భారతీస్వామివారు



# నామాట....

రామాయణ-భారతేతిహాసముల ఆవిర్భావమును బాగుగా పరిశీలించినచో, "విషాదము" ప్రధాన హేతువుగా ఉద్భవించినవని అవగతమవుతుంది. అటులనే, భారతాంతర్గతమైన "శ్రీమద్భగవద్గీత" కూడ "అర్జున విషాదయోగము" తో ప్రారంభింపబడినది.

దీనినిబట్టి, మనం సూక్ష్మ పరిశీలన చేసికొంటే, మానవుడు పుడుతూనే 'విషాద' (ఏడ్పు) యోగాన్ని ప్రారంభించి, తుట్టతుదకు మోక్షాన్ని (మరణం ద్వారా) పొందుతాడని, వేదవ్యాస భగవానునిచే రచింపఁబడిన "శ్రీమద్భగవద్గీత"లోని 18 అధ్యాయాలను అధ్యయనం చేస్తే, ఎవరికి వారు సులభతరంగా గ్రహించవచ్చునని నా తలంపు.

ప్రస్తుతం మీ ముందున్న "శ్రీగీతాభావార్థ చంద్రిక" రచనకు గూడా ప్రధాన ప్రేరణ "విషాదమే". ఈ 'విషాదం' ఒక సద్వంశాన్ని ఆమూలాగ్రం కదిలించి, నభోమండల స్థితినుండి, పాతాళానికి చేర్చింది. దీనికి దైవలీలతో బాటు, మత్సరగ్రస్థులయిన మానవుల చర్యలు గూడా తోడయినాయి. కాని, 'హాలాహలం' నుండి 'అమృతాన్ని' అందించే తత్త్వంగల మా పితృపాదులు (కీ.శే.) గరికపాటి లక్ష్మీకాంతం గారు, విషాదాన్ని దిగమింగి, "శ్రీగీతాభావార్థ చంద్రిక" రచన ద్వారా 'లోక కల్యాణాన్ని' కాంక్షించారు. వారి 'ఆకాంక్ష' గ్రంథరూపం దాల్చటానికి అర్థశతాబ్దకాలం పట్టింది.

ఈనాడు 'శ్రీగీతాభావార్థ చంద్రిక' గ్రంథరూపంలో మీ ముందుకు రావటానికి, ఎందరెందరో, సద్భావనాయుతులయిన మహానుభావుల ప్రేరణ, తోడ్పాటు ప్రధానహేతువని ఈ సందర్భంగా మనవి చేసికొంటూ, వారందరికీ నా మనఃపూర్వక-కృతజ్ఞతాబద్ధ నమస్సుమాంజలిని అర్పించుకొంటున్నాను.

ఈ సందర్భంగా-ముఖ్యంగా నా బాల్యమిత్రుడు చి॥ కంభంపాటి గోపాలకృష్ణమూర్తి నా కందించిన, ఎనలేని-అమృత తుల్యమైన సహాయ-సహకారములు, "శ్రీగీతాభావార్థ చంద్రిక" ముద్రణా రూపంలో మీముందుంచటానికి ప్రధాన హేతువని, ఈ సమయంలో పేర్కొనటం నా కనీస ధర్మంగా భావిస్తూ, వయోరీత్యా నాకన్న పిన్నయైన, నా మిత్రుని-అతని కుటుంబాన్ని ఆ శ్రియఃపతి కరుణా కటాక్ష వీక్షణములతో రక్షించుగాక యని వేడుకొంటూ, నా మనఃపూర్వక ఆశీస్సులందిస్తున్నాను.

ఇంకను, ఈ గ్రంథం, ప్రకాశన మొనర్చుటలో, నాకు ఎంతో విలువైన సహాయ-సహకారము లందించిన-నాకు గురుతుల్యులయిన బ్రహ్మశ్రీ చింతలపాటి సుదర్శన శ్రీనివాసశాస్త్రి గారికి నా హృదయపూర్వక నమస్కారములు తెల్పుకొంటున్నాను. లాభాపేక్ష ఇసుమంతయు లేకుండా, నాయందు గౌరవ-వాత్సల్యాభిమానములుంచి, ముద్రించిన చారీ అండ్ కంపెనీ వారికి, ఆ శ్రీమహావిష్ణు అనుగ్రహం లభించాలని ఆశిస్తున్నాను.

"శ్రీ గీతాభావార్థ చంద్రిక" ముద్రణకు ముందే, శ్రీ శ్రీ శ్రీ జగద్గురు శ్రీమత్పరమహంస, పరమపూజ్య పరివ్రాజకాచార్యులు, శ్రీ పుష్పగిరి పీఠాధీశ్వరులు, శ్రీమదభినవోద్దండ శ్రీ విద్యా నృసింహ భారతీస్వామివారు, నాయందు పరిపూర్ణ శిష్య

వాత్సల్యాన్ని ప్రకటించి, "శ్రీ గీతాభావార్థ చంద్రిక" ముద్రించి, పితృఋణ విముక్తిని సాధించవలసినదిగా నారాయణ-స్మరణ పూర్వకముగా ఆశీర్వదించుటే గాక, ఆశీః పత్రికను ప్రదానము చేసి, నాపై తమ అవ్యాజ కరుణను కటాక్షించినారు. శ్రీవారి దివ్య పాదపద్మములకు, నా కృతజ్ఞతాబద్ధ నమస్సుమాంజలి సర్పించుకొనుచున్నాను.

'శ్రీ గీతాభావార్థ చంద్రిక' రచనారంభము నందు, మా పితృపాదులు 'విజ్ఞప్తి' యందు మూడవ పద్యములో "కృష్ణగీత" అని పేర్కొని యుండిరి. అర్ధశతాబ్ది క్రింద వారు రచించినపుడు, "కృష్ణగీత" పదమును వారే యర్థముతో ఉటంకించిరో నాకు తెలియదు. అయినను, నేను, చదివి అర్థము చేసికొనిన ప్రకారము, శ్రీకృష్ణ భగవానుడు 'గీతోపదేశము' ద్వారా, మానవు లాచరించి ఉద్ధరింపఁబడుటకు గాను, కొన్ని కొన్నిచోట్ల ఆజ్ఞాపూర్వక ఆదేశముల నొసంగినారనియు, అవి మనకు శిరోధార్యములే గాక; అతిక్రమించినచో పాపపంకిలమున బడిపోదుమనియు, కనుక, తాను పేర్కొనిన ప్రకారము ఆచరించి, జీవితములను ఆనందమయము గాను, ధన్యత గాంచు విధముగాను గ్రహించి, జన్మసాఫల్యతను పొందవలసినదిగా బోధించిరను భావముతో - 'కృష్ణగీత' 'లక్ష్మణరేఖ' వంటిదని పేర్కొని యున్నాను. ఇందు ఏదైన విపరీతార్థము విద్వాంసులకు అవగతమగుచో, దీనిని, నా కించి దజ్ఞతగా భావించి, సైరింతురని తలంచుచున్నాను.

'ప్రమాదో ధీమతామపి' అన్న ఆర్యోక్తి, జ్ఞప్తియందుంచుకొని, ఎంతటి జాగ్రత్త వహించినను, కొన్ని కొన్ని దోషములు నా కనుచూపును భ్రమింపజేసి, దొరలియుండ వచ్చును. వాటిని, నా పొరపాట్లుగా గ్రహించి, రచయితకు ఆపాదింప కుందురు గాక యని కవి పండిత శ్రేష్ఠులను వేడుకొనుచున్నాను.

చివరగా, ఈ ప్రచురణకు అనేక విధములుగా సహకరించిన సహృదయులందరికీ, నా కృతజ్ఞతా పూర్వక ప్రణామముల నర్పించుచు, చతుర్దశ భువనాధినేతయు, సృష్టికర్త-భర్త-భోక్తయునగు ఆ శ్రీ మహావిష్ణువు, తన వాత్సల్య పూరిత కృపారసమును అందరిపై చిలికించి, ధన్యజీవులుగా నొనరించుగాతయని వేడుకొంటున్నాను. ఈ గ్రంథానికి వన్నె తెచ్చునట్లుగా, ప్రతి పేజీ పైనను ముద్రింపబడిన 'గీతోపదేశం' చిహ్నాన్ని, విశ్వరూపము, గీతోపదేశ చిత్రాలను, గ్రంథనామాన్ని బహుసుందరంగా లిఖించి, చిత్ర రచన చేసిన శ్రీ పోచంపల్లి బ్రహ్మచారి గారికీ; నాలుగు దశాబ్దాలుగా నాకు అత్యంత ఆప్తమిత్రుడు, సరళ హృదయుడైన శ్రీ సోమవరంపేట రామమూర్తిగారు, (మూర్తీ ప్రాసెస్, సికింద్రాబాద్) బ్లాకులు, ఆఫ్‌సెట్ ముద్రణకు అవసరమైన నెగటివ్‌లు యిచ్చి, గ్రంథ ప్రచురణా యజ్ఞంలో తమ సహకారాన్నిచ్చినందుకు, శ్రీ రామమూర్తి గారికీ-ఇంకా, నేను పేర్కొనక పోయినను నాకు అత్యంత విలువైన సహాయ మందించినవారికీ - అందరికీ శ్రీ మహావిష్ణువు అనుగ్రహం లభించి, సుఖశాంతులు కలుగు గాక యని కోరుకొంటున్నాను.

ఇట్లు
బుధజన విధేయుడు
**గరికపాటి దక్షిణామూర్తి**

శ్రీ శ్రీ శ్రీ జగద్గురు

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్యేత్యాది సమస్త బిరుదావళీ విరాజమాన

శ్రీ పుష్పగిరి పీఠాధీశ్వరులు శ్రీమదభినవోద్దండ

## శ్రీ విద్యానృసింహ భారతీస్వామివారు

అస్మదత్యంత ప్రియశిష్యులు

### శ్రీ గరికపాటి దక్షిణామూర్తి వారికి

ఆశీః పరంపరా పూర్వకముగా వ్రాయించి పంపు

నారాయణ స్మరణ పత్రిక. అనన్తరమ్

మీ తండ్రిగారైన శ్రీ లక్ష్మీకాంతంగారిచే రచించబడిన భగవద్గీతా ఆంధ్ర పద్యానువాదమును స్థాలీపులాక న్యాయంగా పరిశీలించితిమి. ప్రతిశ్లోకమున కొక పద్యముగ సుందరముగ రచించిరి. పద్య రచన హృద్యముగ, మనోజ్ఞముగ నున్నది.

మహాభారతం పంచమవేదం. పంచమవేదమయిన మహాభారతానికి మకుటాయమానమైనదీ భగవద్గీత. అర్జునునకు గల్గిన చిత్త వైక్లబ్యాన్ని బోగొట్టి స్వస్థతను జేకూర్చి కార్యోన్ముఖుని జేసిన దివ్యౌషధము.

ఇట్టి వైక్లబ్యం సమస్యలు సాధకులకు సామాన్యము. అట్టి వారి నుద్దేశించి శ్రీకృష్ణుడు స్వయంగా అనుగ్రహించిన దివ్యరసాయనం. ఇట్టి రసాయనాన్ని తెలుగు ప్రజలు సేవించి సుఖశాంతులు బొందుదురు గాక.

శుభం భవతు.

బేగంపేట,

భాగ్యనగరం

ది.10-4-1993

ఇతి

నారాయణ స్మృతయః

శ్రీ విద్యానృసింహ భారతీస్వామినః

# ఒక చిన్నమాట..

బ్రహ్మశ్రీ చింతలపాటి సుదర్శన శ్రీనివాసశాస్త్రిగారు
('కామకోటి' మాసపత్రిక మాజీ సంపాదకులు; పుష్పగిరి పీఠ అంతేవాసులు)

'అహంకారాన్ని' తనపై వేసుకోవడం 'కర్మ' మార్గం; భగవంతుడిపై నెట్టివేయడ 'భక్తి' మార్గం; అహంకారాన్ని పూర్తిగా నశింపజేసుకోవడం 'జ్ఞాన' మార్గం.

వేద విహితమైన స్వధర్మానుష్ఠానం ద్వారా చిత్తైకాగ్రతను పొంది, గురువు శాస్త్రముల ద్వారా జ్ఞానాన్ని సంపాదించుకొని, జీవునికి-ఆత్మకు మధ్యలో ఉం అంతరాన్ని నశింప చేసుకోవడం, ఉపాధి పొందిన ప్రతిజీవికీ తక్షణ కర్తవ్యం. ఉపాధి పత పర్యంతం కర్మలను విధిగా ఆచరిస్తూ ఉండవలసిందే కాని, కర్మఫలాన్ని మాత్ర విడిచిపెట్టాలి.

"మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామే వైష్యసి యుక్త్వైవ మాత్మానమ్ మత్పరాయణః". (భగవద్గీత-9అ-34శ్లో

"నీ మనస్సు నాయందే లగ్నం చెయ్యి. నా కొరకై యజ్ఞం (కర్మలు) చెయ్యి నాకే నమస్కరించు. ఇట్లు నాయందు అనన్యమైన భక్తి తాత్పర్యంతో, తదేక నిష్ఠక మనస్సుతో నన్నాశ్రయించితే, నన్ను పొందగలవు"-ఇది గీతా రహస్యం; గీతాసారం.

ఈ గీతాఫలాన్ని తాను ఆరగించుచూ, అందరితో ఆరగింప జేయాలనే సంకల్పంతో అర్థశతాబ్దానికి పూర్వం, (కీ.శే.) గరికపాటి లక్ష్మీకాంతంగారు సరళమైన తెలుగు పద్యానువాదాన్ని తమ అనుభవంతో మేళవించి 'పుటం' వేశారు. పితృదేవుల కిచ్చిన మాటను నిలుపుకోవ టానికి వారి కుమారులు - హనుమదుపాసకులు, అనుభవిక-ప్రామాణిక జ్యోతిష్కులును నైన బ్రహ్మశ్రీ గరికపాటి దక్షిణామూర్తి గారు, యాభై సంవత్సరాల పుటంలోంచి బయటకు తీసి, ఆ గీతా రసాయనాన్ని ఆంధ్ర జనులకు అందించాలనే ఆరాట ఫలితమే ఈ పుస్తక రూపం.

ఈ సందర్భంగా నేను దర్శించిన ఒక అద్భుతమేమంటే - బేగంపేటలోని తమ ఆశ్రమంలో, నూతనంగా నిర్మింపబడుతున్న శివాలయంలో శ్రీ శ్రీ శ్రీ పుష్పగిరి పీఠాధీశ్వరులు, శ్రీ శ్రీ శ్రీ జగద్గురువులు శ్రీమదభినవోద్దండ శ్రీ విద్యానృసింహభారతీ స్వామివారు, ఈ గ్రంథానికి నారాయణ స్మరణ పూర్వక పరిచయం వ్రాయటానికి ఉపక్రమించటం, దానికి సాక్షీభూతంగా ఉమామహేశ్వరులు స్వయంగా పర్యవేక్షించటం, ధర్మవిగ్రహుడైన శ్రీ రామచంద్రమూర్తి బంటు హనుమంతుడు స్వయంగా వచ్చి తిలకించటం, ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని, ఈ గ్రంథ ప్రకాశకుని పితృభక్తిని వెల్లడి చేస్తోంది.

అలాగే, వీరు తమ తండ్రిగారు వ్రాసిన "అపరోక్షానుభవము" ను గూడా వెలుగులోకి తేవాలనీ; అందుకు సహృదయులందరూ తోడ్పడాలనీ ఆశిస్తున్నాను.

హైదరాబాదు
ది.11-4-1993

(సం.) చింతలపాటి సుదర్శన శ్రీనివాసశాస్త్రి

# కృతి సమర్పణము



కం. భూవలయ నాక *తలముల
కావాస ముదరముగల - హరి కి గీతా
భావార్థ చంద్రికను సం
భావనచే నర్పణంబు - మది నొనరింతున్.

రచయిత

* తలము = పాతాళము



'కామకోటి' మాసపత్రిక మాజీసంపాదకులు కొల్లూరు, (గుంటూరుజిల్లా)
వేదపరిషత్ మాజీ కార్యదర్శి, అనేక "సుందరయాగ" (సుందర
కాండ సప్తాహ పారాయణ క్రతువు) నిర్వహణాదక్షులు, పురాణ-
ప్రవచనా ప్రవీణులు, సుమనస్కులు, సహృదయులు

**బ్రహ్మశ్రీ చింతలపాటి సుదర్శన శ్రీనివాసశాస్త్రిగారు**

"శ్రీ గీతాభావార్థ చంద్రిక" ప్రచురణకర్త గరికపాటి దక్షిణామూర్తి
పితామహీ పితామహులు, మాతాపితరులు



(ఎడమ నుంచి కుడి వైపు) కుర్చీలోఆసీను లైనవారు (కీ.శే.) బ్రహ్మశ్రీ గరికపాటి వేంకట సుబ్బారాయశాస్త్రిగారు (వారిప్రక్కన ఆసీనులైనవారు-వారి ధర్మపత్ని) అన్నపూర్ణమ్మగారు (వెనుక వైపు నిలుచున్నవారు) (కీ.శే.) గరికపాటి లక్ష్మీకాంతంగారు; వార ధర్మపత్ని లక్ష్మీనరసమ్మగారు.



గుంటూరు పట్టణంలోని స్టాల్స్ ట్రైనింగ్ స్కూల్ ప్రధానాచార్యులుగా
బ్రహ్మశ్రీ గరికపాటి లక్ష్మీకాంతంగారు



ప్రచురణకర్త శ్రీ గరికపాటి దక్షిణామూర్తిగారు
(వారి ధర్మపత్ని) శ్రీమతి కామేశ్వరమ్మగారు.

# "గరికపాటి" వంశచరిత్ర

[ఆంధ్రదేశంలో బ్రాహ్మణాగ్రహారము లెన్నో ఉన్నవి. అందులో గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకాలోని 'గరికపాడు' అగ్రహారము ప్రాశస్త్యము గలది. దురదృష్టవశాత్తు-లోకంలో, మా గరికపాడు అగ్రహారమును గూర్చిన వింతకథలు, మా వంశ ప్రతిష్ఠను దిగజార్చునవిగా నుండుటచేత; మా వంశీకులును, పరిశోధకాగ్రగణ్యులును, విద్వత్కవి పండిత శ్రేష్ఠులును నగు, (కీ.శే.) ఆచార్య శ్రీ గరికపాటి లక్ష్మీకాంతయ్యగారు, ఎం.ఎ. (విద్వాన్) (హైదరాబాదులోని నిజాం కళాశాలలో ఆంధ్రశాఖాధ్యక్షులుగా పదవీ విరమణ చేసిరి.), విశేష పరిశ్రమ యొనర్చి, మా వంశము, విద్వత్కవి పాండితీ ప్రాభవములకు ఆలవాలమనియు, మా పూర్వీకులనుండియు వేదవేదాంగ విద్యావిషయికంగా పేరు ప్రఖ్యాతులు కలవారమనియు, సప్రమాణముగా నిరూపించినారు.

ఆచార్య శ్రీ గరికపాటి లక్ష్మీకాంతయ్యగారు 1976 సం॥లో ప్రకటించిన "శ్రీ శారదా వ్యాస మణిహారము" నందు 'గరికపాటి' వంశచరిత్రను గూర్చిన పరిశోధక వ్యాసమును "గరికపాటి అన్నంభట్టు" అను పేర ప్రకటించినారు. శ్రీ లక్ష్మీకాంతయ్యగారిప్పు డిహలోకమున లేకున్నను, ఒక గొప్ప పేరు ప్రతిష్ఠలు గల వంశమును గూర్చి వారొనర్చిన అనితర సాధ్యమైన పరిశోధనకు అవనత శిరస్కుడనై అంజలి ఘటించుచు, రాబోవు నా వంశీకులు మా వంశమునకు గల కీర్తిప్రతిష్ఠలకు మచ్చరాని విధముగా మెలగి, తమ పూర్వుల అమోఘాశీర్వచనములను పొంది సుఖింతురు గాక యని అభిలషిస్తున్నాను. ఇతిశమ్.]

– గరికపాటి దక్షిణామూర్తి

గోత్ర ప్రవర : కౌశిక-విశ్వామిత్ర-అఘమర్షణ త్రయార్షే ప్రవరాన్విత కౌశిక సగోత్రః-గరికపాటి వంశోద్భవః .......(గరికపాటి – 'క' – 'కి' గాదు, 'కె' గాదు)

# గరికపాటి అన్నంభట్టు

గరికపాటి అన్నంభట్టు ఆంధ్ర బ్రాహ్మణుడు. వేదశాస్త్ర పండితుడు. నవీన నైయాయికులలో అగ్రగణ్యుడు. అన్నంభట్టు తండ్రి కవరీశ్వరభట్టు. తాత సర్వదేవభట్టు. మూలపురుషుడు మామిళ్ళపల్లి రాఘవ సోమయాజి. భట్టశబ్ద మానాడు మహా విద్వాంసుల కొసగబడుచున్న బిరుదము. (శ్లో॥ మామిళ్ళపల్లి రాఘవ సోమయాజ్యన్వవాయినే। శ్రీ సర్వదేవ భట్టస్య పౌత్రాయామిత తేజసే। కవరీశ్వరభట్టస్య సూనవే సూనృతోక్తయే। (గ. అ. తా. శా.)

విజయనగర సామ్రాజ్య స్థాపనానంతరము ఆంధ్ర బ్రాహ్మణ కుటుంబము లనేకములు దక్షిణ-దేశమునకు వెడలెను. అట్టి కుటుంబములలో అన్నంభట్టు

కుటుంబ మొకటి. అన్నంభట్టు పూర్వులకు 'మామిళ్ళపల్లి' అను గృహనామము- మామిళ్ళపల్లి యను ఒకానొక గ్రామమును బట్టి ఏర్పడి యుండవచ్చును.

అన్నంభట్టు పూర్వులు నివసించిన మామిళ్ళపల్లి యను గ్రామమెద్ది అను విషయము విచారింపదగినది. గుంటూరు మండలములో తెనాలి తాలూకాయందు మామిళ్ళపల్లి యను గ్రామ మొకటి కలదు. అందు నేటికిని మామిళ్ళపల్లి యను గృహనామము కల వెలనాటి బ్రాహ్మణ కుటుంబము లున్నవి. తెలంగాణమున మహబూబునగరం జిల్లాలో మరియొక మామిళ్ళపల్లి ఉన్నది. నేడిందు మామిళ్ళపల్లి యను ఇంటిపేరుకల బ్రాహ్మణులు లేరు. ఐనను అన్నంభట్టు తెలగాణ్య శాఖకు చెందిన బ్రాహ్మణుడై యుండుట చేత, ఆతని వంశమునందలి ప్రాచీనులు ఈ తెలంగాణమందలి మామిళ్ళపల్లి యందే నివసించి యుండిరనియు, మామిళ్ళపల్లి యందుండుటచే మామిళ్లపల్లి వారనియు, తెలంగాణము నందుండుటచే తెలగాణ్యు లనియు ప్రసిద్ధినొంది యుండిరనియు ఊహింపవచ్చును. నేడు వారీ మామిళ్ళపల్లి యందు లేకుండుటకు కారణము వారందరును స్థలాంతరములకు వలసపోయి యుండుటయే కావచ్చును. ఇట్లు తెలంగాణము నుండి వలసపోయిన మామిళ్ళపల్లి వారిలో కొందరు కడప జిల్లాలోని ప్రొద్దుటూరు నందు స్థిరపడిపోయిరి. అన్నంభట్టు వంశస్థులైన పెద్దలు ఉత్తర ఆర్కాటు నందలి చిత్తూరునకు చేరువనున్న ఒకానొక గ్రామమందు నివాస మేర్పరచుకొనిరి. అక్కాలమున తెలుగునాడు ఉత్తర ఆర్కాటు మండలము వరకు వ్యాపించి యుండెను.

అన్నంభట్టు బాల్యమున విద్యాశూన్యుడై ఉండెననియు, తండ్రి ఆతనిని తిట్టి కొట్టెననియు, అపుడాతడు స్వగృహ త్యాగమొనర్చి సమర్థులగు గురువులను శుశ్రూషించి వేదశాస్త్రములను అభ్యసించి, కాశికేగి అచట శేష వీరేశ్వర పండితుని ఆశ్రయించి శబ్దశాస్త్రము నేర్చుకొని సంపూర్ణ విద్యాశోభితుడయ్యెననియు ఒక ఐతిహ్యము కలదు. కాశియందు అన్నంభట్టు పొందిన అనన్య సామాన్య గౌరవము "కాశీ గమన మాత్రేన నాన్నంభట్టాయతే ద్విజః" అను అభిజ్ఞోక్తిచే తేటపడుచున్నది.

ఇట్లు ప్రసిద్ధ పండితుడైన అన్నంభట్టు స్వగ్రామమునకేగి తాను స్థాపించిన కొండవీటి శాస్త్ర పాఠశాలయందు యోగ్యులైన విద్యార్థులకు తర్కశాస్త్రమును బోధింపదొడగెను. ఇట్టి స్థితిలో విజయనగర సామ్రాజ్య సింహాసనము నధిష్ఠించిన సదాశివరాయలు -సర్వధర్మ రహస్యార్థ వేదియును, ప్రఖ్యాత పెమ్మసాని తిమ్మనాయుని కొడుకును అయిన తిమ్మనాయకునిచే సవినయముగ విజ్ఞాపితుడై, అత్యంతా నందముతో పురోహిత పురస్కృత వివిధ శాస్త్ర పారగులయు, శ్రౌత విద్యానిధులయు సమక్షమున తుంగభద్రా తీరమున, శ్రీ విరూపాక్ష సన్నిధియందు, ఏకభోగ్యమును

నిధి నిక్షేపాది సంయుతమును వాపీకూప తటాకారామపంచక శోభితమును సుంక తలారి ప్రభృత్యాదేయములతో కూడినట్టిదియు, అష్టదిక్కులయందు అష్ట గ్రామములతో పరివృతమైనట్టిదియునైన 'గరికపాడు' అను గ్రామమును పుత్రపౌత్రాది పర్యంతముగ ఆచంద్రార్కముగ దాన వినిమ యాది సర్వాధికారములతో సహిరణ్యోదక ధారా పూర్వకముగ దత్త మొనర్చెను.

(శ్లో॥ గ్రామం గరికపాడ్వాఖ్యం సర్వసస్యోపశోభితం ।
సర్వాదాయై స్సదా సుంక తలారి ప్రముఖై ర్యుతం ॥
బెల్లంకొండ మహారాజ్యే ప్రాజ్యేవాస ముపాశ్రితం ।
ప్రఖ్యాత శ్రీ వేలనాడు విఖ్యాతై రధికాశ్రితం ॥
శ్రీ బెల్లంకొండ శైలాచ ప్రాగ్దిశం సముపాశ్రితం ।
కాకర్లవాని పాల్యా ఖ్యాగ్నేయాం దిశ ముపాశ్రితం ॥
తక్కెళ్ళపాడు గ్రామాచ్చ దక్షిణాం దిశమాశ్రితం ।
ప్రత్తిపాడు వర గ్రామా న్నైరుతీం దిశ మాశ్రితం ॥
తాళ్లూరు నామక గ్రామా త్పశ్చిమాం దిశ మాశ్రితం ।
గుడిపాడు వర గ్రామాద్వాయవ్య దిశ మాశ్రితం ॥
నందిపాడు వర గ్రామా దుత్తరా దిశ మాశ్రితం ।
గ్రామాన్నాగవర ప్రఖ్యా దీశాన్య దిశ మాశ్రితం ॥
కాకర్లవాని పాలీయ విఖ్యాతాహ్వయ సంయుతం ।
చిన భీమ వరాభిఖ్యా మపరాం సముపాశ్రితం ॥
సర్వమాన చతుస్సీమ సంయుతం చ సమంతతః ।
నిధినిక్షేప పాషాణ సిద్ధసాధ్య జలాన్వితం ॥
అక్షీణాగామి సంయుక్త మేకభోగ్యం సభూరుహం ।
వాపీకూప తటాకైశ్చ పంచారామైశ్చ సంయుతం ॥
పుత్ర పౌత్రాదిభి ర్భోగ్యం క్రమాదాచంద్రతారకం ।
దానార్థమనఘ ప్రీతి యోగ్యం వినిమయోచితం ॥).

తానొర్చిన దాన విషయమును సదాశివరాయలు దేవనాగరీ లిపిలో సంస్కృత శ్లోకములతో ఒక గద్యముతో ఆరు పుటలు గల మూడు తామ్రశాసన పత్రములపై చెక్కించెను. ఆ మూడు తామ్రపత్రములను జోడించు నొక కడియముపై భూవరాహ ముద్ర వేయబడినది. ఈ శాసనము మృడపదమను సంజ్ఞ కలది. ఈ శాసనము "నమస్తుంగ శిరశ్చుంబి చంద్ర చామర చారవే । త్రైలోక్య నగరారంభ మూల స్తంభాయ శంభవే॥" అను శివస్తుతిపర శ్లోకముతో ఆరంభింపబడినది. ఈ

శాసన శ్లోకాదులను విషయానుగుణముగా స్పష్టోచ్చారణముతో మధుర గంభీర స్వరముతో సదాశివరాయలచే ఆజ్ఞాపితుడై సభాముఖమున చదివిన విద్వాంసుడు 'స్వయంభువు' అను సభాపతి. శాసన శ్లోకములను వ్రాసిన కవియు పండితుడును ఇతడే యై యుండెనేమో !

(శ్లో॥ మృడపదమితి తామ్ర శాసనార్థం మహిత సదాశివరాయ శాసనేన।
అఫణ దనుగుణవచో మహిమ్నాక్షర....సభాపతి స్స్వయంభూః॥)

శాసనము తుదియందు ఇది అమిత దానరతుడగు సదాశివ క్షితిపతి శాసనము అని వ్రాయబడియున్నది. ఈ శాసన విషయమును తామ్రపత్రములపై చెక్కినవాడు సదాశివరాయల భృత్యుడును వీరనాత్మజుడునైన వీరనాచార్యుడు.

(శ్లో॥ సదాశివ మహారాయ శాసనా ద్వీరనాత్మజః ।
భృత్య శ్రీ వీరనాచార్యో వ్యలిఖత్తామ్ర శాసనం).

ఈ శాసనము నందలి శ్లోకములను గద్యమును తెలుగు లిపిలో కాగితములపై వ్రాయించిన మహనీయుడు వేమూరి వేంకట్రామా మాత్యుడు. ఈ శాసన విషయమునకు తెలుగులో టీక వ్రాసిన మనీషి కోపురాడ్వంశోద్భవుడైన నరసింహ కవి.

(శ్లో॥ శ్రీమద్భూమి ధరాత్మజావర కృపా పూర్ణేన
శ్రీ కోపురాడ్వంశావిర్భవ నారసింహ కవినా టీకాకృతా నన్ముదే ।
పూర్వం రాయ కృపార్పితే గరికపాడాఖ్యాగ్రహారే కృత
శ్లోకానాం పటు తామ్ర శాసన యుజా మాంధ్రోక్తిభి స్సాదరం.)

దాన మొసగఁబడిన తేది శాలిశకము 1482 (క్రీ.శ. 1560). దీనిని బట్టి అన్నంభట్టు 16వ శతాబ్ది మధ్య భాగమున నున్నవాడని విదిత మగుచున్నది.

(శ్లో॥ నాసత్యానేక పాబ్ధీందు గణితే శకవత్సరే ।
సిద్ధార్థి నామకే పక్షే మాసే చాషాఢ నామని ।
వలపక్షే (చ) ప్రథమ ద్వాదశ్యాం గురువాసరే ।
తుంగభద్రా నదీతీరే విఠలేశ్వర సన్నిధౌ).

గరికపాడు బెల్లంకొండ మహారాజ్యమున నుండెను. అది బెల్లంకొండ దుర్గమునకు తూర్పునను, కాకర్లవాని పాలెమునకు ఆగ్నేయదిశ యందును, తక్కెళ్లపాడు గ్రామమునకు దక్షిణదిశ యందును, ప్రత్తిపాడు గ్రామమునకు నైరృతి దిక్కునను,

తాళ్లూరు గ్రామమునకు పశ్చిమ దిశయందును, గుడిపాడు గ్రామమునకు వాయవ్య దిశయందును, నందిపాడు గ్రామమునకు ఉత్తర దిశయందును, నాగవర గ్రామమునకు ఈశాన్య దిశయందును ఉన్నట్లు శాసనమున చెప్పబడియున్నది. ఈ గరికపాడు గ్రామమునకు కాకర్లవాని పాలెమనియు, చిన భీమవర మనియు మరి రెండు నామములు.

ఈ దాన శాసనము నందలి వర్ణన మాధారముగ అన్నంభట్టు కౌశికాన్వయ సంజాతుడు; వాది వారణ పంచాననుడు; ఆపస్తంబసూత్రి, యశస్వి, యజుశ్శాఖాధ్యాయి; అభీష్టప్రదాత; యజనాది షట్కర్మ నిరతుడు; అర్థిముఖ సముల్లాస దినకరుడు, పదవాక్య ప్రమాణాది ప్రజ్ఞాతిశయశాలి; ఉపనిషద్వరాభరణ హరిచరణ ధ్యానరతుడు; బ్రహ్మవిద్యా పారగుడు; నానాశాస్త్రార్థ నిర్ణయ నాక నాయక మంత్రి; నీతి మార్గోపదేశకుడు, పరోపకార కరణచణుడు; నిగమార్థ నిర్ణేత; పుణ్యమూర్తి, అజపాసరోవర రాజహంస.

(శ్లో॥ కౌశికాన్వయ వారాశి కల్పభూమి మహాత్మనే ।
వాది వారణసింహాయ వరాపస్తంబ సూత్రిణే ।
యశస్వినే యజుశ్శాఖాధ్యాయినే భీష్టదాయినే ।
యజనాదిక షట్కర్మయుత మాన ప్రవృత్తయే ।
............................ సముల్లాస వివస్వతే ।
పదవాక్య ప్రమాణాది ప్రజ్ఞాతిశయ శాలినే ।
ఆశయే చరణాంభోజం హరే రుపనిషద్వరా ।
భరణం వహతే జప్ర మజపాదివ్య హంసకే ।
బ్రహ్మవిద్యా ప్రబంధేషు గాఢాం ప్రౌఢి ముపేయుసే ।
సామాజిక సుధా మేధాకారిణే జ్ఞానశాలినే ।
నానాశాస్త్రార్థ నిర్ణీత నాక నాయక మంత్రిణే ।
నిర్ణీత నిగమార్థాయ నీతిమార్గోపదేశినే ।
పరోపకార పారీణ వృత్తయే పుణ్యమూర్తయే ॥)

ఈ దాన శాసనమున విజయనగర సామ్రాజ్యాధిపతుల వంశాభివృద్ధి క్రమము వర్ణింపబడియున్నది. వీరి వంశము చంద్రునితో ఆరంభమైనది. చంద్రుని కొడుకు బుధుడు, బుధుని కొడుకు పురూరవుడు, పురూరవుని కొడుకు ఆయువు. ఆయువు తనయుడు యయాతి. యయాతి కొడుకు దుర్వసుడు. దుర్వసుని ఆత్మజుడు తిమ్మరాజు. తిమ్మరాజు కొడుకు బుక్కభూపతి. బుక్కభూపతి సుతుడు ఈశ్వరరాజు. ఈశ్వరరాజు కొడుకు నరసరాజు. నరసరాజునకు తిప్పాంబ యందు

వీరనృసింహదేవరాయలు, నాగమాంబ వలన శ్రీకృష్ణదేవరాయలు, ఓబమాంబ వలన రంగక్షితీంద్రుడు, అచ్యుత దేవరాయలు పుట్టిరి. అచ్యుత దేవరాయల కుమారుడు వేంకట దేవరాయలు. వేంకట దేవరాయలకు పుత్రసంతతి లేని కారణమున ఆతని భగినీ భర్తయు 'జగత్త్రాతగా' కర్ణాటక సామ్రాజ్య భారవోఢగా, క్షత్త్రాలంకార భూతుడుగా విఖ్యాతుడైన అళియరామరాయలు మంత్రుల తోడ్పాటుతో సదాశివరాయలను విజయనగర సామ్రాజ్యాభిషిక్తు నొనర్చెను. సదాశివరాయలు తిమ్మాంబా రంగరాజుల కుమారుడు. తిమ్మాంబ వేంకటదేవరాయల సోదరి, రంగరాజాతని బావమరది.

(శ్లో॥ తిమ్మాంబా వరగర్భ మౌక్తికమణీ రంగ క్షితీంద్రాత్మజః ।
క్షత్త్రాలంకరణేన పాలిత మహా కర్ణాటరాజ్యశ్రియా ।
శౌర్యౌదార్యదయావహ స్స్వభగినీ భర్త్రా జగత్త్రాయినా ।
రామక్ష్మాపతినా ప్యమాత్య తిలకైః ప్రాప్తాభిషేక క్రియః ॥)

ఈ విజయనగర రాజులలో ఈశ్వరరాజు క్షాత్త్ర ధర్మశోభితుడు. రాజమౌళి రత్నము. నరసరాజు రామేశ్వరాద్యనేక పవిత్రతీర్థములలో శాస్త్రోక్తరీతిచే షోడశ మహాదానము లొనర్చిన దానవీరుడు. కావేరీనదిని బంధించి దాటి, శత్రురాజును జీవగ్రాహముగా పట్టుకొని ఆతని రాజ్యమును శ్రీరంగ పట్టణమును స్వాయత్త మొనర్చుకొని జయస్తంభ ప్రతిష్ఠచేసిన మహాయోధాగ్రగణ్యుడు. చోళ పాండ్యా ధీశులను మధురాధిపతి ప్రభృతులను జయించి గంగాతీరము మొదలు సేతుపర్యంతము ఉదయగిరి మొదలుకొని అస్తగిరి పర్యంతము సార్వభౌముడై ఆయా దేశపతులకు తన ఆనతిని శిరోగ్రాహ్యముగా నొనర్చిన మహాశూరుడీ నరసరాజు. నరసరాజు కుమారుడు వీరనరసింహరాయలు. విజయనగర రత్న సింహాసనము నధిష్ఠించి నృగ నల నహుషాదులను కీర్తిచే మించినవాడు. మహాదానపరుడు. ఇతడు కనక సరస్సునందు, శ్రీ విరూపాక్ష దేవస్థానమునందు, శ్రీ కాళహస్తి క్షేత్రమునందు, వారణాసియందు, హరిహర క్షేత్రమునందు, అహోబల క్షేత్రమునందు, సంగమేశ్వర, కుంభకోణములందు, తదితర క్షేత్రములందు మహాదానము లొనర్చిన ధన్యజీవి. తులాపురుషదానము స్వర్ణగోసహస్ర దానము, హేమాశ్వదానము; హేమగర్భ కనక రథ దానము, స్వర్ణ గజ దానము చేసి వదాన్యాగ్రగతస్సరుడీతడు.

శ్లో॥ నానాదానాన్యకార్షీ త్కనకసరసియ శ్రీ విరూపాక్ష దేవ
స్థానే శ్రీకాళహస్తే శితురపి నగరే వేంకటాద్రౌచ కాశ్యాం ।
శ్రీ శైలే శోణశైలే మహిత హరిహరేఽహోబిలే సంగమేచ
శ్రీరంగే కుంభకోణే హతతమసి మహానందితీర్థే పవిత్రే ॥

ఇతడు మేరుపర్యంతము, ఉదయాద్రి పర్యంతము, అస్తాద్రి పర్యంతము వ్యాపించిన అఖండ సామ్రాజ్యమును పరిపాలించెను. శ్రీకృష్ణదేవరాయలు మహాదానవీరుడుగా, మహాయోధుడుగా, మహారాజ్య ప్రణేతగా కీర్తింపబడినాడు. రాజనీతి విషయమున ఇతడు నృగమహారాజును మించినవాడు.

శ్లో॥ శత్రూణాం వాసమేతే హృదయ గతరుషా కింనసప్తాంబురాశీన్
నానాసేనా తురంగ త్రుటిత వసుమతీ ధూలికాపాలికాభిః ।
సరశోష్య స్వైరమేతత్ప్రతినిధి జలధి శ్రేణికాం యో విధత్తే
బ్రహ్మాండ స్వర్ణమేరు ప్రముఖనిజ మహాదానతోయై రమేయైః ।

అను శ్లోకము శ్రీకృష్ణదేవరాయల అనన్య సామాన్య జైత్రయాత్రా ప్రౌఢిమను దానవీరత్వమును విశదీకరించుచున్నది. అచ్యుత దేవరాయలు వదాన్యతాది గుణములచే పూర్వులను అతిశయించినవాడు.

శ్రీ సదాశివరాయల వంశావళియు ఈ శాసనమున వర్ణింపబడినది. సదాశివరాయలు చంద్రవంశ్యుడు. ఈ చంద్రవంశరత్నము రాఘవరాజు. ఇతని వంశమున చాలుక్య క్షితీశ్వరుడు పుట్టెను. చాలుక్య క్షితీశుని వంశమున బిజ్జలేంద్రుడు, బిజ్జలేంద్రుని వంశమున సోమదేవుడు ఉదయించిరి. ఈ సోమదేవుడు సప్తదుర్గహర్తగా విశ్రుతుడు. సోమదేవుని కొడుకు పింనయక్షోణీపతి. ఆరవీటి పురాధిపుడు. పింనయరాజు కొడుకు ఆర్వీటి బుక్కరాజు. బుక్కరాజు భార్య బిల్లాంబిక. బుక్క భూపతి కొడుకు రామరాజు. రామరాజు భార్య లక్కాంబ. కుమారుడు శ్రీ రంగరాజు. శ్రీ రంగరాజు భార్య తిరుమలాంబ. శ్రీ రంగరాజు కుమారుడు రామరాజు. రామరాజు సోదరుడు తిరుమలరాయలు. అతని సోదరుడు వేంకటాద్రి. తిరుమల రాయలవారి కొడుకులు రాఘవరాజు, రంగరాజు, రామరాజు, వేంకటాద్రి అనువారలు. రంగరాజుకు తిమ్మాంబ యందు ఉదయించినవాడు సదాశివరాయలు. శ్రీ సదాశివరాయలు ఈ దానశాసనమున

"శ్రీ రాజాధిరాజ పరమేశ్వరః, శరణాగతమందారః, కాంభోజ భోజ కాలింగ వరాహాటాది పార్థివై, సదాభిష్టుతః, ప్రాజ్య కర్నాటక రాజ్యశ్రీ స్థాపనాచార్యః, ఆత్రేయ గోత్రాలం కారమణిః, మనునయస్థితః".

ఇత్యాది విశేషములచే ప్రశంసింపబడినాడు.

శ్లో॥ సోయం నీతివిశారద స్సురతరు స్సిద్ధార్థి విశ్రాణనే
సర్వోర్వీశ నతస్సదాశివ మహారాయో జగన్నాయకః ।
బాహ్వోరంగద నిర్విశేష మఖిలా సర్వం సహాముద్వహన్ ।
విద్వత్త్రాణ పరాయణో విజయతే వీరప్రతాపోనృపః॥

అను నీ శ్లోకమునందు శ్రీ సదాశివరాయలవారి రాజనీతివిశారదత్వము, జగన్నాయకత్వము, రాజ్యశ్రీ చక్ర భార నిరంతరవహన సహిష్ణుత, విద్వత్త్రాణ పరాయణత్వము, పరాక్రమము వర్ణింపబడినవి. ఇది శాసనస్థ రాజవంశ సంగ్రహకథనము.

ఈ దాన శాసన శ్లోక కవిత్వము, మిక్కిలి ప్రౌఢము, కల్పనలు రమ్యములు, సాహిత్య శాస్త్ర పాండిత్య ద్యోతకములు. కవి వాల్లభ్యముతో అనుష్టుప్పు శార్దూల విక్రీడితమును, స్రగ్ధరను, మాలినిని, ఇంద్రవజ్రను, వసంత తిలకను, దోధకను, ఇతర వృత్తములను వాడినాడు. అనుప్రాసము, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, శ్లేష, రూపకము, విరోధాభాసము–ఇత్యాది అలంకారములను సామర్థ్యముతో ఉపయోగించినాడు కవి.

శ్రీ మదన్నం భట్టు పుంభావ సరస్వతి. ఇతడు వేదమునందును తర్క వ్యాకరణ మీమాంసాద్యనేక శాస్త్రములందును నిష్ణాతుడు, నైకశాస్త్ర గ్రంథప్రణేత, తర్కశాస్త్రమున తర్కసంగ్రహము, తర్కసంగ్రహదీపిక, తర్కభాషాతత్త్వబోధిని, అలోక సిద్ధాంజనము (ఇది జయదేవుని ఆలోకమను తత్త్వ చింతామణికి వ్యాఖ్య) సుబుద్ధి మనోహరము (ఇది రఘునాథ శిరోమణి కృత దీధితికి వ్యాఖ్య) అను గ్రంథములను నిర్మించెను. 12వ శతాబ్దివరకు సూత్రగ్రంథములు, పిదప గణేశోపాధ్యాయకృత తత్త్వ చింతామణి ఆధారములుగా న్యాయశాస్త్రము వికాసము నొందెను. ఇట్టి భేదమునుబట్టియే మొదటి దానికి ప్రాచీన న్యాయమనియు, రెండవదానికి నవీన న్యాయమనియు వ్యవహారమేర్పడెను. తర్క సంగ్రహమున ద్రవ్యాది సప్తపదార్థముల స్వరూపము సంగ్రహముగ వివరింపబడినది. తర్క సంగ్రహదీపిక అనునది తర్క సంగ్రహమునకు అన్నంభట్టు వ్రాసిన టీకాగ్రంథము. తర్కసంగ్రహ నిర్మితియందలి వైశిష్ట్య మెద్దియన–ప్రాచీనులు ప్రమాణ నిరూపణానంతరము పదార్థనిరూపణ మొనర్చిరి. ఆరంభముననున్న ప్రమాణ నిరూపణము మిక్కిలి కఠినమైనదై సుబోధమగుటలేదు. అందుచేత శాస్త్రోద్దేశము ప్రచారమునకు వచ్చుట కష్టమయ్యెను. అన్నంభట్టు ముందుగనే శాస్త్రమందలి ప్రమేయములను సవరించి ఆ ప్రమేయ నిరూపణమునకు ప్రమాణములను సాధనములుగా గ్రహించెను. అందువలన శాస్త్రోద్దేశము సుబోధమగుచున్నది. ప్రాచీనులు

ప్రాచీన గ్రంథములందు ఒక్కొక్క భాగమునకు మాత్రమే ప్రాధాన్యమొసగి దానినే విపులముగ చర్చించిరి. అన్నంభట్టు, శాస్త్ర ప్రమేయ సామగ్రినెల్ల సమగ్రముగాను క్లుప్తముగాను వివరించెను. తర్కసంగ్రహమందు అన్నంభట్టు క్రమమును మార్చుటచేతను, విషయమును సమగ్రముగా గ్రహించుటచేతను; సుబోధమొనర్చుటచేతను ఇతని తర్క సంగ్రహము ఆసేతు హిమాచలము, సంతత పఠన పాఠనములందు విశేషోపయోగము గాంచుటచేతను దీనికి నవీన న్యాయమున ప్రధాన స్థానము లభించియున్నది. మీమాంసాశాస్త్రము నందు అన్నంభట్టు, రాణకోజ్జీవి (ఇది భట్టసోమనాథుని రాణకమునకు టీక), తంత్రవార్తికాటీక-అను రెండు గ్రంథములను వ్రాసెను. వేదాంత శాస్త్రమున మితాక్షర (ఇది బ్రహ్మసూత్రములపై వ్రాయబడిన వృత్తి), తత్త్వవివేచనము అను రెండు గ్రంథములను అన్నంభట్టు సంతరించెను. వ్యాకరణ శాస్త్రమున వ్యాకరణ మితాక్షర (ఇది పాణిని అష్టాధ్యాయిపై అత్యంత సులభమైన వ్యాఖ్య) భాష్య ప్రదీపోద్ద్యోతనము (ఇది కైయటుని ప్రదీపముపై వ్యాఖ్య) అను గ్రంథములు వ్రాసెను. ఇట్లు అన్నంభట్టు హాటకలేఖిని బహువిధముల బహురంగముల లీలా నర్తన మొనర్చినది.

ఓం నమో నారాయణాయ

# శ్రీ భగవద్గీతామాహాత్మ్యము

ధరోవాచ :

భగవ న్పరమేశాన భక్తి రవ్యభిచారిణీ
ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో ? 1

భూదేవి పలుకుచున్నది :

భగవానుడా! దేవ! దేవ! ప్రభూ! ప్రారబ్ధ మనుభ వించుచున్న (సుఖదుఃఖము లందు పొరలు) నరునకు అనన్య భక్తి యెట్లు అలవర్చుకొననగును ?

విష్ణు రువాచ :

ప్రారబ్ధం భుజ్యమానోపి గీతాభ్యాసరత స్సదా
స ముక్త స్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే. 2

విష్ణుమూర్తి చెప్పుచున్నాడు :

ప్రారబ్ధ మనుభవించుచున్నవాడైనను మనుజుడు గీతాభ్యాసమందు సదా రతుడగునేని అతడు కర్మలచే పట్టుబడక ముక్తుడై సుఖించును.

మహాపాపాది పాపాని, గీతాధ్యానం కరోతిచేత్
క్వచిత్ స్పర్శం నకుర్వంతి నళినీదళ మంభసా. 3

గీతను ధ్యానించు వానిని మహాపాపములు గూడ నీరు తామరాకు నంటనట్లు స్పృశింప నేరవు. అనగా ఎట్టి పాపములైనను దూరీకృతములగును.

గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠః ప్రవర్తతే
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్ర వై. 4

గీతా పుస్తకముండు చోటను, పఠించుచోటను ప్రయాగాది పుణ్యతీర్థము లన్నియు సన్నిహితములై యుండును. అనగా గీతాధ్యయనము వలన పుణ్యతీర్థములందు స్నాన మొనర్చిన ఫలము లభించును.

సర్వేదేవా శ్చ ఋషయో యోగినః పన్నగా శ్చ యే
గోపాల గోపికావాపి నారదోద్ధవపార్షదైః
సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే. 5

గీతాభ్యాసము సాగుచుండుచోట సర్వదేవతలును, ఋషులును, యోగులును, నాగులును, గోపగోపికలును, నారదుడు, ఉద్ధవుడు, విష్ణుపార్శ్వచరులగు సునందాదులతో గూడ సన్నిధిచేసి గీతా పాఠకులకు సహాయ మొనర్తురు.

యత్ర గీతావిచార శ్చ పఠనం పాఠనం శ్రుతం
తత్రాహం నిశ్చితం పృథ్వి! నివసామి సదైవ హి. 6

భూదేవీ! ఎచట గీతను పఠించుట, పఠింపించుట, అర్థవిచారము చేయుట, అట్టి ప్రసంగములను వినుట, జరుగుచుండునో అట్టి చోట నేను సదా నివసింతును.

గీతాశ్ర యోఽహం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహం
గీతాజ్ఞాన ముపాశ్రిత్య త్రీన్లోకా న్పాలయా మ్యహం. 7

గీత నా కుత్తమమగు గృహము. నేనందే సదా నివసింతును. గీతాజ్ఞానము నాశ్రయించియే ముల్లోకముల నేలుచుందును. శరీరము మనస్సునకు గృహము. గీత శ్రీకృష్ణ భగవానుని మనస్సారమగుటచే గీతాపుస్తకము దానికి గృహము వంటిది. ఇందలి జ్ఞానము త్రిలోక పరిపాలన విధానమునకు వలయు మూలసూత్రములను వివరించుచున్నది.

గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా నసంశయః
అర్ధమాత్రాక్షరా నిత్యా స్వనిర్వాచ్య పదాత్మికా. 8

గీత సర్వోత్కృష్టమగు పరబ్రహ్మ విద్య యనుట కే సందేహము లేదు. ఇది నాశరహితమును, నిత్యమును, స్వానుభూతి వలన దక్క అనిర్వాచ్యమును, ప్రణవమందలి తుది అర్థమాత్రా విరామముచే సూచింపబడినదియును అగు పరమాత్మ తత్త్వమును ప్రకటించు విద్య.

చిదానందేన కృష్ణేన ప్రోక్తా స్వముఖతోఽర్జునం
వేదత్రయీ పరానందా తత్త్వార్థ జ్ఞాన మంజసా. 9

ఈ గీత సచ్చిదానంద స్వరూపుడగు శ్రీకృష్ణునిచే స్వయముగా అర్జునున కుపదేశింప బడినది. ఇది వేదత్రయముల స్వరూపము. అనగా మూడు వేదముల సారము. పరమానంద స్వరూపమైనది. తన నాశ్రయించు వారలకు శీఘ్రముగా తత్త్వజ్ఞానము నలవరచును.

యోఽష్టాదశ జపే న్నిత్యం నరో నిశ్చలమానసః
జ్ఞానసిద్ధిం న లభతే తతో యాతి పరంపదమ్. 10

ఏనరుడు పదునెనిమిది అధ్యాయములను నిశ్చల, లేక ఏకాగ్ర మనస్సుతో పారాయణ చేయునో అతడు జ్ఞానసిద్ధిని పొంది పరమపదము నధిష్ఠించును.

పాఠేఽసమర్థ స్సంపూర్ణే త దర్ధం పాఠ మాచరేత్
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః. 11

పదునెనిమిది అధ్యాయములు పూర్తిగా పారాయణ చేయుటకు శక్తిలేనివారు తొమ్మిది అధ్యాయములు పఠింపవచ్చును. అందువలన గోదానము వలన కలుగు పుణ్యఫలము లభించును. ఇందుకు సందేహములేదు.

త్రిభాగం పఠమాన స్తు గంగాస్నానఫలం లభేత్
షడంశం జపమానస్తు సోమయాగఫలం లభేత్. 12

ఆరు అధ్యాయములు పారాయణ చేయువారికి గంగాస్నాన ఫలమును, మూడధ్యాయములు పఠించువారికి సోమయాగ ఫలమును లభించును.

ఏకాధ్యాయం తు యో నిత్యం పఠతే భక్తిసంయుతః
రుద్రలోక మవాప్నోతి గణోభూత్వా వసే చ్చిరమ్. 13

ప్రతిదినమును భక్తి శ్రద్ధలతో ఒక్క అధ్యాయమును పారాయణ చేయువాడు రుద్రలోకమున కేగి ప్రమథగణములలో నొకడై చిరకాల మందు సుఖముగా నివసించును.

అధ్యాయ శ్లోకపాదం వా నిత్యం యః పఠతే నరః
స యాతి నరతాం యావత్ మనుకాలం వసుంధరే. 14

ఒక అధ్యాయమందు నాల్గవ భాగమును నిత్యము పారాయణము చేసినను అతడు మన్వంతరాంతము వరకు మానవజన్మనే యెత్తుచుండును.

గీతాయాః శ్లోకదశకం సప్త పంచ చతుష్టయమ్
ద్వి త్రి రేకం తదర్ధం వా శ్లోకానాం యః పఠే న్నరః. 15

చంద్రలోక మవాప్నోతి వర్షాణా మయుతం ధ్రువమ్.
గీతాపాఠ సమాయుక్తో మృతో ఽమానుషతాం వ్రజేత్. 16

గీతయందలి పది శ్లోకములను గాని, యేడు, ఐదు, నాలుగు, మూడు, రెండు శ్లోకములను గాని, తుదకు ఒక శ్లోకమును లేదా శ్లోకార్థమును గాని నిత్యము పఠించువాడు చంద్రలోకమున కేగి అందు పదివేల యేండ్లు సుఖించును. గీతాపారాయణము చేయుచు మరణించువాడు దేవత్వము నొందును.

గీతాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తి ముత్తమామ్
గీతే త్యుచ్చారసంయుక్తో మ్రియమాణో గతిం లభేత్. 17

గీతాభ్యాసమును మరల మరలచేసి ఉత్తమమగు మోక్షమును పొందును. గీతాశబ్దము నుచ్చరించుచు మరణించినచో సద్గతి నొందును.

గీతార్థ శ్రవణాసక్తో మహాపాపయుతో ఒపివా
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే. 18

ఘోరపాతకము లొనర్చిన వాడైనను గీతార్థమును వినుటయం దాసక్తి గలిగెనేని, అతడు వైకుంఠమున కేగును. విష్ణుమూర్తితో కూడ సుఖముగా ఉండును.

గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః
జీవన్ముక్త స్స విజ్ఞేయో దేహాంతే పరమంపదమ్. 19

ఎవడు తన విధ్యుక్త కర్మలను సక్రమముగ నిర్వర్తించుచు గీతార్థమును మననము చేయుచుండునో అతడు జీవన్ముక్తుడై. దేహపతనానంతరము అతడు పరమపద మధిష్ఠించును.

గీతా మాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః
నిర్ధూత కల్మషా లోకే గీతా యాతాః పరంపదమ్. 20

జనకుడు మున్నగు పెక్కండ్రు రాజులు గీత నాశ్రయించియే ఇహమందు పాపవిముక్తులై, పరమందు ముక్తిని చూరగొనిరి.

గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్
వృథా పాఠో భవే త్తస్య శ్రమ ఏవ ఉదాహృతః. 21

పారాయణము చేసి మాహాత్మ్యమును పఠింపనిచో పారాయణము వృథా యగును. శ్రమ మాత్రమే మిగులును.

ఏత న్మాహాత్మ్య సంయుక్తః గీతాభ్యాసం కరోతి యః
స తత్ఫల మవాప్నోతి దుర్లభాం గతి మాప్నుయాత్. 22

మాహాత్మ్యముతో గూడ ఎవడు గీతాపారాయణము నొనర్చునో అతడు చెప్పబడిన ఫలమును పొంది తుదకు దుర్లభమగు సద్గతి కేగును.

గీతోపదేశమంతయు ఫలము నపేక్షింపక కర్మ లాచరింపమనియుండ ఇచట మాహాత్మ్యమును చదువనిచో ఫలమేమియు లేదనియు, శ్రమయే మిగులు ననియు చెప్పుట వింతగా తోచవచ్చును. కాని కవి హృదయము నెరింగినచో అసందర్భ మేమియు లేదు. ఫలశృతి ఆరంభ దశలో నున్నవారికి దాని యందాసక్తి కలిగించుటకే. (రోచనార్థం ఫలశృతిః) మాహాత్మ్యమును చూచి గీతా మహిమను గుర్తించి ఫలాపేక్షతోనైనను పారాయణ మొదలిడినచో అభ్యాసము దృఢపడి తుదకది నిష్కామకర్మగా పరిణమించును. పోటీ పరీక్షలయందు బహుమానమునకై గీతాభ్యాసమొనర్చిన వారెందరో తమ జీవితమంతయు గీతాభ్యాసరతులైరి. గీతార్థమును గ్రహించు స్థితికి వచ్చినచో పారాయణ ఫలితమును అపేక్షించువా డుండడు.

సూత ఉవాచ :

**మాహాత్మ్య మేత ద్గీతాయాః మయా ప్రోక్తం సనాతనమ్**
**గీతాన్తే చ పఠే ద్యస్తు యదుక్తం తత్ఫలం లభేత్.** 23

సూతుడు అనుచున్నాడు :

నాచే నిపుడు చెప్పబడిన యీ గీతా మాహాత్మ్యము సనాతనమైనది. గీతా పారాయణానంతరము దీనిని పఠించువాడు చెప్పబడిన ఫలమును బొందును.

ఇతి శ్రీ వరాహ పురాణే, శ్రీ గీతా మాహాత్మ్యమ్ స్సంపూర్ణమ్

శ్రీ వరాహ పురాణమందలి శ్రీ గీతా మాహాత్మ్యము సంపూర్ణమాయెను

£

"శ్రీ గీతా భావార్థ చంద్రిక" ప్రచురణకుగాను తొలుదొల్తగా, తమంత తామే ప్రచురణకర్తకు వెన్నుదట్టినిల్చి, తమ తల్లి దండ్రులు (కీ. శే.) కంభంపాటి సత్యనారాయణ శాస్త్రిగారు (ప్రఖ్యాత సంగీత విద్వాంసులు), (కీ॥ శే॥) శారదాంబగారల స్మృత్యర్థము; తమను ఎంతో అభిమానముతో సంరక్షణచేసిన మేనత్త (కీ॥ శే॥) నిమ్మగడ్డ అన్నపూర్ణమ్మగారి యందు గల భక్తి-వాత్సల్యపూరిత గౌరవ ప్రపత్తిని చాటుచు-వారి స్మృత్యర్థము, "శ్రీ గీతా భావార్థ చంద్రిక" అష్టాదశోధ్యాయము ప్రచురణకుగాను-

**భూరివిరాళముగా**



మూడువేల రూపాయ లొసంగుటయేగాక-ప్రచురణాకాలమందు ప్రచురణకర్తకు నివాస-వసతి-మజ్జన భోజనాది సకల సౌకర్యములు కలిగించి, ప్రచురణారంభము మొదలు గ్రంథావిష్కరణ వరకున్నూ ఎన్నో శ్రమలకోర్చి తోడ్పడుటయే గాక, తనకు తానుగా కొందరు దాతలనుండి విరాళము లిప్పించుటలో ప్రముఖపాత్ర వహించిన నిగర్వి, నిరాడంబరుడు, సచ్ఛీలుడు, సహృదయుడు చి॥ కంభంపాటి గోపాలకృష్ణమూర్తి (రిటైర్డ్ పోస్ట్ మాస్టర్, రామకృష్ణమఠం), వారి ధర్మపత్ని, సహృదయ సౌజన్యమూర్తి చి॥ ల॥ సౌ॥ సుశీల దంపతులు. (శాండిల్య సగోత్రీకులు)

శ్రీమహావిష్ణు కృపకు పాత్రులైన ఈ ఆదర్శ దంపతులను, వీరి కుమారుడు చి॥ సత్యపూర్ణశాస్త్రిని ఆ పరమేశ్వరుడు సకలాయురారోగ్యైశ్వర్యము లొసంగి కాపాడుగాక యనియు; వీరు సదా సత్కార్యాచరణ పరాయణులై కీర్తి ప్రతిష్ఠ లార్జించ వలెననియు, ఇందుకుగాను భగవదనుగ్రహము వీరికి లభించ వలెననియు, నిండుమనస్సుతో, చిరంజీవులుగా వారిని ఆశీర్వదించు చున్నాను.

—ప్రచురణకర్త

"శ్రీ గీతా భావార్థ చంద్రిక" పదునెనిమిదవ అధ్యాయమగు "మోక్షసన్న్యాస యోగము"ను తమ (దత్త) పుత్రుడు చి॥ కంభంపాటి గోపాలకృష్ణమూర్తి ద్వారా ప్రచురింప జేసికొనిన పుణ్య దంపతులు



(కీ॥ శే॥) కంభంపాటి సత్యనారాయణ శాస్త్రి,
,, శారదాంబగారలు



శ్రీ కంభంపాటి రాధాకృష్ణమూర్తిగారు
(రిటైర్డ్ డిప్యూటీ పోస్ట్ మాస్టర్, సికిందారాబాదు హెడ్ పోస్టాఫీస్)
'శ్రీ దత్తగురు' సాంప్రదాయక భక్తిభావనాయుతులు, అద్వైత తత్త్వ చింతనాభిలాషులు, సరళహృదయులు.



మ॥ రా॥ శ్రీ మండవల్లి ముత్యాలరావుగారు
శ్రీమతి మండవల్లి రత్నమాణిక్యాంబగారు

"శ్రీ గీతా భావార్థ చంద్రిక"లోని మొట్ట మొదటి అధ్యాయము "అర్జున విషాద యోగము" ముద్రణకు అయిన పూర్తి వ్యయము రూ. 3000 (మూడువేల రూపాయలు) విరాళమొసగిన ఆదర్శ దంపతులు.

వీరికి శ్రీకృష్ణానుగ్రహప్రాప్తి కలిగి, ఇట్టిసత్కార్యాలు ఇంకెన్నియో వీరిచే చేయ బడగలవను పరిపూర్ణ విశ్వాసము కలదు

వీరికి, వీరి కుటుంబ సభ్యులకు పరవాసుదేవుడైన శ్రీ కృష్ణ పరమాత్మ కృపచే సకలాయురారోగ్యైశ్వర్యములు కలిగి, వీరి వంశములోని వారు వీరిని ఆదర్శంగా గైకొని సత్కార్యాచరణకు మొట్ట మొదటిగా ముందడుగు వేయాలని కోరుచున్నాను.

" శ్లో. గీతాయాః పుస్తకం యత్ర । యత్ర పాఠః ప్రవర్తతే।
తత్ర సర్వాణి తీర్థాని । ప్రయాగాదీని తత్రవై॥"

పైన పేర్కొన్న శ్లోకంలోని విశేష విశిష్టార్థములన్నియు దివ్య భావ యుతులైన పైదంపతులకు అన్వయింపబడుగాక!

—ప్రచురణకర్త

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# పరిమళ వ్యాఖ్య

"వసుదేవ సుతం దేవం । కంస చాణూర మర్దనం ।
దేవకీ పరమానందం । కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥

వసుదేవునికి, దేవకీదేవికి పరమానంద దాయకుడు, కంస చాణూరాదుల దునుమాడిన వాడు, జగద్గురువులలో ఆద్యాచార్యుడు నగు శ్రీకృష్ణ పరమాత్మకు నమస్సుమాంజలు లందించుకొనుచున్నాను.

ఇందు కృష్ణ పరమాత్మకు నాల్గు విశేషణములు వాడబడినవి; 1. వసుదేవ సుతుడు 2. దేవకీ పరమానందుడు 3. కంస చాణూర మర్దనుడు 4. జగద్గురువు అని.

ఈ నాల్గు విశేషణములలో పరవాసుదేవుండైన శ్రీమన్నారాయణ పరబ్రహ్మ స్వరూపుడైన శ్రీకృష్ణ పరమాత్మ యొక్క దివ్యమంగళ విగ్రహ స్వరూపము ప్రతిపాదింపబడినది.

శ్రీకృష్ణుడు జగద్గురువు. "గు" శబ్ద స్త్వంధకారస్స్యాత్ "రు" శబ్ద స్తన్నిరోధకః । అంధకార నిరోధత్వాత్ "గురు" రిత్యభిధీయతే ॥ అను సూక్తి ననుసరించి "గు" అనునది అంధకారము. "రు" అనగా నిరోధించు వాడు అనగా తొలగించువాడు అని వివరణ. వెలుపలి చీకటి వలెనే లోపల వ్యాపించు చీకటి అజ్ఞానము, అనగా తనను తాను ఎరుగకుండుట, తనలో గల భగవంతుని నెరుగకుండుట. ఈ శరీరంలో "తాను" అనగా జీవుడు, తనలోగల (జీవునిలో గల) పరమాత్మ యిద్దరు కలిసి నివసింతురు. కాని అజ్ఞానమనెడి గాఢాంధకారము దట్టంగా ఆవరించి యుండుటచేత జీవునికి తనలో పరాత్పరు డున్నట్లు తెలియదు. అట్టి అజ్ఞానాంధకారమును జ్ఞానాంజన శలాకచే తొలగద్రోసి శరీరంలో నుండు ఆత్మ స్వరూపమును (జీవుని స్వరూపమును) జీవాత్మాంతర్వర్తియైన భగవత్స్వరూపమును గోచరింప జేయుటకు అచ్యుతరూపుడై యవతరించినాడు శ్రీకృష్ణ పరమాత్మ. అందుచే అతనిని జగద్గురువని జ్ఞానసంపన్నులైన యోగులు సంభావించినారు.

మాయామానుష స్వరూపుడైన శ్రీరామచంద్రస్వామి ధర్మాచరణ తత్పరుడై "రామో విగ్రహవాన్ ధర్మః" అన్నట్లు ధర్మస్వరూపుడై వెలసి జగదారాధ్యుడైనాడు. అట్లే లీలామానుష స్వరూపుడైన శ్రీకృష్ణ పరమాత్మ "ఉపదేశాత్తు కృష్ణః" అన్నట్లు ధర్మోపదేశకుడుగా, ధర్మరక్షకుడుగా "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అని చెప్పినట్లుగా ధర్మసంస్థాప కుడుగా నిత్యవిభూతి నివాసుండైన పరవాసుదేవుండైన శ్రీమన్నారాయణుడు ద్వాపర యుగమున శ్రీకృష్ణ పరబ్రహ్మగా అవతరించి ధర్మప్రతిష్ఠాపకుడుగా ధర్మోపదేశకర్తగా జగదాచార్యుడుగా అవతరించినాడు.

లక్ష్మీనాథుడు మొదలుకొని అస్మదాచార్యుల వరకు గురు పరంపరగా వైష్ణవ భక్తులు ఆమోదించి స్మరించుచుందురు. "లక్ష్మీనాథ సమారంభాం నాథయామునమధ్యమాం। అస్మదాచార్య పర్యంతాం వన్దే గురుపరంపరామ్॥" అను ఆచార్య సూక్తి ననుసరించి జగదాచార్యత్వం శ్రీమన్నారాయణునికి మొదటనే సిద్ధించినది. "తానే శిష్యన్నాయ్ తానై ఆచార్యన్నాయ్" అను పూర్వాచార్య సూక్తి ననుసరించి తానే శిష్యుడుగా, తానే ఆచార్యుడుగా శ్రీమన్నారాయణుడు నర-నారాయణ స్వరూపుడై అవతరించి మంత్రరత్న మైన అష్టాక్షరీ మంత్రమును నరునకు ఉపదేశించెను. తదుపరి తన దేవేరియైన లక్ష్మీదేవికి మంత్రరాజంబైన "శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే శ్రీమతే నారాయణాయ నమః" అను ద్వయ మంత్రము నుపదేశించినాడు. స్వామి ద్వాపర యుగాంతమున తాను కృష్ణుడుగా, నరుడు అర్జునుడుగా అవతరించి కురుక్షేత్ర సంగ్రామమున ఉభయ సేనల మధ్యలో అర్జునునికి "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ। అహంత్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః" అను చరమ మంత్రమును గీతోప దేశముతో పాటు ఉపదేశించి శ్రీమన్నారాయణ స్వరూపుడైన శ్రీకృష్ణుడు జగదాచార్యత్వము గలవాడై మొదట కీర్తింపబడుచున్నాడు. నరుని ద్వారా మంత్రరత్నంబైన తిరు మంత్రమును, లక్ష్మీదేవి ద్వారమున మంత్రరాజం బైన ద్వయ మంత్రమును, ద్వాపరాంతమున అర్జుని ద్వారమున చరమ మంత్రమును నిర్హేతుక జాయమాన కృపానుషంగుడైన శ్రీమన్నారాయణుడు నగు శ్రీకృష్ణుడు బద్ధజీవులను సంసార సాగరమునుండి యుద్ధరింపదలచి మంత్రత్రయంబును లోకమునకందించి తన జగదాచార్యత్వమును సార్థకము గావించుకున్నాడు. ఈ విధంగా శ్రీకృష్ణ పరమాత్మ జగద్గురువై వెలసి యున్నాడు.

శ్రీకృష్ణుడు దేవకీ వసుదేవుల గర్భశుక్తిముక్తాఫలమై జన్మించినాడు. కృష్ణ దనగా అనిర్వచనీయమైన నిరతిశయ పరబ్రహ్మానంద స్వరూపుడని అర్థము. "కృష్ అనందే" అను ధాతువునుండి ఏర్పడినదియే 'కృష్ణ' శబ్దము- అనిర్వచనీయమైన ఆనంద స్వరూపమై విరాజిల్లుచున్నది. అట్టి ఆనందము పరబ్రహ్మానందము తప్ప వేరొకటి కాజాలదు. ప్రసన్నత్వమును సిద్ధింప జేయు భక్తి జ్ఞాన వైరాగ్య సత్కర్మ యోగాదులద్వారా బద్ధజీవునికి ఈ పరబ్రహ్మానందానుభవము సిద్ధించినప్పుడు అతడు సంసారమునుండి విడివడి ముక్తజీవుడై పునరావృత్తి రహితమైన పరబ్రహ్మ పదమును పొంది ఆ పర వాసుదేవుని సేవలో తనివిదీర బ్రహ్మానందానుభవము ననుభవించుచుండును.

అట్టి బ్రహ్మానందమును గూర్చి వేదశాఖలైన ఉపనిషత్తులలో అగ్ర శ్రేణికి చెందిన ఉపనిషత్తు తైత్తరీయ పంచోపనిషత్తు నందలి ఆనందవల్లిలో బ్రహ్మానంద మీమాంస యీ విధంగా జేయబడినది. "స ఏకో మానుష ఆనందః శ్రోత్రియస్య చ కామహతస్యయే యే శతం మానుషానందాః। స ఏకో మనుష్య గంధర్వాణామానందః ........ ... తే యే శతం ప్రజాపతే రానందాః। స ఏకో బ్రహ్మణ ఆనందః॥ అని (1) మనుష్యానందములు (2) మనుష్య గంధర్వానందములు (3) దేవగంధర్వానందములు (4) పితృ దేవతానందములు (5) అజాన దేవతానందములు (6) కర్మ దేవతా నందములు (7) దేవతానందములు (8) ఇంద్రానందములు (9) బృహస్ప త్యానందములు (10) ప్రజాపత్యానందములు. ఒక్కొక్క ఆనందములు వంద చొప్పున ఏర్పడి మొత్తము కలిసిన ఆనందములు అన్నీ కలిసి ఒక బ్రహ్మానందమగును; అనగా ఈపై ఆనందములన్ని కలిసి ఒక లక్ష కోట్ల మానుషానందములు కలసినచో ఒక బ్రహ్మానంద మగునని సాక్షాత్తు పరబ్రహ్మద్రష్టలు, బ్రహ్మిష్ఠులగు మహర్షులు పరబ్రహ్మానంద స్వరూపమును వివరించిరి. అట్టి పరబ్రహ్మానంద స్వరూపుడే శ్రీకృష్ణ పరమాత్మ అందు లకే యీ యాదవ నరశార్దూలానికి "శ్రీకృష్ణుడు" అని భూత భవిష్య ద్వర్తమాన వేదియగు 'గర్గ మహర్షి' నామకరణ మొనర్చినాడు. ఆ యాదవ స్వామి జగత్స్వామియై శ్రీకృష్ణ శబ్దముతో సార్థకనామధేయుడై నాడు. ఏతా వతా శ్రీకృష్ణ దనగా పరబ్రహ్మానంద స్వరూపుడు అని అర్థము తేటతెల్ల మైనది. అందులకే "వాసుదేవస్సర్వమితి సమహాత్మా సుదుర్లభః" అని గీతలో వివరింపబడినది.

ఆత్మ స్వరూప భగవత్స్వరూప జ్ఞానముచే అట్టి పరబ్రహ్మానంది మును ఈ శరీరములోనే అనుభవించుటకు వీలుగా శ్రీకృష్ణు డవతరించి తన జన్మ చేతను, తన లీలల చేతను, శాసనముల చేతను, ఉపదేశముల చేతను, జీవజగత్తును నావరించిన యజ్ఞానమును తొలగించి జీవకోటికి నిరతిశయ నిత్య సత్య పరబ్రహ్మానందము ననుగ్రహించినాడు.

సత్వ రజ తమో గుణములచే నిండిన ప్రకృతిలో సత్వగుణము వృద్ధి జెంది దైవీసంపద ఆవిర్భవించినప్పుడు ఆత్మలో స్వస్వరూప జ్ఞానము కలిగి భగవదనుభవము కలుగును. దీనినే తెలియపరచుచు స్వామి దేవకీ వసుదేవు లకు బిడ్డడై అవతరించెను.

"దేవకీ" అను శబ్దముచే ప్రకాశవంతమైన సత్వగుణముచే వృద్ధి చెందు దైవీ సంపద సూచించుచున్నది. "వసుదేవ" శబ్దముచే కర్మవశమున శరీరములో నివసించియుండు జ్ఞాన స్వరూపుడైన జీవుడు సూచింపబడెను. దైవీసంపదతో కూడియున్న ఆత్మయందు అజ్ఞానాంధకారావృతమగు చెర సాల వంటి ఈ శరీరములో పరబ్రహ్మానంద స్వరూపుడగు శ్రీకృష్ణ పర మాత్మ అవతరించును. అందువలన ఆత్మ స్వరూపము భాసించి దానికి గూడ ఆత్మయగు పరమాత్మ స్వరూపము ఆవిర్భవించును. అందుచే శ్రీకృష్ణస్వామి "వసుదేవ సుతుడు", "దేవకీ పరమానందుడు" అయినాడు.

అట్టి శ్రీకృష్ణపరమాత్మయే కంసరాజును, చాణూర ముష్టికులను మల్లు లను సంహరించెను. భగవత్స్వరూపము నెరింగిన వానికి అహంకారము అను కంసుడు, ద్వంద్వములగు రాగ ద్వేషాదులైన చాణూర ముష్టికులు నశించి పోదురు.

తాను కాని దేహమునందు తా ననెడి బుద్ధిని గలిగించు అవివేకమే అహంకారము-దీనిచేతనే సమస్తములగు ఆసురశక్తులు విజృంభించును. దానికి విరోధి భగవత్స్వరూపము.

అహంకారము కంసుడు. అహంకారముచే వెడలునవి రాగద్వేషాదు లగు ద్వంద్వములు - చాణూర ముష్టికులు. వీరిని మర్దించువాడు శ్రీకృష్ణ పరమాత్మ.

ఈ విధముగా మానవునికి నిరతిశయ నిత్యసత్య పరబ్రహ్మానందము గలిగించు శ్రీకృష్ణ ప్రభువును సతతము సేవించుటయే ఈ జన్మలో మానవుడు చేయు కర్తవ్యము.

"మనోర్భవాః మానవాః" అను ఉత్పత్తిచే మనుధర్మానుసారి మానవుడు ధర్మజ్ఞుడై ధర్మాచరణ తత్పరుడై మెలగుచున్నప్పుడే మానవుడగును. ధర్మస్వరూపుడైన పరమాత్మ నెరింగినప్పుడే మానవుడగును. అంత మాత్రమే కాదు "నవత్వంమా" అనగా క్రొత్తదైన పునర్జన్మ లేకుండా చేసికొన్నప్పుడే మానవత్వమునకు సార్థకత ఏర్పడును. అట్టి మానవత్వము దైవానుగ్రహముచే, దైవజ్ఞానముచే ఏర్పడును.

దయామయుడైన శ్రీకృష్ణ పరమాత్మ కన్నతండ్రి తనపై ఆధారపడియున్న కుమారుల అభ్యుదయమునకై పాటుపడుచున్నట్లుగానే, తననే నమ్మికొనియున్న జీవులను తన సన్నిధానమునకు జేర్చ దలచి తనను మఱవకుండునట్లుగా భవసాగరము నుండి యుద్ధరించి ముక్తుల గావింపదలచి సర్వవేదశాఖా స్వరూపంబైన వేదాంగాది సకల శాస్త్రార్థతత్వ స్వరూపతంబును, బ్రహ్మవిద్యా స్వరూపంబైన పదునెనిమిది యోగములతో కూడిన "భగవద్గీత" యను యోగశాస్త్రమును ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునందు తటియెఱింగి, అర్జునుని ముందుంచుకొని తద్వారమున బద్ధజీవుల మైన మనందరిని ముక్తాత్ములుగా నొనర్చుటకై నిర్హేతుక జాయమానమైన కృపతో వాత్సల్యపూర్ణ హృదయుడై మనకు ఉపదేశకర్తయై ఉపదేశించి తన జగదాచార్యత్వమును నిరూపించుకొని అర్థానిని సార్థకము గావించుకొనినాడు.

ఈ భగవద్గీత పదునెనిమిది పర్వములతో నిండి, పంచమవేద స్వరూపంబై, యితిహాస స్వరూపంబైన మహాభారతమునకు హృదయ స్వరూపమై విరాజిల్లుచున్నది. భారతము శాంతరస ప్రధానమైన మహాకావ్యమని కావ్య తత్వవిదులు వక్కాణించియున్నారు. కావున భారతము శాంతరస ప్రధానమైనది. శాంత రసమునకు స్థాయీభావము శమము, అట్టి శమమే ప్రధానమైనది ఈ భగవద్గీత. అరిషడ్వర్గములతో, తాపత్రయములతో, ఈషణత్రయములతో రాగద్వేషాదులు, జనన మరణములు, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వ వాయువులతో దురాశా జలములతో

నిండియున్న పాపపుణ్యాది "కామనాకర్మ" లనే, సుడిగుండములచే, ఆవేశ ఆక్రోశ ఉక్రోశాదులచే పెల్లుబికి, పెనుతుఫాను వలె చెలరేగుచున్న భవసాగరమును శమింపజేసి, పరమాత్మ సంయోగమను యోగనౌకకు కర్ణధారియైన ఈ భగవద్గీత, జీవాత్మను ఒడ్డుకు చేర్చి, శ్రీకృష్ణ పరబ్రహ్మానంద నిలయమునకు ఆచార్య సమాశ్రయణము ద్వారా చేర్పించుచున్నది. తదీయానందానుభూతిని జీవునికి కలిగించి, వానిని ముక్తాత్మునిగా నొనరించి, పునరావృత్తి రహితుని గావించు చున్నది. ఇది నిత్య సత్యమైన విషయము. ఇందు సందియ మావంతయు లేదు.

ఇట్టి భగవద్గీత విశ్వమానవ కల్యాణకారియై వెలుగొందుచున్నదని మన భారతీయ పండితులే కాక, పాశ్చాత్య దేశీయ పండితులందరు నిరాఘాటముగ సవిచారములతో గంటాపథంగా చాటిచెప్పినారు. ఇందువలన ఈ యుద్గ్రంథము కేవలము భారతీయులకే కాక విశ్వమానవ మనీషులందరికి ఆరాధ్య గ్రంథమై అజరామరమై యలరారుచున్నది. ఇట్టి భారత హృదయ గ్రంథమునకు అనువాదములు, వ్యాఖ్యానములు, సవిమర్శనములు విశ్వమందలి జీవద్భాషలన్నింటిలోను భక్తి ప్రపత్తులతో ఏర్పడియున్నవి. మన భారతీయ పండితులలో అగ్రశ్రేణికి చెందిన మతత్రయాచార్యులు ఈ గ్రంథమునకు నిర్దుష్టమైన వ్యాఖ్యలు వ్రాసి, అందలి యథార్థ విషయములను బద్ధజీవులమైన మనకందరికి చాటిచెప్పినారు. వారు తరించినారు, యితరులను తరింపజేసినారు.

అట్లే - విద్వత్కవి పండితశ్రేష్ఠులు, ఉపాధ్యాయ శిక్షణా కళాశాల ప్రధానాచార్యులు, అనేకానేక వృత్తి విద్యా నిపుణులు, బహుభాషాకోవిదులు, సహజ మధుర మంజుల కవితావతంసులు, గుంటూరు వాస్తవ్యులునైన (కీ.శే.) బ్రహ్మశ్రీ గరికపాటి లక్ష్మీకాంతం గారు శ్రీకృష్ణ తత్త్వమును, తద్గీతా యోగతత్త్వమును వీక్షించుకొని, ఆచరణలో చూపిన చక్కని వేదాంతులు. భగవత్ప్రేరణచే శ్రీమద్భగవద్గీతను "కృష్ణగీత"గా "శ్రీగీతా భావార్థ చంద్రిక" అను పేరుతో పరమహంస పరివ్రాజకాచార్యులైన జగద్గురువులైన ఆదిశంకరుల వారి మతానుసారముగా గీతా శాస్త్రములోని శ్లోకములన్నింటికి ఆంధ్ర పద్యానువాదము, తాత్పర్యములను నిష్ఫలాపేక్ష కర్మయోగులై రచించి జగదాచార్యుడైన గీతాచార్యుల పాదపద్మములకు సమర్పించి

ౖలైనారు; చరితార్థ చరిత్రులైనారు. వారు భగవత్తత్వమును కవితా
ు జోడించి ఆ కళతో శ్రీకృష్ణుని నారాధించి, సేవించి బ్రహ్మానందాను
ని పొంది ముక్తాత్ములై పునరావృత్తిరహితమైన పదము నందియున్నారు.
ూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" అని భగవానుడు
ున విధంగానే, అనేక జన్మలనుండి పరివర్తన జెంది ఈ మానవ జన్మ
భగవదనుభవజనిత దివ్యజ్ఞాన యోగులై, శ్రీకృష్ణ పరబ్రహ్మయొక్క
ణ గుణగణముల సంకీర్తనలతో తదీయోక్తియైన గీతను ఆంధ్రమున
దించు రీతులచే తమ జన్మను సార్థకము చేసికొనినారు (కీ॥ శే॥) మన
పాటి లక్ష్మీకాంతము గారు.

వారి భగవద్గీతానువాద శైలి అనన్య సామాన్యము, సరళము, అనర్గళ
శోభితము, సుభగము, సుగమమునై పండిత పామరులకు సులభ పఠన
ీయముగా నున్నది. మచ్చునకు రెండుదాహరణములు :

"యదాయదాహి ధర్మస్య .... .... .... సృజామ్యహమ్"
ఎప్పుడెపుడు ధర్మంబున కెసఁగి నాశ
ము గలిగి యధర్మ మిలలోన వృద్ధి-
జెందు! నప్పుడప్పుడు నేను- చెలగి యాత్మ
మాయచే బడయుచుందును జన్మంబు పార్థ!

"జన్మ కర్మచ మే దివ్యం .... .... .... మామేతి సోఽర్జున"
మహిని నా దివ్య జన్మకర్మముల నెవ్వఁ
డెఱుగును యథార్థముగ, నతఁడీ శరీర
మును విడిచిన వెనుక జన్మమును వహింప
డు; మఱి నన్నె పొందు నతఁడు విమలచరిత!

ఇటుల నెన్నియో వీరి విశిష్టమైన శైలికి ఉదాహరణము లెత్తి చూప
ను. వ్యాస విస్తర భీతిచే ఉదహరింపలేకున్నాను.

రామాయణ మహాభారతాది మహా కావ్యములు కొన్ని విషాదముతో
ంభమై శమముతో ముగిసినవి. అట్లే 'భగవద్గీత' అర్జున విషాదముతో
రంభమై మోక్ష సన్యాసముతో ముగిసినది. "జీవుడు విషాదములోనే

విషాదముతోనే జన్మించి పెరిగి పెద్దవాడై విషాదములోనే సన్యసించి అంత మగుచున్నాడు" అను విషయము తేటతెల్లమగుచున్నది - ఈ భగవద్గీత ద్వారమున. కవిగారు కూడా విషాదంలో రచనను ప్రారంభించి చివరకు త్యాగియై శమించినట్లుగా వీరి కుమారులైన "శ్రీ గరికపాటి దక్షిణామూర్తి గారు" వివరించిన విషయము అక్షరాల నిజము. ఏది యెట్లైనను శ్రీ లక్ష్మీ కాంతంగారి రచన, అనువాద ధోరణి, శంకర మతానుసరణి చాలా హృద్యంగా, అనర్గళంగా గంగా ప్రవాహం వలె సాగినది.

సహృదయులు, సాహితీప్రియులు, మిత్రులు, భక్తి ప్రపత్తులు గల పండిత పామరులు ఈ గ్రంథమును చదివి, వారి రచనలోని ఆనందాను భూతులను పొంది, శ్రీకృష్ణపరబ్రహ్మ కృపకు పాత్రులగుదురని తలంతును.

దాదాపు ఈ రచన పూర్తియై అర్ధ శతాబ్ది కాలం గడిచింది. ఇంత వరకు లోకవిదితం కాలేదను విచారంతో;- వారి కుమారులు - 'హనుమ దుపాసకులు', 'ఆనువంశిక ప్రామాణిక జ్యోతిష్కులు', 'వాస్తు విశారదులు', 'మంత్రశాస్త్ర పరిశోధకులు' నైన బ్రహ్మశ్రీ గరికపాటి దక్షిణామూర్తిశాస్త్రి గారు అనేక శ్రమలకోర్చి సాహితీ సహృదయులైన కొందరు మిత్రవర్యుల సహకార సంపత్తులతో గ్రంథమును ముద్రించి లోక విదితము గావించి పితౄణమును తీర్చుకొన్న ధన్యజీవులు.

ముఖ్యంగా దక్షిణామూర్తి గారికి గురుతుల్యులైన బ్రహ్మశ్రీ చింతల పాటి సుదర్శన శ్రీనివాసశాస్త్రి గారు మరియు వారి చిరమిత్రులైన కంభం పాటి గోపాలకృష్ణమూర్తి గారు మొదలగు పెద్దలు ఈ గ్రంథ ముద్రణ కెంతో సహాయ సంపత్తు లందించి తోడ్పడినారు. వారు ధన్యజీవులు, భగవ దనుగ్రహమునకు పాత్రులైయున్నారు. చరితార్థ చరిత్రులు, శ్రీశ్రీశ్రీ జగ ద్గురు శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యులు, శ్రీ పుష్పగిరి పీఠాధీశ్వరులు, శ్రీ మదభినవోద్దండ శ్రీవిద్యా నృసింహ భారతీ స్వాములవారు కరుణా సముద్రులై అనుగ్రహించిన శుభాశీస్సంపదలతో ఈ శ్రీగీతా భావార్థ చంద్రిక యను ఉద్గ్రంథమును ముద్రించి, లోకవిదితం గావించి దక్షిణామూర్తి గారు తమ పితృభక్తిని నిరూపించుకొని ధన్యజీవులైనారు. వీరెంతో అభినంద నీయులు.

ఈ రోజుల్లో సామాన్యమైన చిన్న గ్రంథమును ముద్రించుట కష్టతరము. అందులో ఈ యుద్గ్రంథమును అనేక శ్రమల కోర్చి నిర్విఘ్నంగా ముద్రించి లోకవిదితము గావించిన బ్రహ్మశ్రీ దక్షిణామూర్తి శాస్త్రి గారు ఎంతగానో కొనియాడదగినవారు. ఇంతటి మహత్కార్యమును చేపట్టి కృతకృత్యులైనందులకు వారికి నా హార్దిక కృతజ్ఞతాభివందన సుమాంజలులు అందించుకొనుచు, వీరిని ఆ శ్రియఃపతి సకలైశ్వర్యములు ప్రసాదించి రక్షించవలెనని ఆకాంక్షించుచు, స్వామివారి కృపతో ఇతోధికంగా సాహిత్యసేవ చేయుచూ భగవత్తత్వములను ప్రచారము చేయుచూ, ఆరోగ్య భాగ్యములతో శ్రీ శాస్త్రిగారు విలసిల్లవలెనని మనఃపూర్వకముగా ఆ పరవాసుదేవుడైన పరబ్రహ్మను ప్రార్థించుచున్నాను.

శుభం భవతు

తేది 4-6-1993
శ్రీముఖ జ్యేష్ఠ శు॥ ౧౫
శుక్రవారము

—నల్లదీగ శ్రీనివాసాచార్యులు
(సికింద్రాబాద్ మహబూబ్ కళాశాలా
విశ్రాంతాంధ్రాధ్యాపకులు)
శ్రీమదార్ష కళాభారతి, ఇం.నెం. 3-2,
వాణీనగర్, మల్కాజిగిరి-500 047

ఓమ్ శ్రీరామ

# చంద్రికా స్నానం

"ఐతిహాసిక పరిశోధనా గ్రంథ రచయితలు,
సుమనోజ్ఞ - సుమధుర కవితా వతంసులు,
సహృదయులు, రసజ్ఞులు"

## శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యులుగారు

లోకంలో ఇన్ని అల్లకల్లోలాలు, వైపరీత్యాలు, నాస్తికత, హింస, ప్రతి హింస, ద్వేషము, నేరప్రవృత్తి ప్రబలడానికి కారణ మేమిటి?

భగవదాజ్ఞలను మానవులు పాటించకపోవడమే! భగవదాజ్ఞలు ఏవి? అవే గీతా వచనాలు

గీతను పఠించేవారు, పఠించిన విషయాన్ని ఆచరించేవారు, ఆచరించిన వారిని ఆదర్శంగా చేసుకొని అనుసరించేవారు ఉన్నట్లయితే లోకంలో శాంతి సౌఖ్యాలు నెలకొంటాయి శాంతిసౌఖ్యాలు భగవంతుని పాదారవిందాల నుంచి రాదగినవేకాని ప్రభుత్వాల మూలంగా వచ్చేవి కావు.

పరబ్రహ్మ పురుషోత్తముడయిన శ్రీకృష్ణభగవానుడు స్థాన విచ్యుతమైన జగద్రథనేమిని సువ్యస్థితం చేసి, అనేకత్వంలో ఏకత్వాన్ని, భిన్నభిన్న రూపాలలో ఏకైక మూల స్వరూపాన్ని దర్శించే మహా భాగ్యాన్ని మానవ కోటికి ప్రసాదించాడు.

సర్వోద్ధార ప్రయత్నంతో ఆవిర్భవించినవాడు శ్రీకృష్ణభగవానుడు. కృష్ణుడు - వేదవ్యాసుడు, కృష్ణుడు - అర్జునుడు, తాను శ్రీకృష్ణుడుగా ఆవిర్భవించి గీతను ఉపదేశించి, సమస్తజీవసముద్ధరణకు దాన్ని లోకంలో ప్రశస్తం చేయించాడు.

శ్రీకృష్ణుని వాఙ్మయమూర్తియే ఈ గీత. ఇలాంటి పరమ పవిత్రమైన గ్రంథాన్ని పఠించకుండా, ఆచరించకుండా మనం మానవత్వాన్ని ఎలా పొందగలం? మన ధ్యేయమైన పరమపదాన్ని ఎలా చేరుకోగలం?

మార్గ భ్రష్టులకు పథప్రదర్శని ఈ గీత. కల్లోలమయ నిబిడాంధకారంలో దివ్యప్రఖర ప్రకాశ మీ గీత. సంసారంలో పడుతూ, లేస్తూ నడవలేని వారికి గతిశీలతని నేర్పేది ఈ గీత. శరణాగతులైన వారి చేతులను పట్టుకొని భగవత్సాన్నిధ్యానికి జేర్చేది ఈ గీత. శాంతిదాయిని, సౌఖ్యప్రదాయిని అయిన గీతా చంద్రిక మనకుండగా మనం అసహాయులము వలె, అనాథలమువలె దుఃఖపడటం దేనికి? ఈ గీతామృత చంద్రికలలో నిలిచియున్న మనం తాపత్రయంలో ఎందుకు సంతప్తులం కావాలి?

గీతను పఠించండి. గీతా పఠనం చేసినవారు ప్రపంచంలో మరే గ్రంథం చదువ నవసరం లేదన్నది విజ్ఞుల మాట.

పూజ్యులు (కీ. శే.) శ్రీ గరికపాటి లక్ష్మీకాంతంగారు గీతామృత రసాన్ని తృప్తిదీర గ్రోలి పరవశించి గీతను హృద్యమైన తేటగీతి పద్యాలలో తెనిగించారు. ఈ శ్రీగీతాభావార్థ చంద్రికను వారి కుమారుడు, సుగృహీత నామధేయుడు శ్రీ దక్షిణామూర్తిగారు అచ్చొత్తించి పితౄణం తీర్చుకొని ధన్యులయ్యారు.

సులభ సుందరమైన గీతపద్యాలలో వెలసినది ఈ గీత. శ్రీ గరికపాటివారు పద్య విద్యలో సాముగరిడీలు నేర్చిన వారయినా, ఏవేవో వ్రాయక, ఈ గీతార్థ చంద్రికను వెలువరించడం తాము తరించడానికీ- మనలను తరింపజేయడానికి, లోక కల్యాణానికి అని గ్రహించ వలసి ఉన్నది. ఈ గ్రంథంలో శ్రీకృష్ణముఖ నిఃసృతమైన వాక్కున్నది. దానికి చక్కని తెలుగుపద్య మున్నది. దానికి తేటతెనుగు తాత్పర్యము అరటిపండు నొలిచి చేత బెట్టినట్లున్నది. ఇక మీ రారగించడమే ఆలస్యం - ఆ తర్వాత మీ ఆచరణ-ఆ పిమ్మట మీరు తక్కినవారికి ఆదర్శంగా నిలవడమే.

గీతను, సహస్రనామాలను, శుక భాషితమైన శ్రీమద్భాగవతాన్ని ప్రయత్నించి ప్రతివాడు చదవాలి - అది శ్రీకృష్ణభగవానునికి సంతోష కారణ మవుతుందంటారు పెద్దలు.

145, అలకాపురి
హైదరాబాదు-500 035

-ఉత్పల సత్యనారాయణాచార్యులు

॥ మధు లుబ్ధోయథా భృంగః పుష్పాత్పుష్పాంతరం వ్రజేత్।
జ్ఞానలుబ్ధస్తథా శిష్యోగురోర్గుర్వంతరం వ్రజేత్॥

గీ॥ తేనె నాశించి తుమ్మెద తిరిగి తిరిగి
పూవునుండియు వేరొక్క పూవుజేరు
అటులె జ్ఞానార్థమై శిష్యుడమితకాంక్ష
గురువరునిజేరవలయును గురుని విడిచి 89

॥ వందే గురుపద ద్వంద్వం వాఙ్మనోఽతీతగోచరం।
శ్వేతరక్తప్రభాభిన్నం శివశక్త్యాత్మకం పరమ్॥

గీ॥ మానసము వాక్కుమించినజ్ఞానమునకు
కానబడు గురుపాదయుగంబునకును
ధవళరక్త ప్రభాసంయుతమ్మునకును
వందనము శివశక్తి సంబంధమునకు 90

॥ గుకారంచ గుణాతీతం రుకారం రూపవర్జితమ్।
గుణాతీత మరూపంచయోదద్యాత్సగురుస్స్మృతః॥

గీ॥ అల గుకారము గుణములకందకుండు
అదె రుకారము రూపున కందకుండు
ఉర్విగుణరూపములనంటకుండునట్టి
తత్త్వమును బోధసేయు నాతండె గురువు 91

॥ అత్రినేత్రశ్శివస్సాక్షాత్ ద్విబాహుశ్చ హరిః స్మృతః।
యోఽచతుర్వదనో బ్రహ్మాశ్రీగురుఃకథితఃప్రియే॥

గీ॥ మూడు కన్నులు లేని శంభుండటంచు
బాహువులు రెండుగల రమాభర్తయనుచు
నాల్గు మోములు లేనట్టి నలువయనుచు
గురువరుని సంస్తుతింతురు గిరితనూజ! 92

అనువాదమునందు భాషా సారళ్యము, భావగాంభీర్యము, అనువాద కౌశలము ఎంతేని కలదు. అనువాద మభినందనీయము.

వ్యయ ప్రయాసల నోర్చి గ్రంథమును ముద్రించి, వెలువరించిన శ్రీ దక్షిణామూర్తి గారి పితృభక్తి ప్రశంసనీయము.

(సం.) చాడ సుబ్రహ్మణ్య చయనులు

ప్లాట్ నెం. 8, సాయిపురి, బ్యాంక్ కాలనీ,
మల్కాజిగిరి-500 047

# "ఉపనిషత్సారమే గీత"


కౌతా లలితా మనోహరః

(ఆంధ్రప్రదేశ్ అఖిల బ్రాహ్మణ సమాజాభివృద్ధి సంస్థ అధ్యక్షులు)


కర్మభూమియైన మన భారతదేశము వేదశాస్త్ర, పురాణాదులకు జన్మభూమి. మహర్షులు మన భారతీయ సంస్కృతిని, సంప్రదాయములను అనాది కాలమునుంచి రక్షించి శిష్య పరంపరకు అప్పగించినారు మానవునిగా పుట్టిన ప్రతి వ్యక్తి సద్వర్తన, ధర్మరక్షణలను చేయుచూ సద్గురూపదేశముల నంది ఈ సంసార ప్రవాహమునుండి బయటపడుటకు ప్రయత్నించవలెను. సంసార సాగరమును దాటుటకు కర్మ, భక్తి, జ్ఞాన మార్గములుపదేశింపబడినవి. జ్ఞానమార్గము మహోన్నతమైనది, చాలా పవిత్రమైనది. శ్రీకృష్ణుడు 'గీత'లో "నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే" అని వక్కాణించినాడు. వేదములందు యజ్ఞయాగాది క్రతువులు మొదలుగా గల కర్మకాండ పరిపూర్ణముగా వర్ణించబడినది. ఉపనిషత్తులయందు జ్ఞాన మార్గము వివరించబడినది. ఉపనిషత్తుల సారమును భగవంతుడైన శ్రీకృష్ణుడు 'శ్రీమద్భగవద్గీత'లో ఉపదేశించినాడు. అర్జునుడు సాధకుడు. సాధకుని సంశయములన్నింటికి భగవంతుడైన శ్రీకృష్ణుడు సమాధానము చెప్పినాడు. భగవద్గీత యోగశాస్త్రము, బ్రహ్మవిద్య. మొదటి అధ్యాయమందు అర్జునుని యొక్క విషాదము (సంసారములోనున్న ప్రతి మానవునికి గలుగు దుఃఖము) వర్ణింపబడినది. రెండవ అధ్యాయము నుంచి భగవంతుని బోధ, దానిమీద వచ్చిన సందేహములు, దానికి సంబంధించిన భగవంతుని సమాధానములు, ఈ విధముగా అభ్యాసకునకు 'కర్మ, భక్తి, జ్ఞాన' మార్గము

లను బోధించిన గ్రంథరాజము. గీతోపదేశము నంతయు వినిన అర్జునుడు చివరకు "నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత। స్థితోఽస్మి గత సందేహః కరిష్యే వచనం తవ॥" అని అంటాడు. "గురు కటాక్షము వలన గీతాధ్యయనము చేసి, నిత్యమూ మననము చేయుచూ అభ్యసించు ప్రతి జీవుడూ మోహము వదలి, జ్ఞానప్రాప్తి నంది సంసార సాగరమును దాటును" అని చెప్పుటకు ఏమాత్రము సంశయింప నక్కరలేదు.

అటువంటి మహోన్నతమైన గ్రంథమును తెనుగు భాషలో (కీ.శే.) గరికపాటి లక్ష్మీకాంతం గారు అనువదించి ధన్యతను పొందినారు. మిక్కిలి వ్యయ ప్రయాసల కోర్చి ఆ గ్రంథమును ముద్రించిన వారి కుమారులు శ్రీ గరికపాటి దక్షిణామూర్తి గారు ఈ విధముగ 'పితృ ఋణము'ను తీర్చు కొనినారు. ఈ గ్రంథమును చదివి సాధకులు కృతకృత్యులగునట్లు జగద్గురువు శ్రీకృష్ణ పరమాత్మ యనుగ్రహించు గాక !

8-7-93 —(సం.) కౌతా లలితా మనోహరః

# విషయానుక్రమణిక



# వి జ్ఞ ప్తి

1. కం. ఎక్కడ భగవద్గీత ల,
వెక్కడ శంకర గురువరు, – డెక్కడ వ్యాసుం,
డెక్కడ, నేను గ్రహించుట,
నక్క కశక్యంబుగాదె – నాకము( బొందన్.

2. గీ. జగతి జ్ఞానవిహీనుండు–మృగసమాను(
డనియు, జ్ఞానంబు దగ( దృప్తి–యాక్తి యనియు
వసుధ( బండితవర్యులు–పల్కుచుంద్రు
కాన, జ్ఞానమొందఁగ( గృషి–క్రమము కాదె.

3. గీ. తెలియుటకు( గుఱుతు మఱల(–దెలుపుటగుట(,
*'కృష్ణగీత'ల( దెలియంగ–నెంచి యత్న
ము నలుపుచు, భావమెంతగ–బోధపడెనొ
తెలిసికొనఁగ లిఖించితి( – దీని నిటుల.

4. కం. పండితుఁడనంచు నెంచను
బండితుఁడని లాతివారు–పలుకఁగ గోరన్
దండము విదులకు( గన బా
లుండు చపలతవలనను న–లుపు పని( బోలెన్.

5. గీ. ధీనిధులకును గూడ ధా–త్రి( బొరపాటు
లుండ నల్పమతినగు నా–కుంట వింత
యగునె? కాన బుధులు దీని–యందుఁగల ప్ర
మాదముల సయిరింపఁగ–మనవి చేతు.

---

కృష్ణగీత = 'లక్ష్మణరేఖ'వలె, ఆదేశము, ఆజ్ఞాపూర్వకము, అను భావముతో





# దేవ, గురు సంస్మరణము

6. కం. శ్రీకరు, మునివర సేవితుఁ,
ప్రాకటమొప్పఁగఁ గిరీటి–భవబంధములన్
బోకటవెట్టిన ధీరునిఁ,
జేకొని ధ్యానింతు నిపుడు–శ్రీకృష్ణు మదిన్.

7. కం. గజచర్మాంబరుపుత్రకు,
గజవదను న్నేకదంతు,–గజరిపుహర్తన్,
విజితేంద్రియు, విఘ్నేశ్వరు,
విజయము పొందంగ నిపుడు–వేడెద భక్తిన్.

8. కం. వేదములను వేఱుపఱచి,
యాదరమున మూఢజనుల – యజ్ఞత పోవన్
మేదినిఁ బురాణజాలముఁ
బ్రోదిగ వ్రాసిన మునీంద్రు – మ్రొక్కెద వ్యాసున్.

9. కం. సంకరమందగ మతములు,
క్రుంక సుకర్మాచరణము, – కూలఁగ కులముల్,
పంకంబు బాపఁ బుట్టిన
శంకర గురు బ్రస్తుతింతు – సంతస మొప్పన్.

10. కం. వర గరికపాటి కులశే
ఖరు, ప్రియ జనకుఁ, బుధవరు, న–ఘరహితు, సుగుణా
కరు, స్మరియించెద మద్గురు
వరు వేంకట సుబ్బరాయు – భావములోనన్.





# శ్రీ గీతా భావార్థ చంద్రిక

## ప్రథమోఽధ్యాయః

## అర్జున విషాదయోగః

ధృతరాష్ట్ర ఉవాచ :-

శ్లో. ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాండవా శ్చైవ కిమ కుర్వత సంజయ! 1

గీ. ఆంబికేయుఁ డిట్లనియె, "నా-హవ మొనర్ప
గను, గురుక్షేత్రముననను గూ-డిన సుయోధ
నాదులును, బాండుపుత్రులు- నచట నేమి
సేసి రదియ సంజయ! తగఁ- జెపుము నాకు.

తా. ఓయి సంజయా! పుణ్యక్షేత్రమైన కురుక్షేత్ర మందు యుద్ధము చేయుటకై చేరిన
నావారలైన దుర్యోధనాదులును, పాండవులును ఏమి చేసిరి ?

సంజయ ఉవాచ :-

శ్లో. దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్. 2

కం. అనవుడు సంజయుఁ డాతని
కనియెను బాండవుల సైన్య-మంతయు దుర్యో
ధనుఁ డరసి పదంబడి ద్రో
ణునిఁజేరి యిటుల వచించె-ను, నయమెసంగన్.

సంజయుడు చెప్పుచున్నాడు :-

తా. దుర్యోధనుడు, వ్యూహరూపముగా నొనర్పఁ బడియున్న పాండవ సైన్యమునుఁ
జూచి, గురువగు ద్రోణాచార్యుని యొద్దకుఁ బోయి యిట్లు చెప్పెను.

శ్లో. పశ్యైతాం పాండుపుత్రాణా మాచార్య! మహతీం చమూమ్
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా. 3





గీ. తెలఁగ యాచార్యవర్య! నీ-శిష్యుఁడయిన
ద్రుపదనందనుం డిటు వ్యూహ-రూపముగ నొ
నర్చియున్న పాండవుల సై-న్యంబు నొక్క-
సారి కలయ వీక్షింపు ము-త్సాహ మెసఁగ.

తా. ఓ యాచార్య! బుద్ధిమంతుఁడును నీ శిష్యుఁడును ద్రుపదరాజు కుమారుఁడును నైన ధృష్టద్యుమ్నుని చేత వ్యూహాకారముగ రచింపఁబడి యున్న, పాండవుల యొక్క గొప్ప సేనను చూడుము.

శ్లో: అత్ర శూరా మహేష్వాసా భీమార్జున సమాయుధి
యుయుధానో విరాట శ్చ ద్రుపద శ్చ మహారథః 4

కం. కల రచట గురువర! కడిఁది
విలుకాండ్రును శూరులు నగు-భీమార్జున తు
ల్యులు, యుయుధాన విరాట నృ
పులు, ద్రుపదుఁడు, ధృష్టకేతు-వును, బురుజితుఁడున్.

తా. ఈ పాండవ సేనయందు గొప్ప విలుకాండ్రును, యుద్ధము చేయుటయందు భీమార్జునులతో సమానులు నగు సాత్యకియు, విరాటుఁడును, మహారథికుఁడైన ద్రుపదరాజును గలరు.

శ్లో. ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజ శ్చ వీర్యవాన్
పురుజి త్కుంతిభోజ శ్చ శైబ్య శ్చ నరపుంగవః 5

శ్లో. యుధామన్యు శ్చ విక్రాన్త ఉత్తమౌజా శ్చ వీర్యవాన్
సౌభద్రో ద్రౌపదేయా శ్చ సర్వ ఏవ మహారథాః 6

గీ. చేకితానుండు, మఱియు గా-శీపురాధి
పుండు, నభిమన్యుఁడుఁ దగ శై-బ్యుండు, నుత్త
మౌజుఁడును, యుధామన్యువు, - నొనరఁ బాండ
వేయులును, మహారథికులు-వీరు సుమ్ము.

తా. మఱియు, ధృష్టకేతువు, చేకితానుఁడు, పరాక్రమశాలియైన కాశీరాజు, పురుజిత్తు, కుంతిభోజుఁడు, శైబ్యుఁడు, అభిమన్యుఁడు, ద్రౌపదీపుత్రులు, కలరు. వీరందఱును మహారథికులు సుమా!



శ్లో. అస్మాకం తు విశిష్టాయే తా న్నిబోధ ద్విజోత్తమ!
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే. 7

కం. మన సేనసున్న నాయకు
లను, మఱీ, మనలోని శ్రేష్ఠులను, గుఱుతుగ నే
వినిపింతు నిపుడు వివరము
గను, విను మాచార్యవర్య! - కరుణ దలిర్పన్.

తా. ఓ బ్రాహ్మణోత్తమా! మనలో శ్రేష్ఠులైన వారిని, మన సైన్యములో నాయకులుగ నున్నవారిని నీకు జ్ఞాపకము చేయుట కొఱకు చెప్పుచున్నాను.

శ్లో. భవా న్భీష్మ శ్చ కర్ణ శ్చ కృప శ్చ సమితింజయః
అశ్వత్థామా వికర్ణ శ్చ సౌమదత్తి ర్జయద్రథః 8

కం. నివుడఁగ భీష్ముఁడు, భూరి
శ్రవుఁడును, గర్ణుఁడుఁ, గృపుండు-సంగడియౌ సైం
ధవుఁ, డశ్వత్థామయు, మఱీ
యు, వికర్ణుఁడు, నీవును నిట-నుత్తము లరయన్.

తా. నీవును, భీష్ముఁడును, కర్ణుఁడును, కృపాచార్యుఁడును, అశ్వత్థామయును, వికర్ణుఁడును, సోమదత్తుని కుమారుఁడైన భూరిశ్రవుఁడును, జయద్రథుఁడు (సైంధవుఁడు) ను మన సేనలో నుత్తములు.

శ్లో. అన్యే చ బహవశ్శూరా మదర్థే త్యక్త జీవితాః
నానాశస్త్ర ప్రహరణా స్సర్వే యుద్ధ విశారదాః 9

గీ. అరయ నింక పెక్కండ్రు మ-హాస్త్ర శస్త్ర
నిస్సరణ కళాదక్షులు - నిశ్చయించి
యున్నవారలు, ననుగూర్చి-యుద్ధరంగ
మునను బ్రాణము ల్విడువంగ - భూసురుండ!

తా. వీరలేకాక, నానావిధములైన యాయుధములచే యుద్ధము సేయుట యందు సమర్థులైన పెక్కండ్రు శూరులు నా కొఱకు ప్రాణములను విడువ నిశ్చయించి యున్నారు.





శ్లో. అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితం,
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితం. 10

గీ. అరయ భీష్మాభిరక్షిత-మగు మన బల
మపరిమితముగను, వృకోద-రాభిరక్షి
తమగు శత్రుసేన పరిమి-తముగను దన
రారుచున్నవి, కను మొక్క-సారి వీని.

తా. భీష్ముని చేత రక్షింపఁబడుచున్న మన 'సైన్య మపరిమితము'గను భీమునిచేత రక్షింపఁబడుచున్న పాండవ సైన్యము 'పరిమితము'గను, ఉన్నవి.

శ్లో. అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః,
భీష్మ మేవాభిరక్షంతు భవంత స్సర్వ ఏవహి. 11

గీ. వ్యూహమున మీరలందఱు-పూని నియమి
త ప్రదేశముల నిలిచి, - యప్రమత్తు
లయి, నలుదిశలను మన సై-న్యంబు నడుపు
భీష్మునిఁ దగ రక్షింపుడు-వీక నింక.

తా. మీరందఱు వ్యూహమందు నియమిత ప్రదేశములందు నిలచి, అప్రమత్తులై భీష్మున కెట్టి యపాయము కలుగకుండు నటుల, నలుదిక్కులందును కాచి యుండవలెను.

శ్లో. తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః,
సింహనాదం వినద్యోచ్చైః శ్శంఖం దధ్మౌ ప్రతాపవాన్. 12

గీ. అప్పు డాతనికి మిగుల-హర్ష మెసఁగఁ
బెలుచ సింహనాదము దగ-సలిపి యంత
శంఖమును దీసి పూరించె-శంతనసుతుఁ
డుభయపక్షము *ఆని సల్ప-నుత్సహింప.

తా. అప్పు డా దుర్యోధనునకు సంతోషము గల్గునట్లుగ, కురువృద్ధుఁడైన భీష్ముఁడు బిగ్గఱగా సింహనాదము చేసి, శంఖమును పూరించెను.

---

* ఆని = యుద్ధము



శ్లో. తత శ్శంఖా శ్చ భేర్య శ్చ పణవానక గోముఖాః
సహసైవాఽభ్యహన్యంత స శబ్ద స్తుములోఽభవత్. 13

గీ. అంతఁ గౌరవసైనికు- లానకముల
నుఁ, బణవములను, భేరుల-ను, మఱి, శంఖ
ములను ద్వరగ ప్రయోగింప, ది-శలు పదియును
నిండె సంకులంబయి యా ధ్వ-నియుఁ, గరంబు.

తా. అంత కౌరవ సైనికులు శంఖములు, భేరులు, పణవములు, ఆనకములు-అనెడి వాద్య విశేషములను శీఘ్రముగా వాయించిరి. వాని శబ్దము దశదిశలందును దట్టముగా నిండెను.

శ్లో. తత శ్శ్వేతై ర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ,
మాధవః పాండవ శ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః. 14

గీ. అంత మధుసూదనుండును,- నర్జునుఁడును,
ధవళ హయములఁ దనరు స్యం-దనము నెక్కి
సరగ దేవదత్తము పాంచ-జన్య మనఁగ
నెసఁగు దివ్యశంఖములఁ బూ-రించి రెలమి.

తా. అప్పుడు కృష్ణార్జునులు తెల్లని గుఱ్ఱములు కట్టబడిన గొప్ప రథము నెక్కి, దివ్యములైన తమ శంఖములను పూరించిరి.

శ్లో. పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః,
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః. 15

శ్లో. అనంత విజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః
నకుల స్సహదేవ శ్చ సుఘోష మణిపుష్పకౌ. 16

గీ. పౌండ్రమను శంఖ మూదెను-వాయుసుతుఁ, డ
నంత విజయమును దగ ధ-ర్మాత్మజుండు,
నకులుఁడు సుఘోష శంఖర-త్నంబును, సహ
దేవుఁడు మణిపుష్పకము నూ-దిరి కడఁగి.

గురునిందా దుష్ఫలములు :-

శ్లో॥ ఏవం శ్రుత్వా మహాదేవి గురునిందాం కరోతి యః।
సయాతి నరకాన్ ఘోరాన్ యావచ్చంద్రదివాకరౌ॥

తే.గీ॥ ఇట్లు చెప్పిన సూక్తుల నెల్ల వినియు
వరగురుని నింద చేయుచో పాపమొంది
మనుజులతి ఘోర నరకంబు లనుభవింత్రు
భాస్కరుడు చంద్రుడున్నంత వరకు దేవి! 130

గురునియెడ శిష్యుడు ప్రవర్తింప వలసిన విధము :-

శ్లో॥ యావత్కల్పాంతకో దేహ స్తావద్దేవి గురుం స్మరేత్।
గురులోపో న కర్తవ్యః స్వచ్ఛన్దో యది వా భవేత్॥

తే.గీ॥ తనువు కల్పంబు ముగెసెడు దనుక నున్న
శ్రీ గురువు నంతవరకు స్మరింప వలయు
స్వేచ్ఛమీరగ దవ్వున శిష్యుడున్న
గురుని తలచుట మాత్రము మరువరాదు 131

శ్లో॥ హుంకారేణ న వక్తవ్యం ప్రాజ్ఞశిష్యైః కదాచన।
గురోరగ్రే నవక్తవ్య మసత్యం తు కదాచన॥

ఆ.వె॥ గురువునెదుట కోపపరత హుంకృతి జేసి
ప్రాజ్ఞులైన శిష్యవర్యులెపుడు
మాటలాడరాదు మరివారలెప్పుడు
కల్లలాడరాదు కమలనయన! 132

శ్లో॥ గురుం త్వం కృత్య హుంకృత్య గురుసాన్నిధ్య భాషణః।
అరణ్యే నిర్జ లే దేశే సంభవేద్బ్రహ్మరాక్షసః॥

తే.గీ॥ నియతి విడనాడి గురువును నీవటంచు
హుంకృతిన్ జేసి మాటాడు చున్న నరుడు
జలములేని అరణ్య దేశమ్మునందు
బ్రహ్మరాక్షస జన్మంబు పడయు నిజము 133



తా. సంకులమైన వారి శంఖధ్వని భూమ్యాకాశములను ప్రతిధ్వనింపఁజేయుచు, దుర్యోధనాదుల గుండెలు బ్రద్దలగునట్లుఁ జేసెను.

శ్లో. అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః,
ప్రవృత్తే శస్త్ర సంపాతే ధను రుద్యమ్య పాండవః. 20

శ్లో. హృషీకేశం తదావాక్య మిదమాహ మహీపతే!
సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత! 21

శ్లో. యావ దేతాన్ నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్,
కైర్మయా సహయోద్ధవ్య మస్మిన్ రణ సముద్యమే? 22

శ్లో. యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః,
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియ చికీర్షవః. 23

గీ. చెలఁగి శత్రు బాణంబులు-చెంతఁబడఁగ
నంత గాండీవమును బూని- యర్జునుండు
ధార్తరాష్ట్రుల దెసఁ జూచి,- తగ ముకుందుఁ
బిలిచి యివ్విధంబుగఁ బల్కెఁ- బేర్మి నధిప.

గీ. ఉత్సుకత తోడఁ జెలగి, దు-ర్యోధనునకు
హితముఁ గూర్పంగఁ దలపోసి- యిపుడు యుద్ధ
భూమిఁ బడసిన యోధులఁ - బొసఁగఁ గాంచి
యెవరిఁ బోరవలెనొ వారి-నెఱుఁగఁ దలతుఁ
గాన, రథమునుఁ దగ నిప్డు- కంసవైరి!
యుభయ సైన్యంబుల నడుమ- నుంచుమయ్య.

తా. ఓ రాజా! అటు తరువాత, ఉభయ పక్షముల వారొకరి మీద నొకరు బాణములు ప్రయోగించు టారంభము కాగా, అర్జునుఁడు యుద్ధము చేయుటకు సిద్ధముగా నిలచియున్న దుర్యోధనాదులనుఁ జూచి వింటి నెక్కుపెట్టి, అప్పుడు శ్రీకృష్ణునితో నిట్లుఁ జెప్పెను :-

"కృష్ణా! దుష్టబుద్ధి గలిగిన దుర్యోధనుని పక్షమున నిల్చి యుద్ధము చేయుటకై వచ్చిన వీరి నందఱిని నే నీ యుద్ధారంభ సమయమం దొక్కసారి కలయఁ జూడ గలుగునట్లుగ, నా రథమును రెండు సేనల నడుమ నుంచుము."





సంజయ ఉవాచ :-

శ్లో. ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత!
సేనయో రుభయో ర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్. 24

శ్లో. భీష్మ ద్రోణ ప్రముఖత స్సర్వేషాం చ మహీక్షితాం,
ఉవాచ పార్థ! పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి. 25

సంజయుడు చెప్పుచున్నాడు :

గీ. అటులఁ బార్థుండు పలుక దై-త్యారి యెలమి
దురగముల నదల్చి, రథము- ద్రోణ భీష్ము
లట కెదుట నుభయ సైన్యంబు-ల నడి నుంచి
"సారిది నీ సైనికులఁ బాఱఁ-జూడు" మనియె.

తా. ఓ ధృతరాష్ట్రా! అర్జునుఁ డిట్లు చెప్పగా, కృష్ణుఁ డా రథమును రెండు సైన్యముల మధ్యన, భీష్మ ద్రోణులకును, సమస్త రాజులకును నెదురుగా నిలిపి, "అర్జునా! ఇక్కడ యుద్ధము చేయుటకై చేరియున్న కౌరవులను జూడు"మని పల్కెను.

శ్లో. తత్రా పశ్యత్ స్థితాన్ పార్థః పితౄ నథ పితామహాన్
ఆచార్యా న్మాతులా న్భ్రాతౄన్ పుత్రా న్పౌత్రా న్సఖీం స్తథా. 26

శ్లో. శ్వశురాన్ సుహృద శ్చైవ సేనయో రుభయో రపి
తాన్ సమీక్ష్య సకౌంతేయ స్సర్వాన్ బంధూ నవస్థితాన్ 27
కృపయా పరయాఽఽవిష్టో విషీద న్నిద మబ్రవీత్. 27 1/2

అర్జున ఉవాచ :

దృష్ట్వేమం స్వజనం కృష్ణ! యుయుత్సుం సముపస్థితమ్ 28
సీదంతి మమ గాత్రాణి, ముఖం చ పరిశుష్యతి,
వేపథు శ్చ శరీరే మే రోమహర్ష శ్చ జాయతే. 29

గీ. అర్జునుఁ డట నుభయసేన-లందు నున్న
తండ్రులను, తాతలను, నన్న-దమ్ములను, గు
రులను, మేనమామలను, మి-త్రులను, బుత్రు
లను, మనుమల, నందఱఁ గను-గొనియె నపుడు.



గీ. వారలందఱ వీక్షించి- పార్థుఁ డంత
సచ్యుతుని తోడ ననియె, ద-య జనియింప
దుఃఖ పరవశుం డగుచు, "మ-ధురిపుహారి!
యుద్ధ మొనరింప నిటఁ గూడి-యున్న యీ స్వ
జనముఁ జూడంగ, రోమ హ-ర్షంబు గలుగు,
వక్త్ర మెండెడు, దేహంబు- వణకుచున్న,
దవయవంబులు శిథిలంబు-లయ్యెడు; మఱి
మనసు కలఁతఁ బొందెడు, దగఁ-గనుము నన్ను.

తా. అర్జునుఁ డప్పు డా రెండు సేనలందున్న తండ్రులను, తాతలను, గురువులను, మేనమామలను, అన్నదమ్ములను, కొడుకులను, మనుమలను, చెలికాండ్రను, మామలను, మిత్రులను జూచెను. (26, $26^{1}/2$)

అర్జునుఁ డా రెండు సేనలందున్న చుట్టముల నందఱిని జూచి, ఉత్కృష్టమైన దయతోఁ గూడినవాడై, దుఃఖించుచు, ఇట్లు పలికెను. "కృష్ణా! యుద్ధము చేయుట కిచ్చట చేరియున్న యీ బంధువుల నందఱిని జూడగా, నా యవయవము లన్నియు బలహీనములగుచున్నవి. నోరు ఎండుచున్నది. (27, 28, 29)

శ్లో. గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే,
న చ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః. 30

గీ. జారుచున్నది విల్లు హ-స్తంబునుండి
యొడలి చర్మంబు మిక్కిలి- యుడుకు జెందు,
మనసు భ్రమరించుచున్నది- మాధవుండ!
రథముపై నిలువఁగ సమ-ర్థతయు లేదు.

తా. గాండీవము చేతినుండి జారుచున్నది. ఒడలి చర్మమంతయు మిక్కిలి యుడుకు చెందుచున్నది. నిలుచుటకైనను శక్తి లేకున్నది. నా మనస్సు తిరుగుదానివలె నున్నది.

శ్లో. నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ!
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే. 31





గీ. అశుభ సూచకములగు న-పశకునములు
గాన వచ్చుచున్న విపుడు-కమలనాభ!
బంధువులఁ జంప నని యందుఁ - బరఁగ శుభము
గలుగఁ జాల దవని యందు- దలచి చూడ.

తా. కృష్ణా! మఱియును, అశుభ సూచకములైన శకునములు కనఁబడుచున్నవి. యుద్ధమందు బంధువులను జంపుట వలన శుభ మేమియు గానరాదు.

శ్లో. **న కాంక్షే విజయం కృష్ణ! న చ రాజ్యం సుఖాని చ,**
**కిం నో రాజ్యేన గోవింద! కిం భోగై ర్జీవితేన వా?** 32

గీ. **జయముఁ గోరను, మఱియు రా-జ్యంబుఁ గోర,**
**సుఖముఁ గోరఁ; బుడమి, మధు-సూదనుండ!**
**బంధువులను జంపిన వెనుకఁ- బరఁగ రాజ్య**
**మేల? భోగమేల? బ్రతుకు-టేల? చెపుమ.**

తా. కృష్ణా! నేను జయమునుగాని, రాజ్యమును గాని, సుఖమును గాని కోరను. గోవిందా! మన బంధువు లందఱు చనిపోయిన పిమ్మట మన కీ రాజ్యము వలన నేమి ప్రయోజనము? భోగము వలన నేమి ప్రయోజనము? బ్రతుకుట వలన నేమి ప్రయోజనము?

శ్లో. **యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖాని చ,**
**త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ.** 33

గీ. ఎవరు జీవించి యుండిన- నిందు రాజ్య
భోగములు సుఖదాయకం-బులగు; నట్టి
బంధువులు ప్రాణ ధనముల-పైన నాశ
వదలి నిల్చి యున్నారు స-మన మొనర్ప.

తా. ఏ బంధువుల యొక్క ప్రయోజనము కొఱకు మనము రాజ్యమును, భోగములను, సుఖములను, కోరఁదగినవారమో, అట్టి బంధువులు ధన ప్రాణముల మీద ఆశను వదలి, ఈ యుద్ధ భూమియందు నిల్చియున్నారు.

శ్లో. ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః,
మాతులా శ్శ్వశురాః పౌత్రా స్స్యాలా స్సంబంధిన స్తథా. 34



కం. కల రీ రంగంబున గురు
వులు, దండ్రులునుం గనంగఁ -బుత్రులు, మఱి, మా
మలు, మేనమామలుం, బా
వలు, తాతలు, మఱఁదులు నగు- బంధుజనంబుల్.

తా. గురువులు, తండ్రులు, కొడుకులు, తాతలు, మేనమామలు, మామలు, బావమఱఁదులు, సంబంధులు (వియ్యంకులు) మొదలగు బంధువులున్నారు.

శ్లో. ఏతా న్నహంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన!
అపి త్రైలోక్య రాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే. 35

కం. పెల్లుగ నను హింసించిన,
ముల్లోకముల దొరతనము- పాసఁగఁగ నున్న
న్నొల్లను వీరలఁ జంపఁగ;
నుల్లము ధర నేలఁ జంప-నొప్పునె? కృష్ణా!

తా. ఓ కృష్ణా! ఈ దుర్యోధనాదులు మమ్ము చంపుచున్నను, త్రైలోక్యరాజ్యము రానున్నను, నేను వీరిని జంపఁ గోరను. ఇక నీ భూలోక రాజ్యము కొఱకు వీరిని జంపఁ జాలనని వేఱుగఁ జెప్పవలయునా? (చెప్ప నవసరము లేదనుట).

శ్లో. నిహత్య ధార్తరాష్ట్రాన్నః కాప్రీతిస్స్యా జ్జనార్దన!
పాప మేవాశ్రయే దస్మా న్హత్వైతా నాతతాయినః. 36

గీ. ధార్తరాష్ట్రుల నిపుడు యు-ద్ధంబు సలిపి
చంప మనకుఁ జేకూరునే- సంతసంబు?
మనలఁ జంపంగ వీరు వ-చ్చినను, మనము
వీరలను జంపఁ బాపంబె- చేరు మనల.

తా. ఓ కృష్ణా! దుర్యోధనాదులను జంపుట వలన మన కేమి సంతోషము కలుగును? వీరు మనలను జంపుటకు వచ్చి యున్న వారలైనను, వీరిని జంపుట వలన మనకు పాపమే కలుగును.

శ్లో. తస్మా న్నార్హావయం హన్తుం ధార్తరాష్ట్రాన్ సబాంధవాన్,
స్వజనం హి కథం హత్వా సుఖి న స్స్యామ మాధవ! 37





కం. అందువలన మన మిప్పుడు
బందుగులన్ జంపు టరయఁ- బాడియునుం గో
విందుఁడ! కా; దిటు చుట్టల
నందఱఁ జంప సుఖ మెట్టు-లందుదు మూర్విన్.

తా. కావున దుర్యోధనాదులను వారి బంధువులను జంపుట మనకు తగదు. కృష్ణా! మన వారలను మనమే చంపి యెట్లు సుఖము పొందుదుము.

శ్లో. యద్యప్యేతే న పశ్యంతి లోభోపహత చేతసః,
కులక్షయకృతం దోషం మిత్ర ద్రోహే చ పాతకమ్. 38

శ్లో. కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుమ్,
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన! 39

గీ. రాజ్య లోభము చేత రా-రాజు, నతని
తమ్ములును, వంశ నాశ పా-తకము, మిత్ర
వధ వలన సంభవించు పా-పంబుఁ దెలియ
కున్నను, దగ వీనిఁ దెలిసి-యుండియు, మన
మిటుల నీ పాపకార్యంబు- నిపుడు పూని
చేయు టరయ ధర్మమగునె? - చెప్పుమయ్య.

తా. రాజ్యలోభము చేత, దుర్యోధనుఁడును, అతని తమ్ములును, వంశనాశముచేఁ గలుగు పాతకమును, మిత్రవధ వలనఁ, గలుగు పాపమును దెలిసికొన జాలకున్నను, దీనిని దెలిసియున్న మన మీ పాపకార్యము చేయుట ధర్మమగునా?

శ్లో. కులక్షయే ప్రణశ్యంతి కులధర్మా స్సనాతనాః,
ధర్మే నష్టే కులం.కృత్స్న మధర్మోఽభి భవత్యుత. 40

గీ. వంశ నాశంబు గలుగ శా-శ్వతములైన
వంశ ధర్మంబు లన్నియు-భంగమగును;
వంశ ధర్మములు నశింప-వంశమంత
యును నధర్మంబు పాలగు-నుర్విఁ గృష్ణ!

తా. వంశ నాశము గలుగుట వలన, శాశ్వతములైన వంశ ధర్మము లన్నియు నశించును; వంశ ధర్మములు నశించుట వలన వంశమంతయును నధర్మము పాలగును.



శ్లో. అధర్మాభి భవా త్కృష్ణ! ప్రదుష్యంతి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ! జాయతే వర్ణ సంకరః. 41

గీ. వంశ మం దనాచారంబు- ప్రబలగను, వ
సుధ కులస్త్రీలు చెడుదురు- సొరిది; స్త్రీలు
దుష్టురాండ్రు గాఁగ సరగఁ- దోడు తోడ
వర్ణ సంకరంబు గలుగు- పద్మనాభ!

తా. కృష్ణా! వంశము యొక్క సదాచారములు నశించుట వలన కులస్త్రీలు చెడుదురు. స్త్రీలు చెడుటచే వర్ణ సంకరము గలుగును.

శ్లో. సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ,
పతంతి పితరో హ్యేషాం లుప్త పిండోదక క్రియాః. 42

గీ. వర్ణ సంకరము గలుగ- వంశనాశ
మునకుఁ గారణులగు వారి-కి నరకంబు
గలుగు; పిండోదకములు లే-క పితరులు బ
డుదు రధో లోకముననుఁ, గ-డు వెత తోడ.

తా. వర్ణ సంకరము వలన వంశమును జెఱచిన వారికిని, ఆ వంశమునకును నరకమే కలుగును. కారణ మేమనిన; పితృదేవతలు పిండోదకములు లేక, అధోలోకమున బడుదురు.

శ్లో. దోషై రేతైః కులఘ్నానాం వర్ణ సంకర కారకైః
ఉత్సాద్యంతే జాతి ధర్మాః కులధర్మా శ్చ శాశ్వతాః. 43

గీ. వర్ణ సాంకర్య మొనరించు- వర్ణనాశ
కారకుల దోషముల చేత- గౌరవంబు
లును, పరంపరానుగతము-లు నయి వెలయు
జాతి కుల ధర్మములు, వినా-శంబు చెందు.

తా. వర్ణనాశ కారకుల వలన నీ వర్ణ సాంకర్యము కలుగగా, శాశ్వతములైన జాతి కుల ధర్మములు నాశము చెందును.

శ్లో. ఉత్పన్న కుల ధర్మాణాం మనుష్యాణాం జనార్దన!
నరకే నియతం వాసో భవతీ త్యను శుశ్రుమ. 44





శ్లో. అహో! బత! మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్
యద్రాజ్య సుఖలోభేన హంతుం స్వజన ముద్యతాః 45

గీ. సత్కులాచారములను నా-శంబు సేయు
వారలకు నరకమున శా-శ్వత నివాస
ము గలుగు; మన మెంత కలుషం-బు సలుపంగఁ
గడఁగితిమి రాజ్య లోభంబు-కతన నకట!

తా. ఇట్లు సత్కులాచారములను నశింపఁ జేసిన వారలకు నరకమందు శాశ్వత నివాసము కలుగునని పెద్దలు చెప్పుదురు. మన మిప్పుడెంత పాపకార్యము సలుపఁ బూనితిమి. అక్కటా! రాజ్యలోభము చేత మన బంధువులనే చంపుట కుద్యుక్తులమైతిమి కదా!

శ్లో. యది మా మప్రతీకార మశస్త్రం శస్త్ర పాణయః,
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్. 46

గీ. ఆయుధ రహితుండనయి యా-హవ మొనర్ప
కుండు నను శస్త్రములను దు-ర్యోధనాదు
లెనఁగి చంపినను నదియె- యిపుడు నాకు
క్షేమతరమని యెంచుదుఁ- గృష్ణ! నేను.

తా. నేను ఆయుధములు లేకుండను, యుద్ధము చేయకుండను నుండగా, దుర్యోధనాదులు ఆయుధ హస్తులై వచ్చి నన్ను వధించిన, అది నాకు మిక్కిలి మేలు కాగలదు.

సంజయ ఉవాచ :

శ్లో. ఏవముక్త్వార్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్,
విసృజ్య సశరం చాపం శోక సంవిగ్న మానసః. 47

(అర్జున విషాద యోగోనామ ప్రథమాధ్యాయ స్సంపూర్ణమ్)

గీ. పార్థుఁ డిటు పలికి గరుడ-ధ్వజుని తోడ
శరశరాసనముల నంత! జార విడిచి
తేరుపైన దిగులు పడి-కూరుచుండె
నని తగఁ బలికె సంజయుం-డధిపుతోడ.

తా. అర్జునుఁ డిట్లు చెప్పి దుఃఖముచే చలించిన మనస్సుగలవాడై ధనుర్బాణములను విడిచిపెట్టి, ఉభయసేనల మధ్యమునందు రథముపైనఁ గూర్చుండెను.

(అర్జున విషాదయోగమనెడి ప్రథమాధ్యాయము సంపూర్ణము.)



# ద్వితీయోధ్యాయః
## సాంఖ్య యోగః

సఞ్జయ ఉవాచ :

శ్లో. తం తథా కృప యాఽఽవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్,
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః. 1

గీ. అంతఁ బొంగి పొరలు దయ-యలమికొనగ
నశ్రుపూర్ణాకులేక్షణుండగుచు రథము
పైన గూర్చుండి యున్న బీభత్సు నపుడు
కాంచి పలికె నిటుల మురవైరి యెసఁగి.

తా. అట్లు జాలితో గూడుకొని యున్నవాడును, కన్నీటితో నిండిన వ్యాకులమైన కన్నులు గలవాడును, దుఃఖించుచున్న వాడును నగు నా యర్జునునితో శ్రీకృష్ణుఁ డిట్లు పలికెను.

శ్రీ భగవాన్ ఉవాచ :-

శ్లో. కు తస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్,
అనార్య జుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున! 2

శ్లో. క్లైబ్యం మాస్మగమః పార్థ! నైతత్త్వ య్యుపపద్యతే,
క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప! 3

గీ. కశ్మలంబును నపకీర్తి-కరము మఱి, య
నార్యజుష్టంబునైన మో-హం బిదేల
నిన్నిపుడు చేరె యలమికొ-నియె గిరీటి?
పాడి కాదిది నీయందు-బాదుకొనుట
వేగ నీ మనః క్లైబ్యంబు-విడిచి ధృతిని
బూని యుద్ధంబు చేసి గె-ల్పొందుమయ్య.

తా. కశ్మలమును, అపకీర్తికరమును, పామరు లవలంబింపదగినదియును, నరకము కలిగించునదియునునైన యీ మోహము, కలుగదగని యీ తరుణమందు నీకేల





గలిగినది? అర్జునా! (నీకీ) మనోవ్యాకులత తగినది కాదు. ఈ తుచ్ఛమైన హృదయ దౌర్బల్యమును పోగొట్టుకొని యుద్ధమునకు లెమ్ము.

అర్జున ఉవాచ :

శ్లో. కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన!
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన 4

గీ. నాపు డిట్లనునంత ధ-నంజయుండు,
"పూజ్యులౌ ద్రోణ భీష్ములఁ-బూని యెటుల
నిపుడు యుద్ధంబునం దెది-రించి, తీక్ష్ణ
బాణజాలము వైచి నొ-వ్వంగఁజేతు.

తా. ఓ కృష్ణా! పూజ్యులైన భీష్మ ద్రోణుల మీద నే నెట్లు యుద్ధమునం దెదిరించి బాణములను ప్రయోగింతును?

శ్లో. గురూ న హత్వా హి మహానుభావా
శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే,
హత్వార్థ కామాంస్తు గురూ నిహైవ
భుంజీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్. 5

కం. గురువుల జంపక నిలలో
సారిదిగ భైక్షంబు తినుటె-చూడఁగ శ్రేయం;
బరయఁగ ధన కామములగు
గురువుల జంపంగ నెత్రు-కూడె పొసంగున్.

తా. మహానుభావులైన గురువులను సంహరింపక నీలోకమందు భిక్షమువలన జీవించుటయే మేలు. నేను అర్థకాములైన గురువులను వధించి, వారి రక్తముచే తడిసిన భోగముల నె ట్లనుభవింతును?

శ్లో. న చైత ద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ, యదివానో జయేయుః
యానేవ హత్వా న జిజీవిషామః
తేఽవ స్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః 6



గీ. మనము వారి గెలువ మేలొ?-మనల వారు
గెలుచుటగునొ మే? లది నాకు-దెలియదయ్యె;
నెవరి వధియించి బ్రతుకంగ-నెంచ మట్టి
ధార్తరాష్ట్రులు గల రచ్యు-తా! మన యెదుట.

తా. మఱియును, మనమే దుర్యోధనాదులను జయింతుమో, లేక వారే మనలను జయింతురో, ఈ రెంటిలో మన కేది గురుతరమైనదో, యెరుగము. ఎవరిని వధించిన పిమ్మట మనము బ్రతుకగోరమో, ఆ ప్రియ బంధువులైన దుర్యోధనాదులు మన యెదుట నిలిచి యున్నారు.

శ్లో. కార్పణ్య దోషోపహత స్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మ సమ్మూఢ చేతాః,
యచ్ఛ్రేయస్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్య స్తేఽహం, శాధి మాం త్వాం ప్రపన్నమ్. 7

గీ. వితత కార్పణ్యదోషోప-హతుఁడ నగుట
ధర్మ మెద్దియొ కానక-తమకపడుచు
నడుగు-చున్నాఁడ; నా శర-ణ్యంబు నీవె;
మేలు రూఢిగ జెప్పి న-న్నేలుకొనుము.

తా. ఈ కృపణత్వ దోషము చేత నా శౌర్యస్వభావము మాఱినది. యుద్ధము చేయుట ధర్మమో, చేయకుండుట ధర్మమో నాకు తెలియకున్నది. కావున, ఏది మేలో దానిని నాకు నిశ్చయించి చెప్పుమని విన్నవించుచున్నాను. నేను నీ శిష్యుఁడను. నిన్ను శరణు జొచ్చితిని. యుక్తాయుక్తములను దెల్పుము.

శ్లో. నహి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణాం,
అవాప్య భూమావసపత్నమృద్ధం
రాజ్యం, సురాణా మపి చాధిపత్యమ్. 8

. అవని వైరులు లేని రా-జ్యంబు గలిగి
నను, సురాధిపత్యము గల్గి-నను, నిఖిల, శ





రీరమును వేల్చి నా దుఃఖ-భారముఁ దొల
గంగ జేయునట్టిది తెలి-యంగరాదు.

తా. ఈ లోకమందు, నిష్కంటకమై, సకల సంపదలతోఁ గూడిన రాజ్యమును బొందినను, లేక, ఇంద్రత్వమును బొందినను నా యింద్రియములకు మిగుల సంతాపకరముగ నున్న నా దుఃఖము నేది పోగొట్టునో, దానిని నేను కాంచుట లేదు కదా!

సంజయ ఉవాచ :

శ్లో. ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః,
'నయోత్స్య' ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవహ. 9

శ్లో. త మువాచ హృషీకేశః ప్రహస న్నివభారత!
సేనయో రుభయోర్మధ్యే విషీదంత మిదం వచః. 10

సంజయుఁడు చెప్పుచున్నాడు :

గీ. అని పలికి యర్జునుండు గం-సారితోడ
యుద్ధ మొనరింపనని చెప్పి- యూరకుండె;
నంత నుభయ సైన్యముల మ-ధ్య కడు కుందు
చున్న నరు గాంచి నగుచు న-చ్యుతుఁడు పలికె.

తా. అర్జునుఁ డిట్లు శ్రీకృష్ణునితో జెప్పి, మరల నాయనతో "యుద్ధము చేయ"నని యూరకుండెను. అంత శ్రీకృష్ణుఁడు అట్లు రెండు సేనల నడుమ దుఃఖించుచున్న యర్జునుని గాంచి, హాస్యము చేయువాని వలె నీ వాక్యమును బలికెను.

శ్రీ భగవా నువాచ :

**శ్లో. అశోచ్యా నన్వశోచస్త్వం, ప్రజ్ఞా వాదాం శ్చ భాషసే,**
**గతాసూ నగతాసూం శ్చ నాను శోచంతి పండితాః.** 11

శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాడు :

కం. ప్రజ్ఞావాదము లాడెదు,
విజ్ఞానము గల్గినట్లు-పెల్లుగ నిటుల



న్న జ్ఞాన మరయ నియ్యది,
తజ్ఞానిఁ జచ్చుట, బ్రతుకుట, – *దనుకింప విలన్.

కం. గతజీవులఁ గూర్చియు, సం
గతజీవులఁ గూర్చియుఁ గడు–కలవరపడక
న్నతులిత సమదృష్టి గలిగి
ధృతితో వర్తింతు రెపుడు–ధీనిధు లవనిన్.

తా. నీవు భీష్మాదులను గూర్చి దుఃఖింపఁ దగవు. మఱియును, పండితుని వలె మాటలాడుచున్నావు. పండితులు (ఆత్మానాత్మ వివేకజ్ఞులు) చచ్చినవారిని గూర్చికాని, బ్రతికియున్న వారిని గూర్చి కాని దుఃఖింపరు.

**శ్లో. న త్వేవాహం జాతు నాసం, న త్వం, నే మే జనాధిపాః,**
**న చైవ న భవిష్యామ స్సర్వే వయ మతఃపరమ్.** 12

కం. ఎపు డేనుండినవాఁడను,
నెపు డీవునుఁ గూడ నుంటి; – వెపుడున్నా రీ
రిపు రాజులు; నిక్కముగ
న్నెపు డందఱముందుము, మర–ణించిన పిదపన్.

తా. నేనిది వఱకెప్పుడును లేని వాఁడను కాను. నీవును, ఇదివఱకెప్పుడును లేనివాడవు కావు. ఈ రాజులును, ఇదివఱకెప్పుడును లేనివారు కారు. మన మందఱము ఈ దేహము గతించిన తరువాత లేకపోవువారము కాము. అందఱము శాశ్వతము నుండువారమే. (ఈ దేహములు నశించినను, ఆత్మ స్వరూపము చేత నిత్యులమై యుందుమని భావము.)

**శ్లో. దేహి నోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా,**
**తథా దేహాంతర ప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి.** 13

కం. దేహికి వయోదశలువలె
దేహాంతరముల్ బరంగు; – ధీరులు పాసగన్
దేహముఁ బాయుటఁ గూర్చి, వి
మోహముఁ జెందఱు గదయ్య– పుడమిని బార్థా.





తా. జీవున కీ జన్మము నందు బాల్య యౌవన వార్ధక్య దశ లెటులనో, మఱియొక దేహమును బొందుటయు నట్లే. కావున ప్రాజ్ఞుఁ డా దేహ నాశోత్పత్తి విషయమై దుఃఖము నొందడు.

శ్లో. మాత్రాస్పర్శాస్తు కౌంతేయ! శీతోష్ణ సుఖ దుఃఖదాః,
ఆగమాపాయినో నిత్యా స్తాం స్తితిక్షస్వ, భారత! 14

గీ. పంచతన్మాత్ర హేతుసం-భవము లైన
చక్షురాదులౌ యింద్రియ-చయము వలన
నుర్వి రూపాది విషయ సం-యోగములు పొ
సంగు; వానిచే ద్వంద్వముల్- సంభవించు.

గీ. కలఁచు శీతోష్ణ సుఖ దుఃఖ-ములె ధరిత్రి
ద్వంద్వము లను నామంబుచే- బరఁగుచుండు;
నస్థిరంబులయిన వాని- యందు సక్తి
లేక *క్షాంతితో మెలఁగుము - లోకమందు.

తా. అర్జునా! పంచతన్మాత్రల వలన బుట్టిన చెవులు, కండ్లు, ముక్కు, నాలుక, చర్మము లనెడి పంచేంద్రియములతో సంబంధము గల శబ్ద, రూప, గంధ, రస, స్పర్శనము లనెడి విషయములు, శీతోష్ణములు మొదలుగాగల సుఖ దుఃఖములను గలుగజేయు నట్టివియు, రాకపోకలు గలిగినవియు, అస్థిరములైనవియు గావున, వానిని, ఓర్పుతో సహింపుము. (సుఖము కలిగినప్పుడు సంతోషమును, కష్టము కలిగినప్పుడు దుఃఖమును బొందకుమని భావము.)

శ్లో. యం హి న వ్యథయంత్యే తే పురుషం పురుషర్షభ!
సమదుఃఖ సుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే. 15

గీ. జీవయాత్ర విధివశుఁడై - సేయుచుండ
మహిని సుఖ దుఃఖములను స-మత వహించు
పురుషు భవబంధములు వీడి-పోవుఁ గాన
ముక్తి బొందు నతండు వి-బుధ విధేయ!

---

* క్షాంతి = సహన భావము.



తా. పురుష శ్రేష్ఠుఁడవైన యో యర్జునా! ఏ పురుషుఁడు వివేకియై సుఖదుఃఖములను సమానముగ నెంచుచు, వీనిచే బాధ నొందడో, అతఁడు మోక్షమును బొందును గదా!

శ్లో. నాసతో విద్యతేభావో, నాభావో విద్యతే సతః,
ఉభయో రపి దృష్టోఽంత స్త్వనయో స్తత్త్వదర్శిభిః. 16

కం. అస్తిత్వము *సత్తుకు గల
దస్తిత్వము లే **దసత్త్వ-దార్థంబునకున్
దుస్తర సంసృతిపోవును
నిస్తుల సదసద్వివేక - నిశ్చయ బుద్ధిన్.

తా. అసత్తైన యీ దేహమునకు భావము (ఉండుట) లేదు. సత్తైన (నిత్యమైన) ఆత్మకు భావము (లేకపోవుట) లేదు. పరబ్రహ్మ మనెడి వస్తువును దెలిసినవారు (పండితులు) ఈ సదసత్తులైన యాత్మ దేహముల యొక్క నిశ్చయమును దెలిసి యుందురు.

శ్లో. అవినాశితు తద్విద్ధి యేన సర్వ మిదం తతం,
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి. 17

శ్లో. అన్త వన్త ఇమేదేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః
అనాశినోఽప్రమేయస్య, తస్మా ద్యుధ్యస్వ భారత! 18

గీ. ఆత్మయే సత్తు, బ్రహ్మంబు;- నాత్మచేత
వ్యాప్తమయ్యె సర్వజగము - భవ్య చరిత!
శాశ్వతముగ నుండు నిది నా-శంబు లేక,
వ్యయముఁ బొందును దీని దే-హంబు లరయ.

తా. ఈ విశ్వమంతయును వ్యాపించి యున్న యా పరబ్రహ్మము (పరమాత్మ) నాశము లేనిదని తెలియుము. శాశ్వతమైన (నాశములేని) యీ పరమాత్మకు నాశము కలిగించుట, యెవ్వనికి శక్యము కాదు. మఱియు, ప్రత్యక్షాది ప్రమాణములచేత తెలియఁబడనివాడైన యీ యాత్మ నిత్యుఁడనియు, అతఁడు ధరించిన దేహములు నాశనము కలవనియు పండితులచే చెప్పఁబడినది. కావున, ఓ యర్జునా! యుద్ధము చేయుము.

---

* సత్తు = ఎల్లప్పుడుండునది. **అసత్తు = ఎప్పుడును లేనిది





శ్లో. య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం,
ఉభౌ తౌ న విజానీతో; నా యం హంతి, న హన్యతే. 19

గీ. చంపు ననియును, నీ యాత్మ- చచ్చుననియుఁ
దలచు వార లజ్ఞు లటంచుఁ-దెలియుమయ్య;
చచ్చుటయును లేక, మఱియుఁ-జంపఁబడక
గర్తయునుఁ గాకఁ గర్మయుం- గాక నొప్పు.

తా. కర్తృత్వ కర్మత్వములు రెండును లేని యీ యాత్మ వధించునదియును, వధింపఁబడునట్టిదియును గాదు. కావున నీయాత్మను వధించువానిగ తలచువాఁడును, వధింపఁబడువానిగ తలచువాఁడును, (ఇద్దఱును) తెలిసినవారు కారు.

శ్లో. న జాయతే, మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్య శ్శాశ్వతో౽యం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. 20

గీ. చావు పుట్టుకలును లేక - సార్వకాలి
కమిది; యుండి పోవునదియుఁ- గాదు; మఱియు
మునుపు లేకుండ నుండంగ- వెనుక రాదు;
హన్యమానము గాఁగ దే-హంబు, హత్య
నొంద దిది, శాశ్వతంబయి-యుంట బార్థ!

తా. ఈ యాత్మ పుట్టుకలేనిది; చావు లేనిది. ఒకప్పు డుండి మరల యొకప్పు డుండనిది కాదు. ఎల్లప్పు డుండునది. స్థిరరూపము కలది. అనాది యైనది. శరీరము సంహరింపఁబడినను, యిది సంహరింపఁబడదు.

శ్లో. వేదా వినాశినం నిత్యం య ఏన మజ మవ్యయం,
కథం స పురుషః పార్థ! కం ఘాతయతి హంతి కమ్. 21

గీ. ఎవ్వఁ డీయాత్మ నాశర-హిత మనియును
నేకరూప, మజమనియు,- నెపుడు క్షయ ర
హితము, శాశ్వతం బనియును-నెఱుఁగు; వాఁడు
చంపు నెవ్వని? జంపింప జాలు నెవని?



తా. అర్జునా! ఎవ్వఁడీ యాత్మ స్థిరరూపము కలదిగాను, నాశము లేనిది గాను, పుట్టుక లేనిది గాను, తరిగి పోనిది గాను తెలిసికొనుచున్నాడో, అట్టి పురుషుఁడు, ఎట్లు, ఎవ్వని జంపును? మఱియు, ఎట్లు, ఎవ్వనిఁ జంపించును?

శ్లో. వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ. 22

గీ. ప్రాత బట్టలను విడిచి -వైచి నరుఁడు
చేరి నవ వస్త్ర ధరణంబు- సేయునట్లు,
పరఁగ జీర్ణ దేహంబులు- వదలి దేహి
ధరణి నూత్న దేహంబుల- దాల్చుచుండు.

తా. మనుష్యుఁడు చినిగిన బట్టలను విడిచి క్రొత్తబట్టలను గ్రహించునట్లు, ఈ యాత్మ శిథిలములైన దేహములను విడిచి నూతన దేహములను గ్రహించుచున్నది.

శ్లో. నైనం ఛిన్దంతి శస్త్రాణి, నైనం దహతి పావకః,
న చైనం క్లేదయం త్యాపో, న శోషయతి మారుతః. 23

గీ. శస్త్రములు దీని ఛేదింప-జాల వెందు,
బరఁగఁ గాల్పంగఁజాలడు-పావకుండు,
జలము దీని కార్ద్రత గూర్ప-జాల దరయ,
వాయు వెప్పుడు శోషింపఁ-జేయలేదు.

తా. ఈ యాత్మను ఆయుధములు ఛేదింపజాలవు; అగ్ని దహింపజాలదు; ఉదకము తడుపఁజాలదు; వాయువు శోషింపఁజేయఁజాలదు.

శ్లో. అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యో ఽశోష్య ఏవ చ,
నిత్య స్సర్వగత స్థాణు రచలోఽయం సనాతనః. 24

శ్లో. అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే,
తస్మాదేవం విదిత్వైనం నాను శోచితు మర్హసి. 25





గీ. ఆత్మ ఛేదింపఁబడదు, ద-హ్యంబుగాదు,
తడుపఁబడ దిద్ది ద్రవపదా-ర్థముల చేత,
నెండ గాడ్పులు దీని నెం-డింపలేవు.
తఱుఁగకయు నశింపకయు నం-తటను నుండు.

గీ. బుద్ధికిని దృగా దీంద్రియ-ముల కగోచ
రంబు, కర్మేంద్రియావిష-యంబు నౌను;
స్థాణువును సనాతనము న-చలమును నయి
యుండు; దీని దెలిసి దుఃఖ-మొంద దగవు.

తా. ఈయాత్మ ఛేదింపబడదు; కాల్చబడదు; తడుపబడదు; ఎండింపబడదు; స్థిరరూపము కలది; చలింపదు; అనాదియైనది; నాశము లేనిది; అంతటను వ్యాపించి యుండునది. మఱియు నీయాత్మ అవ్యక్తము (అవగా, పంచేంద్రియములకు గోచరముకానిది), మనస్సునకు గూడ కనబడదు; కర్మేంద్రియములతో నేమి చేయుటకును వీలుగాదు. అందువలన విషయమును దెలిసికొని దుఃఖింపకుము.

శ్లో. అథ చైనం నిత్యజాతం, నిత్యం వా మన్యసేమృతమ్.
తథాపి మహాబాహో! నైవం శోచితు మర్హసి. 26

గీ. మఱియు, నర్జున! యీ యాత్మ-మరల మరల
జనన మగుచు జచ్చుచు నుండు-నని తలంచు
వాడవయ్యును, నీవిట్లు-వ్యసన మిపుడు
పూన గారణం బెద్దియు-గానరాదు.

తా. అట్లుగాక, నీ వీయాత్మ మరల మరల బుట్టు చున్నది గాను, మరల మరల చచ్చుచున్నదిగాను తలచినను, నీ వీప్రకారముగ దుఃఖింప నవసరము లేదు.

శ్లో. జాతస్య హి ధ్రువో మృత్యుః, ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి. 27

గీ. పుట్టు వాడెపుడో పుడమి-గిట్టు నటుల
గిట్టు వాడును ధ్రువముగ-బుట్టు మరల;
నవని నివి యనివార్యంబు-లగుట కతన
వ్యసన మొందంగ నీ కిందు-బాడికాదు.



తా. పుట్టిన వానికి మరణము తప్పదు. చచ్చిన వానికి పుట్టుక తప్పదు. కావున, అనివార్యమైన యీ విషయమందు నీవు దుఃఖింపదగవు.

శ్లో. అవ్యక్తాదీని భూతాని వ్యక్త మధ్యాని భారత!
అవ్యక్త నిధనాన్యేవ తత్ర కా పరిదేవనా. 28

కం. తెలియదు దేహముల మొదలు,
తెలియదు మఱి వాని తుదలు-తిలకింపంగన్
దెలియు నడుమంత్రపు దశలు,
విలపింపగ నేల నిందు-విపరీతముగన్.

తా. ఈ శరీరముల మొదలు తుదలు తెలియవు; వాని మధ్యములు మాత్రము కనుపించుచున్నవి. అవి నశించిన తరువాత నేమగునో తెలియదు. అట్టి శరీరములను గూర్చి దుఃఖింపనేల?

శ్లో. ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః,
ఆశ్చర్యవ చ్చైన మన్య శ్శృణోతి
శ్రుత్వాప్యేనం వేద నచైవ కశ్చిత్. 29

కం. ఒకఁ డద్భుతముగఁ దలచును
నొకఁ డాశ్చర్యముగ బల్కు-నుర్విని, నన్యుం
డొకఁ డాశ్చర్యముగన్ విను,
నొకఁడును గ్రహియింప డయ్యె-*నువ్వున్ దీనిన్.

తా. ఈ యాత్మ నొకడు, ఆశ్చర్య వస్తువును జూచినట్లు చూచును. మఱి యొకడు, ఆశ్చర్యము వలె జెప్పును. వేఱొక్కఁడు, ఆశ్చర్యమువలె వినును. మఱి యొక్కఁడు, ఈ యాత్మను వినియును, చూచియును, పలికియును దెలిసికొనఁడు.

శ్లో. దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత!
తస్మా త్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి. 30

* ఉవ్వు = పూనిక





గీ. అరయ నీ శరీరము హత-మయిన దీని
యందు గల నాత్మ యెప్పుడు-హతము కాదు;
కాన దుఃఖ మొందంగ ద-గవు, పితామ
హాది బంధు జనముల దే-హములఁ గూర్చి.

తా. అర్జునా! ఈ శరీరము వధింపఁబడినను, అందుండు 'ఆత్మ' యెప్పుడును వధింపఁబడదు అందువలన నీవు భీష్మాదుల శరీరములను గూర్చి దుఃఖింప దగవు.

శ్లో. స్వధర్మ మపి చావేక్ష్య న వికంపితు మర్హసి,
ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే. 31

గీ. ఎల్ల వారికి గుల ధర్మ-మిమ్ముగాన
క్షత్రియుఁడ వౌట యుద్ధంబ- క్షమము నీకు;
ధర్మరక్షణ తత్పర-త్వంబు నైన
సంచలింపక యుద్ధంబు-సలుపు మయ్య.

తా. నీవు స్వధర్మమును బట్టి విచారించినను యుద్ధము విడువదగదని తేటపడును. క్షత్రియునకు ధర్మ యుద్ధముకంటె మేలు కలిగించు కార్యము మఱియొకటిలేదు.

శ్లో. యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్,
సుఖినః క్షత్రియాః పార్థ! లభంతే యుద్ధ మీదృశమ్. 32

గీ. కోఱకయె తెఱవఁబడు స్వ-ర్గద్వారమైన
యిట్టి యాజి బొందుదురే మ-హీశు లవని,
వారె భాగ్యవంతు లటంచు-ఫల్గునుండ!
తలఁచువాడ నెమ్మనమున-గలతలేక.

తా. అర్జునా!కోరకయే తెఱవఁబడిన స్వర్గద్వారమైన యీ యుద్ధమును బొందు క్షత్రియులు మిక్కిలి భాగ్యవంతులు సుమా!

శ్లో. అథచే త్త్వం ధర్మ్య మిమం సంగ్రామం న కరిష్యసి
తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి. 33



శ్లో. అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తే వ్యయామ్,
సంభావితస్య చా కీర్తి ర్మరణా దతి రిచ్యతే. 34

గీ. మఱియు నీ ధర్మ్య యుద్ధంబు-మానుదేని
యశమును స్వధర్మమును వీడు-దయ్య; జనులు
చేరి నీ యపకీర్తిని-జెప్పుకొందు,
రపయశము కంటె చావె మే-లరయ గుణికి.

తా. అట్లైనను నీవీ ధర్మయుద్ధమును చేయక, స్వధర్మమును, కీర్తిని పోగొట్టుకొనుటయేగాక పాపమును గూడ బొందుదువు. మఱియును, సమస్త జనులు నీ యపకీర్తిని చాల కాలము చెప్పుకొందురు. గౌరవముగలవానికి, అపకీర్తి మరణము కంటెను ఎక్కువైనది.

శ్లో. భయాద్రణా దుపరతం మన్యంతే త్వాం మహారథాః,
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్. 35

కం. శూరుఁడ వీవని నిన్ను
గౌరవమెసగంగఁ గాంచు-కౌరవు లిక నిన్
భీరుఁడవై యని సలుపక
పారితివని యీసడింత్రు-భవ్య చరిత్రా!

తా. నిన్నిదివర కెక్కువగా గౌరవించిన మహారథు లందఱు (కర్ణ దుర్యోధనాదులు) నిన్ను భయముచే యుద్ధము చేయనివానిగా దలంచి, యిక చులకనగా జూతురు.

శ్లో. అవాచ్య వాదాం శ్చ బహూ న్వదిష్యంతి తవా హితాః,
నిందంత స్తవ సామర్థ్యం, తతో దుఃఖతరం ను కిమ్? 36

శ్లో. హతోవా ప్రాప్స్యసి స్వర్గం, జిత్వావా భోక్ష్యసే మహీమ్,
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ! యుద్ధాయ కృతనిశ్చయః. 37

కం. మడసిన స్వర్గము బొందెదు,
కడగి యనిం గెలుతువేని-గాంతువు ధరణిన్,
తడబడి మిన్నక యుండిన
గడు చెడు నుడులంద్రు నిన్ను-గవ్వడి వైరుల్.





తా. నీ శత్రువులు నీ సామర్థ్యమును నిందింతురు, ని న్ననరాని మాటలందురు. అంతకంటె నెక్కువ దుఃఖ మేమిగలదు? యుద్ధమందుఁ జంపబడితివేని స్వర్గము బొందుదువు;గెలుతువేని రాజ్యమును బొందుదువు. అందువలన,అర్జునా! యుద్ధము చేయ నిశ్చయించుకొని, లెమ్ము.

శ్లో. **సుఖదుఃఖే సమేకృత్వా, లాభాలాభౌ జయాజయౌ,**
**తతో యుద్ధాయ యుజ్యస్వ; నైవం పాప మవాప్స్యసి.** 38

గీ. జయము, సుఖదుఃఖముల, నప-జయము,లాభ
నష్టముల సమముగ గణ-నంబు సేసి,
యాహవం బొనర్పఁగబూను;-మటులఁ జేయ
నీవు పాపంబు బొందక-*నెగడుదయ్య.

తా. సుఖ దుఃఖములను, లాభనష్టములను, జయాపజయములను సమముగా దలచి, అటు పిమ్మట యుద్ధమునకు సిద్ధపడుము. అట్లు చేయుదువేని నీవు పాపము బొందవు.

శ్లో. **ఏషా తేఽభి హితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు,**
**బుధ్యా యుక్తో యయా పార్థ! కర్మబంధం ప్రహాస్యసి.** 39

గీ. ఇట్లు నీకు సాంఖ్యమని పే-రెనయు నాత్మ
తత్త్వము నుడువంగ బడియె;-దనరు కర్మ
యోగమును నింకఁ జెప్పంగ-నోపుదయ్య!
దాన విడుతువు కర్మబం-ధంబు నీవు.

తా. అర్జునా! ఇప్పుడు నీకు ఆత్మ తత్త్వ విషయ జ్ఞానము చెప్పఁబడినది. ఇక నీకు కర్మయోగ విషయ జ్ఞానమును గూర్చి చెప్పెదను, వినుము. ఈ కర్మయోగ జ్ఞానముతో గూడిన వాడు సంసారబంధమునుండి విముక్తుడగును..

శ్లో. **నేహాఽభిక్రమ నాశోఽస్తి; ప్రత్యవాయో న విద్యతే;**
**స్వల్ప మప్యస్య ధర్మస్య, త్రాయతే మహతో భయాత్.** 40

గీ. అరయ దీని యారంభంబు-వ్యర్థమెపుడు
కాదు; ప్రత్యవాయంబులే-కను బరంగు;

---

* నెగడు = వర్ధిల్లు



స్వల్పముగ జేసినను వేగ-బాయు సంస
రణ భయము, గాన దీని న-రయుము పార్థ!

తా. ఈ కర్మయోగము నారంభించుట వ్యర్థము కాదు.దీని యందెట్టి ప్రత్యవాయము (దోషము)ను గలుగదు. దీనిని కొంచెముగ ననుష్ఠించినను సంసార భయము పోవును. (సంసారమనగా: మరల మరల పుట్టుచు, మరల మరల చచ్చుట.)

శ్లో. వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన!
బహుశాఖా హ్యనంతా శ్చ బుద్ధయో౽ వ్యవసాయినామ్. 41

తే. సాంఖ్య కర్మయోగముల వి-జ్ఞాన మేక
విధ ఫలప్రదాయకము, వి-వేకశాలు
రకు, మఱి యనిశ్చితులగువా-రి కరయంగ
బుద్ధి విధములు పెక్కులు-బుధ విధేయ!

తా. అర్జునా!నిశ్చయరూపబుద్ధితో గూడిన సాంఖ్యయోగ జ్ఞానముకాని, కర్మయోగ జ్ఞానముకాని, ఒకే విధమైన ఫలమునిచ్చును. నిశ్చయబుద్ధి లేనివారి జ్ఞానములు బహువిధములుగను,ఆత్మజ్ఞానము కలిగింపనివిగను నుండును.

శ్లో. యా మిమాం పుష్పితాం వాచం ప్రవదంత్య విపశ్చితః,
వేద వాదరతాః పార్థ! నాన్య దస్తీతి వాదినః 42

శ్లో. కామాత్మాన స్స్వర్గ పరా జన్మ కర్మఫల ప్రదామ్,
క్రియా విశేష బహుళాం భోగైశ్వర్య గతిం ప్రతి. 43

శ్లో. భోగైశ్వర్య ప్రసక్తానాం తయాపహృత చేతసాం
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధేయతే. 44

సీ. వేదములలోన దగ నర్థ-వాదములుగ
దెలుపఁబడి యున్న ఫలవాక్య-ములను నమ్మ
వారలును, స్వర్గమే పరమా-వధి యటంచు
నమ్ము వారును, నిల నీష-ణత్రయంబు
నందు సక్తులౌ వారును,-నవని భోగ
ములను బడయంగ బహువిధ-ములుగ జెప్పఁ





బడిన వాక్యముల వలస-భ్రాంతి నొంది,
వసుధ భోగ భాగ్యంబుల-నొసఁగు కర్మ
సంచయంబును నెపు ‿ ' -రించుచుందు;
రట్టి వారలకు గలుగ-దవని, సాంఖ్య
కర్మయోగముల వలన-గాంచగలుగు
నిశ్చయాత్మకమగు బుద్ధి-నిర్మలాత్మ!

తా. అర్జునా! వేదములందు ఫలమును దెలిపెడి యర్థవాదములయందుఁ బ్రీతి గలవారును, స్వర్గముకంటె నుత్తమపురుషార్థము లేదని నమ్ముటకంటె విశేషఫలము నిచ్చు మఱి యొకటి లేదను వారును, పుత్ర మిత్ర భార్యాదులయందు కోరికగలవారును నగు వివేక శూన్యులు-భోగైశ్వర్యములు సిద్ధించుటకై యనేక కర్మభేదములను చెప్పు నట్టివియు, ఫలప్రదముగాక పుష్పములను మాత్రము పూచి, నేత్రానందము కలిగించు వృక్షము వలె, చెవుల కింపు గలుగ జేయు నట్టివియు నగు మాటలచే మోసగింపఁ బడినవారై, భోగైశ్వర్యములం దాసక్తులగు వారికి ఆత్మ స్వరూప విషయ జ్ఞానమందు నిశ్చయాత్మకమైన బుద్ధి కలుగ నేరదు.

శ్లో. త్రైగుణ్య విషయా వేదా, నిస్త్రైగుణ్యో భవార్జున!
నిర్ద్వంద్వో నిత్య సత్త్వస్థో నిర్యోగ క్షేమ ఆత్మవాన్. 45

గీ. వసుధ వేదములు త్రిగుణ- ప్రభవ ఘోర
సంసృతి విషయములని వి-జయ! యెఱింగి
నీవు ద్వంద్వ రహితుఁడవు, - నిత్య సత్త్వ
గుణ విశిష్టుఁడవు, మరియుఁ- గోర్కెలేని
వాఁడవును, క్షేమయోగ వి-వర్జితుండ
వును, గడఁగి యాత్మవేత్తవు - ను, నగుము, తగ.

తా. అర్జునా! వేదములు సత్త్వ రజ స్తమో గుణముల వలన గలిగిన సంసార స్వరూపమును దెలియజేయు నట్టివి. నీవు శీతోష్ణాది సుఖ దుఃఖ రహితుఁడవును, నిత్యసత్త్వ గుణ విశిష్టుఁడవును, యోగ క్షేమ రహితుఁడవును, ఆత్మ జ్ఞానము గలవాఁడవును, నిష్కాముఁడవును నగుము.

శ్లో. యావా నర్థ ఉదపానే, సర్వత స్సంప్లుతోదకే,
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః. 46



గీ. ధరణి స్నానపానాది సం-దర్భమందు
స్వల్పకాసారముల ప్రయో-జన మరయ మ
హా ప్రవాహయుతములైన-*యాపగల ప్ర
యోజనమున నంతర్భావ-మొందు నటుల
సర్వవేదోక్త కర్మాను-చరణ ఫలము
బ్రహ్మతత్త్వ విదుని జ్ఞాన-ఫలమున, విజ
యుండ! పరగ నంతర్భావ- మొందు సుమ్ము.

తా. నీళ్లతో నిండియున్న మడుగు యొక్క స్నానపానాది ప్రయోజనము నదీతటాకాదుల యొక్క యనేక ప్రయోజనములలో నంతర్భావము నొందునట్లు, వేదములందు జెప్పఁబడిన కర్మాచరణ ఫలము, బ్రహ్మ జ్ఞాన నిష్ఠునకుఁ గలుగు మోక్షరూప మహాఫలములో నంతర్భావము నొందును.

**శ్లో. కర్మణ్యే వాధికార స్తే మా ఫలేషు కదాచన,**
**మా కర్మఫలహేతుర్భూ ర్మాతే సంగోఽస్త్వ కర్మణి.** 47

గీ. కర్మలంజేయ నీ కధి-కార మరయఁ
గల దయిన వాని ఫలములఁ-గాంచఁగోర
వలదు; మఱియుఁ గర్మములకు-ఫలము గలుగఁ
గారణుండవు కాక, న-కర్మమందుఁ
దలఁపు గలవాఁడవునుఁ గాక-మెలగు మెపుడు.

తా. నీకు కర్మాచరణమందే అధికారము గలదు. నీకు కర్మ ఫలములందు కోరిక లేకుండును గాక. కర్మ ఫలమునకు గారణమైన వాఁడవు కాక యుండుము. మఱియు, కర్మములఁ జేయకుండుట యందు తలఁపు గలవాఁడవు కాకుండుము.

**శ్లో. యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ!**
**సిద్ధ్యసిద్ధ్యో స్సమో భూత్వా; సమత్వం యోగ ఉచ్యతే.** 48

గీ. సంగమును ద్యజించి ఫలము- సంభవించి
న, నది సంభవింపక యుండి -నను, కరంబు
సమతఁ జేయుము కర్మంబు; - సమత నుంట
యోగ మని యందురు విబుధు-లుర్వి యందు.

---

* ఆపగ = నది





తా. అర్జునా! నీవు అభిమానమును విడిచి, బ్రహ్మజ్ఞాన రూపమగు ఫలప్రాప్తి యందును, అప్రాప్తి యందును సమమైన మనస్సు గల వాఁడవై, యోగమందుండి కర్మములను జేయుము. సమత్వము యోగమని చెప్పఁబడుచున్నది.

శ్లో. దూరేణ హ్యవరం కర్మ బుద్ధి యోగా ద్ధనంజయ!
బుద్ధౌ శరణ మన్విచ్ఛ; కృపణాః ఫలహేతవః. 49

కం. ఫలమును గోరుట కంటెను
ఫలమునుఁ గోరక సలుపుటె – వరమగు నీకున్
ఫలమునుఁ గాంక్షించెడి వా
రిల, జన్మంబులఁ బడయుదు–రెప్పుడు పార్థా!

తా. సమత్వ బుద్ధితోఁ జేసిన కర్మము కంటె, ఫలాపేక్షతోఁ జేసిన కర్మము నికృష్టమైనది. ఫలమును గోరి కర్మములఁ జేయువారు జనన మరణములు బొందుదురే కాని మోక్షమును బొందఁ జాలరు. కావున నీవీ సమత్వ బుద్ధిని బూని విహిత కర్మములను జేయుము.

శ్లో. బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే,
తస్మా ద్యోగాయ యుజ్యస్వ; యోగః కర్మసు కౌశలమ్. 50

గీ. ఫలము, నఫలంబుఁ దగ వీడు–వాఁడు సుకృత
దుష్కృత యుగళంబునకును– దూరమగును;
గాన నీ బుద్ధి యోగంబుఁ– గాంచఁ గడఁగు
మయ్య; కౌశలంబిది కర్మ–లందుఁ జూడ.

తా. ప్రాప్త్యప్రాప్తుల యందు సమత్వ బుద్ధి గలిగి, కర్మములను జేయువారికి పుణ్య పాపము లంటవు. కావున,నీవు యోగమునకుఁ గడఁగుము. కర్మములు చేయుట యందు, సమత్వ బుద్ధియనెడి యోగము మిక్కిలి నేర్పరితనము గలదిగా నున్నది.

శ్లో. కర్మజం బుద్ధి యుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః,
జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛం త్యనామయమ్. 51

గీ. అవని సమదృష్టి గల్గి యా–త్మార్థ విదులు
కర్మజంబగు ఫలమందుఁ– గాంక్ష లేక
జన్మ బంధ విముక్తులై– సర్వ హాని
విరహిత పదవిఁ గాంతురు–విజయ! వినుము.



తా. సమత్వ బుద్ధితోఁ గూడి, ఆత్మానాత్మ వివేకము గలిగిన పండితులు, ఫలాపేక్ష విడిచి కర్మములఁ జేసి, జన్మబంధమునకు లోనుగాక సర్వోపద్రవ రహితమైన మోక్షమును బొందుదురు.

శ్లో. యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి,
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ. 52

కం. మనసు విషయములఁ దగులకఁ
గను నెప్పుడు నిర్మలతను; – గౌరవ మెసగం
గను *నిర్వేదంబు గలుగు
వినవలసిన, మఱియు వినిన– విషయము లందున్.

తా. ఎప్పుడు నీ బుద్ధి మోహమును విడిచి పరిశుద్ధమగునో, అప్పుడు నీకు వినఁదగిన విషయమందును, వినిన విషయమందును, హేయత్వ బుద్ధి యేర్పడును.

శ్లో. శ్రుతి విప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా,
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి. 53

గీ. భవ్య వేదాంత విషయ శ్ర–వణము చేత
చలన మొందిన బుద్ధి, ని–శ్చలతఁ బొందు
నెప్పుడు సమాధి యందు, మ–హిని నరుండు
గాంచుఁ జ్ఞానంబు, దాన మో–క్షంబు నపుడు.

తా. వేదాంత శ్రవణము చేత చలింపఁ జేయఁబడిన నీ బుద్ధి యెప్పుడు సమాధి (సమవతావస్థ) యందు చలింపక స్థిరముగ నుండునో, అప్పుడు యోగరూపమగు జీవన్ముక్తిని బొందగలవు.

అర్జున ఉవాచ :

శ్లో. స్థిత ప్రజ్ఞస్య కా భాషా? సమాధి స్థస్య కేశవ!
స్థితధీః కిం ప్రభాషేత? కి మా సీత? వ్రజేత కిం? 54

గీ. ఆ స్థిత ప్రజ్ఞ నెటు దెలి–యంగనగును?
మఱియు నేరీతిగ నతఁడు– మాటలాడు?

---

* నిర్వేద మనగా = జ్ఞానము వలన గలిగిన వైరాగ్యము; ప్రాపంచిక విషయములందు హేయబుద్ధి





నేమి చేయును? మఱి యాతఁ- డెట్లు కూరు
చుండు? నెటులఁ బ్రవర్తించు-చుండు నతఁడు?

తా. ఓ కృష్ణా! ఈ సమాధి యందున్న స్థిత ప్రజ్ఞునిఁ (నిశ్చల బుద్ధి గల పురుషుని) లక్షణమేమి? ఆతఁడేమనును? ఏమి చేయును?ఎట్లు కూర్చుండును? ఎట్లు నడుచును?

శ్రీ భగవాన్ ఉవాచ :

శ్లో. ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ! మనోగతాన్,
ఆత్మ న్యేవాత్మనా తుష్టః స్థిత ప్రజ్ఞ స్తదోచ్యతే. 55

గీ. ఎవ్వఁ డాత్మయందాత్మచే- నెసఁగి సంత
సించుచుఁ దగ వాంఛల విస-ర్జించి మెలఁగు
చుండు భువి; నాతఁడు స్థిత ప్ర-జ్ఞుం డటంచుఁ
బండితులు వచియింతురు- ఫల్గునుండ!

తా. అర్జునా! ఆత్మ స్వరూపానుభవముచే నానందించుచున్నవాఁడై, మనస్సును బొందిన కోరికల నన్నిటిని విడుచు చుండు యోగి, స్థితప్రజ్ఞుఁడని చెప్పఁబడుచున్నాడు.

శ్లో. దుఃఖే ష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః,
వీతరాగ భయ క్రోధః, స్థితధీ ర్ముని రుచ్యతే. 56

గీ. కష్టములు సంభవించినఁ -గలత పడక
విషయ భోగానుభవమందు- వేడ్క లేకఁ
గ్రోధ భయరాగములను ద-గులక మెలఁగు
మహి నిఁ దగ స్థితప్రజ్ఞుండు, - మాన్యచరిత.

తా. దుఃఖములు గలుగుచుండగా సంక్షోభము చెందని మనస్సు కలవాఁడును, సుఖములందాశ లేని వాఁడును, ప్రీతి, భయ, క్రోధములు లేనివాఁడును నగు ముని, స్థిత ప్రజ్ఞుఁడని చెప్పఁబడుచున్నాడు.

శ్లో. య స్సర్వత్రా నభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్,
నాభినందతి, నద్వేష్టి, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 57



గీ. ప్రాణ దేహేంద్రియములందు-రక్తి లేక,
నెందు శుభము కలుగఁగ నా-నందవశుఁడు
కాక, నశుభంబుఁ బొందంగఁ- గలతలేకఁ
ధర మెలఁగు స్థితప్రజ్ఞుండు - ధర్మనిష్ఠ!

తా. ఎవ్వఁడు దేహ ప్రాణాదులం దంతటను అభినివేశము లేని వాడై, ఆయా శుభాశుభములను బొందుచు, సంతోష ద్వేషములు పొందకుండు నట్టి పురుషుని యొక్క బుద్ధి నిశ్చలమైన దని చెప్పఁబడును.

శ్లో. యదా సంహరతే చాయం కూర్మోఽంగా నీవ సర్వశః,
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 58

గీ. పుడమి కూర్మ మంగములను-ముడుచుకొనున
ట్టు లెవఁడు సతతంబు విషయ-ములను బొంద
నీక నింద్రియముల నియ-మించు; నతని
నవనిఁ దగ స్థితప్రజ్ఞుం డ-టంద్రు బుధులు.

తా. ఈ యోగి యెప్పుడు, తాఁబేలు తన యంగములను లోపలికి ముడుచుకొనునట్లు, తన యింద్రియములను విషయములనుండి మరలించుకొనునో, అప్పుడు వాని బుద్ధి నిశ్చలమైనదని చెప్పఁబడును.

శ్లో. విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః,
రసవర్జం; రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. 59

గీ. ఉపవసించువానికి విష-య పరివర్త
నంబు మాత్రంబె కలుగు; నై-న నభిలాష
యటులె యుండు; నా కోర్కియు- నాత్మతత్త్వ
మునుఁ దెలియ నివర్తించును - బుణ్యతముఁడ.

తా. ఆహారమును మాత్రము వదలిన దేహికి విషయానుభవము మాత్రమే లేకుండును గాని, వానియందు కోరిక నశింపదు. పరమాత్మను జూచిన యీ స్థితప్రజ్ఞునికి అభిలాష కూడ లేకుండ పోవును.

శ్లో. య తతో హ్యపి కౌంతేయ! పురుషస్య విపశ్చితః,
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః. 60





గీ. వసుధ నింద్రియంబులఁ దగఁ- బండితుఁడును
బూని నియమింపఁ దలచినన్- వాని మనసు
నవి విషయ సుఖములఁ బడ-యంగ జేయ
లాగుచుండు, సతతము, బ-లాత్కరించి.

తా. అర్జునా! పురుషుఁడు వివేకియై బ్రహ్మప్రాప్తి కొఱకు మిగుల యత్నము చేయుచున్నను, బలవంతములైన యింద్రియములు వాని మనస్సును బలాత్కారముగ లాగివేయును.

శ్లో. తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః,
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 61

గీ. మహిని నా యింద్రియముల ని-గ్రహ మొనర్చి
పరఁగ యోగంబుఁ బూని, మ-త్పరుఁడయి, మఱి
నిశ్చలమతితోడ నెవఁడు - నిరతముండు,
నతని దగ స్థితప్రజ్ఞుం డ-టంద్రు బుధులు.

తా. కావున, యోగి, యింద్రియములను నిగ్రహించి, నాయందే మనస్సు నిలిపి యుంచవలెను. ఇంద్రియములను తన వశమం దుంచుకొనువాఁడే, స్థితప్రజ్ఞుఁడు.

శ్లో. ధ్యాయతో విషయాన్ పుంస స్సంగ స్తేషూపజాయతే,
సంగా త్సంజాయతే కామః, కామా త్క్రోధోఽభిజాయతే. 62

కం. పురుషుఁడు విషయ ధ్యానము
సరకునఁ జేయగ సతతము- సక్తి జనించున్
బరగఁగఁ గామము దానను,
సొరిదిగఁ గ్రోధంబు దానఁ-జూడఁగ గల్గున్.

తా. విషయములను గూర్చి ధ్యానించు పురుషునకు వాని యందాసక్తి గలుగును. ఆ విషయాసక్తి వలన కామము పుట్టును. కామము వలన క్రోధము పుట్టును.

శ్లో. క్రోధా ద్భవతి సమ్మోహ స్సమ్మోహాత్ స్మృతి విభ్రమః,
స్మృతిభ్రంశా ద్బుద్ధి నాశో, బుద్ధి నాశా త్ప్రణశ్యతి. 63

గీ. పుట్టు క్రోధంబు వలన; స-మ్మోహ మరయ,
మరపు వొడము దాని వలన; - మఱియు దాన



బుద్ధి నాశంబు నొందమును; బుద్ధి చెడఁగఁ
బురుషుఁడే నశించుఁ బుడమి- బుధ విధేయ!

తా. క్రోధము వలన వివేక శూన్యత గలుగును. వివేక శూన్యత వలన గురూపదిష్టమైన యర్థము యొక్క విస్మృతి గలుగును. ఆ విస్మృతి వలన బుద్ధి నశించును. బుద్ధి నాశము వలన తానే నశించును.

శ్లో. రాగద్వేష వియుక్తైస్తు విషయా నింద్రియై శ్చరన్,
ఆత్మ వశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి. 64

గీ. వసుధ రాగంబు ద్వేషంబు-వదలి, వశ్య
ములగు నింద్రియములతోడఁ- బొసఁగ దేహ
యాత్ర నడువంగ, విడువ శ-క్యంబు కాని
విషయములఁ బరఁగెడి యోగి- విమలుఁ డెంచ.

తా. రాగద్వేషములను వదిలి స్వాధీనములోనున్న యింద్రియముల చేత, శరీర ధారణకై విడువ శక్యము కాని విషయముల ననుభవించు నట్టి మనస్స్వాధీనతగల పురుషుఁడు నిర్మలత్వమును బొందుచున్నాడు.

శ్లో. ప్రసాదే సర్వ దుఃఖానాం హాని రస్యోపజాయతే,
ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి. 65

గీ. నిర్మలత్వంబుఁ బడయంగఁ- గర్మయోగి
కపుడె తగ సర్వ దుఃఖంబు- లంతరించు;
నిర్మల మనస్కుఁ డగు వాని- నిశ్చయాత్మ
కమగు బుద్ధి స్థిరత్వంబుఁ- గనుట వలన.

తా. మనో నైర్మల్యము కలుగగా సమస్త దుఃఖములు నశించును. స్వచ్ఛమైన మనస్సు గల పురుషునకు శీఘ్రముగా నిశ్చయాత్మకమైన బుద్ధి స్థిరముగా నిలుచును.

శ్లో. నాస్తి బుద్ధి రయుక్తస్య న చా యుక్తస్య భావనా,
నచా భావయత శ్శాంతి రశాంతస్య కుత స్సుఖమ్. 66

గీ. పూని యింద్రియ నియమంబుఁ – బొందకుండు
పూరుషున కాత్మ విషయక-బుద్ధి, మఱియు





స్వస్వరూప భావనయుఁ, బొ-సఁగవు; దాన
ధరణి శాంతి సుఖములఁ బొం-దంగ లేదు.

తా. ఇంద్రియ నిగ్రహము లేనివానికి, ఆత్మ విషయక బుద్ధియును, ఆత్మ స్వరూప భావనయును, గలుఁగవు. బ్రహ్మ భావన చేయని వానికి చిత్తోపరతి గలుగదు. చిత్తోపరతి లేని వానికి సుఖము గలుఁగదు.

శ్లో. ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽను విధీయతే,
తదస్య హరతి ప్రజ్ఞాం వాయు ర్నావ మివాంభసి. 67

గీ. ఎప్పు డింద్రియములు సంచ-రించుచుండ
విషయముల, నెవ్వని మనస్సు-వెంబడించు,
నతని నది, పెనుగాలి మ-హార్ణవమునఁ
జెలఁగి నావనుం బోలె, న-శింపఁ జేయు.

తా. విషయము లందు సంచరించుచున్న యింద్రియములకు పురుషుని మనస్సు లోబడునేని, ఆ మనస్సు సముద్రము నందు ప్రతికూల వాయువు నావను హరించు నటుల, పురుషుని యాత్మానాత్మ వివేకమును హరించును.

శ్లో. తస్మా ద్యస్య మహాబాహో! నిగృహీతాని సర్వశః,
ఇన్ద్రియా ణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. 68

గీ. అవని నెవ్వఁ డర్జున! యింద్రి-యముల నెపుడు
విషయములఁ బొందనీక, వి-వేకి యగుచు
మెలఁగు వాని మనస్సు ని-శ్చలత నుంట
నతనిఁ దగ స్థిత ప్రజ్ఞుం డ-టంద్రు బుధులు.

తా. అర్జునా! అందువలన, ఎవఁడు తన యింద్రియములను, వాని విషయములందు జొరనీక నిగ్రహించునో, వాని బుద్ధి మిక్కిలి స్థిరమైనది.

శ్లో. యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః. 69

గీ. అవని భూతములకు రాత్రి-యై పరంగు
నజ్ఞతను నెద్ది; యా యాత్మ-నాత్మ తత్త్వ



మెఱుఁగు నతఁ డెల్లపుడును వీ-క్షించు
బగలువలెఁ బ్రకాశించును - వాని కరయ. (పూర్వార్థము)

గీ. మఱియు సర్వభూతములకు-మహినిఁ బగలు
వలెఁ బ్రకాశించు చుండు శ-బ్దాది విషయ
జాల మాత్మవిదున కందు-సక్తి లేమి,
రాత్రి వలెఁ బ్రకాశింప వ-రయఁ గిరీటి! (ఉత్తరార్థము)

తా. సర్వప్రాణులకు దెలియక పోవుట వలన రాత్రి వలె దోచునట్టి 'ఆత్మను' ఆత్మావలోకనపరుఁడైన మనన శీలుఁడు చూచుచుండును. సమస్త ప్రాణులు మేలుకొనియుండి చూచుచుండు శబ్దాది విషయములు, అతనికి రాత్రివలెఁ బ్రకాశింపకుండును. (సర్వప్రాణులకు రాత్రివలె ప్రకాశింపకుండు పరమార్థ తత్త్వము నతఁడు చూచుచుండుననియును, సర్వప్రాణులకు జాగ్రత్కాలమందు ప్రకాశించుచుండు ప్రాపంచిక వ్యవహారములు, విషయాసక్తి లేని యతనికి ప్రకాశింపకుండుననియును భావము.)

**శ్లో. ఆపూర్య మాణ మచల ప్రతిష్ఠం సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్,**
**తద్వత్కామా యం ప్రవిశంతి సర్వే, స శాంతి మాప్నోతి; న కామకామీ.70**

గీ. సర్వనదుల గ్రహించెడి-సంద్ర మెపుడు
హద్దు మీఱకుండు నటుల; - నవని యోగి
విషయముల బొందుచున్నను- వేడ్కలేక,
నిర్వికారుఁడై శాంతితో- నెగడు చుండు.

తా. భూమిపై నుండు సమస్త ప్రవాహములు సముద్రములో జేరుచున్నను, ఎటుల సముద్రము తన హద్దు మీఱక, ఆ ప్రవాహ జలముల నన్నిటిని గ్రహించుచు, కొంచెమైనను వికారము చెందకుండునో, అటుల యోగి సమస్త విషయములను గ్రహించుచున్నను కొంచెమైనను వికారము చెందక యుండును. విషయములందు కోర్కె గలవాఁడు శాంతిని బొందడు. ఎవ్వని యందు సర్వ విధములైన కోరికలు అణగుచుండునో, అట్టివాఁడే మోక్షమును బొందును.

శ్లో. విహాయ కామాన్ య స్సర్వాన్
పుమాం శ్చరతి నిస్పృహః,
నిర్మమో నిరహంకారః
సశాంతి మధిగచ్ఛతి. 71





గీ. వసుధ సర్వకామములను-వదలి, దేని
యందు నాశలేక, మఱి, య-హంకృతియు, మ
మత్వమును బొంద డెవ్వఁ డ-మ్మనుజుఁ డొందు
శాంతియుం, దాన మోక్షంబు- సవ్యసాచి!

తా. ఏ పురుషుఁడు సమస్తమైన కోరికలను విడిచి, దేనియందును నాశలేనివాఁడుగను, అహంకారమమకారములు (నేను, నాదియను భావములు) లేనివాఁడుగను నుండునో ఆ పురుషుఁడు శాంతిని బొందును.

శ్లో. ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి,
స్థిత్వాఽ స్యా మంతకాలేఽపి బ్రహ్మ నిర్వాణ మృచ్ఛతి. 72

(సాంఖ్యయోగోనామ ద్వితీయోధ్యాయ స్సంపూర్ణమ్)

గీ. దీని బ్రహ్మ నిష్ఠ యటండ్రు; - దీని నొందు
నతఁడు బొంద డెప్పుడును మో-హంబు; మఱియు
మరణకాలంబునైన నే-నరుఁడు దీనిఁ
గాంచు, నాతఁడు మోక్షంబుఁ- గాంచు సుమ్ము.

తా. అర్జునా! ఈ నిష్ఠ బ్రహ్మ నిష్ఠ యనఁబడును. దీనినిఁ బొందిన పురుషుఁడు మోహముఁ జెందఁడు. మరణ కాలమందీనిష్ఠను బొందినను మోక్షముఁ బొందును. (కావున నిక, జీవితకాలమంతయు నీ నిష్ఠయందున్న యతఁడు మోక్షము బొందునని వేఱె చెప్పఁ బనిలేదు కదా!)

(సాంఖ్యయోగమనెడి ద్వితీయాధ్యాయము సంపూర్ణము)



# తృతీయోఽధ్యాయః
## కర్మయోగః

అర్జున ఉవాచ :-

శ్లో . జ్యాయసీ చే త్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన!
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ! 1

గీ. అంత నర్జునుం డడిగెను – హరినిఁ "గర్మ
కంటె జ్ఞానంబె శ్రేష్ఠంబు–గాఁ దలంతు
వేని, యీ ఘోరకర్మంబు– నేల నన్నుఁ
జేయుమని చెప్పుచున్నావు– చెప్పుమయ్య.

తా. ఓ కృష్ణా! కర్మయోగము కంటె జ్ఞానమే శ్రేష్ఠమని నీ యభిప్రాయమైన యెడల, నన్ను ఘోరమైన కర్మము నొనరింపుమని యేల ప్రేరేపించు చున్నావు?

శ్లో. వ్యామిశ్రేణైవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే,
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్. 2

గీ. నీదు వాక్యంబుచే నాకు–నిశ్చితార్థ
ము తెలియ కునికి మిగుల నా–బుద్ధి కలఁతఁ
బొందు; గాన నీ రెంటిలో–మోక్ష మొసఁగు
నెద్ది, దాని నాకిట వచి–యింపుమయ్య."

తా. ఈ వాక్యమున కర్థము నాకు విస్పష్టముగఁ దెలియకుండుట వలన నా బుద్ధి కలఁత జెందుచున్నది. కాబట్టి, యీ జ్ఞాన కర్మములలో దేనివలన మోక్షమును బొందుదునో దానిని నిశ్చయించి చెప్పుము.

శ్రీ భగవాన్ ఉవాచ :-

శ్లో. లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ!
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్. 3

గీ. అతని కపుడు ముకుందుఁ డి–ట్లనియె, నాత్మ
వేత్తలకు జ్ఞానయోగంబుఁ– జిత్తశుద్ధి





యుతులయిన యోగులకు గర్మ-యోగము, మును,
యుక్తముగఁ జెప్పితిని వారి-ముక్తి కొఱకు.

తా. అర్జునా! ఈ లోకమున, పూర్వకర్మ ఫలము వలన, నాత్మానాత్మ వస్తు వివేకము గల పురుషులకు జ్ఞానయోగము చేతను, విహిత కర్మాచరణ మందాసక్తి గలవారికి కర్మయోగము చేతను ముక్తి గలుగునని, యీ రెండువిధములైన నిష్ఠలు పూర్వము నాచే చెప్పఁబడినవి.

శ్లో. న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే,
న చ సన్న్యసనా దేవ సిద్ధిం సమధి గచ్ఛతి. 4

గీ. మహినిఁ గర్మలఁ జేయని-మాత్రముననుఁ
జ్ఞానరహితమౌ కర్మస-న్యాసముననుఁ
గలుగ దెపుడు నరునకు నై-ష్కర్మ్య సిద్ధి
చిత్త పారిశుద్ధ్యము లేమి-చేఁ, గిరీటి!

తా. పురుషుఁడు కర్మముల నాచరింపక పోవుట వలన, క్రియా రహితమైన నిశ్చయమును బొందడు. మఱియు, జ్ఞాన రహిత కర్మ సన్న్యాసము వలనను నైష్కర్మ్య లక్షణ సిద్ధిని బొందఁజాలడు. విహితకర్మానుచరణము వలన పాపము నశించి, చిత్తశుద్ధి యేర్పడును. దానివలన జ్ఞాన ముత్పత్తి యగును. చిత్త శుద్ధి లేని కర్మ పరిత్యాగము వలన జ్ఞానము కలుగదు.

శ్లో. నహి కశ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః. 5

గీ. కర్మ చేయక నజ్ఞుఁ డొ-క క్షణకాల
మైన నుండలేడు వసుధ-యందు; ప్రకృతి
జములయి ప్రబలు సత్త్వ ర-జ స్తమోగు
ణములకు వశుండగుచును గ-ర్మము లొనర్చు.

తా. ఈ ప్రపంచమం దెవ్వఁడును, కర్మము చేయకుండ నొక్క క్షణకాలమైన నుండఁ జాలడు కదా! ఏలనన! ప్రతిమనుష్యుఁడును ప్రకృతి వలన బుట్టిన రాగ ద్వేషాది గుణములచేత ప్రేరితుఁడై, తప్పక కర్మములను జేయుచున్నాడు. (ప్రతి మనుష్యుఁడును కర్మముల నెటులను జేయక తప్పదు కావున, విహిత కర్మములను



విధిగ నొనరించిన యెడల, అతఁడు చిత్త శుద్ధిని బొంది, దాని మూలమున మోక్షముఁ బొందును)

శ్లో. కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్,
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే. 6

గీ. నియతిఁ గర్మేంద్రియములను-నిగ్రహించి,
మనసుచే విషయములను-స్మరణ సేయు
చుండెడి వివేకశూన్యునిఁ-జొప్పడంగ
నవనిలోన మిథ్యాచారుఁ-డంద్రు బుధులు.

తా. ఎవఁడు కర్మేంద్రియములను నిగ్రహించి వానిచేఁ గర్మముల నొనరింపక, మనస్సు చేత నా యింద్రియార్థములైన శబ్దాది విషయములను గూర్చి చింతన చేయు చుండునో, అట్టి వివేక శూన్యుఁడు మిథ్యాచారుఁడని చెప్పఁబడుచున్నాడు.

శ్లో. యస్త్వింద్రియాణి మనసా నియ మ్యారభతేఽర్జున!
కర్మేంద్రియైః కర్మయోగ మసక్త స్సవిశిష్యతే. 7

గీ. జగతి జ్ఞానేంద్రియంబుల-సంయమించి
మనసు చేత, విహిత కర్మ-లను సలుపుచు
సంగరహితుఁడయి, ఫలకాం-క్షయును లేక
నుండు పూరుషుం డరయంగ- నుత్తముండు.

తా. అర్జునా! ఎవఁడు మనస్సు చేత ఇంద్రియములను నిగ్రహించి, ఫలము నపేక్షింపక కర్మేంద్రియముల చేత కర్మయోగము ననుష్ఠించునో (విహిత కర్మముల నాచరించునో), అట్టిపురుషుఁడు శ్రేష్ఠుఁడని చెప్పఁబడుచున్నాడు. (కర్మేంద్రియము లేవి యనగాః- వాక్కు, చేతులు, కాళ్లు, గుదము, ఉపస్థ).

శ్లో. నియతం కురు కర్మ త్వం, కర్మ జ్యాయో హ్యకర్మణః,
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః. 8

గీ. నియత కర్మంబు సేయుము-ప్రియము తోడఁ
గర్మ చేయుటయే మే ల-కర్మ కంటె;
గర్మమునుఁ జేయవేని దు-ష్కరమగును శ
రీర యాత్ర సాగుటయుఁ గి-రీటి నీకు.





తా. అర్జునా! అందువలన నీవు విధ్యుక్తమైన కర్మమును జేయుము. కర్మము చేయక పోవుట కంటె, కర్మము చేయుటయే శ్రేయస్కరము. నీవు కర్మమును చేయవేని, నీకు శరీరయాత్ర కూడ బాగుగ సాగనేరదు.

శ్లో. **యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః,**
**తదర్థం కర్మ కౌంతేయ! ముక్తసంగ స్సమాచర.** 9

గీ. ఈశ్వరార్థమయిన కర్మ-నే యొనర్పు
మందు ఫలకాంక్ష లేకఁ; ద-దన్యకర్మ
బంధ కారణంబగును; నీ-శ్వరుని గూర్చి
సలుపు కర్మను విదులు య-జ్ఞం బటంద్రు.

తా. ఈశ్వరార్పణముగా జేయఁబడు కర్మము కంటె నన్యమైన కర్మ మీలోకమునకు బంధము కలిగించును. (ఈశ్వరార్థముగా చేయబడక, ఫలాపేక్షతో చేయబడు కర్మము, ఈ లోకములో మరల పుట్టి మరల చచ్చుటకు కారణమగునని యర్థము.) కాబట్టి, అర్జునా! నీవు, ఈశ్వరార్థమైన కర్మమును ఫలమం దపేక్ష లేక చేయుము. (భగవత్ప్రీతి కొఱకు చేయబడు కర్మము యజ్ఞమని చెప్పఁబడుచున్నది)

శ్లో. **సహ యజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,**
**అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్ట కామధుక్.** 10

గీ. పరఁగ యజ్ఞంబుతో గూడఁ - బ్రజల సృష్టి
చేసి, "దీన మీరలు వృద్ధిఁ- జెందుఁ; డిదియు
నిష్ట కామంబులను దగ-నిచ్చు"ననియె
సృష్టికాలంబునందు నా-స్రష్ట చెలఁగి.

తా. సృష్టి కాలమందు బ్రహ్మదేవుఁడు యజ్ఞములతోఁ గూడిన ప్రజలను సృష్టించి వారితో, "ఈ యజ్ఞము చేత వృద్ధి పొందుడు. దీనివలన మీరు మీ కోరికలను బొందుదురు గాక" యని చెప్పెను.

శ్లో. **దేవా న్భావయతానేన, తే దేవా భావయంతు వః,**
**పరస్పర భావయంతః శ్రేయః పరమవాప్స్యథ.** 11

గీ. యజ్ఞ మొనరించి మీరు ది-వౌకసులను
వృద్ధి పొందింపుడు, మఱియుఁ- బేర్మి మిమ్ము



వారు వృద్ధి పొందింతురు; -పరగ నిటు ప
రస్పరంబు మెలగుట మో-క్షా స్పదంబు.

తా. "మీరీ యజ్ఞము చేత దేవతలను సంతోషపెట్టుడు. ఆ దేవతలు వర్షాదుల చేత మిమ్ము సంతోష పఱచి వృద్ధి పొందింతురు గాక. ఇట్లు మీరొకరి నొకరు సంతోషపఱచుకొనుచు, ఉత్కృష్టమైన శ్రేయస్సును (మోక్షమును) పొందుడు".

శ్లో. ఇష్టాన్ భోగాన్హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః,
తైర్దత్తా నప్రదాయైభ్యో యోభుఙ్క్తే స్తేన ఏవ సః. 12

గీ. దేవతలు మీ సవనములఁ - దృప్తిఁ జెంది
సరగ మీకభీష్టంబు లొ-సంగుచుందు;
రెలమి వారొసంగిన భోగ-ములను వారి
కొసఁగక మను నతఁడు చోరుఁ-డుర్వియందు.

తా. "దేవతలు మీరు చేయు యజ్ఞముల వలన సంతోషము బొంది మీకు కోరిన భోగములను ప్రసాదింతురు. ఆ దేవతల చేత నొసఁగఁబడిన వస్తువులను తనవే యనుకొని తిరిగి వారి కర్పణము చేయక భుజించువాఁడు దొంగయే యగును.

శ్లో. యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యతే సర్వకిల్బిషైః,
భుంజతే తే త్వఘం పాపా యే పచం త్యాత్మ కారణాత్. 13

గీ. యజ్ఞ శిష్టాన్నమును దగ-నారగించు
సత్పురుషులను విడనాడు-సర్వపాప
ములు; తమకయి వండుకొను పా-పులరయ భుజి
యించుచున్నారు పాపంబె-యెంచఁ బార్థ!

తా. యజ్ఞార్థము వినియోగింపగా మిగిలిన యన్నమును భుజించెడి సత్పురుషులు సమస్త పాపముల చేతను విడువఁబడుదురు. తమ కొఱకే వండుకొని భుజించుచున్న జనులు పాపమునే భుజించుచున్నారు.

శ్లో. అన్నా ద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః,
యజ్ఞా ద్భవతి పర్జన్యో, యజ్ఞః, కర్మ సముద్భవః. 14

గీ. పుట్టుచుండు భూతము లన్న-మువలన; మఱి
పుట్టుచున్న దన్నము వర్ష-మువలనఁ; దగఁ





గలుగుచుండు వర్షము యజ్ఞ-కరణమునను,
యజ్ఞ మరయఁ గర్మంబుచే-నవనిఁ గలుగు.

తా. అన్నమువలన భూతములు పుట్టుచున్నవి. అన్నము వర్షము వలన గలుగుచున్నది. వర్షము యజ్ఞమువలన గలుగుచున్నది. యజ్ఞము కర్మము వలనఁ గలుగుచున్నది.

శ్లో. కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్.
తస్మా త్సర్వగతం బ్రహ్మ, నిత్య యజ్ఞే ప్రతిష్ఠితమ్. 15

గీ. తెలియు మర్జున! కర్మంబు-గలుగు వేద
మువలన, దగ నా వేదంబు-వొడమును బర
మాత్మ వలనను, మఱియు ని-మ్మహిని వేద
మరయ నిల్కడై యుండును-యజ్ఞమందు.

తా. కర్మము వేదమువలన గలుగుచున్నది, ఆ వేదము పరమాత్మ వలన గలిగినది. అందువలన శాశ్వతమైన వేదము యజ్ఞమునందుఁ బ్రతిష్ఠింపఁబడియున్నది.

శ్లో. ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ! సజీవతి. 16

గీ. ఇటు ప్రవర్తించు చక్రంబు-నెవ్వఁడనుస
రింపఁ డిహలోకమందు, వాఁ-డింద్రియవశుఁ
డయి విషయ పరిరంభణ-మందుఁ దవులుఁ
గాన, వాని జీవితము మో-ఘంబు పార్థ!

తా. అర్జునా! ఎవ్వఁడివ్విధముగ ప్రవర్తింపఁజేయబడిన జగచ్చక్రమును ఈ లోకమందనువర్తింపడో, అట్టివాఁడు విషయలోలుఁడును పాపజీవనుఁడును కావున వాని జీవితము నిరర్థకము.

శ్లో. యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మ న్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే. 17

గీ. పుడమి నాత్మయందా సక్తి-బొందు నెవ్వఁ
డాత్మచేతనె తగఁ దృప్తి-నందు; మఱియు
నాత్మచేతనె సంతోష-మనుభవించు;
నతఁడు సేయవలసిన-కార్యంబు లేదు.



తా. ఆత్మయందే యాసక్తిగలవాఁడును, ఆత్మ చేతనే తృప్తిఁబొందువాఁడును, ఆత్మ చేతనే సంతోషము పొందు వాఁడును నైన ఆత్మ విదునకు చేయవలసిన పనిలేదు.

శ్లో. నైవ తస్య కృతే నార్థో; నాకృతే నేహ కశ్చన,
నచాస్య సర్వభూతేషు కశ్చిదర్థ వ్యపాశ్రయః. 18

గీ. అట్టి జ్ఞానికి వసుధఁ గ-ర్మా చరణము
వలనఁ బుణ్యం, బకర్మంబు-వలన హాని
యును, సమస్త భూతంబులం-దునుఁ బ్రయోజ
నముఁ బడయుట కరయ నాశ్ర-యమును, లేవు.

తా. ఆ బ్రహ్మనిష్ఠునకుఁ (జ్ఞానికి) గర్మాచరణమువలన పుణ్యములేదు. కర్మము చేయనందున నెట్టి హానియునులేదు. మఱియు నతనికి సమస్త భూతముల యందును ప్రయోజన నిమిత్తమైన యాశ్రయ మెంతమాత్రమును లేదు.

శ్లో. తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః. 19

గీ. ఫలముఁ గోరకఁ గర్మంబు-సలుపుచుండు
మెపుడు;ఫలముఁ గాంక్షింపక-నెలమిఁ గర్మ
ముల నొనర్చు పూరుషుఁడు ని-ర్మలమనస్కుఁ
డయి క్రమంబుగ మోక్షంబు-నందు సుమ్ము.

తా. అందువలన నీవు ఫలకాంక్ష లేక నెల్లప్పుడును విహిత కర్మమును జేయుము. ఫలాసక్తి లేక కర్మము నొనరించు పురుషుఁడు చిత్తశుద్ధి పొంది క్రమముగా మోక్షమును బొందును.

శ్లో. కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః
లోక సంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి. 20

గీ. కర్మ మొనరించి కరము మో-క్షంబుఁబొంది
యుండిరి జనకాదులు దగ-నుర్వి మున్ను;
మఱియు నీవు జనులకు స-న్మార్గదర్శ
కుఁడవగుటఁ గర్మసేయు మె-పుడు కిరీటి!

తా. జనకుఁడు మొదలగువారు నిష్కామకర్మము చేతనే చిత్తశుద్ధిని బొంది, దాని వలన





మోక్షమును బొందిరి. మఱియు నీవు లోకులకు విహిత కర్మాచరణమందు మార్గ దర్శకుఁడవుగ నుండవలసిన వాఁడవు కావున నీవు కర్మము నాచరింప వలసి యున్నావు.

శ్లో. యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్త దే వేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే. 21

గీ. ఉత్తముఁడు దేని నొనరించు-నుర్విఁ దానిని
నితరు లొనరింతురు; మఱియు-నతఁడు దగఁ బ్ర
మాణముగఁ దేనినెంచుఁ గ-ర్మంబులందు,
సల్పుదురు దానినె కరము-సకల జనులు.

తా. ఉత్తముఁ డే కర్మము నెట్లాచరించునో, పామరజను లాకర్మము నట్లాచరింతురు. ఆబ్రహ్మనిష్ఠుఁడు దేనిని ప్రమాణముగా పాటించునో, వారును దాని నే ప్రమాణముగా నెంచి యనుసరింతురు.

శ్లో. నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,
నా నవాప్త మవాప్తవ్యం; వర్త ఏవ చ కర్మణి. 22

గీ. తెలియు మర్జున! ముల్లోక-ములను నాకుఁ
జేయవలసినఁ గర్మంబుఁ-జెలఁగి పొంద
వలసినదియు, మఱియుఁ బొందఁ-బడని దెప్పు
డరయ లే; దైనఁ గర్మలం-బరఁగుచుందు.

తా. ఓ యర్జునా! నాకు ముల్లోకములందును చేయవలసిన దెద్దియును లేదు; మఱియు, పొందవలసినదియు, పొందకున్నదియు లేదు. అయినను కర్మము చేయుచునే యున్నాను.

శ్లో. యది హ్యహం న వర్తేయం జాతు కర్మ ణ్యతంద్రితః,
మమ వర్త్మాను వర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః. 23

గీ. జాగరూకతం గర్మల-సలుపనేని
నేనొకప్పుడైనఁ, బుడమి-మానవులును
నన్ని విధములుగను నన్నె-యనుసరింత్రు;
కానఁ జేయు మందును నేను-కర్మ లెపుడు,



తా. అర్జునా! నే నప్రమత్తుఁడనై కర్మ మొనర్పగ యుందునేని, జను లన్ని విధములు గను నా మార్గమునే యనుసరింతురు.

శ్లో. ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్,
సంకరస్య చ కర్తాస్యా ముపహన్యా మిమాః ప్రజాః 24

గీ. ఏను కర్మంబు నొనరింప-నేని పుడమి
మనుజులందఱు చెడుదురు,-మఱియు వర్ణ
సంకరము గల్గు; దానఁ బ్ర-జలను నేనె
చెరచినట్టి వాఁడ నగుదు,-శ్వేత హయుఁడ!

తా. నేను శ్రద్ధతో కర్మము నాచరింపని యెడల, జనులందఱు చెడిపోవుదురు. వర్ణ సంకరమునకుఁ గారణభూతుఁడనగుదును. ఈ ప్రజలను చెడ గొట్టిన వాఁడనగుదును.

శ్లో. సక్తాః కర్మ ణ్య విద్వాంసో యథా కుర్వంతి భారత!
కుర్యా ద్విద్వాం స్తథా సక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్. 25

గీ. పామరు లెటులఁ గర్మను-ఫలము గోరు
చు సలుపుదు రట్లు కర్మఁద-జ్ఞులు జనులను
సత్ప్రవర్తనమునఁ దగ-సంచరింపఁ
జేయ, ఫలము గాంక్షింపకఁ-జేయవలయు.

తా. అర్జునా! అజ్ఞానులు ఫలాపేక్షచే నెట్లు కర్మము చేయుదురో, జ్ఞానియు నట్లు లోకులను సన్మార్గమందుఁ బ్రవర్తింపఁజేయుటకు ఫలాపేక్షలేక కర్మము చేయవలెను.

శ్లో. న బుద్ధి భేదం జనయే దజ్ఞానాం కర్మ సంగినామ్,
జోషయే త్సర్వ కర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్. 26



గీ. పాసఁగ జ్ఞాని యజ్ఞుల కిలఁ-బుద్ధి భేద
ముఁ గలిగింపకఁ దగఁ గర్మ-ములనుఁ బూని
యాచరించుచు, వారిచే-నాచరింపఁ
జేయవలయుఁ గర్మముల, వి-శిష్టుఁ డగుచు.

తా. కర్మాచరణమం దాసక్తిగల యజ్ఞానులకు జ్ఞాని బుద్ధి భేదము గలుగ చేయక, శ్రద్ధతోఁ గర్మముల నాచరించుచు, వారిచే సమస్త కర్మముల నాచరింపఁ జేయవలెను.





శ్లో. ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే. 27

గీ. అరయఁ బ్రకృతి వికారంబు-లైన సత్త్వ
ము; రజము, తమంబను త్రిగుణం-బుల వలన నొ
నరుపఁబడెడు కర్మములకుఁ-బురుషుఁ డెసఁగి
మోహమునఁ దానె కర్తని-*యూహ మెందు.

తా. అహంకారమువలన నవివేకముతోఁ గూడియున్న పురుషుఁడు ప్రకృతి (మాయ) వలన బుట్టిన త్రిగుణముల యొక్క ప్రేరేపణము వలన, ఇంద్రియముల చేతఁ జేయఁబడునట్టి బహువిధములగు కర్మములను, తాను జేయుచున్నట్లు తలఁచును.

శ్లో. తత్త్వవిత్తు మహాబాహో! గుణకర్మ విభాగయోః,
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే. 28

గీ. ఈ గుణములను, గర్మల-నెలమి వేఱు
పఱచి, తగఁ దెలిసికొనిన-బ్రహ్మవిదుఁడు
కర్మరూప గుణంబులు-బేర్మి విషయ
రూప గుణము లొందునని, **ని-రుకున మెలఁగు.

తా. అర్జునా! ఈ త్రిగుణములను గూర్చియు, కర్మములను గూర్చియు, యథార్థమును దెలిసినవాఁడు మాత్రము, ఇంద్రియములు విషయముల యందుఁ బ్రవర్తించు చున్నవని యెంచి తా నా యింద్రియ కార్యములందు సక్తుఁడుకాడు.

శ్లో. ప్రకృతే ర్గుణసమ్మూఢా స్సజ్జంతే గుణ కర్మసు,
తా నకృత్స్నవిదో మందాన్ కృత్స్నవి న్నవిచాలయేత్. 29

గీ. ప్రకృతి గుణముచే మోహంబు-బడసి, ఫలముఁ
బొంద నా గుణముల కర్మ-ములఁ దవిలెడి
మందమతుల కాత్మ విదుఁడు-మహిని బుద్ధి
భేదము గలుగ జేయంగ-రాదు సుమ్ము.

---

*ఊహము=తలంపు; ** నిరుకు = నిర్ణయము



తా. ప్రకృతి మాయవలన బుట్టిన త్రిగుణముల ప్రభావము చేత తెలియని వారై ఫలాపేక్షచే నాగుణముల యొక్క కర్మములం దాసక్తులై యున్న యజ్ఞానులకు, ఆత్మవేత్త యైనవాఁడు (జ్ఞాని) బుద్ధి భేదము కలిగింపరాదు.

శ్లో. మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యా ధ్యాత్మచేతసా,
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుద్ధ్యస్వ విగత జ్వరః. 30

గీ. అన్ని కర్మంబులఁ దగ నా-కర్పణమొన
రించి,జ్ఞానంబు-చే గోర్కె-లెందు లేక,
వ్యసనమును విడనాడి, య-హంకృతియును
లేక, యుద్ధంబు సలుపుము-వీక నిపుడు.

తా. సమస్తములైన కర్మములను,-పరమేశ్వరుఁడనైన నాయందు సమర్పించి, వివేక బుద్ధి చేత, కోర్కె లేని వాఁడవును, అహంకార మమకారములు లేని వాఁడవును, సంతాపమును వదలినవాఁడవునై యుద్ధము చేయుము.

శ్లో. యే మే మత మిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః,
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేపి కర్మభిః. 31

గీ. జగతి నెపుడు నా మతమును-శ్రద్ధతోడ
ను, మఱియు ననసూయయును లేక-విమలమతుల
గుచు ననుష్ఠించు వారలు-గూడ, కర్మ
ఫలము చేతఁ దగ విడువఁ-బడుదురయ్య.

తా. ఏ మనుష్యులు నా వాక్యమందు విశ్వాసము గలిగి, అసూయలేని వారై యెల్లప్పుడు నా మతము ననువర్తించు చుందురో, యట్టి వారికి కర్మఫల మంట కుండును.

శ్లో. యే త్వేత దభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్,
సర్వజ్ఞాన విమూఢాం స్తాన్ విద్ధి నష్టా న చేతసః. 32

గీ. ఈ మతంబు నెవ్వారు నిం-దించుచు నెపు
డాచరింప రీజగతి యం-దట్టి వారు
సర్వ విషయ మూఢులయి నా-శంబుఁబొందు
దురని తగ విశ్వసింపుము-*తొనకులేక.

* తొనకు = తొట్రుపాటు





తా. నా యందసూయగలిగి, నా మతము ననుసరింప కుండువారు సర్వ విషయముల యొక్క జ్ఞానమందు మూఢులనియు, వివేక శూన్యులనియు, నశించువారనియు దెలిసికొనుము.

శ్లో. సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్ జ్ఞానవా నపి,
ప్రకృతిం యాంతి భూతాని; నిగ్రహః కిం కరిష్యతి. 33

గీ. జ్ఞానియును బూర్వ జన్మ సం-స్కారమునకుఁ
దగినటులఁ బ్రవర్తించు, భూతంబులన్ని
యును నటులె ప్రవర్తించుచుండును గిరీటి!
కాన ప్రకృతి నిగ్రహము దు-ష్కరము సుమ్ము.

తా. జ్ఞానియును జన్మాంతర సంస్కారమున కనుగుణ్యముగఁ బ్రవర్తించును. సమస్త భూతములును నా జన్మాంతర సంస్కార రూపమైన ప్రకృతి ననుభవించు చుండును. కాబట్టి, సామాన్య జనుఁడు ప్రకృతిని నిగ్రహించుట యసాధ్యము.

శ్లో. ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ,
తయో ర్నవశ మాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపంథినౌ. 34

గీ. అరయ నింద్రియవిషయము-లందు ద్వేష
రాగములు గల్గు చుండుఁ గ-రంబు;పూరు
షున కివియె విరోధులగుట-సారిది,వీని
కవశుఁడై మెలఁగ వలయు-నవని నెపుడు.

తా. సర్వేంద్రియములకు శబ్దాది విషయములందు రాగము(ఇష్టవస్తువునందు ప్రీతి), ద్వేషము ఉన్నవి. అవియే పురుషునకు శత్రువులు కావున వాని కధీనుండు కాఁగూడదు. పురుషుఁడీ రాగద్వేషములకు వశుఁడైనచో స్వధర్మమును వదలుటయు, పరధర్మముల నవలంబించి యితరులచేత వాని ననుష్ఠింపఁ జేయుటయు సంభవించును. రాగద్వేషముల నణచికొనుట వలన శాస్త్ర దృష్టి కలవాఁడై, విహిత కర్మాచరణమం దాసక్తిఁ బొందుటయు, నిషిద్ధ కర్మముల యందు హేయభావము పొందుటయు గలుగును.

శ్లో. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. 35



గీ. అన్యధర్మంబుఁ జక్కఁగా-నాచరించు
చుఁ మెలఁగుటకంటెను దలప-సుగుణ వర్జి
తంబయినను స్వ ధర్మంబు-ధరణిఁ శ్రేష్ఠ;
మన్యధర్మంబు భయావ-హంబు;మఱియు
మృత్యువైన స్వధర్మమం-దెంచ మేలు.

తా. బాగుగా నాచరింపఁబడిన పరధర్మము కంటె, గుణము లేనిదైనను స్వధర్మమే శ్రేష్ఠము. స్వధర్మమందు మరణమైనను శ్రేష్ఠము. పరధర్మము భయము గలుగ జేయును.

అర్జున ఉవాచ :

శ్లో. అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః,
అనిచ్ఛ న్నపి వార్ష్ణేయ! బలాదివ నియోజితః. 36

గీ. అంతఁ బార్థుండు, "పూరుషుం-డవనిఁ జేయ
నిచ్ఛయింపనివాఁడయ్యు-నెనఁగి దేని
వలనఁ బ్రేరింపఁబడుచుఁ బా-పంబు సలుపు
చుండుఁ జెప్పు మయ్య"యని య-చ్యుతుని నడిగె.

తా. ఓకృష్ణా! పురుషుఁడు పాపము చేయఁగోరని వాడైనను, దేని చేత బలాత్కరింప బడినవాఁడగుచు పాపము చేయుచున్నాడు?

శ్రీ భగవాన్ ఉవాచ :

శ్లో. కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యే న మిహ వైరిణమ్. 37

గీ. హరి యనియెఁ,గారణము కామ-మది రజోగు
ణోద్భవము; దీని నేదైన-నొడ్డఁ గ్రోధ
రూపముగ మారి చేయించుఁ-బాపములను;
దెలియు మీ కామమును విరో-ధియని పార్థ!

తా. కామము (కోరిక) దానికి కారణము. ఈ కామము దేని చేతనైనను అడ్డగింపఁబడినప్పుడు ద్వేషముగా మారును. విపరీత ఫలితములు గలదియు, పాపస్వరూపమైనదియునైన యీ కామము మోక్షమార్గమందు శత్రువని తెలిసికొనుము.





శ్లో. ధూమేనా వ్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేన చ,
యథోల్బే నావృతో గర్భ స్తథా తేనేద మావృతమ్. 38

గీ. వహ్ని పొగచేత నెటులఁ గ-ప్పఁబడి యుండు,
నద్దము నెటుల మాలిన్య-మావరించుఁ,
గర్భ శిశువు నెటుల మావి-క్రమ్మి యుండుఁ,
గామ మటుల జ్ఞానంబును-గ్రమ్మియుండు.

తా. ఎటుల, అగ్ని పొగ చేతఁ గప్పఁబడియుండునో, అద్దము మాలిన్యము చేతఁ గప్పబడి యుండునో, గర్భస్థ పిండము మావిచేతఁ గప్పఁబడియుండునో, అటుల జ్ఞానము కామము చేతఁ గప్పఁబడియుండును.

శ్లో. ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా,
కామరూపేణ కౌంతేయ! దుష్పూరేణానలేన చ. 39

గీ. వసుధ జ్ఞాని కరయ నిత్య-వైరియు,సత
తంబు నిండఁజేయుట కసా-ధ్యమును,దృప్తి
గాంచ కుండునదియునైన-కామ మెపుడు
జ్ఞానమును గప్పి యుండును-సవ్యసాచి!

తా. అర్జునా! జ్ఞానికి నిరంతర శత్రువైనట్టియు, నిండింప నశక్యమైనట్టియు, నశింపఁ జేయునట్టియు నీ కామము చేత జ్ఞానము కప్పఁబడియుండును.

శ్లో. ఇంద్రియాణి, మనో,బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే,
ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్. 40

గీ. బుద్ధియు, మనసు, నింద్రియ-ములును సారిది
నాశ్రయములు కామంబున-కండ్రు బుధులు;
కామ మెపుడు జ్ఞానంబును-గ్రమ్మియుండి
పురుషు నెల్లవేళ యందు-మోహపఱచు.

తా. ఇంద్రియములును, మనస్సును, బుద్ధియు నీ కామమునకు అధిష్ఠానము(ఆశ్రయము) అని చెప్పఁబడుచున్నది. ఈ కామము వీనిచేఁ గప్పఁబడి యుండి, నానా విధములుగ పురుషుని పొరపెట్టి, వాని చేత పాపకార్యములు చేయించును.



శ్లో. తస్మా త్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ!
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన విజ్ఞాన నాశనమ్. 41

కం. కాన దొలుత నింద్రియములఁ
బూని స్వవశ మొనరిచి, విడు-వుము నేర్పు మెయిన్
జ్ఞానంబును విజ్ఞానముఁ
బోనాడెడు కామమునుఁ, బ్ర-మోదము గలుగన్.

తా. ఓ యర్జునా! అందువలన నీవు మొదట పంచేంద్రియములను నిగ్రహించి జ్ఞాన విజ్ఞానములను నశింపఁజేయునదియును, పాపస్వరూపమును నైన కామమును విడువుము.

శ్లో. ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరాబుద్ధి ర్యోబుద్ధేః పరతస్తు సః. 42

గీ. ఎంచ దేహంబుకంటెను-నింద్రియములు,
మఱియు నింద్రియముల కంటె మనసు; మనసు
కంటె బుద్ధియు, నికఁ బుద్ధి-కంటె బుద్ధి
సాక్షియగు నాత్మ, శ్రేష్ఠంబు-సవ్యసాచి!

తా. బ్రహ్మవిదులు స్థూల దేహముకంటె నింద్రియములు శ్రేష్ఠమైనవనియు, ఇంద్రియముల కంటె మనస్సు శ్రేష్ఠమైనదనియు, మనస్సు కంటె బుద్ధి శ్రేష్ఠమైనదనియుఁ జెప్పుదురు.

శ్లో. ఏవం బుద్ధేః పరం బుధ్వా సంస్త భ్యాత్మాన మాత్మనా,
జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్. 43

(కర్మయోగోనామ తృతీయోధ్యాయ స్సంపూర్ణమ్)

గీ. చేరి, మీ బుద్ధి కంటెను-శ్రేష్ఠమైన
యాత్మతత్త్వంబు నెఱిఁగి, యా-యాత్మను దగఁ
బుద్ధిచే నిశ్చలము చేసి,-పాసఁగ గామ
శత్రువును సంహరింపుము-సరగఁ బార్థ!

తా. ఓ యర్జునా! ఇట్లు నీవు బుద్ధి కంటె గొప్పదియును, కనిపించనిదియును నైన కామమును విడువుము.

(కర్మయోగంబనెడి తృతీయాధ్యాయము సంపూర్ణము)





# చతుర్థోఽధ్యాయః

## జ్ఞానయోగః

శ్రీ భగవాన్ ఉవాచ :

శ్లో. ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్,
వివస్వాన్ మనవే ప్రాహ; మను రిక్ష్వాకవేఽబ్రవీత్. 1

గీ. అవ్యయంబగు నీయోగ-మర్కునకు మొ
దటఁ దెలిపితిని;వైవస్వ-తమనువున క
తఁడు దెలిపె;నతఁ డిక్ష్వాకు-ధరణీ పతికిఁ
జెప్పె నని శౌరి మఱియు వ-చించె నిటుల.

తా. నాశరహితమైన యీ యోగమును నేను సూర్యునకు జెప్పితిని. సూర్యుఁడు తన కుమారుఁడైన వైవస్వతమనువునకుఁ జెప్పెను. ఆయన ఇక్ష్వాకు మహారాజునకుఁ జెప్పెను.

శ్లో. ఏవం పరంపరా ప్రాప్త మిమం రాజర్షయో విదుః,
సకాలే నేహ మహతా యోగో నష్టః పరంతప! 2

గీ. ఇటు పరంపరగ నుపదే-శింపఁబడిన
దీని రాజర్షి వర్యులు-దెలిసికొనిరి;
కాలవశముచేత నిహలో-కమున నాశ
మొందె నయ్య కిరీటి! యీ-యోగ విద్య.

తా. అర్జునా! ఇట్లు పారంపర్యముగఁ బొందఁబడిన యీ యోగమును రాజర్షులు దెలిసికొనిరి. చాల కాలము గడచుట చేత నీ యోగ విద్య లోకమందు నశించెను.

శ్లో. స ఏవాయం మయాతేఽద్య యోగః ప్రోక్తః పురాతనః,
భక్తోఽసి మే సఖాచేతి రహస్యం హ్యేత దుత్తమమ్.

గీ. భక్తుఁడవును నీవు మఱియు-బాల్య సహచ
రుఁడవును నగుటచే నీకు-గడగి యిటుల
జెప్పితిని విశదంబుగ-శ్రేష్ఠమును ర
హస్యమునునైన యీ యోగ-మమల చరిత!



తా. అర్జునా! నాకు నీవు భక్తుఁడవును స్నేహితుఁడవును గావున, పురాతనమైనదియును, గోప్యమైనదియును, ఉత్తమమైనదియును నగు నీ యోగమును నీకుఁ జెప్పితిని.

అర్జున ఉవాచ :

శ్లో. అపరం భవతో జన్మ, పరం జన్మ వివస్వతః,
కథమేత ద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవా నితి. 4

అర్జునుఁడు చెప్పుచున్నాడు :

గీ. పుట్టె నాదిత్యుఁడు దొలుతఁ-బుట్టి యుంటి
వరయ వెనుక నీ; వైన న-హస్కరునకు
నీవె యీ యోగ విద్యను-నేర్పియుంటి
వను టెటులఁ బొసఁగును జెప్పు-మయ్య, కృష్ణ!

తా. సూర్యుడు ముందు జన్మించెను. నీవు తరువాత జన్మించితివి. అట్లుండగా నీవీ యోగమును సూర్యున కుపదేశించితివని నేనెట్లు గ్రహింపఁగలను?

శ్రీ భగవాన్ ఉవాచ :

శ్లో. బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున!
తా న్యహం వేద సర్వాణి, న త్వం వేత్థ పరంతప! 5

గీ. కృష్ణుఁ డిట్లనియె నపుడు-క్రీడితోడ,
మన కిరువురకుఁ జాలజన్మములు గడచె;
వాని నీవు దెలియవైన-నేను వాని
నెఱుఁగుదును, నిత్యుఁడ నగుట-నిపుడు పార్థ!

తా. ఓ యర్జునా! నాకును నీకును చాల జన్మములు గడచినవి. నా జన్మము లన్నిటిని నే నెఱుగుదును. కాని నీవు నీ జన్మముల నెఱుఁగవు.

శ్లో. అజోఽపిసన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మ మాయయా. 6

గీ. అజుఁడ, నిర్వికారుఁడ, నవ్య-యాత్మకుఁడను
సర్వభూతజాలమున కీ-శ్వరుఁడనయ్యు,





*నను చు త్రిగుణాత్మకంబగు-నాప్రకృతిని
బూని యాత్మమాయవలన-బుట్టు చుందు.

తా. నేను పుట్టుక లేనివాడనయ్యును, నాశ రహితుఁడ (అవికారుఁడ) నయ్యును, సమస్త భూతములకు నియామకుఁడనయ్యును, సత్త్వ రజస్తమో గుణాత్మకమైన నామాయ నవలంబించి, నా మాయవలనఁబుట్టు చున్నాను.

శ్లో. యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్. 7

గీ. ఎప్పుడెపుడు ధర్మంబున-కెసఁగి నాశ
ము గలిగి, యధర్మ మిలలోన-మిగుల వృద్ధి
జెందు;నప్పుడప్పుడు నేను-చెలగి యాత్మ
మాయచేఁ బడయు చుందును-జన్మంబు పార్థ!

తా. ఓ యర్జునా! ఎప్పుడెప్పుడు ధర్మము నశించి, అధర్మము వృద్ధియగునో, అప్పుడప్పుడ లోకమందు నా మాయ చేత పుట్టుచున్నాను.

శ్లో. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే. 8

గీ. శిష్ట పరిపాలనంబును,-దుష్టనిగ్ర
హంబునుఁ దగనొనర్చి, ధ-ర్మంబుఁ దిరిగి
నెలకొలుపఁ బ్రతియుగమునఁ-జెలఁగి యవత
రించుచున్నాను, పార్థ! ధ-రిత్రియందు.

తా. మంచివారిని రక్షించుటకొఱకును, పాపాత్ములను నాశముచేయుటకొఱకును, ధర్మమును స్థాపించుట కొఱకును ప్రతియుగమందును నే నవతరించుచున్నాను.

శ్లో. జన్మకర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి; మామేతి సోఽర్జున. 9

గీ. మహిని నా దివ్య జన్మక-ర్మముల నెవ్వఁ
డెఱుఁగును యథార్థముగ, నతఁ-డీశరీర

*ననుచు = అతిశయించు



మును విడిచిన వెనుక జన్మ-మును వహింపఁ
డు; మఱి నన్నె పొందు నతఁడు-విమల చరిత!

తా. అర్జునా! ఎవడు, అప్రాకృతమైన నా యొక్క మాయా రూపజన్మమును, శిష్ట రక్షణ దుష్ట శిక్షణాది కర్మమును యథార్థముగ దెలిసి కొనునో, ఆపురుషుఁ డీ శరీరమును విడిచిన తరువాత మరల జన్మమును బొందక నన్నే పొందును.

శ్లో. వీతరాగ భయ క్రోధా మన్మయా మా ముపాశ్రితాః,
బహవో జ్ఞాన తపసా పూతా మద్భావ మాగతాః. 10

గీ. వినుము, క్రోధంబు, ననురాగ-మును, భయంబు
విడిచి, నా యందె మనసుచొ-ప్పించి యుంచి
నన్నె సతత మాశ్రయ మొంది-యున్న సత్పు
రుషు లనేకులు, వీతక-ల్మషులగుచు, న
వగత విజ్ఞాన యోగంబు-వలనఁ దుదనుఁ
బడసియుండిరి నా స్వరూ-పంబె పార్థ!

తా. భయమును, రాగమును, క్రోధమును విడిచి, నన్నే ధ్యానించుచు, నన్నాశ్రయించిన పెక్కుండ్రు సత్పురుషులు జ్ఞాన యోగము చేత పరిశుద్ధులై నా స్వరూపమును బొందిరి.

శ్లో. యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం,
మమ వర్త్మాను వర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః 11

గీ. ఎవరెటుల నన్నుఁ దెలియుదు-రవని నేను
వారి కట్టుల ఫలములఁ-జేరి యిడుదు;
గాన నెల్లరు సర్వప్ర-కారములను
నన్ననుసరించు చున్నారు-నరుఁడ! వింటె.

తా. అర్జునా! నన్నెవ రే ప్రకారముగఁ దెలియుచున్నారో, నేను వారి నాప్రకారముగ ననుగ్రహించుచున్నాను. మనుష్యులందఱును సర్వప్రకారముల చేతను నామార్గము ననుసరించుచున్నారు. కర్మ సన్న్యాస మొనరించిన జ్ఞానులకు మోక్ష మొసఁగుచున్నాను; నిష్కామ కర్మమొనర్చు వారికి జ్ఞాన మొసఁగు చున్నాను. ఆపదలనుండి రక్షింపఁగోరు





వారిని రక్షించుచున్నాను. ఎవ రేయుద్దేశ్యముతో నన్నాశ్రయింతురో వారి కా యుద్దేశము లను నెరవేర్చుచున్నాను.

శ్లో. కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః,
క్షిప్రం హి మానుషేలోకే సిద్ధిర్భవతి కర్మజా. 12

గీ. కర్మఫల సిద్ధిఁ బడయంగఁ-గరము దేవ
తలనుఁ బూజింతు రెలమిఁ జ-నులు ధరిత్రి
యందు; మానుషలోకంబు-నందుఁ గర్మ
ఫలము శీఘ్రముగఁ గలుగుభవ్య చరిత!

తా. ఈ లోకమందు కర్మముల యొక్క ఫలమును గోరుచున్న మనుష్యులు, ఇంద్రాది దేవతల నుపాసించుచున్నారు. ఈ మనుష్యలోకమున, కర్మముల యొక్క ఫలితము శీఘ్రముగాఁగలుగుచున్నది.

శ్లో. చాతు ర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః,
తస్య కర్తారమపి మాం విద్ధ్య కర్తార మవ్యయమ్. 13

గీ. పుడమి నేనె చతుర్వర్ణ-ములను సృష్టి
చేసితిని గుణకర్మ వి-శేషములను
బట్టి;యైన నన్నుఁ దగ న-వ్యయునిగను, న
కర్త గనుఁ దెలిసి కొనుము-కరము పార్థ!

తా. సత్త్వ రజ స్తమోగుణముల యొక్కయు, తపశ్శమాది కర్మముల యొక్కయు విభజనము చొప్పున బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగు వర్ణములు నాచే సృష్టింపఁబడినవి. ఆ సృష్టిక్రమమునకు నేనే కర్తనైనను, నన్ను కర్త కానివానిగను, నాశరహితునిగను దెలిసికొనుము.

శ్లో. నమాం కర్మాణి లింపంతి, నమే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న సబధ్యతే. 14

గీ. 'కర్మలంట వెపుడు నన్నుఁ;-గర్మఫలము
నందు లేదు నా కాసక్తి'-యం చెవండు
దెలియు, నట్టి వానినిఁ గర్మ-ఫలము లరయ
బద్ధునిగఁ జేయఁజాలవు-ఫల్గునుండ!



తా. 'సృష్ట్యాది కర్మములు నన్నంటవు. నాకు కర్మఫలమందు కోర్కెలేదు.' ఈ ప్రకారముగా నన్ను దెలిసికొను పురుషుఁడు కర్మఫలముల చేత కట్టు పడడు.

**శ్లో. ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః,**
**కురు కర్మైవ తస్మా త్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్. 15**

గీ. ఇవ్విధంబుగఁ దెలిసి మో-క్షేచ్ఛ తోడ,
బూర్వు లొనరించి యుండిరి-పుడమిఁ గర్మఁ
గాన నీ సనాతనమైన-కర్మఁ జిత్త
శుద్ధి కొఱ కొనరింపుము-సారిది నీవు.

తా. ఈ ప్రకారముగాఁ దెలిసికొని మోక్షాపేక్షగల పూర్వులచేత సైతము, కర్మములు చేయబడినవి. కాబట్టి, నీవు కూడ పూర్వులైన జనకాదుల చేతఁ జేయఁబడిన కర్మమునే చేయుము.

**శ్లో. కిం కర్మ కి మకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః**
**తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. 16**

గీ. కర్మమున కకర్మమునకుఁ-గల విభేద
మునుఁ దెలిసికొనఁ జాలక-బుద్ధిమంతు
లును మిగుల మోహపడుదు ర-ర్జునుఁడ!కానఁ
దీని నిప్పుడు చెప్పెదఁ-దెలిసికొనుము.

తా. కర్మ మననెట్టిది? అకర్మమననెట్టిది? అను నీ విషయమును గూర్చి బుద్ధిమంతులు కూడ మోహమును బొందిరి (పొరబాటుగఁదలచిరి). నీవు వానిని గూర్చి తెలిసి కొనిన యెడల మోక్షమును బొందగలవనెడి యుద్దేశముతో నీకు వానిని (కర్మము, అకర్మమును) గూర్చి విపులముగ జెప్పబోవుచున్నాను.

**శ్లో. కర్మణో హ్యపి బోద్ధవ్యం, బోద్ధవ్యం చ వికర్మణః,**
**అకర్మణ శ్చ బోద్ధవ్యం; గహనా కర్మణోగతిః. 17**

గీ. విహిత కర్మమనంగ, స-విహిత కర్మ
మనఁగను, నకర్మమనఁగను-దనరు త్రివిధ





గతుల వివరంబును దెలియం-గవలయు;*గహ
నంబు చూడంగ నీ విష-యంబు మిగుల.

తా. విహిత కర్మము యొక్క యథార్థమును గూర్చియు, నిషిద్ధకర్మము యొక్క యథార్థమును గూర్చియు, కర్మ సన్న్యాస రూపమైన జ్ఞానమును గూర్చియు బాగుగా దెలిసి కొనవలయును. ఈ కర్మము యొక్కయు, వికర్మము యొక్కయు, అకర్మము యొక్కయు యథాస్థితిని దెలిసికొన శక్యము కాదు.

శ్లో. కర్మ ణ్యకర్మ యః పశ్యేద కర్మణి చ కర్మయః
న బుద్ధి మా న్మనుష్యేషు; సయుక్తః కృత్స్న కర్మకృత్. 18

గీ. ఇంద్రియములు దమ పనుల-నెసఁగి చేయు
చుంట, సాక్షియౌ తన కెపు-డంట కుండు
వాని ఫలములనియు మఱి-తానుఁ గర్తఁ
గాదనియునుఁ దలంచుచుఁ-గరము, కర్మఁ
మొనరుచుచు దాని యం దక-ర్మను, మఱి, య
కర్మయందుఁ గర్మంబునుఁ-గాంచునతఁడు
యోగియును, సర్వకర్మము-లొనరించిన య
తఁడును, జ్ఞానియును, గిరీటి-పుడమియందు.

తా. కర్మయందు కర్మాభావము నెవఁడు తెలిసికొనుచున్నాఁడో, కర్మాభావమునందు కర్మ నెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు మనుష్యులలోన బుద్ధిమంతుఁడును, యోగియు, నెల్ల కర్మల చేసినవాఁడును అగును.

శ్లో. యస్య సర్వే సమారంభాః కామసంకల్ప వర్జితాః,
జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం తమాహుః పండితం బుధాః. 19

గీ. మహి ని నెవఁడు సంకల్ప కా-మములు లేక
కర్మ లొనరించు; నెవ్వని-కర్మ లరయ
జ్ఞాన వహ్ని దగ్ధంబులై-సతత మొప్పు;
నట్టి వానిని బండితుం-డంద్రు పార్థ!

* గహనము = ఎఱుఁగ శక్యము కానిది



తా. ఎవని యొక్క సమస్త కర్మములు కోరికయు, ఉద్దేశమును లేనివిగ నుండునో, మఱియు సకల శుభాశుభ కర్మములు జ్ఞానాగ్నియందుఁ గాల్పఁబడినవో, అట్టి పురుషుఁడు పండితుఁడని చెప్పఁబడుచున్నాడు.

శ్లో. త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః,
కర్మ ణ్యభిప్రవృత్తోఽపి నైవ కించి త్కరోతి సః. 20

గీ. కర్మఫలకాంక్ష విడిచి, సంగంబు లేక,
నిరత సంతృప్తుఁడగుచును, - గరము కర్మ
ముల నొనర్చునతఁడు, గర్మ-ముల నొకించు
కైన ఒనరించునతఁడు గా-డవనియందు.

తా. కర్మఫలాపేక్షను విడిచి, యెల్లప్పుడు విషయములందును, కర్మఫలమునందును కర్తృత్వాభిమాన కాంక్షలు లేక, జ్ఞానముచేత తృప్తుఁడుగను నిరాశ్రయుఁడుగను నుండువాఁడు కర్మమందుఁ బ్రవర్తించినవాఁడైనను, కొంచెమైనను కర్మమును చేయని వాఁడే యగును. అట్టివాఁడు చేసిన కర్మము జ్ఞానాగ్నియందు దగ్ధమగుట వలన, అకర్మమే యగును.

శ్లో. నిరాశీ ర్యత చిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః,
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్. 21

గీ. కోరికలు లేక, మనసును-జేరి నిగ్ర
హించి, సర్వ విషయములం-దించుకైన
సక్తి లేక, శరీరావ-సరములైన
కర్మలొనరించు పురుషుఁ డ-ఘంబుఁ గనడు.

తా. కోరికలు లేనివాఁడును, నిగ్రహింపఁబడిన మనస్సు గల వాఁడును, రాబోవు కాలమందుపయోగించుకొను తలంపుతోనే వస్తువులను సంపాదించి కూడబెట్టని వాఁడును, శరీర పోషణకు మాత్ర మవసరమైన కర్మమునుఁజేయువాఁడును నైన మనుష్యునకు సంసార బంధరూపమైన పాప మంటదు.

శ్లో. యదృచ్ఛా లాభ సంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః,
సమ స్సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబద్ధ్యతే. 22





గీ. పరఁగ యాదృచ్ఛికమగు లా-భంబు చేతఁ
దృప్తుఁడగుచు, ద్వంద్వముల క-తీతుఁడును, వి
మత్సరుఁడును, బ్రాప్తమయిన-మఱియుఁ బ్రాప్తి
గాకయున్న నొక్క విధము-గనె తలంచు.
చుండువాఁడును, నగు పురు-షుండు గట్టఁ
బడడు శారీర కర్మల-వలనఁ బార్థ!

తా. కోరకయే ప్రాప్తించు లాభముచే సంతుష్టుఁడగువాఁడును, శీతోష్ణాది ద్వంద్వముల నతిక్రమించినవాఁడును, మాత్సర్యము లేనివాఁడును, ప్రాప్త్యప్రాప్తులయందు సమ భావము గలవాఁడునునైన పురుషుఁడు కర్మమును చేసినను సంసారము చేత కట్టబడడు.

శ్లో. గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః,
యజ్ఞా యాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే. 23

గీ. సంగరహితుఁడు, ముక్తుండు, - జ్ఞానమందు
నిశ్చలుండైన పురుషుండు - నిర్మల హృద
యంబుతోఁడ నొనర నీశ్వ - రార్పణముగఁ
జేయు కర్మ, ఫలముతో న - శించు సుమ్ము.

తా. అహంకార మమకారములు లేనివాఁడును, సంసార వ్యాపారములందెట్టి ప్రయోజనమును జూడనివాఁడును యజ్ఞార్థము కర్మమును జేయువాఁడును నగు పురుషుని కర్మము ఫలముతో గూడ నశించును.

శ్లో. బ్రహ్మార్పణం, బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్,
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా. 24

గీ. యజ్ఞపాత్రంబు బ్రహ్మము,-హవ్యమరయ
బ్రహ్మము;హవనక్రియయును-బ్రహ్మము;మఱి
కర్త బ్రహ్మంబు; దగ బ్రహ్మ-కర్మమగు స
మాధిచేఁ గల్గుఫలము బ్ర-హ్మంబు, పార్థ!

తా. హోమ సాధనమైన యజ్ఞ పాత్రము బ్రహ్మమే; ఆజ్యాది హోమ ద్రవ్యము బ్రహ్మమే; అగ్నియు బ్రహ్మమే; హోమము చేయునతఁడును (హోత) బ్రహ్మమే;



హోమము చేయుటయును బ్రహ్మమే; బ్రహ్మమనెడి కర్మమందు చిత్తైకాగ్రత చేత పొందదగిన ఫలమును బ్రహ్మమే.

శ్లో. దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే,
బ్రహ్మాగ్నా వపరేయజ్ఞం యజ్ఞే నైవోప జుహ్వతి. 25

గీ. యోగులగు కొందఱు ఫలము-నొందఁగోరి
యమరులకుఁ బ్రీతిగలుగు య-జ్ఞములుసేయు
దురు; మఱియు జ్ఞానులగువారు-కరము కర్మ
హవ్యమును వేల్చుచుంద్రు బ్రహ్మాగ్ని యందు.

తా. కొందఱు కర్మయోగులు ఫలకాంక్షచే దేవతాయజన సాధనమైన యజ్ఞమునే యాచరించుచున్నారు. కాని జ్ఞానులైన సన్యాసులు బ్రహ్మమనెడి యగ్నియందు కర్మమనెడి హోమ ద్రవ్యమును హోమము చేయుచున్నారు.

శ్లో. శ్రోత్రాదీ నింద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి
శబ్దాదీ న్విషయానన్యే పీంద్రియాగ్నిషు జుహ్వతి. 26

గీ. అవనిఁ గొందఱు జ్ఞానేంద్రి-యముల నిగ్ర
హమను నగ్ని యందుఁ దగ హో-మ మొనరింతు;
రితరులగు కొందఱు పొసఁగి-యింద్రియాగ్ని
యందు వేల్చు చుందురు విష-యముల నెసఁగి.

తా. మఱికొందఱు శ్రోత్రాది జ్ఞానేంద్రియములను నిగ్రహమనెడి యగ్ని యందు వేల్చుచున్నారు. మఱికొందఱు శబ్దాది విషయములను ఇంద్రియములనెడి యగ్నియందు వేల్చుచున్నారు.

శ్లో. సర్వా ణీంద్రియ కర్మాణి ప్రాణకర్మాణి చాపరే
ఆత్మ సంయమ యోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే. 27

గీ. ఇంక నితర నైష్ఠికులు జ్ఞా-నేంద్రియముల
విషయములను, గర్మేంద్రియ-విషయములను,
జెలఁగి ప్రాణాది దశవాయు-వుల బహిర్గ
తులను, హోమ మొనర్చుచుం-దురు కరంబు,





జ్ఞాననిష్ఠచేతఁ దగఁ బ్ర-జ్వలితమగుచుఁ
బరఁగు, యింద్రియ నియమన-వహ్నియందు.

తా. మఱికొందఱు జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల యొక్క శబ్దాది వచనాది విషయములను, ప్రాణాది దశవాయువుల యొక్క బహిర్గమనాది కర్మములను జ్ఞానముచేతఁ బ్రజ్వలింపఁజేయఁబడిన యింద్రియ నిగ్రహమనెడి యగ్నియందు వేల్చుచున్నారు.

శ్లో. ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాఽపరే.
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞా శ్చ యత యస్సం శితవ్రతాః. 28

గీ. ద్రవ్య దాన యజ్ఞంబుఁ గొం-దఱు, తపమను
యజ్ఞమును గొందరు, మఱి స్వా-ధ్యాయ యజ్ఞ
మును నితరులు, ప్రాణాయామ మనఁగ నొప్పు
యజ్ఞమును గొందఱు, మఱియుఁ-నన్యులెసఁగి
యింద్రియ నియమ యజ్ఞంబు,-నింకఁ గొంద
ఱు వ్రతయజ్ఞంబు లొనరింతు-రు సతతంబు.

తా. మఱికొందఱు పుణ్యతీర్థాదులందు ద్రవ్యదానమను యజ్ఞకర్మమును జేయుచున్నారు. మఱికొందఱు కృచ్ఛచాంద్రాయణాది తపస్సుచేత శరీరములను గృశింపఁజేయుటయను యజ్ఞ కర్మమును జేయుచున్నారు. కొందఱు ప్రాణాయామాది యోగములనెడి యజ్ఞకర్మమును జేయుచున్నారు. కొందఱు వేదపారాయణ, వేదార్థ పరిజ్ఞానమనెడి యజ్ఞమును జేయుచున్నారు. మఱికొందఱు, ఇంద్రియ నియమన మనెడి యజ్ఞమును జేయుచున్నారు. ఇంక కొందరు కఠినమైన నియమములు గలిగియుండుట యనెడి యజ్ఞమును చేయుచున్నారు.

శ్లో. అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే,
ప్రాణాపాన గతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః. 29

గీ. ప్రాణవాయువున్ గొంద ఱ-పానవాయు
వందు వేల్చుచుందురు, మఱి-కొందఱిల న
పానవాయువును గడఁగి-ప్రాణవాయు
వునను జేర్చి వేల్చెదు; ఱింక-పూరకంబు,



రేచకము, కుంభకములను-త్రివిధములుగ
వెలయుచుండు ప్రాణాయామ-ములనుఁ బరఁగి
ప్రాణవాయుగతి నపాన-వాయుగతిని
నిగ్రహించి వేల్తురు కొంద-*ఱాగ్రహమున.

తా. కొందఱు, అపాన వ్యాపారమందు ప్రాణవాయు వ్యాపారమును, ప్రాణవాయు వ్యాపారమందు అపాన వ్యాపారమును వేల్చుచున్నారు. ప్రాణాయామ పరాయణులైన మఱికొందఱు పూరక రేచక కుంభకములనెడి ప్రాణాయామములందు ప్రాణాపాన వాయుగతులను నిగ్రహించి వేల్చుచున్నారు.

శ్లో. అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి
సర్వేఽప్యేతే యజ్ఞ విదో యజ్ఞ క్షపిత కల్మషాః. 30

గీ. అవనిఁ గొందఱు పరిమితా-హారు లగుచుఁ,
జెలఁగి ప్రాణసంశ్రయవాయు-వులను వశ్య
వాయువులఁజేర్చి వేల్తురు;-పరఁగ యజ్ఞ
విదులయిన వీరలందఱు-ప్రియము తోడ
యజ్ఞముల నొనరిచి తమ-యఘచయమును
నాశ మొనరించు వారు ధ-నంజయుండ!

తా. కొందఱు పరిమితాహారులగుచు, ప్రాణాధారమైన వాయువిశేషములను వశీకృత వాయువులందు వేల్చుచున్నారు. ఈ చెప్పఁబడిన యోగపురుషులందఱు యజ్ఞకర్మము నెఱిఁగిన వారు కావున యజ్ఞకర్మములచేఁ దమ పాపములను నశింపఁ జేయుచున్నారు.

శ్లో. యజ్ఞశిష్టామృత భుజో యాంతి బ్రహ్మ సనాతనమ్,
నాయం లోకోఽస్త్య యజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ! 31

గీ. యజ్ఞశిష్టామృతంబునుఁ – నారగించు
వారు శాశ్వత బ్రహ్మంబుఁ – బడయుదురు; మ
ఱియు నొకరకపు యజ్ఞంబు-నయిన నాచ
రింపని పురుషున కిహలో-కంపు సుఖమె

---

* ఆగ్రహము = ఆసక్తి





గలుగ; దట్టివాఁడు పరలో-క సుఖముఁ బడ
యంగఁజాలఁ డటంచుఁ జె-ప్పంగవలెనె?

తా. అర్జునా! యజ్ఞకర్మములలో మిగిలిన 'అమృత'మనెడి భాగమును భుజించినవారు శాశ్వతమైన బ్రహ్మమును బొందుచున్నారు. పైన జెప్పఁబడిన యజ్ఞకర్మములలో నొక్కదానినైనను జేయని వానికీ లోకమున సుఖము గలుగదు. అట్టివానికి పరలోకమందు సుఖముండదని వేఱె చెప్పవలయునా?

శ్లో. ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే,
కర్మజా న్విద్ధి తాన్ సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే. 32

గీ. పలుతెఱఁగులైన యీ యజ్ఞ-ములు జనులకుఁ
దగ విధింపఁబడినవి వే-దంబువలన;
బరఁగ వీనినిఁ గర్మరూ-పము లటంచు
దెలిసికొను, మివ్విధంబుగఁ-దెలిసికొందు
వేని జన్మబంధమునుండి-విడువఁబడిన
వాఁడ వగుదువు చెలఁగి వి-వ్వచ్చ! నీవు.

తా. ఈ పైన జెప్పఁబడిన పలు తెఱగులైన యజ్ఞములు వేదముచే జెప్పఁబడినవి. ఆ యజ్ఞములన్నియుఁ గర్మముల వలన బుట్టినవని తెలిసికొనుము. ఇట్లు తెలిసికొంటివేని నీవు సంసారబంధము నుండి విముక్తుఁడ వగుదువు.

శ్లో. శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప!
సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే. 33

గీ. ద్రవ్యదాన యజ్ఞముకంటె-ధరణి నరయ
నాత్మ విజ్ఞానరూపమౌ-యజ్ఞము వర
ము మిగుల;మఱియు సర్వ క-ర్మములు పరిస
మాప్తి నొందు జ్ఞానంబు నం-దర్జునుండ!

తా. అర్జునా! ద్రవ్యసాధనమైన యజ్ఞము కంటె జ్ఞాన స్వరూప యజ్ఞము మిక్కిలి శ్రేష్ఠమైనది. సమస్త కర్మములు బ్రహ్మజ్ఞానమందు, అంతర్భూతమగుచున్నవి.

శ్లో. తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః. 34



కం. తెలియుము నీవీ జ్ఞానము
నిల తత్త్వజ్ఞులగు వారి-కెలమిని దండం
బు లిడుచుఁ దెలియని విషయం
బుల నడుగుచును, బరిచార-ము సలుపుచుఁ దగన్.

తా. నీవు తత్త్వవిదులైన జ్ఞాననిష్ఠల వద్దకుఁ జని, సాష్టాంగ నమస్కారములచేతను, తెలియని విషయముల నడుగుట చేతను, సేవ చేయుట చేతను వారిని సంతోష పరచి, యంతట వారు నీ కుపదేశించునట్టి యీ బ్రహ్మజ్ఞానమును దెలిసికొనుము.

శ్లో. యజ్జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాండవ!
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్యస్యాత్మ న్యథోమయి. 35

కం. ధర నీకీజ్ఞానంబునఁ
దిరిగి కలుగనేరదీ మ-తిభ్రమ, మఱియుం
బరమాత్ముఁడనగు నాలో
నరుదుగఁ గాంతువు చరాచ-రాత్మక జగమున్.

తా. అర్జునా! ఈ బ్రహ్మజ్ఞానమును బొందితివేని మరల నీకిట్టి చిత్తవైకల్యము కలుగదు. మఱియు నీ జ్ఞానము చేత చరాచరములైన సమస్త భూతములను నీయందును, తరువాత పరమాత్మ స్వరూపుడనైన నాయందును జూడగలవు.

శ్లో. అపిచేదసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః,
సర్వం జ్ఞానప్లవే నైవ వృజినం సంతరిష్యసి. 36

కం. పాపులలో నీవు మిగులఁ
బాపాత్ముండ వయినను, శు-భంబొనరంగా
నేపుగ జ్ఞానప్లవమునఁ
బాపార్ణవ పారముఁ దగఁ-బడసెదు పార్థా!

తా. సమస్తమైన పాపులకంటెను ఎక్కువ పాపము చేసినవాఁడవైనను, నీవీ జ్ఞానమనెడి తెప్ప చేత పాపమనెడి సముద్రమును దాటగలవు.

శ్లో. యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసా త్కురుతేఽర్జున!
జ్ఞానాగ్ని స్సర్వ కర్మాణి భస్మసా త్కురుతే తథా. 37





గీ. వసుధ నెట్టుల బాగుగాఁ-బ్రజ్వలింపఁ
బడిన యనలంబు గట్టెలన్-భస్మముగ నొ
నర్చు; నటుల జ్ఞానజ్వల-నంబు భస్మ
ముగ నొనర్చు సకల కర్మ-ములను బార్థ!

తా. అర్జునా! బాగుగా మండుచున్న నిప్పు కట్టెల నేవిధముగ భస్మము చేయునో, ఆ విధముగ జ్ఞానమనెడి నిప్పు సమస్త కర్మములను భస్మము చేయును. (ఏ ప్రారబ్ధ కర్మమువలన నీ శరీరము కలిగెనో; ఆ ప్రారబ్ధ కర్మము అనుభవముచేత దప్ప మఱిదేని చేతను నశింపదు. కాని, యీ జన్మమునందు జ్ఞానము కలుగుటకు పూర్వము చేయఁబడిన కర్మములను, అనేక పూర్వ జన్మములందుఁ జేయఁబడిన కర్మములను జ్ఞానము నశింపఁ జేయును. పూర్వ జన్మములందుఁ జేయఁబడిన పుణ్య పాపముల యొక్క సంచయములో, ఏ పుణ్యభాగమును గాని పాపభాగమును గాని యనుభవించుట కొఱకీ జన్మము కలిగెనో, ఆ పుణ్యభాగము లేక పాపభాగము 'ప్రారబ్ధ'మని చెప్పఁబడుచున్నది.)

శ్లో. న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే,
తత్స్వయం యోగ సంసిద్ధః కాలే నాత్మని విందతి. 38

గీ. అరయ జ్ఞానంబుతో సమ-మగు పవిత్ర
వస్తు వెందులేదు జగతిఁ;-బరఁగ యోగ
సిద్ధిచేఁ గాలవశమున- జెందు నరుఁడు
తానె తనయందు జ్ఞానంబు-ధర్మ నిష్ఠ!

తా. ఈ లోకమందు జ్ఞానముతో సమానమైన పవిత్ర పదార్థము మఱెద్దియును లేదు. పురుషుఁడు చాలకాలము యోగాభ్యాస మొనరించుట చేత సిద్ధినిఁ బొంది, ఆ జ్ఞానమును బొందును.

శ్లో. శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరేణాధిగచ్ఛతి. 39

గీ. జ్ఞానమునుఁ బొందఁ గోరిక,-శ్రద్ధ, యింద్రి
య నియమంబు గల పురుషుఁ-డవనిఁ బొందు
జ్ఞానము; మఱియు దానిచే-నరగ నతఁడు
గాంచు నుత్కృష్టమైన మో-క్షంబు సుమ్ము.



తా. శ్రద్ధ గలవాఁడును, జ్ఞానముఁ బొంద నాసక్తుఁడైన వాఁడును, ఇంద్రియ నిగ్రహము గలవాఁడునునైన పురుషుఁడు జ్ఞానమును బొందును. జ్ఞానమును బొందిన పిమ్మట, అతి శీఘ్రముగ నుత్కృష్టమైన చిత్తోపరతిని బొందును. (ఆత్మానందమువలన వెలుపల నుండు విషయములందు మనస్సు, ఉద్వేగము చెందక నిశ్చలతతో నుండుట, ఉపరతి యనఁబడును).

శ్లో. అజ్ఞశ్చా శ్రద్దధాన శ్చ సంశయాత్మా వినశ్యతి,
నాయం లోకోఽస్తి నపరో న సుఖం సంశయాత్మనః. 40

గీ. జ్ఞానహీనుండును, మఱియు-శ్రద్ధలేని
వాఁడు, సంశయములు గల-వాఁడు నాశ
మొందు; సంశయాత్ముఁడు, పార్థ!-పొందఁడు సుఖ
మిహమునందునుఁ బరమునం-దెంచి చూడ.

తా. జ్ఞానములేనివాఁడును, శ్రద్ధలేనివాఁడును, సంశయముతోఁ గూడిన మనస్సు గలవాఁడును చెడిపోవును. సంశయాత్మునకు ఈ లోకమందును పరలోకమందును సుఖము లేదు.

శ్లో. యోగసన్న్యస్త కర్మాణం జ్ఞాన సంఛిన్న సంశయమ్,
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ! 41

గీ. కర్మములఁ దగ విడిచి యో-గంబు చేత,
జ్ఞానము వలనఁ బాసి సం-శయములను, దృ
ఢ మనసు గల పురుషునిఁ, బు-ణ్యమును మఱియు
బాపమును సంటఁజాలవు-ఫల్గునుండ!

తా. అర్జునా! యోగము చేత సర్వకర్మములను విడిచి, జ్ఞానము చేత సందేహములను బోగొట్టుకొని, దృఢమనస్సు గలిగినట్టి పురుషుని పుణ్యపాపకర్మములు బంధింపవు.

శ్లో. తస్మా దజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాఽఽత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత! 42

(జ్ఞాన యోగోనామ చతుర్థాధ్యాయ స్సంపూర్ణమ్)





గీ. కాన యజ్ఞాన సంభూత-మైన నీదు
సంశయంబును ఖండించి-జ్ఞానఛురిక
చేత బరఁగ యోగం బను-ష్ఠింపు; మింక
లేచి రణమొనర్పుము, సవ్య-సాచి! యిపుడు.

తా. అర్జునా! అందువలన, అజ్ఞానము వలనఁ బుట్టి నీబుద్ధి యందున్న యీసంశయమును జ్ఞానమునెడి ఖడ్గముచేత ఛేదించి పరమార్థ జ్ఞానసాధనమైన 'ఆత్మ జ్ఞానయోగము' ననుష్ఠింపుము. లేచి యుద్ధము చేయుము.

(జ్ఞానయోగమనెడి చతుర్థాధ్యాయము సంపూర్ణము)



# పంచమోఽధ్యాయః

## కర్మసన్న్యాసయోగః

అర్జున ఉవాచ :-

శ్లో. సన్న్యాసం కర్మణాం కృష్ణ! పునర్యోగం చ శంససి,
యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్. 1

గీ. కర్మయోగంబు మఱియును-గర్మ సన్న్య
సనముఁ జెప్పినాడవు జనా-ర్దనుఁడ! యీ ద్వ
యంబులోన నేది వరము-యదియ నాకుఁ
జెప్పుమన నర్జునుఁడు, హరి-వలికె నిట్లు.

తా. ఓ కృష్ణా! నీవొకప్పుడు కర్మ సన్న్యాసమును గూర్చియు, మఱియొకప్పుడు కర్మయోగమును గూర్చియుఁ జెప్పుచున్నావు. ఈ రెంటిలో నేది శ్రేష్ఠమో దానిని నాకు నిశ్చయించి చెప్పుము.

శ్రీ భగవాన్ ఉవాచ :-

శ్లో. సన్న్యాసః కర్మయోగ శ్చ నిశ్శ్రేయసకరా వుభౌ,
తయోస్తు కర్మ సన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే. 2

గీ. కర్మ సన్న్యాస కర్మయో-గములు రెండు
నరయ మోక్షదాయకములె; - యైనఁ గర్మ
సన్యసనముకంటెఁ బుడమి-సవ్యసాచి!
కరము శ్రేష్ఠంబు కర్మయో-గంబె సుమ్ము.

తా. కర్మ పరిత్యాగ కర్మానుష్ఠానములను నీరెండును మోక్షమును గలుగజేయునట్టివే; అయినను నా రెంటిలో, కర్మ పరిత్యాగముకంటె కర్మయోగము శ్రేష్ఠమైనది.

శ్లో. జ్ఞేయ స్సనిత్య సన్న్యాసీ యో న ద్వేష్టి నకాంక్షతి,
నిర్ద్వంద్వో హి మహాబాహో! సుఖం బంధత్ప్రముచ్యతే. 3

గీ. ఇల నెవఁడు ద్వేషమును, గోరి-కలును లేక
మెలగుచుండు, నతఁడు కర్మ-ములనుఁ దగనొ





నర్చుచున్నను నిత్య స-న్యాసి; మఱియుఁ
గర్మముల వలన నతఁడు-గట్టువడడు.

తా. ద్వేషరహితుఁడును నిష్కాముఁడును నగు కర్మయోగి కర్మముల నాచరించుచున్నను నిత్య సన్యాసియే. రాగద్వేష రహితుఁడై యతఁ డనాయాసముగా సంసార బంధము నుండి విడువఁబడుచున్నాఁడు.

శ్లో. సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి, న పండితాః,
ఏక మప్యాస్థి తస్సమ్య గుభయో ర్విందతే ఫలమ్. 4

గీ. కర్మసన్యాస కర్మయో-గములు భిన్న
ఫలదము లటంచు మూఢజ-నులు వచింతు;
రైన దేనినిఁ జక్కగా-నభ్యసించి
నను, గలుగు రెండిఁటి ఫలము-లును గిరీటి!

తా. మూఢులు కర్మసన్యాస కర్మయోగములు వేఱ్వేఱు ఫలముల నిచ్చునవని చెప్పుదు రే కాని, జ్ఞానులట్లు చెప్పరు. ఈ రెంటిలో దేనినైనను జక్కగ ననుష్ఠించిన వాఁడు రెంటియొక్క ఫలమును బొందుచున్నాఁడు.

శ్లో. యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగై రపి గమ్యతే,
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి సపశ్యతి. 5

గీ. జ్ఞాన నిష్ఠయై తనరు స-న్యాసమునను
బడయు స్థానంబె, తగ ఫల-వాంఛ లేక
సలుపఁబడు కర్మయోగంబు-వలనఁ బొంద
నగును; గాన నరసి చూడ-నవని నెవఁడు
కర్మ సన్యాస కర్మయో-గముల నొకటి
యని తలంచు, నతఁడె జ్ఞాని-యర్జునుండ!

తా. జ్ఞాననిష్ఠుఁడు సన్యాసముచే నేస్థానముఁ బొందుచున్నాఁడో, కర్మయోగియు భగవ దర్పితముగ ఫలకాంక్ష లేక కర్మముల ననుష్ఠించుట చేతఁ బొందుచున్నాఁడు. సాంఖ్య కర్మ యోగములు రెండును నేకఫలప్రదములని తెలియు నతఁడే పండితుఁడు (జ్ఞాని).



శ్లో. సన్న్యాసస్తు మహాబాహో! దుఃఖ మాప్తుమయోగతః,
యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధి గచ్ఛతి. 6

గీ. కర్మ రహిత సన్యాసంబుఁ - గాంచ దుష్క-
రంబు; వైదిక కర్మాచ-రణము వలనఁ
బురుషుఁడు సరగ జ్ఞానంబుఁ-బొంది బ్రహ్మ
మును బడయుఁగాన, గర్మ మే-లనఁగ నొప్పు.

తా. అర్జునా! కర్మములు విడిచి పరమార్థ సన్యాసమును బొందుట మిక్కిలి కష్టము. ఈశ్వరార్పణ బుద్ధితో ఫలాపేక్ష లేక విహిత కర్మముల నాచరించు మననశీలుఁడు శీఘ్రముగా బ్రహ్మమును బొందును.

శ్లో. యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః,
సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి నలిప్యతే. 7

గీ. చెలఁగి కర్మయోగియగుచు, - చిత్తశుద్ధి,
వశ్యమై మనసు, దగ-వశ్యమైన
యింద్రియములు గలిగియుండి, - యెలమిఁ దాను
సర్వభూతములుగ, మఱి-సర్వభూత
ములును దానుగను గరము-దలఁచు నరుఁడు
గర్మ లొనరింప, వానిచేఁ - గట్టువడడు.

తా. కర్మయోగము ననుష్ఠించువాఁడు పరిశుద్ధమైన మనస్సు గలిగి, ఇంద్రియములను, మనస్సును స్వాధీనములో నుంచుకొని, సర్వభూతములు తానుగఁ దలఁచుచు లోక సంగ్రహము కొరకు కర్మముల నాచరించినను వానిచే నంటఁబడఁడు.

శ్లో. నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యన్, శృణ్వన్, స్పృశన్, జిఘ్ర న్నశ్న న్గచ్ఛన్, స్వపన్, శ్వసన్. 8

శ్లో. ప్రలపన్, విసృజన్, గృహ్ణ న్నున్మిష న్నిమిషన్నపి,
ఇంద్రియా ణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్. 9

గీ. చూచుచును, వినుచును, నడ-చుచును, దినుచు,
వాసనఁ గనుచు, ఁదాకుచుఁ, - బలుకుచు, విష





యముల నంగీకరించుచు, - నక్షియుగము
మూయుచు, దెఱచుచుఁ, బురీష-మూత్రముల వి
డుచుచుఁ, గాలి పీలుచుచు, వి-డుచుచు, నిద్ర
పోవుచును, జ్ఞాని, యింద్రియ-ములు దమ విష
యముల యందుఁ బరఁగుచున్న-వని తలఁచుచుఁ,
గర్త దానుఁ గాదను నమ్మ-కమున మెలఁగు.

తా. యథార్థమును దెలిసిన జ్ఞాని, చూచుచును, వినుచును, స్పృశించుచును, వాసన చూచుచును, భుజించుచును, నడచుచును, నిద్రించుచును, ఉచ్ఛ్వాస నిశ్వాస కార్యములు చేయుచును, పలుకుచును, మూత్రపురీషములను విడుచుచును, శరీరయాత్ర కవసరమగు విషయములను గ్రహించుచును, కన్నులు తెఱచుచును, కన్నులు మూయుచును, ఇంద్రియములు వాని విషయములందుఁ బ్రవర్తించుచున్న వనియు, తానేమియుఁ జేయుట లేదనియు దలచుచు, సమాహితచిత్తుఁడై యుండును.

శ్లో. బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః,
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాంభసా. 10

గీ. మహిని బ్రహ్మార్పణముగఁ గ-ర్మములను ఫల
కాంక్ష లేకఁ జేయు నెవఁడు;-గనగఁ బద్మ
పత్రము జలముచే నంటఁ-బడని యటులఁ
బాపములచేత నతఁ డంటఁ-బడడు సుమ్ము.

తా. ఎవఁడు ఫలాపేక్షలేక, ఈశ్వరార్పణబుద్ధితో కర్మముల ననుష్ఠించునో, వాఁడు, జలముచేత తామరా కంటఁబడనట్లు, పాపములచేత నంటఁబడడు.

శ్లో. కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి,
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽఽత్మ శుద్ధయే. 11

గీ. సారిది కర్మయోగులు చిత్త-శుద్ధి కొఱకు
చెలఁగి బుద్ధి దేహంబుల-చేత, మనసు
చేత, మఱియు నింద్రియముల-చేత నెపుడు
కర్మములను జేయుదురు సం-గంబు లేక.



తా. కర్మయోగులు చిత్తశుద్ధికొఱకు, ఫలకాంక్ష విడిచి, శరీరము చేతను, మనస్సు చేతను, బుద్ధి చేతను, ఇంద్రియముల చేతను, కర్మముల నాచరించుచున్నారు.

శ్లో. యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీమ్,
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే. 12

కం. ఫలమును గాంక్షింపకఁ గ
ర్మలఁ జేయు పురుషుఁడు పొందు-మానసశాంతిన్,
ఫలమును గోరుచుఁ గర్మల
సలుపు నరుఁడు బద్ధుఁడగుట-సంసృతిఁ బరగున్.

తా. సమాహితచిత్తుఁడై ఫలమును గోరక కర్మములను జేయు కర్మయోగి తన కర్మ నిష్ఠవలన మనశ్శాంతిని బొందును. సమాహితచిత్తుఁడు కానివాడు ఫలాపేక్షతో కర్మము లొనరించుట వలన జనన మరణరూపమైన సంసారముచేఁ గట్టబడుచున్నాడు.

శ్లో. సర్వ కర్మాణి మనసా సన్న్యస్యాఽఽస్తే సుఖం వశీ,
నవద్వారే పురే దేహే నైవ కుర్వ న్న కారయన్. 13

గీ. పుడమి నింద్రియ నిగ్రహ-ము గల నరుఁడు
మనసు చేత సమస్త క-ర్మలను విడిచి,
తగ నవద్వారపురమను-తనువు నందుఁ
గర్మములను దాను సలుప-క, మఱి యొరుల
చేతఁ జేయిం పకయు, సుఖో-పేతుఁడగుచు
మెలఁగు చుండును నిరతంబు-కలఁత లేక.

తా. ఇంద్రియ నిగ్రహము గల పురుషుఁడు సమస్త కర్మములను మనస్సుచే విడిచి, తొమ్మిది ద్వారములు గల దేహమను పట్టణమందు, కర్మములను తాను చేయుట లేదనియు, నితరులచే చేయించుట లేదనియు భావము కలిగి, సుఖముగా నుండును.

శ్లో. న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః,
నకర్మఫల సంయోగం స్వభావస్తు ప్రవర్తతే. 14

గీ. ఈశ్వరుండు లోకులకు సృ-ష్టింపలేదు
కర్మములనుఁ, గర్తృత్వంబుఁ,-గర్మముల ఫ

లంబు; నివి యన్నియును స్వభా-వంబు వలనఁ
గలుగుచున్నవటంచును-దెలియవలయు.

తా. ఈశ్వరుడు లోకమందు కర్తృత్వమును గాని, కర్మములను గాని, వాని ఫలములను గాని సృష్టింపలేదు. ఇవి యన్నియును ప్రకృతిమాయచే గలుగుచున్నవి.

శ్లో. నా దత్తే కస్య చిత్పాపం నచైవ సుకృతం విభుః,
అజ్ఞానే నావృతం జ్ఞానం, తేన ముహ్యంతి జంతవః. 15

గీ. నరుల పాపంబుగాని పు-ణ్యంబుఁగాని
యీశ్వరుఁడు గ్రహింపడు; మఱీ-యెంచి చూడ
వారి జ్ఞాన మజ్ఞానంబు-వలన గప్పఁ
బడుటఁ, గర్తల మనుకొంద్రు-భ్రాంతిఁ జెంది.

తా. ఈశ్వరుఁడు పురుషుల యొక్క పాపములను గాని పుణ్యములను గాని గ్రహింపఁడు. వివేక జ్ఞాన మజ్ఞానము చేతఁ గప్పఁబడియుండుట వలన మనుష్యులు వివేక శూన్యులై, భ్రాంతిఁ జెందుచున్నారు.

శ్లో. జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః,
తేషా మాదిత్య వజ్ఞానం ప్రకాశయతి తత్పరమ్. 16

కం. జ్ఞానము వలన నెవరి య
జ్ఞానము నాశమగు, వారి-జ్ఞానం బా య
జ్ఞాన పరంబగు నాత్మను,
భానుని వలె నగపఱచును-భవ్య చరిత్రా!

తా. ఏ పురుషుల యొక్క పరమాత్మ విషయక వివేక జ్ఞానము చేత నా యజ్ఞానము నాశము చేయఁబడుచున్నదో, వారి కా జ్ఞానము, సూర్యునివలె పరమాత్మ తత్త్వమును ప్రకాశింపఁజేయును.

శ్లో. తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః,
గచ్ఛంత్య పునరావృత్తిం జ్ఞాన నిర్ధూత కల్మషాః 17

గీ. జ్ఞానమునను బాపముల నా-శ మొనరించు
వారలు నిరత మా పర-బ్రహ్మమందె



బుద్ధి గలిగియు, నా బ్రహ్మ-మునె నిజస్వ
రూపముగ నెంచుచును, బ్రహ్మ-రూపమందె
యభినివేశము గలిగియు,-నందగలరు
సరగ జన్మంబులేని మో-క్షంబుఁ బార్థ!

తా. జ్ఞానము వలన పాపములన్నియు నశించినవారు, ఆ బ్రహ్మమందే బుద్ధి గలిగియుండి, ఆ పరబ్రహ్మమే యాత్మస్వరూపముగా గలవారలై యుందురు. మఱియు, ఆ పరబ్రహ్మమందే యభినివేశము గలిగియుండి ఆ పరబ్రహ్మమే యుత్కృష్ట గతిగా గలవారలై, పునరావృత్తి రహితమైన మోక్షమును బొందుదురు.

శ్లో. విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వ పాకే చ పండితా స్సమదర్శినః. 18

గీ. వినయమును, విద్యయును గల-విప్రునందు,
ధేనువందు, శునకమందుఁ-ద్విరదమందు,
శ్వానమాంసంబు భక్షించు-వాని యందు,
జ్ఞానులు సమదృష్టి గలిగి-సంచరింత్రు.

తా. జ్ఞానులు విద్యయు వినయమును గలిగిన బ్రాహ్మణుని యందును, గోవు నందును, ఏనుఁగు నందును, కుక్క యందును, కుక్కమాంసమును వండుకొని తిను చండాలుని యందును సమానదృష్టి గలిగియుందురు.

శ్లో. ఇహైవతై ర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః,
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః. 19

గీ. ఎవరి మనసు పొందును సమ-దృష్టి సకల
వస్తువుల యందు, వార లీ-భవము నందె
మోక్షముఁ బడయుదురు; బ్రహ్మ-ము దగ నేక
రూపమును, దోషరహితంబు-నై పరఁగుట
వలన, సమదృష్టి గలవారు-నిలువగలరు
దాని యందు స్థిరంబుగ-ధర్మనిష్ఠ!

తా. ఎవరి మనస్సన్నిటియందు నిశ్చయమైన సమభావము పొందుచున్నదో, వారిచేత





నీ జన్మమునందే మోక్షము పొందఁబడుచున్నది. పరబ్రహ్మ మేకమును దోషరహితము నగుట వలన నా సమదర్శను లా బ్రహ్మమందున్నారు.

శ్లో. న ప్రహృష్యే త్ప్రియం ప్రాప్య, నో ద్విజే త్ప్రాప్య చా ప్రియమ్,
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మ విద్బ్రహ్మణి స్థితః. 20

గీ. మోహవర్జితుఁడై, స్థిర–బుద్ధి గలిగి,
యిష్టమును బొందినపుడు సం–తుష్టిఁ గనక,
నప్రియంబు బొందగ, దుఃఖ–మందకఁ దగఁ
బ్రహ్మమందు నిలిచియుండు–బ్రహ్మవిదుఁడు.

తా. సంశయరహితుఁడును, మోహవర్జితుఁడునైన 'ఆత్మజ్ఞాని' బ్రహ్మమందు నిశ్చలబుద్ధితో నుండి, ప్రియమును బొందినపుడు సంతోషింపకయు, అప్రియమును బొందినపుడు దుఃఖింపకయు నుండును.

శ్లో. బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్,
సబ్రహ్మ యోగ యుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే. 21

గీ. ఆస్థ లేక యింద్రియ విష–యములఁబడసి
యెట్టి సుఖము ననుభవించు;–నట్టి సుఖము
ననుభవించును, బ్రహ్మంబు–నందు నిలిచి
యుండు బ్రహ్మతత్త్వార్థవి–దుండు పార్థ!

తా. శబ్ద స్పర్శ రూప రస గంధము లనెడు పంచేంద్రియ విషయములం దనసక్తుఁడై, ఆత్మయందు సుఖమును బొందువాఁడు పరబ్రహ్మమందు నిర్మలమైన యంతఃకరణము గలవాఁడై, నాశ రహితమైన సుఖమును బొందును.

శ్లో. యేహి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవతే,
ఆద్యంతవంతః కౌంతేయ! న తేషు రమతే బుధః. 22

గీ. పరఁగ విషయేంద్రియంబుల–వలన గలుగు
భోగము లశాశ్వతంబు; లా–భోగములను
విదులు దుఃఖ కారణములు–గఁ దలచి యెపు
డాశపడక యుందురు వాని–ననుభవింప.



తా. అర్జునా! విషయేంద్రియముల వలన బుట్టిన సుఖములు సంయోగ వియోగములు కలవగుట వలన నా సుఖములు దుఃఖ కారణములై యున్నవి. అందువలన తత్త్వజ్ఞుఁడా విషయ భోగములందాసక్తుఁడు కాడు.

శ్లో. శక్నోతీ హైవ యస్సోఢుం ప్రాక్చరీర విమోక్షణాత్,
కామక్రోధోద్భవం వేగం స యుక్త సస్సుఖీ నరః. 23

గీ. ఈ శరీరముండంగనె-యెవఁడు క్రోధ
కామముల వేగము జయింపఁ-గలుగు; నా య
నఘుఁడె యోగియును, బరమా-నంద సుఖము
ననుభవించువాఁడును, గర-మర్జునుండ!

తా. ఎవఁడీ దేహమును విడుచుటకు ముందె, కామక్రోధాదుల యొక్క వేగమును సహింపగలుగునో, ఆ పురుషుఁ డింద్రియ నిగ్రహము గల యోగియు సుఖియునై యున్నాడు.

శ్లో. యోఽంత స్సుఖోఽంతరారామ
స్తథాఽంతర్జ్యోతి రేవ యః,
స యోగీ బ్రహ్మ నిర్వాణం
బ్రహ్మ భూతోఽధి గచ్ఛతి. 24

గీ. ఆత్మభోగి, యాత్మారాముఁ-డాత్మతత్త్వ
వేత్త, యంతఃప్రకాశుఁడు,-ప్రియము నప్రి
యంబు లేని యోగి యెవఁడు; బ్ర-హ్మ స్వరూపుఁ
డగుచు బ్రహ్మ నిర్వాణంబు-నందు నతఁడు.

తా. అంతరాత్మ సుఖ మనుభవించువాఁడును, ఆత్మయం దానంద మనుభవించువాఁడును, అంతఃప్రకాశము గలవాఁడునైన యోగి బ్రహ్మ స్వరూపుఁడై, బ్రహ్మానందమును బొందుచున్నాడు.

శ్లో. లభంతే బ్రహ్మ నిర్వాణ మృషయః క్షీణ కల్మషాః,
ఛిన్న ద్వైధా యతాత్మాన స్సర్వభూత హితే రతాః. 25

గీ. అఘ రహితులును, నిస్సంశ-యాత్మ, లింద్రి
య నియమయుతులు, సర్వ భూ-తాను కంప





వహులును, నగు ఋషులు పర–బ్రహ్మ తత్త్వ
విదులగుచుఁ బొందుదురు మోక్ష–పదవిఁ బార్థ!

తా. పాపరహితులును, సంశయరహితులును, నిగ్రహింపఁబడిన చిత్తములు గలవారును, సర్వభూతముల యొక్క శ్రేయస్సునందాసక్తులునైన ఋషులు (జ్ఞాన నిష్ఠులు) మోక్షమును బొందుదురు.

శ్లో. కామక్రోధ వియుక్తానాం యతీనాం యత చేతసామ్,
అభితో బ్రహ్మ నిర్వాణం వర్తతే విదితాత్మనామ్. 26

గీ. కనఁగఁ గ్రోధ కామ రహితు–లును, యతులును,
జిత్తశుద్ధిని బడసిన–శిష్టజనులు
నైన యాత్మతత్త్వవిదుల–కరయ నుండు
నంతటను బ్రహ్మనిర్వాణ–మనఘచరిత!

తా. కామక్రోధ వర్జితులును, మనో నిగ్రహము గలవారును, ఆత్మ స్వరూపమును దెలిసినవారును నైన సన్యాసులకు బ్రహ్మానందము (మోక్షసుఖము) ఇహపరముల యందంతటను నున్నది.

శ్లో. స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాం శ్చక్షు శ్చైవాన్తరే భ్రువోః,
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతర చారిణౌ. 27

శ్లో. యతేంద్రియ మనోబుద్ధి ర్ముని ర్మోక్ష పరాయణః
విగతేచ్ఛా భయ క్రోధో య స్సదా ముక్త ఏవ సః. 28

గీ. అరయ శబ్దాది విషయంబు–లందుఁ జొర
నీక మనసునుఁ దగ నిగ్ర–హించి, భ్రూ యు
గంబు మధ్య దృష్టి నిలిపి,–కడఁగి ఘ్రాణ
పథము నందుఁ బ్రాణాపాన–వాయువులను
సమగమన యుతోచ్ఛ్వాస ని–శ్వాసములుగఁ
జేసి, మనసు నింద్రియముల – జిత్తమును వ
శ మొనరించి, క్రోధ భయ కా–మముల విడిచి,
మోక్షమును గోరు పురుషుండె–ముక్తుఁ డవని.



తా. శ్రోత్రాదీంద్రియముల చేత బుద్ధియందుఁ బ్రవేశింపఁజేయబడిన శబ్దాది విషయములను బైటికి ద్రోసివైచి, దృష్టిని కనుబొమల యొక్క మధ్యమందుంచి ప్రాణాపాన వాయువులను నాసికలోపల సమమైన యుచ్ఛ్వాసనిశ్వాసములుగ సంచరించునటుల జేసి, నియమింపబడిన యింద్రియ మనోబుద్ధులు గలిగి, ఇచ్ఛా భయ క్రోధములను విడిచి, మోక్షాసక్తుఁడై, మననశీలుఁడుగనుండు పురుషుఁడు నిత్యముక్తుఁడు.

శ్లో. భోక్తారం యజ్ఞ తపసాం సర్వలోక మహేశ్వరమ్,
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి. 29

(కర్మ సన్న్యాస యోగోనామపంచమోధ్యాయ స్సంపూర్ణమ్)

గీ. ఏను యజ్ఞతపముల గ్ర-హింతుననియు,
సర్వ భువనములకును నీ-శ్వరుఁడ ననియు,
నఖిల భూతములకుఁ దగ-నాశ్రయుఁడ న
నియుఁ దెలియువాఁడు ముక్తి బ-డయును బార్థ!

తా. నేను యజ్ఞ తపస్సుల యొక్క భోక్తననియు, సమస్తలోకములయొక్క నియామకుడ ననియు, సర్వ భూతముల యొక్క ఉపకారిననియుఁ దెలిసికొను పురుషుఁడు మోక్షమును బొందును.

(కర్మ సన్న్యాస యోగమనెడి పంచమాధ్యాయము సంపూర్ణము.)





# షష్ఠోఽధ్యాయః
## ఆత్మ సంయమయోగః

శ్రీ భగవాన్ ఉవాచ :-

శ్లో. అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః,
న సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్ని ర్నచా క్రియః. 1

గీ. వాసుదేవుఁ డిట్లు పలికెఁ-బార్థు తోడ
ప్రతిఫలాపేక్ష లేకఁ గ-ర్మలను జేయు
వాఁడు సన్యాసియును, జిత్త-పారిశుద్ధ్య
ముగల వాఁడును, శాస్త్రోక్త-ముగ దలకొని
వహ్ని దానాదికములను-వదలునట్టి
యోగికంటె నధికుఁడును,-నుర్వియందు.

తా. ఏ పురుషుఁడు కర్మఫలమును గోరక విహిత కర్మములను జేయునో, ఆ పురుషుఁడు కర్మ పరిత్యాగము చేసిన సన్యాసియు, చిత్తశుద్ధిగల యోగియునై యున్నాడు. మఱియు, అగ్నులు లేనివాఁడును, తపోదానాది క్రియలు లేనివాఁడును కాడు.

శ్లో. యం సన్న్యాస ఇతి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ!
న హ్యసన్న్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన. 2

గీ. అవనిఁ దేనిని సన్యాస-మందురు బుధు
లెంచు మది కర్మయోగంబె-యంచు మదినిఁ,
గడఁగి సంకల్పము విడక-కర్మములను
సలుపు పురుషుండు యోగి కా-జాల డరయ.

తా. అర్జునా! ఏది సన్యాసమని చెప్పఁబడుచున్నదో అదియే కర్మయోగమని తెలిసికొనుము. సంకల్పమును విడువనివాఁడు కర్మయోగి కాడు గదా!

శ్లో. ఆరురుక్షోర్మునేర్యోగం కర్మకారణ ముచ్యతే
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే. 3

గీ. జ్ఞానయోగంబుఁ బొందని-చ్ఛ గలుగు మును
లకు ఫలాపేక్ష లేని క-ర్మ, కరణంబు;



మఱియు, జ్ఞానంబు గలిగిన-మౌనులకును
సర్వ కర్మ నివృత్తియే-సాధనంబు.

తా. జ్ఞానయోగమును బొందఁగోరు మునికి ఫలకాంక్షా రహితమైన కర్మాచరణము సాధనమై యున్నది. జ్ఞానముఁ బొందిన తరువాత, ఆ మునికే సర్వకర్మ నివృత్తి సాధనముగ నుండును.

శ్లో. యదాహి నేంద్రియార్థేషు నకర్మ స్వనుషజ్జతే,
సర్వసంకల్ప సన్న్యాసీ యోగారూఢ స్త దోచ్యతే. 4

గీ. అరయ శబ్దాది విషయంబు-లందు, మఱియు
సర్వ కర్మంబులందు, నా-సక్తిఁ బొంద
క మెలఁగు నతఁడు సర్వసం-కల్ప వర్జి
తుఁడును, జ్ఞాన విజ్ఞానయు-తుఁడును, బార్థ!

తా. ఎప్పుడు పురుషుఁ డింద్రియ విషయములైన శబ్ద స్పర్శ రూప రస గంధ విషయములందును సర్వకర్మములందును ఆసక్తుడు గాక యుండునో, అప్పుడతఁడు సమస్త సంకల్పములను త్యజించినట్టివాఁడనియు, జ్ఞానమును బొందినవాఁడనియుఁ జెప్పఁబడును.

శ్లో. ఉద్ధరే దాత్మనాత్మానం; నాత్మాన మవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపురాత్మనః. 5

గీ. చేరి, యాశలేని మనసు-చేతఁ దన్నుఁ
దానె యుద్ధరించుకొనంగఁ-దగును నరుఁడు,
తన్నుఁ దానె చెఱుపు కొన-దగదు; తనకు
బంధువు తన మనసే పగ-వాఁడు నదియె.

తా. పురుషుఁడు కోర్కెలేని మనస్సుచేత, తన్ను దా నుద్ధరించుకొనవలెను. తన్ను దాను చెఱుపుకొనరాదు. తనకు వశీకృతమైన తన మనస్సే బంధువు; వశీకృతము కాని తన మనస్సే శత్రువు.

శ్లో. బంధు రాత్మాత్మన స్తస్య యేనాత్మై వాత్మనా జితః,
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్. 6





గీ. ఎవ్వఁడు మనస్సు చేతఁ దే-హేంద్రియంబు
లను జయించు, నవ్వానికిఁ-దన మనస్సె
యాప్తుఁడగును; నింద్రియ విజ-యంబులేని
వానికి దన మనసె పగ-వాఁడు దలప.

తా. ఎవఁడు తన మనస్సు చేత నింద్రియములను జయించునో, అట్టివానికి తన మనస్సు బంధువు వలె నుపకారము చేయును. మనస్సుచే నింద్రియములను జయింపక వానికి దాసుఁడుగ నుండునో వానికి తన మనస్సు శత్రువువలె నపకారము చేయును.

**శ్లో. జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః,**
**శీతోష్ణ సుఖ దుఃఖేషు తథా మానావమానయోః.** 7

గీ. వశియగుచు నుపశాంతినిఁ-బరఁగు పూరు
షుండు, పరమాత్మ తానెయై-సుఖమునందు,
దుఃఖమందును, నుష్ణమం-దుఁ, చలియందు
నటుల మానావమానము-లందు గరము
సమతఁ గలిగి, సుఖంబుగ-సంచరించు.

తా. స్వాధీనములో నున్న మనస్సు గలిగి, ఉపశాంతిని బొందిన పురుషుఁడు పరమాత్మ భావముతో నుండి, శీతోష్ణాది సుఖదుఃఖములందు మానావమానములందును సమబుద్ధితోఁ బ్రవర్తించును.

**శ్లో. జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః,**
**యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మ కాంచనః.** 8

గీ. *జ్ఞాన విజ్ఞానములచేతఁ-జాల దృప్త
మైన మనసు గలిగి సముఁ-డగుచు, ఇంద్రి
య నియమనముఁబడసి, హిర-ణ్యమును, మట్టి
గడ్డను, శిలను సమముగఁ-గాంచుచుండు
యోగి, యాత్మభావంబుచే-నొప్పుచుండు.

---

*జ్ఞానము=శాస్త్రము చదువుట వలన గలుగు జ్ఞానము; విజ్ఞానము=ఆత్మానుభవ జ్ఞానము



తా. జ్ఞాన విజ్ఞానములచేత మిక్కిలి తృప్తిఁ జెందిన మనస్సు గల వాఁడును, ఇంద్రియ నిగ్రహము గలవాఁడును, మట్టిగడ్డను ఱాతిని బంగారమును సమానముగఁ జూచువాఁడును నైన యోగి, ఆత్మానుభవము గలవాఁడని చెప్పఁబడుచున్నాడు.

శ్లో. సుహృన్మిత్రా ర్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బంధుషు,
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే. 9

గీ. ఎలమి నుపకారులందు, స్నే-హితుల యందు,
వైరులందు, తటస్థభా-వమున నుండు
జనులయందు, మధ్యస్థులౌ-జనులయందు,
మఱియుఁ బాపాత్ములందు స-మముగ మెలఁగు
నతని బుధులు యోగారూఢు-డంద్రు పార్థ!

తా. ఉపకారము చేసినవారి యందును, స్నేహితులయందును, శత్రువులందును, తటస్థముగ నుండు వారి యందును, మధ్యస్థుల యందును, తనపై ద్వేషము గల వారి యందును, బంధువులయందును, సత్పురుషులయందును, నిషిద్ధ కార్యములు చేయు పాపాత్ములయందును, సమబుద్ధి గలిగియుండువాఁడు 'యోగారూఢు'డని చెప్పఁబడుచున్నాడు.

శ్లో. యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః,
ఏకాకీ యత చిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః 10

గీ. ఆత్మచింతన మొనరించు-నతఁడు నిశ్చ
యంబుగల మనస్సు గలిగి,-యాశయును, ప
రిగ్రహమును వదలి, యొంట-రిగ వసించి
మనసు నిగ్రహింపవలెను-మొనసి పార్థ!

తా. ఆత్మధ్యాన మొనరించు యోగి, సహాయము లేనివాఁడుగను, నియమింపఁబడిన మనో దేహములు కలవాఁడుగను, ఆశలేనివాడుగను, వస్తువులను గ్రహించి దాచియుంచని వాడుగను నుండి, యొంటరిగ రహస్య స్థలమందు నివసించుచు మనస్సును నిగ్రహింపవలెను.

శ్లో. శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః,
నాత్యుచ్ఛ్రితం నాతి నీచం చేలాజిన కుశోత్తరమ్. 11





గీ. మిగులఁ బల్లంబుగను లేక,-మెరకగాను
లేక సమమగు శుభ్రస్థ-లిని, గుశాస
నంబును బిదపఁ గృష్ణాజి-నంబు, దాని
పైని వస్త్రాసనంబును-బఱచవలయు.

తా. పరిశుద్ధమైన ప్రదేశమందు, మిక్కిలి యెత్తుకానట్టియు, మిక్కిలి కుఱుచ కానట్టియు, స్థిరమైనట్టియు నొక యాసనమేర్పరచుకొని, దానిపైన మొదట దర్భాసనము నుంచి దానిపైన కృష్ణాజినమును, దానిపైన వస్త్రాసనమును నుంచవలెను.

శ్లో. తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియ క్రియః,
ఉపవిశ్యాఽసనే యుంజ్యా ద్యోగ మాత్మ విశుద్ధయే. 12

గీ. ఆ స్థిరాసనముపయి, న-భ్యాసకుండు
కూరుచుండి, మనస్సునుఁ-జేరి నిశ్చ
లముగ నొనరించి, చిత్తేంద్రి-యముల నిగ్ర
హించి, యోగసాధక మొన-రింపవలయు.

తా. ఆ యాసనమందు కూర్చుండి మనస్సును నిశ్చల మొనరించి, ఇంద్రియ వ్యాపారము లను నిగ్రహించి యోగాభ్యాసకుఁడు మనశ్శుద్ధికొఱకు యోగము నభ్యసింపవలెను.

శ్లో. సమం కాయ శిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం ధారయ న్నచలం స్థిరమ్. 13

గీ. దేహమును, మెడనుఁ, దలను-స్థిరముగను, స
మానముగను నిలిపి, స్థిర-మనసు గలిగి
దిక్కులు గనక, దృష్టిని-ముక్కుకొనను
నిలిపి, పూన్కితో యోగంబు-సలుపవలయు.

తా. (యోగాభ్యాసకుఁడు) తన దేహమును తలను కంఠమును నిలువుగ నిలిపి యుంచి, కదలక యుండి, దిక్కులు చూడక తన నాసికాగ్రముమీద దృష్టిని నిలుపవలెను.

శ్లో. ప్రశాంతాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః,
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. 14



గీ. నిలుకడ గలిగిన మనస్సు-గలిగి, భయర
హితుఁడగుచు; బ్రహ్మచర్య సు-వ్రతము గలిగి,
మనసు నాయందుఁ జేరిచి-మత్పరుఁడయి,
నన్నె యుత్కృష్టునిగ మది-నెన్నవలయు.

తా. మఱియు నతఁడు మిక్కిలి శాంతమైన మనస్సు గలిగి, భయరహితుఁడై, బ్రహ్మచర్య వ్రతమందుండి, మనస్సును నిశ్చలము చేసి నాయందు నిలిపి, నన్నే ధ్యానించుచు సమాహిత చిత్తుఁడై యుండవలెను.

శ్లో. యుంజ న్నేవం సదాఽఽత్మానం యోగీ నియత మానసః,
శాంతిం నిర్వాణ పరమాం మత్సంస్థా మధిగచ్ఛతి. 15

గీ. నియత మానసుండగు యోగి-నిచ్చలుఁ దన
మనసును వశము నందుంచు-కొనుచు, నా య
ధీనమందుండు నుత్కృష్ట-మైన మోక్ష
సుఖమును నిచటె యనుభవిం-చును గిరీటి!

తా. నిశ్చల మనస్కుఁడైన యోగాభ్యాసకుఁ డీ విధముగ నెల్లప్పుడు మనస్సును సమాధాన మందుంచుకొన్నవాడై, సర్వోత్కృష్టమును నా స్వాధీనములో నుండు నదియు నైన సంసారోపరతి (మోక్షము)ను బొందుచున్నాడు.

శ్లో. నా త్యశ్నతస్తు యోగోఽస్తి; న చైకాంత మనశ్నతః,
న చాతి స్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున! 16

గీ. అమితముగ భుజించు పురుషుఁ-డసలె తినని
వాఁడు, మిగుల నిదురపోవు-వాఁడు, నిదుర
లేనివాఁడును, బొందంగ-లేడు యోగ
మెప్పుడును; మితత్వ మవశ్య-మిందుఁ బార్థ!

తా. అర్జునా! యోగము అపరిమితముగా భుజించువానికిని, కొంచెమైనను తిననివానికిని, మిక్కిలి నిద్రపోవువానికిని, నిద్రపోనివానికిని సిద్ధింపదు.

శ్లో. యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మ సు,
యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా. 17





కం. మితముగ భుజియించుటయును,
మిత సంచారంబునుఁ, దగ-మిత కర్మంబున్
మిత జాగర నిద్రలు గల
యతఁడీ దుఃఖహర యోగ-మందును జగతిన్.

తా. యోగము మితాహారము, మిత సంచారము, మిత కర్మము, మిత నిద్ర, మిత జాగరణము గలిగియున్న పురుషుని యొక్క సంసార దుఃఖమును బోగొట్టును.

శ్లో. యదా వినియతం చిత్త మాత్మ న్యేవావతిష్ఠతే,
నిస్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా. 18

గీ. ఎప్పుడెవఁడు మనసు నిగ్ర-హించి, యాత్మ
యందుఁ దగ లయ మొనరించు;-నప్పుడతఁడు
సర్వ విషయములందు, వాం-ఛా వివర్జి
తుఁడగు యోగియని నుడువ-బడును బార్థ!

తా. ఎవని మనస్సు దృఢముగా నిగ్రహింపఁబడి నిశ్చలముగ నాత్మయందే నిలిచి యుండునో, ఆ పురుషుఁ డెట్టి కోర్కెలు లేని యోగియని చెప్పఁబడును.

శ్లో. యథా దీపో నివాతస్థో నేంగతే సోప మాస్మృతా,
యోగినో యత చిత్తస్య యుంజతో యోగమాత్మనః. 19

గీ. వాయురహిత స్థలమున దీ-పం బెటుల చ
లింప దట్లు మనస్సు చ-లింపకుండ
నుండ వలె నాత్మ సంయమ-యోగ మభ్య
సించుచు మెలఁగెడు పురుష-సింహమునకు.

తా. గాలిలేని స్థలమందున్న దీపము చలింపక నొకేవిధముగ నుండునటుల, యోగము నభ్యసించుచున్న యోగి యొక్క మనస్సు చలింపకుండవలెను.

శ్లో. యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
యత్ర చైవాత్మనాఽఽత్మానం పశ్య న్నాత్మని తుష్యతి. 20

శ్లో. సుఖ మాత్యంతికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్,
వేత్తి యత్ర; న చైవాయం స్థిత శ్చలతి తత్త్వతః. 21



శ్లో. యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః,
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే. 22

శ్లో. తం విద్యా ద్దుఃఖ సంయోగ వియోగం యోగసంజ్ఞితమ్,
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణ చేతసా. 23

గీ. మనసు సంయమనంబు వ-లన నిలుకడఁ
జెంది యుపరతినిఁ బడయు-నెందు; మనసు
చేత నెందు బ్రహ్మమును ద-ర్శించుచుఁ దన
యందె సతత మానందముఁ-బొందుచుండు;
నెందు నింద్రియములచే గ్ర-హింపఁబడని
దియును బుద్ధిచే దెలియున-దియును నైన
సుఖము గలుగు; నెందు నరుఁడు-చొక్కి బ్రహ్మ
దర్శనానందమునను గ-దలక యుండు;
నెందు నాత్మలాభంబును-బొంది తలఁప
డన్యలాభంబును, మఱియు-నాత్మతత్త్వ
మందెయుండి వికారంబుఁ-జెందకుండు
నెట్టి దుఃఖముల వలన; - నట్టి దుఃఖ
ములు గలుగుటయును మఱియు-బోవుటయును
లేని యీ యవస్థఁ దగఁ దె-లియఁగవలయు
యోగమని పార్థ! మఱియు నీ-యోగము, నను
మాన దుఃఖ వివర్జిత-మైన మనసు
చేత నభ్యసింపఁగ దగ-సిద్ధి గలుగు.

తా. ఏ యవస్థయందు మనస్సు నిగ్రహింపఁబడినదై, ఉపరతిని బొందుచున్నదో; ఏ యవస్థ యందింద్రియ గోచరము కానట్టియు, బుద్ధిచేత గ్రహింపదగినట్టియు, అనంతమైనట్టియు బ్రహ్మానంద మనుభవింపఁబడుచున్నదో; యేయవస్థయందు పరమాత్మ స్వరూప బ్రహ్మానందము నిశ్చలముగ నుండునో, యే యవస్థయందాత్మ లాభముఁ బొంది దానికంటె నితరమైన యే లాభము నధికముగఁ దలంపఁబడదో, యే యవస్థయందు మనఃస్సాత్మ తత్త్వమందుండి, యధికమైన దుఃఖము చేతను గూడ చలింపఁబడదో, అట్టి దుఃఖరహితమైన యవస్థను యోగమను పేరుగల





దానినిగా దెలియవలెను. ఆ యోగమును నిస్సంశయమైనట్టియు, దుఃఖము బొందనట్టియు మనస్సుచే నభ్యసింపవలెను.

శ్లో. సంకల్ప ప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః,
మనసై వేంద్రియ గ్రామం వినియమ్య సమంతతః. 24

గీ. పూని సంకల్ప సంభవం-బులగు కోరి
కలను నిశ్శేషముగ వీడి-కలఁచు నింద్రి
యములను మనస్సుచే నిగ్ర-హ మొనరించి,
యోగ మాచరింపఁగ సిద్ధి-వేగఁ గలుగు.

తా. సంకల్పము వలనఁ బుట్టిన సమస్తమైన కోరికలను నిశ్శేషముగా విడిచి, మనస్సుచేత నింద్రియములను నిగ్రహించి యోగము నభ్యసింపవలెను.

శ్లో. శనై శ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతి గృహీతయా,
ఆత్మ సంస్థం మనఃకృత్వా న కించి దపి చింతయేత్. 25

గీ. బుద్ధి బలముచే మనస్సును-బొసఁగి యాత్మ
లోనఁ జొప్పించి, మెల్లగ-మానసోప
రతిని బొందవలయు; మఱి-యితర విషయ
ములను గూర్చి కొంచెమయినఁ - దలంపఁదగదు.

తా. బుద్ధిబలము చేత మనస్సును నాత్మయందుఁ జేర్చి, మెల్లమెల్లగా నుపరతిని బొందవలెను. కొంచెమైనను అన్య విషయములను గూర్చి చింతింపఁ గూడదు.

శ్లో. యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్,
తత స్తతో నియమ్యైత దాత్మ న్యేవ వశం న యేత్. 26

గీ. చంచలమయి నిలుకడఁగాం-చని మనస్సు
యింద్రియ విషయముల యందు-నెపుడు సంచ
రించు; నపుడు దానిని మఱ-లించి, యాత్మ
యందు నిలుపంగ వలయు బ్ర-యత్నమునను.

తా. చంచలమైన మనస్సు యేయే విషయములయందు సంచరించుచుండునో, ఆయా విషయములనుండి దానిని మరల్చి ఆత్మయంధుండునట్లు వశము చేసికొనవలెను.



శ్లో. ప్రశాంత మనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్,
ఉపైతి శాంతరజసం బ్రహ్మ భూత మకల్మషమ్. 27

గీ. శాంతి బొందిన మానస-మంతముఁ బడ
సిన రజోగుణంబు గలిగి, - యనఘుఁడు, మఱి
బ్రహ్మభూతుండునగు యోగి- పడయఁగలుగు
ను బరమానంద సుఖ మర్జు-నుండ! కరము.

తా. శాంతిఁ బొందిన మనస్సు గలిగినట్టియు, నాశ మొందిన రజోగుణము గలిగి నట్టియు, జీవన్ముక్తుఁడై నట్టియు, పాపరహితుఁడై నట్టియు నీ యోగిని శ్రేష్ఠమైన సుఖము (బ్రహ్మానందము) పొందును.

శ్లో. యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీ విగత కల్మషః,
సుఖేన బ్రహ్మ సంపర్శ మత్యంతం సుఖ మశ్నుతే. 28

గీ. ఇట్లెపుడు మనస్సును ని(గ-హించి, విగత
పాపుఁడగు యోగి లెస్సగా-బ్రహ్మ దర్శ
నంబుఁ బడయుచు, శ్రేష్ఠమై-న పరమాత్మ
విషయ సుఖము నందగలడు-పెల్లుగాను.

తా. ఈ ప్రకారముగ నెల్లప్పుడును మనస్సును వశము చేసికొనినట్టియు, పాపములు నశించినట్టియు జ్ఞాని సులభముగా పరమాత్మను జూచుచున్న వాఁడగుచు, బ్రహ్మానందము ననుభవించుచున్నాడు.

శ్లో. సర్వ భూతస్థ మాత్మానం సర్వభూతాని చాఽత్మని,
ఈక్షతే యోగ యుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. 29

గీ. సర్వభూతంబులందును-సమత తోడ
నుండి యోగంబుతో నొప్పు-చుండు నతఁడు
గాంచును సకల భూతని-కరమును దన
యందుఁ; దన్ను నా భూతంబు-లందు నెపుడు.

తా. సర్వభూతములందు సమదృష్టిగల పురుషుఁడు యోగముతో గూడిన యంతఃకరణము గలవాఁడై, సర్వభూతములందున్న తన్ను, తన యందున్న సర్వభూతములను





జూచుచుండును.

శ్లో. యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. 30

గీ. ఎవఁడు సకల భూతములయం-దెపుడు నన్ను,
మఱియు నాయందు గరము స-మస్త భూత
నికరమునుఁ జూచు; నతనికి-నేను, నాక
తఁడును, నుందు మెదుటఁ గనఁ-బడుచు నెపుడు.

తా. సర్వభూతములందు నన్ను, నాయందు సర్వభూతములను జూచునట్టి పురుషునకు నేను ప్రత్యక్ష స్వరూపుడనుగ నుందును; అతడును నాకు ప్రత్యక్ష స్వరూపుఁడుగ నుండును.

శ్లో. సర్వ భూత స్థితం యో మాం భజత్యేకత్వ మాస్థితః,
సర్వథా వర్తమానోఽపి సయోగీ మయి వర్తతే. 31

గీ. ఎలమి నద్వైతుఁడుగ నుండి-యెపుడు సర్వ
భూతగతుఁడనయిన నన్నుఁ-బూజసేయు
వాఁడు, పలుతెఱఁగులయిన-వర్తనంబు
గలిగియున్నను, నాయందె-మెలఁగు చుండు.

తా. ఏ యోగి, అభేదభావము కలవాఁడై సర్వభూతము లందున్న నన్ను సేవించుచుండునో, ఆ యోగి యనేక విధములుగ వర్తించువాఁడై నను, నా యందే వర్తించుచున్న వాడని తెలియుము. (అభేద భావమనగా, అద్వైత భావము).

శ్లో. ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున!
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమోమతః. 32

గీ. కరము సర్వభూత సుఖ దుః-ఖములనుఁ దన
విగఁ దలచుచు నెపుడు సమ-ముగ మెలగు
నతఁడు జ్ఞానియు, నాకు స-మ్మతుఁడును, మరి,
జ్ఞానులందుత్తముండును-నౌను పార్థ!

తా. అర్జునా! సర్వభూతముల యొక్క సుఖదుఃఖములను తనవిగా భావించునట్టి జ్ఞాని



శ్రేష్ఠుఁడని యెంచఁబడుచున్నాడు.

అర్జున ఉవాచ :-

శ్లో. యోఽయం యోగ స్త్వయా ప్రోక్త స్సామ్యేన మధుసూదన!
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్. 33

గీ. పార్థుఁడంత ననియె భగ-వంతు తోడ,
"నీసమత్వ యోగంబుఁ గ్ర-హింపఁ జాల
నైతి; మనసు తిరము లేని-దగుట, నేను
చలన వర్జితావస్థను-దెలియఁజాల.

తా. ఓ కృష్ణా! నీచేఁ జెప్పఁబడిన 'సమత్వ' మనెడి యీ యోగము యొక్క స్థిరస్థితిని, చంచలమతిని నేను దెలియజాలను.

శ్లో. చంచలం హి మనః కృష్ణ! ప్రమాథి బలవద్దృఢమ్,
తస్యాహం నిగ్రహం మన్యే, వాయోరివ సుదుష్కరమ్. 34

కం. మిక్కిలి చంచలము మనసు,
చిక్కులు వెట్టును వశంబు-చెందని దగుటన్,
అక్కట! మనసును నిలుపుట
*యక్కజమని, వాయు నిగ్రహమువలె, నెంతున్."

తా. కృష్ణా! మనస్సు చంచలమైనదియును, కలఁత పెట్టునదియును, నిగ్రహింపఁ శక్యము కానిదియును గదా! నేనిట్టి మనస్సును నిగ్రహించుట వాయువును నిగ్రహించుటవలెఁ జేయ నశక్యమైనదని తలఁచుచున్నాను.

శ్రీ భగవాన్ ఉవాచ :-

శ్లో. అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహమ్ చలమ్,
అభ్యాసేన తు కౌంతేయ! వైరాగ్యేణ చ గృహ్యతే. 35

గీ. అంత నతని కిట్లనియె ము-రాంతకుండు,
"మనసు చంచలంబును, నియ-మనము సేయ
దుష్కరము ననఁ గొంకులే-దు, నర! కాని

* అక్కజము = సాధ్యము కానిది





వశ్యమగును సు మ్మభ్యాస-బలము చేత.

తా. ఓ యర్జునా! మనస్సు చంచలమైనదనియును, నిగ్రహింప శక్యము కానిదనియును జెప్పుటకు సంశయమెంత మాత్రమును లేదు. అయినను, ఆత్మానుసంధానము చేతను వైరాగ్యము చేతను దానిని స్వాధీనము చేసికొనవచ్చును (ప్రాపంచిక విషయములందు దోషత్వ మారోపించి వానియందు హేయత్వ బుద్ధిని బొందుట 'వైరాగ్య' మనఁబడును.)

శ్లో. అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః. 36

గీ. మనసు స్వాధీనము లేని-మానవుండు
పొందఁజాల డీ యోగంబు-భువిని; మనసుఁ
దన వశమునందుగల పురు-షునకుఁ దగిన
యత్నమునను లభ్యమగున-టంచుఁ దలతు."

తా. మనో నిగ్రహము లేని వాఁడీ యోగమును బొందఁజాలడు. మనస్సు స్వాధీనమందుగల వాఁడు తగిన యుపాయముల చేత నీ యోగము నభ్యసించి 'యోగి' కాగలడని నా యభిప్రాయము.

అర్జున ఉవాచ :-

శ్లో. అయతిః శ్రద్ధయోపేతో యోగా చ్చలిత మానసః,
అప్రాప్య యోగ సం సిద్ధిం కాం గతిం కృష్ణ! గచ్ఛతి. 37

గీ. అంత నిట్లడిగెను హరి - నర్జునుండు,
"యోగమందు శ్రద్ధ గలిగి-యుండియు, నియ
యనము లేమిఁ, జంచలమైన-మనసు కతన
సిద్ధిఁ బొందకుండు మనుజు-స్థితినిఁ జెపుమ.

తా. ఓ కృష్ణా! శ్రద్ధ గలవాఁడయ్యును, నియమములు లేని కారణమున, చంచలమనస్సు గలవాఁడైన యోగాభ్యాసకుఁ డే గతిని బొందుచున్నాడు?

శ్లో. కచ్చి న్నోభయ విభ్రష్ట శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి,
అప్రతిష్ఠో మహాబాహో! విమూఢో బ్రహ్మణః పథి. 38



గీ. అకట! బ్రహ్మానుసంధాన-మాచరింపఁ
జాలనట్టి మూఢుఁడు నిరా-శ్రయుఁడయి, భువిఁ
గర్మమార్గంబు, జ్ఞానమా-ర్గంబు రెండు
బొందక చెడునె చెదరిన-*మొయిలు వోలె?

తా. ఓ కృష్ణా! పరమాత్మను దెలిసికొను మార్గమును దెలియని యోగాభ్యాసకుఁడు నిరాశ్రయుఁడై, కర్మజ్ఞానమార్గములు రెంటికిని దూరుఁడై చెదిరిపోయిన మేఘమువలె చెడిపోఁడా యేమి?

శ్లో. ఏతం మే సంశయం కృష్ణ! ఛ్చేత్తు మర్హ స్యశేషతః,
త్వదన్య స్సంశయ స్యాస్య ఛ్చేత్తా నహ్యుపపద్యతే. 39

గీ. సరగ నాకు గలిగిన యీ-సంశయమునుఁ
బాపుటకు నీవె తగుదువు-వాసుదేవ!
యెలమిఁ దీనినిఁ బాపుట-కీవు దప్ప
దొరకఁ డితరుఁ డెవ్వఁడు నాకు-ధరణి యందు."

తా. ఓ కృష్ణా! నిన్నీ సంశయమును బూర్ణముగ నివర్తింపఁ జేయఁ బ్రార్థించుచున్నాను. ఈ సంశయమును బోగొట్టువాఁడు నీవు తప్ప మఱియొకఁడు నాకు దొరకడు కదా!

శ్రీ భగవాన్ ఉవాచ :-

శ్లో. పార్థ! నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే,
నహి కల్యాణ కృత్కశ్చి ద్దుర్గతిం తాత! గచ్ఛతి. 40

గీ. ఒనరఁ గృష్ణుండు సెప్పెఁ బ్ర-త్యుత్తరంబు,
"పార్థ! యోగమందుఁ జెడిన-వాఁడు నాశ
మొంద డిహపరములు రెంటి-యందు; మంచి
సేయు వానికి దుర్గతి-చేరదెపుడు.

తా. ఓ యర్జునా! అట్టి యోగభ్రష్టున కీలోకమందును, పరలోకమందును నాశము లేదు. ఓ తండ్రీ! మంచిపని చేసిన వాఁడెప్పుడును దుర్గతిని బొందడు.

---

* మొయిలు = మేఘము





శ్లో. ప్రాప్య పుణ్య కృతాన్ లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభి జాయతే. 41

గీ. యోగ మొనరించియు ఫలము-నొందకుండు
వాఁడు పుణ్యమొనర్చిన-వారి లోక
ములఁ బడసి, యందు బహు వర్ష-ములు వసించి,
యంత శుచియుత ధనిక గృ-హమునఁ బుట్టు.

తా. యోగభ్రష్టుఁడు పుణ్యము చేసిన వారి యొక్క లోకములను బొంది, అనేక సంవత్సరములా లోకములందు వసించి, తరువాత సదాచారవంతులైన ధనవంతుల గృహమునందు జన్మించును.

శ్లో. అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్. 42

గీ. అట్లుకాకుండినను, భ్రష్టుఁడైన యోగి
పుట్టు నిశ్చయాత్మకమైన – బుద్ధిచేఁ ద
నరెడు యోగుల వంశము-నను గిరీటి!
యిట్టి జన్మంబు దుర్లభం-బిహము నందు.

తా. అట్లు కాదేని, ఆయోగభ్రష్టుఁడు నిశ్చయాత్మక బుద్ధిగల యోగుల యొక్క వంశమందుఁ బుట్టును. ఇట్టి జన్మము గలుగుట లోకమునందు మిక్కిలి దుర్లభము.

శ్లో. తత్ర తం బుద్ధి సంయోగం లభతే పౌర్వ దైహికమ్,
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురు నందన! 43

గీ. అట్టి యోగి వంశమునందు-బుట్టి, యతఁడు
పూర్వ దేహమందుండిన-బుద్ధిఁబొంది,
పూర్వ సంస్కారము వలనఁ-బూని తోడ
సిద్ధిఁ బొందంగ యత్నంబు-సేయు మరల.

తా. ఓ యర్జునా! అట్లతఁడు యోగుల వంశమందు జన్మించి, పూర్వ జన్మము నందు గలిగిన యాత్మానాత్మ వివేక జ్ఞానమును బొందును. ఆ పూర్వ జన్మ సంస్కారము వలన నతఁడు జ్ఞానమును బొందుటకై మరల ప్రయత్నము చేయును.



శ్లో. పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః,
జిజ్ఞాసు రపి యోగస్య శబ్ద బ్రహ్మాతి వర్తతే. 44

గీ. వినుము మనసు స్వాధీనత-గనని వాఁడ
యినను భ్రష్టుఁడయిన యోగి-తనదు పూర్వ
భవ విశేషంబుచే నింద్రి-య విషయముల
నుండి తగ నివృత్తుఁడగును;-యోగ విషయ
మునుఁ దెలియఁగోరు పురుషుఁడు-పుడమి, శ్రుతివి
హిత సుకర్మ ఫల మతిక్ర-మించియుండు.

తా. ఆ యోగభ్రష్టుఁడు, వశములో లేని మనస్సు కలవాఁడైనను, పూర్వ జన్మాభ్యాసము చేత నింద్రియ విషయముల యందాసక్తి బొందకుండును. యోగస్వరూపమును దెలియఁగోరువాఁడు వేదోక్త కర్మానుష్ఠాన ఫలము నతిక్రమించిన వాఁడని తెలియుము.

శ్లో. ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః,
అనేక జన్మసంసిద్ధ స్తతోయాంతి పరాంగతిమ్. 45

గీ. యత్నమున జ్ఞాన నిష్ఠుఁ డ-నఘుఁడయి, తన
పూర్వ జన్మసుకృత వశ-మున బవిత్రుఁ
డయి పిదప మహాత్కృష్టమై-నట్టి మోక్ష
మంది, యాత్మ విషయ సుఖ-మనుభవించు.

తా. జ్ఞాన నిష్ఠుఁడు పాపముల నుండి విముక్తుఁడై, పూర్వ జన్మసంస్కారము వలనఁ బ్రయత్నము చేసి యోగసిద్ధిని బొంది, పిమ్మట నన్నింటిని మించిన మోక్షమును బొందును.

శ్లో. తపస్విభ్యోఽధికో యోగీ, జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ, తస్మాద్యోగీ భవార్జున! 46

గీ. తాపసుల కంటె, సకల శా-స్త్రములఁ జదివి
నట్టి విద్వజ్జనుల కంటె-నరయఁ గర్మ
లొనరుచు జనులకంటెను-నుత్తముండు
యోగి; కాన యర్జున! నీవు-యోగి వగుము.





తా. అర్జునా! యోగి తపస్సులఁ జేయువారి కంటెను, శాస్త్ర పాండిత్యము గల వారి కంటెను, కర్మములను చేయువారికంటెను శ్రేష్ఠుఁడు. అందువలన నీవు యోగి వగుము.

శ్లో. యోగినా మపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా,
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః. 47

(ఆత్మసంయమ యోగోనామ షష్ఠోధ్యాయ స్సంపూర్ణమ్)

గీ. అవని శ్రద్ధతో నెపుడు న-న్నాశ్రయించి
మనసుచే నన్ను సేవించు-మానవుండు
పలుతెఱంగులైన యుపాస-నల నొనర్చు
చుండువారి యందఱికంటె-నుత్తముండు.

తా. ఎవడు విశ్వాసము కలవాఁడై, నాయందాసక్తమైన మనస్సు చేత నన్ను సేవించు చున్నాడో, అట్టివాఁడు యోగులలో శ్రేష్ఠుఁడని నా యభిప్రాయము.

(ఆత్మ సంయమ యోగమను షష్ఠాఽధ్యాయము సంపూర్ణము)



# సప్తమోఽధ్యాయః

## విజ్ఞానయోగః

శ్రీ భగవాన్ ఉవాచ :-

శ్లో. మయ్యాసక్త మనాః పార్థ! యోగం యుంజన్ మదాశ్రయః,
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు. 1

శ్రీ కృష్ణుఁడు చెప్పుచున్నాడు :-

గీ. మనసు నాయందు నిడి, యోగ-మును నిలుకడ
తోడ నాచరించుచు, నన్నుఁ-గూడి, పూర్ణుఁ
డనగు నన్నెటులఁ దెలిసి-కొనఁగఁ దగునొ
యా విధం బెఱుకపఱతు-నయ్య నీకు.

తా. ఓ యర్జునా! నాయందు మనస్సు నిలిపి, నేనే యాశ్రయముగా గలవాఁడనై, యోగము నభ్యసించుచు సకల గుణ పరిపూర్ణుడనైన నన్నెట్లు సంశయము లేకుండ తెలియగలవో ఆ విషయమును వినుము.

శ్లో. జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః,
యద్జ్ఞాత్వా నేహ భూయోఽన్య జ్జ్ఞాతవ్య మవశిష్యతే. 2

గీ. అనుభవజ్ఞానమననేమొ? - వినుట వలనఁ
గలుఁగు జ్ఞానమనఁగ నేమొ?- దెలుపుదిపుడు;
దీనిఁదెలిసికొనిన, నీకుఁ-దెలిసికొనఁగ
నుండ దితర విషయమేది-యునుఁ గిరీటి!

తా. నేను నీకు అనుభవజన్య జ్ఞానముతో గూడిన శాస్త్ర జన్య జ్ఞానమును గూర్చి సాకల్యముగాఁ జెప్పెదను. నీవీ జ్ఞానమును దెలిసికొంటివేని నీకికఁ దెలిసికొనఁదగిన మఱియొక విషయమేదియు నుండదు.

శ్లో. మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే,
యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః. 3

గీ. జ్ఞానసిద్ధి కొఱకు వేల-జనులయందొ
కండు చేయును యత్నంబు;-కాని యటుల





యత్న మొనరించు పెక్కండ్ర-యందొకండు
మాత్రమే నన్నెఱుంగును-మహిని పార్థ!

తా. అనేక వేలమంది మనుష్యులలో నొకానొకఁడు జ్ఞానసిద్ధి కొఱకు ప్రయత్నము చేయుచున్నాడు. అట్లు యత్నము చేయు బహుజనులలోను, ఒకానొకఁడు మాత్రమే నన్ను యథార్థముగఁ దెలియుచున్నాడు.

శ్లో. భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ,
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా. 4

గీ. అగ్ని, యుదకంబు, గాలియు; - నాకసంబు,
భూమి, చిత్తం, బహంకృతి,-బుద్ధియనఁగ
నొప్పు నెనిమిది తెఱఁగులై-యుండుఁ బ్రకృతి;
దీని నాదు మాయ యటంచుఁ-దెలియవలయు.

తా. నా మాయా శక్తి (ప్రకృతి), భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారమనెడి యెనిమిది విధములైన భేదములు గలిగియున్నది.

శ్లో. అపరే యమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్,
జీవ భూతాం మహాబాహూ! య యేదం ధార్యతే జగత్. 5

గీ. ఈ ప్రకృతి పార్థ! నీచము-యినది; దీని
కన్యమును, మఱి, యుత్కృష్ట-మైనదియును,
భూతముల *యుసుఱుకు హేతు-వునునయి, జగ
తిని ధరించు నా ప్రకృతిని-దెలిసికొనుము.

తా. అర్జునా! ఈ ప్రకృతి నికృష్టమైనది. దీనికంటె నితరమైనట్టియు, ప్రాణాధార నిమిత్త భూతమైనట్టియు, ఉత్కృష్టమైనట్టియు నాయొక్క ప్రకృతిని దెలిసికొనుము. ఈ ప్రకృతి చేతనే యీ ప్రపంచము ధరింపఁబడుచున్నది.

శ్లో. ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ,
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా. 6

---

* ఉసురు = ప్రాణము



గీ. ప్రాణ భూతమై యొప్పు నీ-ప్రకృతి సర్వ
భూతములకు హేతువనియుఁ-బొసఁగ సర్వ
జగమునకు సంభవ విలయ-స్థాన మేనె
యనియును, దెలిసికొనుము, ఫ-ల్గునుఁడ! కరము.

తా. సమస్త భూతములును నీ జీవభూతమైన ప్రకృతియే కారణముగా గలవని తెలియుము. ప్రపంచమంతటికిని, ఉత్పత్తి స్థానమును, నాశస్థానమును నేనె అయియున్నాను.

శ్లో. మత్తః పరతరం నాన్య త్కించిదస్తి ధనంజయ!
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ. 7

గీ. ఇతర హేతువు నాకంటె-నెందులేదు;
హార రత్నములన్నియు-దారమందు
వలెను నాయందు ఫల్గుణ!-నిలచియున్న
దీ ప్రపంచమంతయు నటం-చెఱుఁగు మీవు.

తా. అర్జునా! నాకంటె నితరమైన కారణమేదియును లేదు. నాయందు సర్వజగత్తు, దారమందు హార రత్నములవలె, కూర్పఁబడియున్నది.

శ్లో. రసోఽహ మప్సు కౌంతేయ! ప్రభాఽస్మి శశి సూర్యయోః,
ప్రణవ స్సర్వ వేదేషు, శబ్దః ఖే, పౌరుషం నృషు. 8

గీ. జలముల రసమును, *హరిద-శ్వ శశధరుల
ప్రభయు, నాగమముల యందుఁ-బ్రణవమును, గ
గనము నందుఁ గలుగు శబ్ద-మునుఁ, బురుషుల
యందు బౌరుషంబును, నేనె-యగుదు బార్థ!

తా. అర్జునా! ఉదకముల యందు రుచియును, సూర్యచంద్రుల యందు కాంతియును, వేదములన్నిటియందు 'ఓం' కారమును, ఆకాశమందు శబ్దమును, పురుషుల యందు పౌరుషమును నేనై యున్నాను.

శ్లో. పుణ్యో గంధః పృథివ్యాం చ తేజ శ్చాస్మి విభావసౌ
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు. 9

---

* హరిదశ్వ శశధరులు = సూర్యచంద్రులు





గీ. అవని యందుగల సుగంధ,-మగ్నిహోత్ర
మందుఁ దేజంబు, సర్వ భూ-తాళియందు
నాయువును, దాపసుల తప-మౌదు నేన
టంచు నిశ్చయముగ మది-నెంచు మనఘ!

తా. భూమియందు పరిమళించు గంధమును, అగ్నియందు తేజమును, సమస్త భూతములం
దాయువును, తపస్సు చేయువారి యందు తపస్సును నేనై యున్నాను.

శ్లో. బీజం మాం సర్వ భూతానాం విద్ధి పార్థ! సనాతనమ్,
బుద్ధి ర్బుద్ధి మతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్. 10

గీ. ధరణి నున్న భూతముల యు-త్పత్తి కార
ణమయి యొప్పు ననాది బీ-జమును, మఱియు,
ధీనిధుల బుద్ధి మహిమంబు, - తేజముగల
వారి తేజంబు, నేనని-పరఁగ నెంచు.

తా. ఓ యర్జునా! సమస్త భూతములకు ఉత్పత్తి కారణమైన బీజమును, బుద్ధిమంతుల
యొక్క బుద్ధియు, తేజస్సుగల వారి యొక్క తేజస్సును నేనై యున్నాను.

శ్లో. బలం బలవతాం చాహం కామ రాగ వివర్జితమ్,
ధర్మా విరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ! 11

గీ. ధరణి కామ రాగ వివర్జి-తమయి యొప్పు
బలము గల వారి బలమును,- బ్రాణులందు
ధర్మశాస్త్రమునకు విరు-ద్ధంబు కాని
కామమును నేనెయని యెఱు-గంగ వలయు.

తా. బలవంతుల యందు కామరాగ వివర్జితమైన బలమును, ప్రాణులయందు ధర్మశాస్త్ర
విరుద్ధము కాని కామమును, నేనై యున్నాను.

శ్లో. యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసా శ్చ యే,
మత్త ఏవేతి తా న్విద్ధి న త్వహం తేషు; తే మయి. 12

గీ. సత్త్వ గుణ రూపములయిన-శమ దమాదు
లును, రజోగుణరూపంబు-లనఁగ నొప్పు



గర్వహర్షంబు లింక శో-కంబు, మోహ
ము మొదలగు తామస గుణ రూ-పములును, దగ
నేర్పడినవి నా యందని-యెంచవలయు;
నైనను వివేక వర్జితు-లటుల నేను
వశ్యుఁడను గాను వానికి-ఫల్గునుండ!
యవియే నాకు స్వాధీనంబు-లై పరంగు.

తా. సత్త్వగుణ రూపములైన శమము, దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ, సమాధానము-అను మనోభావములును, రజోగుణ రూపములైన గర్వ సంతోషములును, తామస గుణరూపములైన శోక మోహములును నావలనఁ గలిగినవిగా తెలిసికొనుము. ఆ భావములకు నేను లోబడినవాడనుకాను. అవి నాయందుండి నాకు లోబడి యున్నవి.

శ్లో. త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్,
**మోహితం; నాభి జానాతి మామేభ్యః పరమవ్యయమ్.** 13

గీ. కుటిల సత్త్వ రజ స్తమో-గుణ వికార
కారణమున భ్రమసిన జ-గంబు, గుణర
హితుఁడను, మఱి, వికార -హితుఁడనైన
నన్ను దెలియఁ జాలదు సుగు-ణమణి జలధి!

తా. సత్త్వ రజ స్తమో గుణ వికారములైన శమదమాది భావములచే నవివేకము పొందింపఁ బడిన యీ జగత్తు, ఈ భావములకు విలక్షణుఁడ నైనట్టియు, నాశరహితుఁడ నైనట్టియు నన్నెఱుగుదు.

శ్లో. దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
**మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే.** 14

గీ. జగతి నా యందుఁ బుట్టిన-త్రిగుణరూప
మైన నాదు మాయ దురత్య-యంబు జనుల
కైన, నన్నుఁబొందెడి యన-ఘాత్ములు ధ్రువ
ముగను దీనిఁ దాట గలరు-పుణ్యచరిత!





తా. నా సంబంధమై త్రిగుణాత్మకమగు నామాయ నెవరును అతిక్రమింపఁజాలరు. నన్ను శరణుఁ బొందువారీ మాయ నతిక్రమింపఁగలుగుదురు.

**శ్లో. న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః,**
**మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః. 15**

గీ. పుడమి పాపకర్మరతులు-మూఢమతులు,
మందబుద్ధియుతులును, నా-మాయచే వి
వేక శూన్యులై రాక్షస-వృత్తిఁబూని
హింసఁ జేయుచు నన్నాశ్ర-యింప రెపుడు.

తా. పాపాత్ములును, వివేక రహితులును, నీచులునునైన మనుష్యులు జ్ఞాన శూన్యులై, అసుర స్వభావము గలిగి హింసాకృత్యములు చేయువారలై నన్ను భజింపరు.

**శ్లో. చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతి నోఽర్జున!**
**ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ! 16**

గీ. బాధనొందు నతఁడు, జ్ఞాన-వాంఛఁ బొందు
నతఁడు, ధనవాంఛ గల నరుఁ-డాత్మ వేత్త
యనెడి నాలుగు తెఱఁగుల-యిన సుకృతులు
నన్నుఁ గొలుచుచున్నారు ధ-నంజయుండ!

తా. అర్జునా! ఇక్కట్టులలో నుండి బాధనొందువాఁడు, జ్ఞానముఁ బొందఁ గోరువాఁడు, ధనమును గోరువాఁడు, ఆత్మజ్ఞానము కలవాఁడు ననెడి యీ నాలుగు విధములైన పుణ్య పురుషులు నన్ను భజించుచున్నారు.

**శ్లో. తేషాం జ్ఞానీ నిత్య యుక్త ఏకభక్తి ర్విశిష్యతే,**
**ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ మహం సచ మమ ప్రియః. 17**

గీ. చలన రహితమయిన భక్తి-గలిగినట్టి
యాత్మవిదుఁడౌను నలుగురి-యందు శ్రేష్ఠుఁ;
డతని కేను ప్రియతముండ-నగు, దతఁడును
నాకు మిక్కిలి ప్రియుఁ డర్జున! భువి యందు.



తా. ఈ నలుగురిలో నిశ్చల భక్తి గలిగియుండు జ్ఞాని శ్రేష్ఠుఁడు. అట్టి జ్ఞానికి నేను మిక్కిలి ప్రియుఁడను. నాకును నతఁడు మిక్కిలి ప్రియుఁడు.

శ్లో. **ఉదారా స్సర్వ ఏవైతే, జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్,**
**ఆస్థిత స్సహి యుక్తాత్మా మామే వా నుత్తమాం గతిమ్.** 18

గీ. ఈ నలుగురు శ్రేష్ఠుల-యినను, వీరి
యందు నాత్మ విదుఁడు నేనె-యని తలంతు;
చలన రహితమైన మనసు-గల యతండు
నన్నె శ్రేష్ఠమైన గతిగ-నమ్మియుంట.

తా. ఈ నాలుగు తెఱఁగుల వారును ఉత్కృష్టులే. అయినను వారిలో జ్ఞాని యన్ననో నేనేయని నా యభిప్రాయము. ఆ జ్ఞాని నిశ్చయాత్మకమైన బుద్ధిచే, నేనే ప్రాప్య స్థానముగ విశ్వసించుచు, నన్నే యాశ్రయించి యుండును.

శ్లో. **బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే,**
**వాసుదేవ స్సర్వ మితి; స మహాత్మా సుదుర్లభః.** 19

గీ. జ్ఞానసిద్ధి కొఱకు పెక్కు-జన్మలొంది,
యంత జ్ఞానియై పూరుషుం-'డంత వాసు
దేవు స్వరూపమౌ'నని-స్థిరముగ నను
బొందు; నట్టి నరుఁడు దుర్ల-భుండు సుమ్ము.

తా. పురుషుఁడనేక జన్మములెత్తిన తరువాత జ్ఞానము కలవాఁడై, సమస్తము వాసుదేవ స్వరూపమేయను భావము గలిగి, నన్నుఁ బొందుచున్నాడు. అట్టి మహాత్ముఁడు మిక్కిలి దుర్లభుఁడు.

శ్లో. **కామై స్తైస్తై ర్హృత జ్ఞానాః ప్రపద్యంతేఽన్య దేవతాః,**
**తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతా స్స్వయా.** 20

గీ. కోరికలచే వివేకంబు-కోలుపోయి,
ప్రజలు కోరికలొసఁగు దే-వతలను దమ
ప్రకృతి కనుగుణ్యముగను గ-ల్ప నియమముల
నాచరించుచు బూజింతు-రవని యందు.





తా. జనులు పూర్వ జన్మ సంస్కారవశులై, కోరికలచేత వివేకమును బాసి, తమ కోరికల నొసఁగు దేవతలను పూజనోపాసనాది నియమమును బూని, భజించుచున్నారు.

శ్లో. యో యో యాం యాం తనుం భక్త శ్శ్రద్ధయార్చితు మిచ్ఛతి
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధా మ్యహమ్. 21

గీ. ఎవ్వఁడే కోరికల చేత-నెట్టి దేవ
తలను శ్రద్ధయు భక్తియుఁ-గలిగి పూజ
సలుపు; ఆ దేవతల యందు-శ్రద్ధయు, మఱి
భక్తియు నొసఁగుచున్నాను-వాని కేను.

తా. ఎవడెవఁడే యే కోరికలను బొందుట కే యే దేవతలను శ్రద్ధాభక్తులతోఁ బూజించుచున్నారో, వాని వానికా యాదేవతలయందు శ్రద్ధను స్థిరమైన దానినిగఁ జేయుచున్నాను.

శ్లో. సతయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే,
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్. 22

గీ. అట్టి శ్రద్ధతో నాతఁడు-హర్షమెసగఁ
బొసఁగి యా దేవతా రూప-మునకుఁ బూజ
సలిపి, యాదేవతవలన-సరగ నేనొ
సంగు కోర్కెలఁ బడయును-సవ్యసాచి!

తా. ఆ భక్తుడట్టి శ్రద్ధతో నా దేవతను బూజించుచు, ఆ దేవత మూలమున నాచే నొసఁగ బడు కోరికలను బొందుచున్నాడు.

శ్లో. అంతవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్ప మేధసామ్,
దేవాన్ దేవ యజోయాంతి, మద్భక్తా యాంతి మామపి. 23

గీ. అన్యదేవతారాధన-మాచరించు
పురుషులా దేవతాస్థాన-ములఁ బడయుదు,
రల్పబుద్ధి గలిగిన యా-యన్యదేవ
తార్చకులు పొందు ఫల మంత-మగును గాని
నన్నుఁబూజించు భక్తులు-నన్నె పొంది
నిలచియుందురు నాయందు-నిలుకడగను.



తా. స్వల్పబుద్ధి గలిగిన యాయన్య దేవతోపాసకులు, ఆయా దేవతల స్థానములను బొందుచున్నారు. వారు పొందు ఫలములు నశించునట్టివి. నా భక్తులన్ననో నన్నే పొందుచున్నారు.

శ్లో. **అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యతే మా మబుద్ధయః,**
**పరం భావ మజానంతో మమావ్యయ మనుత్తమమ్.** 24

గీ. అవ్యయంబును, నిరతిశ-యమును, శ్రేష్ఠ
మును నయిన నా స్వరూపంబు-గనగ లేని
యజ్ఞులు భువి నవ్యక్తుండ-నైన నన్ను
వ్యక్తునిగ నెంచుచున్నారు-ఫల్గునుండ!

తా. మూఢులు నాశరహితుఁడనై నట్టియు, నిరతిశయుండనై నట్టియు, ఉత్కృష్టుఁడ నై నట్టియు నన్ను వ్యక్తుని గాను, నాశముగల వానిగాను భావించుచున్నారు.

శ్లో. **నాహం ప్రకాశ స్సర్వస్య, యోగమాయా సమావృతః,**
**మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజ మవ్యయమ్.** 25

గీ. సర్వలోకములకుఁ బ్రకా-శకుఁడ గాను
నేను; త్రైగుణ్యమనెడి య-జ్ఞానమునకుఁ
గారణమయిన మాయచేఁ-గప్పఁబడిన
జగ మజునిగ, నవ్యయుఁగ నె-ఱుఁగదు నన్ను.

తా. నేను లోకమునకు బ్రకాశమయిన వాడనుగాను. మూఢులు త్రైగుణ్యమను మాయచేఁ గప్పబడినవారై నన్ను జన్మరహితుని గాను, నాశరహితుని గాను దెలియరు.

శ్లో. **వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున!**
**భవిష్యాణి చ భూతాని; మాంతు వేద న కశ్చన.** 26

గీ. ఎఱుఁగుదును నేను పార్థ! గ-తించినట్టి
భూతముల, నిపుడున్నట్టి-భూతములనుఁ,
గాఁగలిగిన భూతములను;-గాని నన్నె
వండెఱుంగడు నాదు భ-క్తుండు దప్ప.





తా. అర్జునా! నేను భూత భవిష్య ద్వర్తమాన కాలములందుండు భూతముల నెఱుఁగుదును. నన్ను మాత్ర మెవ్వ డెఱుఁగడు.

శ్లో. ఇచ్ఛా ద్వేష సముత్థేన ద్వంద్వ మోహేన భారత!
సర్వ భూతాని సమ్మోహం సర్గేయాంతి పరంతప! 27

కం. బిట్టుగ ద్వేషేచ్ఛలచేఁ
బుట్టిన దుఃఖ సుఖరూప-ములకుఁ గారణమై
నట్టి *యెఱుఁగమినిఁ బ్రాణులు
పుట్టిన సమయంబునందే-పొందుదు రనఘా!

తా. అర్జునా! జన్మించునపుడే, కామక్రోధాదులవలన బుట్టిన సుఖ దుఃఖాదులైన ద్వంద్వముల యందు మోహము చేత, సమస్త ప్రాణులు నజ్ఞానమును బొందుచున్నవి.

శ్లో. యేషాం త్వంతం గతం పాపం జనానాం పుణ్య కర్మణాం,
తే ద్వంద్వ మోహ నిర్ముక్తా భజంతే మాం దృఢ వ్రతాః. 28

గీ. పుణ్యకర్మలు గలవారు,-పాసఁగ వారి
పాపములు నశించిన పిద-ప, సుఖదుఃఖ
కారణా వివేకముపోవుఁ-గాన, నన్ను
గొలుతురు దృఢ నియమములు-గలిగి కరము.

తా. పుణ్యకర్మముల నాచరించు జనులు తమ పాపములు నశించుట వలన ద్వంద్వములైన సుఖదుఃఖాదులకుఁ గారణమైన యజ్ఞానము నశించినవారై, నిశ్చలమైన నియమముతో నన్ను సేవించుచున్నారు.

శ్లో. జరా మరణ మోక్షాయ మా మాశ్రిత్య యతంతి యే,
తే బ్రహ్మ త ద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మ చాఖిలమ్. 29

గీ. ఎవరు జనన మరణ విర-హిత విముక్తి
నొంద నన్నాశ్రయము పడ-యుదురొ, వారి
కెఱుక పడుఁ గర్మలన్నియు,-మఱియు సకల
ప్రాణులందుండు బ్రహ్మంబు-పరఁగఁ బార్థ!

---

* ఎఱుఁగమి = అజ్ఞానము



తా. ఎవరు మోక్షముఁ బొందఁ గోరికతో నన్నాశ్రయించి తగిన యత్నము చేయుచున్నారో, అట్టివారు పరబ్రహ్మమును, సమస్త కర్మములను దెలిసినవారగుచున్నారు.

శ్లో. సాధి భూతాధి దైవం మాం సాధి యజ్ఞం చ యే విదుః
ప్రయాణకాలేఽపి చ మాం తే విదు ర్యుక్త చేతసః. 30

(విజ్ఞానయోగో నామ సప్తమాధ్యాయ స్సంపూర్ణమ్)

కం. అధిభూతంబును బదపడి
యధి దైవాధి సవనముల-హత్తుకొనిన, న
న్నధి భువుగఁ దెలిసికొనిన వి
బుధుఁడుండు చెదరక మరణ-ము గలుగు వఱకున్.

తా. అధి భూతాధి దైవములతోను, అధి యజ్ఞముతోను గూడియున్న నన్ను దెలిసికొనువారు, అంత్యకాలమందుఁ గూడ నిశ్చయముతో గూడిన మనస్సు గలవారై నన్ను దెలిసికొందురు.

(విజ్ఞాన యోగమనెడి సప్తమాధ్యాయము సంపూర్ణము.)





# అష్టమోఽధ్యాయః
## అక్షర పరబ్రహ్మయోగః

అర్జున ఉవాచ :-

శ్లో. కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మ కిం కర్మ పురుషోత్తమ!
అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కి ముచ్యతే. 1

శ్లో. అధి యజ్ఞ కథం కోఽత్ర దేహేఽస్మి న్మధుసూదన!
ప్రయాణ కాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః. 2

గీ. "ఏమి యధ్యాత్మమన? బ్రహ్మ-మెద్ది? కర్మ
మనఁగ నేయది? యధిభూత-మనఁగఁ దేని
కర్థమగు? నింక నధి దైవ-మనగ నెయ్య
దీ శరీరమం దధి యజ్ఞుఁ-డెవ్వఁడాతఁ
డెటులఁ దెలిసికొనంబడు?-నిక, చలన
మొందని మనస్సు గలవార-లుర్వి నంత్య
కాలమున నిన్నెటు తెలియ-గలర"టంచు
బార్థుఁ డడుగ నంత మురారి-పలికె నిటుల.

తా. ఓ పురుషోత్తమా! ఆ పరబ్రహ్మమెట్టిది? అధ్యాత్మమెట్టిది? కర్మ మెట్టిది? అధి భూతాధిదైవము లనఁగనెట్టివి? శరీరమందధి యజ్ఞుఁడెవ్వఁడు? ఆ యధియజ్ఞుఁడెట్లు తెలిసి కొనఁబడును? నిశ్చల మనస్సుగలవారిచే, అంత్య కాలమందు నీ వెట్లు తెలిసి కొనఁబడుదువు?

శ్రీ భగవాన్ ఉవాచ :-

శ్లో. అక్షరం బ్రహ్మ పరమం; స్వభావోఽధ్యాత్మ ముచ్యతే,
భూత భావో ద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః 3

శ్రీ కృష్ణుఁడు చెప్పుచున్నాడు :-

గీ. బ్రహ్మ మక్షరమయ్యది-ప్రత్యగాత్మ
యై ప్రతి శరీరమున నుండు;-నదియె చెప్పఁ



బడును నధ్యాత్మమంచు; దే-వతలఁగూర్చి
త్యాగ మొనరుచులే కర్మ-మగును బార్థ!

తా. నిరతిశయమైనట్టియు, నాశరహితమైనట్టియు, బ్రహ్మము యొక్క ప్రత్యగాత్మ భావము 'ఆధ్యాత్మ'మని చెప్ప బడుచున్నది. ప్రతి శరీరమందున్న యీ పరబ్రహ్మమే ప్రత్యగాత్మ యని చెప్పఁబడుచున్నది. ప్రాణుల యొక్క ఉత్పత్తివృద్ధుల కొఱకు దేవతలను గూర్చి చేయఁబడు హోమాదికము కర్మమని చెప్పఁబడుచున్నది.

శ్లో. అధిభూతం క్షరోభావః పురుష శ్చాధి దైవతమ్,
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర! 4

గీ. క్షయమగు చరాచరంబు స-కలము చెప్పఁ
బడును నధిభూతమంచు;దే-వతల కధిప
తియయిన హిరణ్య గర్భునిఁ-దెలిసి కొనఁగ
వలయు నధి దైవతమటంచు;-బార్థ!సర్వ
జీవుల శరీరములయందుఁ-జేరియున్న
నేనె యధి యజ్ఞుఁడ నగదు-నిర్మలాత్మ!

తా. అర్జునా! ఉత్పత్తి నాశములుగల ప్రాణి సమూహము 'అధిభూత' మని చెప్పఁబడుచున్నది. హిరణ్యగర్భుఁడు 'అధిదైవత' మని చెప్పఁబడుచున్నాడు. (హిరణ్యగర్భుఁడనగా దేహధారులలో మొదటి వాఁడును, సకల భూతముల కాదికర్తయును నైన బ్రహ్మ.)

**శ్లో. అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్
యః ప్రయాతి సమద్భావం యాతి నా స్త్యత్ర సంశయః.** 5

గీ. ఎవ్వఁ డంత్యకాలమున న-న్నే స్మరించు
చును శరీరంబు **విడు**చునో,-కనఁగ నతఁడు
నా స్వరూప**ంబె** పొందు నిం-ద్ర సుత! యిందు
**సందియ మణు మాత్రంబును-బొందవలదు.**

**తా. ఎవఁడంత్య కాలమందు నన్నే స్మరించుచు శరీరమును విడుచునో, వాఁడు నన్ను బొందు చున్నాడు. ఇందు సందేహములేదు.**

**శ్లో.** యం యం వాపి స్మరన్ **భావం** త్యజ త్యంతే కళేబరమ్,





**తం తమే వైతి కౌంతేయ! సదా తద్భావ భావితః.** 6

గీ. చలన రహితమైన మనస్సు-గలిగి యెవ్వ
రెట్టి దేవతలను స్మరి-యింతురో శ
రీరమును విడుచునపుడు-వారు దాల్తు
రు, తగ నట్టి దేవతల స్వ-రూపములను.

తా. అర్జునా! ఎవ డంత్య కాలమం దే దేవతను స్మరించుచు శరీరమును విడుచునో, వాఁడా దేవతా స్వరూపమునే పొందును.

శ్లో. **తస్మా త్సర్వేషు కాలేషు మామనుస్మర యుద్ధ్యచ,**
**మయ్యర్పిత మనో బుద్ధి ర్మామే వైష్య స్యసంశయః.** 7

గీ. అందువలనఁ బార్థుండ! ని-రంతరంబు
నన్నె ధ్యానించుచును కద-నం బొనర్పు
మీవు; నా యందు చిత్తంబు నెలమి నిలుక
డగ నిలిపి తేని నన్నుఁ బ-డసెదు సుమ్ము.

తా. కావున నీ వెల్లప్పుడును నన్నే ధ్యానించుచు యుద్ధము చేయుము. నీవు నా యందు స్థిరముగ మనో బుద్ధుల నుంచితి వేని నన్ను బొందగలవు. ఇందు సందేహము లేదు.

శ్లో. **అభ్యాస యోగ యుక్తేన చేతసా నాన్యగామినా,**
**పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్.** 8

గీ. కలఁతలేనట్టి చిత్తంబు-గలిగి యెవఁడు
స్థిరముగను యోగపరుఁడయి-దివ్యరూపుఁ
డగు పరమ పురుషు స్మరణ-మాచరించు;
నాతఁ డా పరమ పురుషు-నందు సుమ్ము.

తా. అభ్యాస యోగముతోఁగూడుకొని నట్టియు, ఇతర విషయములను బొందనట్టియు మనస్సు చేత, ఉత్కృష్టుఁడైన పరమపురుషుని స్మరించునట్టి మనుష్యుఁ డా పరమ పరుషునే పొందును.

శ్లో. **కవిం పురాణ మనుశాసితా రమణోరణీయాం సమనుస్మరేద్యః,**
**సర్వస్య ధాతార మచింత్యరూప మాదిత్యవర్ణం తమసః పరస్తాత్.** 9



గీ. కనఁగ నాతఁడు సర్వజ్ఞుఁ-డును, బురాణ
పురుషుఁడును, సకల భువన-ములకు శిక్ష
కుండును, నణువుకంటెను-గూడ సూక్ష్మ
మైనవాఁడును, సకల చ-రాచర నిచ
యంబునకుఁ గర్మ ఫలమిచ్చు-నతఁడును, దలఁ
పగ నలవి కానివాఁడును,-భానుదీప్తి
వలెను దేజోమయ స్వరూ-పము గలిగిన
యతఁడు, న జ్ఞాన లక్షణ-మైన తమము
కంటెఁ బరుఁడును నై యొప్పుఁ-గరము పార్థ!

తా. ఆ మహాపురుషుఁడు సర్వజ్ఞుఁడు, పురాణ పురుషుఁడు, సకల ప్రపంచముననకు శిక్షకుఁడు, అణువు కంటెను సూక్ష్మమైనవాఁడు, సమస్త ప్రాణులకును కర్మఫలము నొసఁగువాఁడు, మనస్సుచే చింతింప నశక్యమైన స్వరూపము కలవాఁడు, సూర్యకాంతి వంటి కాంతిగలవాఁడు, అజ్ఞానలక్షణమైన మోహాంధకారము కంటె నితరుఁడైన వాఁడు.

శ్లో. ప్రయాణ కాలే మనసా చలేన భక్త్యాయుక్తో యోగబలేన చైవ
భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్ సతం పరం పురుష ముపైతి దివ్యమ్.10

గీ. అంత్యకాలమున సుస్థిర-మైన మనసు
తోడ భక్తి వహించి,కు-దురుగ యోగ
పురుషుఁడయి,కను బొమల మధ్య-ప్రాణవాయు
వులను జేరిచి, యామహా-పురుషుని స్మరి
యించునట్టి యోగపురుషుఁ-డెసఁగి యామ
హాపురుషునె పడయఁగల-డబ్బురముగ.

తా. దేహావసానసమయమందు నిశ్చలమైన మనస్సుతోను, భక్తితోడను, యోగబలము తోడను గూడిన వాఁడై కనుబొమలమధ్యమందు ప్రాణవాయువును బ్రవేశింపఁజేసి యాపరమ పురుషుని స్మరించునట్టి యోగి దివ్యమైనట్టియు, ఉత్కృష్టమైనట్టియు, ఆ పురుషుని బొందును.

శ్లో. య దక్షరం వేదవిదో వదంతి, విశంతి యద్యతయో వీతరాగాః,
య దిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి, తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే. 11





గీ. అవని వేదార్థ విదు లే ప-దవి క్షయరహి
తంబటంచు బల్కెదు; రే-పదవివి మోహ
వర్జితులగు సన్యాసు లు-వడయుచుందు;
రేపదవిని గోరి మనుజా-లిలను బ్రహ్మ
చర్య సువ్రతము వెసఁగి-సలుపుచుందు;
రా పదవిఁ దెల్పెద సంగ్ర-హముగ నీకు.

తా. వేదార్థము నెఱిఁగిన వా రే స్థానము నాశరహితమైనదని చెప్పుచున్నారో, జితేంద్రియు లైన సన్యాసు లే నాశరహిత స్థానమును ప్రవేశించుచున్నారో, ఏ నాశరహిత స్థానమును బొందఁగోరి జనులు బ్రహ్మచర్యము నాచరించుచున్నారో, ఆ నాశరహిత స్థానమును నీకు సంక్షేపముగఁ జెప్పుచున్నాను.

శ్లో. సర్వ ద్వారాణి సంయమ్య మనో హృది నిరుద్ధ్యచ,
మూర్ధ్న్యా ధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగ ధారణామ్. 12

శ్లో. ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్,
యః ప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాం గతిమ్. 13

గీ. అవని నవరంధ్రములను ని-యతి యొనర్చి,
మనసును హృదయమునఁజేర్చి-తనదు యసువు
లను సహస్రారచక్రము-న నెలకొలిపి,
'ఓ' మ్మనెడి యక్షరంబును-నుచ్చరించు
చు, నను ధ్యానించుచు శరీర-మును త్యజించు
పురుషుఁడు పరమ పదవిని-బొందు నవను!

తా. నవద్వారములను నియమించి మనస్సును హృత్కమల మందు నిలిపి, సహస్రార చక్రమందు, భ్రూమధ్యమందు ప్రాణవాయువును జేర్చి, యోగ ధారణ మాశ్రయించి, పరబ్రహ్మ వాచకమైన 'ఓ' మ్మ నెడి యే కాక్షరము నుచ్చరించుచు, ఓం కారవాచ్యుఁడనైన నన్ను ధ్యానించుచు నెవఁడు శరీరమును వదలు చున్నాడో, వాఁడుత్కృష్టమైన మోక్షమును బొందు చున్నాడు.

శ్లో. అనన్య చేతా స్సతతం యోమాం స్మరతి నిత్యశః,
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః. 14



గీ. ఇంద్రియవిషయముల యందు-నెసఁగి తన మ
నస్సును దగులనీయక,-నన్ను సర్వ
వేళలందు ధ్యానించు వి-వేక శాలి
యైన యోగి, పడయును న-న్నర్జునుండ!

తా. అర్జునా! ఎవఁడన్య విషయములందు ప్రవేశింపని మనస్సుతో పరబ్రహ్మ స్వరూపుఁడ నైన నన్నెల్లప్పుడు ధ్యానించునో, అట్టి సమాహితచిత్తుఁడైన యోగి నన్ను సులభముగా బొందగలుగును.

శ్లో. మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్,
నాప్నువంతి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః. 15

గీ యోగపరులైన జ్ఞాను లీ-యుర్వియందు
యోగ సిద్ధివలన నన్ను-నొంది దుఃఖ
సంశ్రయంబును, మఱియు న-శాశ్వతంబు
నైన యట్టి పునర్జన్మ-మంద రనఘ!

తా. మహాత్ములైవ యోగులు నన్ను బొందుట చేత నుత్కృష్టమైన మోక్షమును బొందుదురేకాని, దుఃఖాశ్రయమైనట్టియు అస్థిరమైనట్టియు పునర్జన్మమును బొందరు.

**శ్లో. ఆ బ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తి నోఽర్జున!**
**మా ముపేత్యతు కౌంతేయ! పునర్జన్మ న విద్యతే. 16**

గీ. బ్రహ్మలోకాది సకల భు-వనము లొసఁగు
జన్మములను మరల జీవ-జాలమునకుఁ;
గాని నన్నొందిన యతండు-గాంచు, మరల
మహి నిఁ బుట్టని మోక్షసా-మ్రాజ్య పదవి.

తా. అర్జునా! బ్రహ్మలోకము వఱకుగల సమస్త లోకములు జీవులకు పునరావృత్తిని గలుగ జేయునట్టివి. నన్ను పొందిన వారికి మాత్రము పునర్జన్మములేదు.

శ్లో. సహస్రయుగ పర్యంత మహర్య ద్బ్రహ్మణోవిదుః,
రాత్రిం యుగ సహస్రాం తాం తేఽహోరాత్ర విదో జనాః. 17





గీ. పరఁగ వేయి యుగంబులు-బ్రహ్మకొక్క
పగలటంచును, మఱివేయి-యుగము లతని
కొక్క రాత్రియనియుఁ దెలి-యు జనులె, ధర
గాల విషయంబు దెలిసిన-ఘనులు సుమ్ము.

తా. అహోరాత్ర విదులకు, సహస్ర మహాయుగ కాలము బ్రహ్మ కొక్క పగలనియును, ఇంకొక సహస్ర మహాయుగ కాలము బ్రహ్మ కొక్క రాత్రియనియును దెలియును.

శ్లో. అవ్యక్తా ద్వ్యక్తయస్సర్వాః ప్రభవం త్యహరాగమే,
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవా వ్యక్త సంజ్ఞికే. 18

గీ. చెలఁగి బ్రహ్మకుఁ బగలు మొ-దలగు సమయ
మందు, నవ్యక్తముగ నుండు-నట్టి ప్రకృతి
నుండి వ్యక్త రూపంబున-నుండు సర్వ
భువన భూత జాలంబును-బుట్టు చుండు;
రాత్రి కాలాది యందు, మ-రల సకల భు
వనము లణఁగు నవ్యక్తమౌ-ప్రకృతి యందె.

తా. బ్రహ్మదేవుని పగటి కాలము ప్రారంభించునపుడు బ్రహ్మదేవుని వలన సమస్తములైన స్థావర జంగమాత్మక భూతములు పుట్టుచున్నవి. ఆ బ్రహ్మయొక్కరాత్రి కాలారంభమందు నీ సమస్త భూతములా బ్రహ్మదేవుని యందే లీనమగుచున్నవి.

శ్లో. భూతగ్రామ స్స ఏవాయం భూత్వా భూత్వాప్రలీయతే,
రాత్ర్యాగమేఽ వశః పార్థ! ప్రభవ త్యహరాగమే. 19

గీ. అస్వతంత్రమయిన జగ-మంత నిటులఁ
బగలు మొదలగునపుడు, త-గఁ బొడముచును
లీనమగుచుండు దివసావ-సానమందు;
మరల మరలిట్లెయగును గ-ర్మవశమునను.

తా. అ స్వతంత్రమైన యీ భూత సమూహము రాత్రి కాలము వచ్చినపుడు లీనమగుచు, పగటికాలము వచ్చినపుడు మరల పుట్టు చుండును.

శ్లో. పర స్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తా త్సనాతనః,
యస్ససర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి. 20



గీ. భూతమయలోక కారణ-భూతుఁడైన
బ్రహ్మకంటె నన్యమును, శా-శ్వతమును, బర
ము నిఁక, నవ్యక్తమును నయి-తనరు 'బ్రహ్మ'
మంత మొందదు లోకంబు-లంతమొంద.

తా. ఈ భూత సమూహమునకు కారణభూతుఁడైన చతుర్ముఖ బ్రహ్మ కంటె నుత్కృష్ట మైనదియు, వేఱైనదియు, అగోచరమైనదియు, శాశ్వతమైనదియు నగు పరబ్రహ్మము, సమస్త భూతములు నశించుచున్నను నశింపదు.

శ్లో. అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిమ్,
యం ప్రాప్య నని వర్తంతే తద్ధామ పరమం మమ. 21

గీ. ఏ పరబ్రహ్మ మక్షర,-మింద్రియంబు
లకు నగోచరమునయి వె-లయు, నదియె,ప
రమగతి మనుజులకును; జ-న్మములు లేవు
దీనిఁబొంద; నాదు స్థలమి-దియె కిరీటి!

తా. ఏ పరబ్రహ్మము, ఇంద్రియములకు నగోచరమనియు, నాశరహితమనియు చెప్పఁబడినదో, ఆపరబ్రహ్మమే మిక్కిలి యుత్కృష్టమైన మోక్షస్థానమని చెప్పఁబడుచున్నది. ఆ స్థానముఁ బొందిన వారికి పునర్జన్మము లేదు. అదియే నాస్థానమైన పరమ పదము.

శ్లో. పురుష స్సపరః పార్థ! భక్త్యా లభ్య స్త్వ నన్యయా
యస్యాంతస్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్. 22

గీ. ఏమహాపురుషుని లోన-నెల్లలోక
ములును లీనమైయుండు, నే-పురుషుచేత
విశ్వమంతయును దగ వ్యా-పింప బడెనొ;
యతఁ డనన్య భక్తివలన-నందఁబడును

తా. అర్జునా! సమస్త భూతము లే మహాపురుషుని యందున్నవో, వానిని, ఉత్కృష్టుఁడైన యా మహాపురుషుఁ డితరాసక్తిలేని జ్ఞానము చేతఁ బొందును.

శ్లో. యత్ర కాలే త్వనా వృత్తి మావృత్తిం చైవ యోగినః,
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ. 23





గీ. ఉర్వి నెట్టి మార్గములందు-యోగిజనులు
దేహమును వీడి యరిగినఁ-దిరిగి జన్మ
ములను బొందరొ; యేమార్గ-ముల నరిగినఁ
బుట్టుదురొ తిర్గి, యదియ తె-ల్పుదును నీకు.

తా. అర్జునా! కర్మయోగులు (ఫలకాంక్షతో కర్మములను జేయువారు) మరణించిన పిదప నే మార్గమునఁ బోయి మరల జన్మమును బొందు చున్నారో, మఱియు ప్రణవోపాసకులు మరణించిన పిదప నే మార్గమునఁబోయి జన్మరాహిత్యమును బొందుచున్నారో (మరల జన్మింపరో) ఆ మార్గములను జెప్పుచున్నాను.

శ్లో. అగ్నిర్జ్యోతి రహశ్శుక్ల ష్షణ్మాసా ఉత్తరాయణమ్,
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః. 24

గీ. పరఁగ నగ్న్యభిమాని దే-వతయును, దివ
సాభిమాని దేవతయును-నటుల శుక్ల
పక్షమునకుఁగలిగిన దే-వతయు నింక
నుత్తరాయణదేవత-యును నధిపతు
లై వఱలు నర్చిరాది మా-ర్గానుసారు
లైన జ్ఞానులు క్రమముగ నందుదురు, పు
డమిని బుట్టుక లేని మో-క్షమును బార్థ!

తా. అగ్న్యభిమాని దేవతయును, దినాభిమాని దేవతయును, శుక్లపక్షాభిమాని దేవతయును, ఉత్తరాయణాభిమాని దేవతయును నధిపతులై యున్న యర్చిరాది మార్గమునఁ బోవు ప్రణవోపాసకులు క్రమముగాబ్రహ్మమును (ముక్తిని) బొందుచున్నారు.

శ్లో. ధూమో రాత్రి స్తథా కృష్ణ ష్షణ్మాసా దక్షిణాయనమ్,
తత్ర చాంద్ర మసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే. 25

గీ. పరఁగ ధూమాభిమాని దే-వతయు,మఱి,ని
శాభిమాని దేవతయును-నటుల గృష్ణ
పక్షమునకుఁ గలిగిన దే-వతయు, దక్షి
ణాయనాధి దేవతయును-నధిపతులయి
తనరునట్టి ధూమాది ప-థమునఁబోవు



సక్తి కర్మనిరతులు, సు-ధాంశులోక
మును( బడసి, కర్మ తఱగిన-వెనుకఁదిరిగి
జన్మముల నెత్తుచున్నారు-సవ్యసాచి!

తా. ధూమాభిమాని దేవతయును, రాత్ర్యభిమాని దేవతయును, కృష్ణపక్షాభిమాని దేవతయును, దక్షిణాయనాభిమాని దేవతయును నధిపతులై యున్న ధూమాది మార్గమునఁబోవు కర్మ యోగులు చంద్రలోకమును బొంది, యచ్చట కర్మఫలము ననుభవించిన పిమ్మట మరల జన్మమును బొందుచున్నారు.

శ్లో. శుక్ల కృష్ణే గతీహ్యేతే జగత శ్శాశ్వతీమతే,
ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽఽవర్తతే పునః. 26

గీ. ఇటుల శుక్ల కృష్ణములని-యెసఁగు రెండు
శాశ్వత పథములున్నవి-సవ్యసాచి!
భవములేదు శుక్ల మను త్రో-వ నరుగు జను
లకును గృష్ణంబు నరుగ, గ-లదు భవంబు.

తా. శుక్ల కృష్ణములనెడు నీ రెండు మార్గములు ప్రపంచమునకు శాశ్వతముగ నున్నవి. వానిలో శుక్ల మార్గము చేత జన్మరాహిత్యము గలుగును; కృష్ణమార్గముచేత పునర్జన్మము కలుగును.

శ్లో. నైతే సృతీ పార్థ! జానన్ యోగీ ముహ్యతి కశ్చన,
తస్మా త్సర్వేషు కాలేషు యోగ యుక్తో భవార్జున! 27

గీ. ఈ పథంబుల రెండింటి-నెఱుఁగు యోగి
జనులు మోహంబుఁ బొందరు-సవ్యసాచి!
కాన నెల్లకాలమును యో-గంబుతోడఁ
గూడి యుండిన పాఁడవ-గుము కరంబు.

తా. అర్జునా! ఈ రెండు మార్గములను దెలిసిన యోగి మోహము జెందడు. ఆ కారణము వలన నీ వెల్లప్పుడును యోగ యుక్తుఁడవై యుండుము.

శ్లో. వేదేషు యజ్ఞేషు తపస్సుచైవ దానేషు యత్పుణ్యా ఫలం ప్రదిష్టమ్,
అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్. 28

(అక్షరపరబ్రహ్మయోగో నామ అష్టమాధ్యాయ స్సంపూర్ణమ్)





గీ. ఆగమములయందు, యజ్ఞంబు-లందు,తపము
లందు, దానములందున్న-యట్టి పుణ్య
ఫలమునంతయు మించిన-వాఁడు యోగి;
మఱియు, వీని ఫలముల జ-న్మమొసఁగునవి
యని తెలిసి, యాది కారణంబును, బరమును
నగు పరబ్రహ్మమందుఁ బ-రఁ గునతండు.

తా. వేదములయందును యజ్ఞములయందును తపస్సులందును దానములయందును ఏ పుణ్యఫలము చెప్పఁబడినదో, దానినంతటిని యోగి అతిక్రమించిన వాడై, ఉత్కృష్టమైన బ్రహ్మమునుఁ (మోక్షమును) బొందుచున్నాడు.

(అక్షర పరబ్రహ్మ యోగమనెడి అష్టమాధ్యాయము సంపూర్ణము.)



# నవమోఽధ్యాయః

## రాజవిద్యా రాజగుహ్యయోగః

శ్రీ భగవాన్ ఉవాచ :-

శ్లో. ఇదంతు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే,
జ్ఞానం విజ్ఞాన సహితం యజ్ఞాత్వా మోక్ష్యసే ఽశుభాత్. 1

శ్రీ కృష్ణుఁడు చెప్పుచున్నాడు :

గీ: ఉరు రహస్యంబు, విజ్ఞాన-యుతమునైన
జ్ఞానమును దెల్పెదను నీకు;-దానిఁ దెలిసి
కొంటివేని యీ యశుభము-గు భవపాశ
బంధము సరగఁ బోవును-బార్థ! నీకు.

తా. ఇప్పుడు నేను మిక్కిలి గోప్యమైనదియు, అనుభవజన్యజ్ఞానముతో గూడినదియునైన 'అంతయు' వాసుదేవుఁడనెడు జ్ఞానము నసూయలేని నీకుఁ జెప్పెదను. దానిని దెలిసికొంటి వేని నీవు సంసారమునుండి ముక్తుఁడవు కాగలవు.

శ్లో. రాజ విద్యా రాజ గుహ్యం పవిత్ర మిద ముత్తమమ్
ప్రత్యక్షా వగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్. 2

గీ. ఇది పవిత్రంబు, విద్యలం-దెల్ల శ్రేష్ఠ
మును, రహస్యంబు, ప్రత్యక్ష-బోధకంబు,
ధర్మయుత, మవ్యయంబు, ప-దపడి యభ్య
సించుటకుఁ గరము సులభం-బెంచి చూడ.

తా. ఈ జ్ఞానము మిక్కిలి యుత్కృష్టమైనదిగను, ప్రత్యక్ష సుఖబోధకమైనదిగను, ధర్మముతో గూడుకొనినదిగను, ఆచరించుటకు మిక్కిలి సులభమైనదిగను, నాశము లేనిదిగను, నున్నది.

శ్లో. అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప!
అప్రాప్య మాం నివర్తంతే మృత్యు సంసార వర్త్మని! 3

గీ. ఎవ్వరీ జ్ఞాన ధర్మంబు-నిందు విశ్వ
సింపకుందురో యట్టి నా-స్తికులు నన్ను





బొందక, మరణించి మరలఁ-బుట్టఁజేయు
నట్టి సంసారమునకు లో-వగుదు రెపుడు.

తా. అర్జునా! ఈ యాత్మజ్ఞాన ధర్మమును విశ్వసింపని పురుషులు నన్నుఁ బొందక మృత్యువుతో గూడిన సంసార మార్గమందుఁ దిరుగు చుందురు.

శ్లో. మయా తత మిదం సర్వం జగ దవ్యక్త మూర్తినా
మత్ స్థాని సర్వ భూతాని; న చాహం తే ష్వవస్థితః. 4

గీ. అరయ నవ్యక్తమయి యొప్పు-నట్టి వాఁడు
పరమభావముచే చరా-చరములన్ని
కరము వ్యాపింపఁబడినవి;-కాని వాని
యందు నేను లేనని తెలి-యంగ వలయు.

తా. ఈ జగత్తంతయు ఇంద్రియములకు గోచరముకాని స్వరూపముగల వాచే వ్యాపింపఁ బడియున్నది. సమస్త భూతములును నాయందున్నవి. నేను మాత్ర మా భూతముల యందు లేను.

శ్లో. న చ మత్స్థాని భూతాని; పశ్యమే యోగ మైశ్వరమ్,
భూతభృ న్న చ భూతస్థో మమాత్మా భూతభావనః. 5

గీ. భూతములు లేవు నా యందు;-భూతముల భ
రించుచున్నను, మఱి, వాని-నెసఁగి వృద్ధి
పఱచుచున్నను, నా స్వరూ-పంబు లేద
టంచుఁ దెలిసికొనుము వాని-యందుఁ బార్థ!

తా. భూతములు నాయందు లేవు. నా యథార్థస్థితిని దెల్పుచున్నాను, వినుము. నాయొక్క స్వరూపము భూతములను భరించుచు వృద్ధిఁబొందించుచున్నను నేను వానియందు లేను:

శ్లో. యథాఽఽకాశ స్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్,
తథా సర్వాణి భూతాని మత్స్థానీ త్యుపధారయ. 6

గీ. ఎటుల జగతినంతటను వ్యా-పించి యుండు
గాలి లీనమై యుండు నా-కాశమందు,
నటుల సకల లోకములు నా-యందు నణఁగి
యుండునని నీవెఱుఁగ వల-యును గిరీటి!



తా. అంతటను వ్యాపించియున్న వాయు వెట్లాకాశమం దణగియున్నదో, అట్లు సమస్త భూతములు నాయందున్నవని తెలిసికొనుము.

శ్లో. సర్వభూతాని కౌంతేయ! ప్రకృతిం యాంతి మామికామ్,
కల్పక్షయే; పునస్తాని కల్పాదౌ విసృజా మ్యహం. 7

గీ. ప్రళయకాలమం దెల్ల ప్ర-పంచములు, ల
యంబు నొందు నా సంబంధ-మైన ప్రకృతి
యందు; మరల సృష్టి సమయ-మందు నేను
గలుగఁజేయుచున్నాను లో-కముల నెసఁగి.

తా. అర్జునా! కల్పాంతమందు (ప్రళయకాలమందు,)సమస్త భూతములు నా సంబంధమైన ప్రకృతిలో లయించును. సృష్టికాలమందు నేను వానిని మరల బుట్టించుచున్నాను.

శ్లో. ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునః పునః,
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్. 8

గీ. తవిలి సర్వభూతము లస్వ-తంత్రమైన
వగుట నాత్మ మాయను బొంది, -పరఁగ దాని
ప్రకృతి వలనఁ గరము నేను-వానిని మర
ల మరల సృజించు చుందును. - విమలచరిత!

తా. ప్రకృతియొక్క యధీనతవలన నస్వతంత్రమైన సర్వభూతములను నేను నా మాయ నవలంబించి మరల మరల పుట్టించుచున్నాను.

శ్లో. న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ!
ఉదాసీ నవదాసీన మసక్తం తేషు కర్మ సు. 9

గీ. సృష్టి మొదలగు కర్మల - జేయువాఁడ
నైన, నభిమాన రహితుఁడ-గాన నన్నుఁ
గట్టఁజాల; వట్లు ఫలసం-గంబు లేకఁ
గర్మములఁ జేయు పురుషుఁడు-గట్టువడడు.

తా. అర్జునా! నాకు కర్మములం దభిమానము లేదు. అందువలన నన్నవి బంధింపవు.

శ్లో. మయాఽధ్యక్షేణ ప్రకృతి స్సూయతే స చరాచరమ్,
హేతునాఽనేన కౌంతేయ! జగ ద్విపరివర్తతే. 10





గీ. జ్ఞానమాత్ర స్వరూపుండ–నైన నేను
సాక్షిభూతుండనుగ నుండ–సకల భువన
జాలమును బుట్టుచుండు; నీ–సాక్షి ధర్మ
ము వలన నడుచు నీ జగం–బు సకలంబు.

తా. అర్జునా! జ్ఞాన స్వరూపుఁడనగు నేను సాక్షిగా నుండగా, స్థావర జంగమాత్మకమైన సర్వప్రపంచము నా ప్రకృతియందు పుట్టుచున్నది.

శ్లో. అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్,
పరంభావ మజానంతో మమ భూత మహేశ్వరమ్. 11

గీ. కనఁగ లోక నియామక–మును, బరంబు
నైన నా భావముఁ దెలియ–నట్టి మూఢ
జనులు నన్ను మానుష దేహ–మును ధరించి
నట్టి వానిగ భావింతు–రర్జునుండ!

తా. సర్వభూత నియామకమైనట్టియు, ఉత్కృష్టమైనట్టియు నా తత్త్వమును దెలియని మూఢులు నేను మనుష్య శరీరమును ధరించి యుండుట చేత న న్నలక్ష్యము చేయుచున్నారు.

శ్లో. మోఘాశా మోఘ కర్మాణో మోఘ జ్ఞానా విచేతసః,
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః 12

గీ. అట్టిజనులు వ్యర్థమయిన–యాశలు గల
వారుగను, వ్యర్థకర్మలు,–వ్యర్థమైన
జ్ఞానముగలవారుగ నుండి,–సతత మసుర
రూపమును, గామ మత్సర–రూపమును, బ
డపడి, మోహనంబునునయి–తనరు ప్రకృతి
కి వశులై, నన్నుఁ గానరు–భువిని బార్థ!

గీ. అట్టి వారు వ్యర్థాశను, వ్యర్థజ్ఞానమును, వ్యర్థ కర్మములను గలిగియుండి, హింసా రూపమును, కామక్రోధాదులతోఁ గూడుకొన్నదియును, మోహన రూపమునునైన ప్రకృతి నాశ్రయించిన వారలై నన్నలక్ష్యము చేయుచున్నారు.



**మహాత్మానస్తు మాం పార్థ! దైవీ ప్రకృతి మాశ్రితాః,**
**భజం త్యనన్య మనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్.** 13

తిరముగ మహాత్ములగు వారు-దేవతా ప్ర
కృతిని బొంది, వినాశర-హితుఁడ, మఱియు
భూతహేతుండనగు నన్నుఁ-బూజసేయు
చుందు రితర చింతలు లేక-డెందమందు.

అర్జునా! మహాత్ములు దేవతా సంబంధమైన ప్రకృతి నాశ్రయించినవారలై, భూత కారణుఁడను నాశరహితుఁడను నైన నన్నుఁ దెలిసికొని, ఇతర విషయములందాసక్తి లేనివారై నన్నే భజించుచున్నారు.

**సతతం కీర్తయంతో మాం యతంత శ్చ దృఢవ్రతాః,**
**నమస్యంత శ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే.** 14

దృఢమగు వ్రతము నొంది, యింద్రియ నియమముఁ
గలిగినట్టి కొంద ఱెడతె-గని సమాధి
చింతనము నందు మునిగి, ని-రంతరంబు
నన్నుఁ దలచుచు, భక్తితో-నాకు వంద
నములు సేయుచుఁ గొల్చుచు-న్నారు నన్ను
శ్రద్ధతోడ నత్యంతము,-సవ్యసాచి!

జితేంద్రియులును, దృఢవ్రతులును నైన కొందు, ఎడతెగని సమాధి చింతనము గలవారై, నన్ను నిరంతరము స్మరించుచును, భక్తితో నమస్కరించుచును నన్ను భజించుచున్నారు.

**జ్ఞాన యజ్ఞేన చాప్యన్యే యజంతో మా ముపాసతే,**
**ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతో ముఖమ్.** 15

ధరణి జ్ఞానయజ్ఞమునఁ గొం-ద, ఱొకఁడనెడు
భావముఁ గలిగి కొందఱు,-భక్తిభావ
మున సమస్త దైవస్వరూ-పుం డనుచును
గొందఱు, గొలుతురు బహుభం-గులుగ నన్ను.





తా. మఱికొందఱు జ్ఞానయజ్ఞము చేతను, కొందఱంతయు బ్రహ్మమను భావము చేతను, కొందఱు సేవ్య సేవక భావము చేతను, కొందఱు సమస్త దైవ స్వరూప భావము చేతను నన్ను సేవించుచున్నారు.

శ్లో. అహం క్రతు రహం యజ్ఞః స్వధాఽహ మహ మౌషధమ్,
మంత్రోఽహ మహ మేవాజ్య మహ మగ్ని రహం హుతమ్. 16

గీ. శ్రౌతకర్మంబు, మంత్రంబు,-స్మార్తకర్మ,
మన్నమును, హోమకర్మంబు-*హవియు, వహ్ని,
పైతృకంబగు కర్మంబు-పరఁగ నన్ని
యును దెలియవలయును నేనె-యని కిరీటి!

తా. జ్యోతిష్టోమాది యజ్ఞకర్మము నేను, స్మార్తకర్మము నేను. పైతృకకర్మము నేను (ఓషధీ వికారమైన అన్నము నేను, మంత్రము నేను) ఆజ్యాది హవిస్సు నేను, అగ్నిహోత్రము నేను, హోమకర్మము నేను.

శ్లో. పితాఽహ మస్య జగతో మాతా ధాతా పితామహః,
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజురేవచ. 17

గీ. ఎల్లలోకములకు నేను-దల్లి, నింక
దండ్రియు నేను, మఱియుఁ బి-తామహుండ
నేను, గర్మఫలదుఁడను-నేను, వేద్య
వస్తువు మఱియుఁ బావన-వస్తువగుదు
నేను, శ్రేష్ఠంబు సర్వంబు-నేను బార్థ!

తా. ఈ జగత్తునకు తండ్రియు, తల్లియు, కర్మఫలప్రదుఁడును, తాతయు, తెలియఁదగిన వస్తువును, పవిత్ర వస్తువును, ఓంకారమును, ఋగ్యజుస్సామవేదములును, నేనయై యున్నాను.

శ్లో. గతిర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్,
ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజ మవ్యయమ్. 18

* హవి = హోమద్రవ్యము



గీ. సర్వసాక్షి, కర్మఫల, మీ-శ్వరుఁడు, పోష
కుండు, వాస, మాశ్రయము, మి-త్రుండు, సంభ
వంబు, స్థితి, ప్రళయము, నిధా-నంబు, నాశ
రహిత సర్వ ప్రపంచ కా-రణము నేను.

తా. కర్మఫలము, పోషకుఁడు, ఈశ్వరుఁడు, సాక్షి, ఉనికిపట్టు, ఆశ్రయము, మిత్రుఁడు, ఉత్పత్తి, స్థితి, సంహారము, నిక్షేపము, నాశములేనట్టి జగదుత్పత్తి కారణమైన బీజము నేనే.

శ్లో. తపా మ్యహ మహం, వర్ష నిగృహ్ణా మ్యుత్సృజామి చ,
అమృతం చైవ మృత్యు శ్చ సదస చ్చాహ మర్జున! 19

గీ. వర్షము, మఱియు నుష్ణంబు,-వర్ష మాపు
వా, డమృతము, మృత్యువు, మఱి-ప్రకృతి వికృతు
లైన స్థూల సూక్ష్మములును-నేనె యగుదు
నంచుఁ గొలుచుచున్నారు న-న్నర్జునుండ!

తా. అర్జునా! నేను ఉష్ణము చేత తపింపఁజేయువాఁడ ననియును, వర్షమును కురిపించువాఁడననియును, వర్షమును నిరోధించువాఁడననియును, అమరత్వము మృత్యువు స్థూలము సూక్ష్మము నేనెయనియును జనులు నన్నుపాసించుచున్నారు.

శ్లో. త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయం తే,
తే పుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యాన్ దివి దేవ భోగాన్. 20

గీ. ఆగమత్రయ విదులయి-యవని సోమ
పానము సలిపి, యఘములఁ-బాసి, యజ్ఞ
ముల వలన నన్నుఁ గొల్చువా-రలు, త్రిదివముఁ
బడసి, యనుభవింతు రచట-స్వర్గసుఖము.

తా. సోమపానము చేసి, పాపములను నశింపఁజేసికొని, అగ్నిష్టోమాది యజ్ఞముల చేత నన్నుఁ బూజించి స్వర్గప్రాప్తిని గోరువారు పవిత్రమైన యింద్రలోకమును బొంది యచ్చట దివ్య సుఖముల ననుభవించుచున్నారు.





శ్లో. తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి,
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభంతే. 21

గీ. అట్టివారు స్వర్గసుఖము-లనుభవించి
పుణ్యము నశింపఁగ మరల-పుడమి యందు
బుట్టుదు; రిటు నిగమకర్మ-ము లొనరించు
వారు స్వర్గమును ధరనుఁ-బడయుచుంద్రు.

తా. వారు విస్తారములైన యా స్వర్గ సుఖముల ననుభవించి, తమ పుణ్యకర్మఫలము క్షీణించిన తరువాత మరల మనుష్యలోకము నందు జన్మించుచున్నారు. ఈ ప్రకారముగా ఫలకాంక్షతో వేద కర్మములను జేయువారు స్వర్గలోకమునకు బోవుచు మరల మనుష్యలోకమందు బుట్టుచున్నారు.

శ్లో. అనన్యా శ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్. 22

గీ. ఇతర దేవతలఁ గొలువ-కెలమి నన్నె
శరణుపొంది యారాధించు-చలన రహిత
బుద్ధి గల జనులకు యోగ-మును బదపడి
క్షేమమును గూర్చుదును నేనె-చేరి పార్థ!

తా. ఏ జను లితర దేవతల నుపాసింపక నన్నే ధ్యానించుచు భజించుచున్నారో, అట్టి నిశ్చల చిత్తులైన జనులకు యోగక్షేమములను నేనే పొందించుచున్నాను.

శ్లో. యేఽప్యన్య దేవతా భక్తా యజంతే శ్రద్ధ యాన్వితాః
తేఽపి మామేవ కౌంతేయ! యజంత్య విధి పూర్వకమ్. 23

గీ. ధరణి భక్తితోడ నితర-దైవతములఁ
గొల్చువారు, మోక్షమునందుఁ-గోర్కెలేని
వారు, నజ్ఞానులును నైనఁ-బార్థ! నన్నె
కొలుచుచున్నా రటంచును-దెలిసికొనుము.



తా. అర్జునా! ఏ జనులు శ్రద్ధాభక్తులతో నితర దేవతలను బూజించుచున్నారో, ఆ జనులు మోక్షమును బొందింపనట్టి విధానముచే నన్నే పూజించుచున్నారు.

శ్లో. అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ,
న తు మా మభిజానంతి తత్త్వేనాత శ్చ్యవంతి తే. 24

గీ. శ్రౌత కర్మలకు మఱియు-స్మార్తకర్మ
ములకుఁ దగ భోక్తయును నధి-భువును నేనె;
నా యథార్థంబు నెఱుఁగని-నరులు స్వర్గ
సుఖముఁ బొంది, మరల బుట్టు-చుంద్రు భువిని.

తా. సర్వ శ్రౌత స్మార్త కర్మముల ననుభవించువాఁడును, దానికి ప్రభువును నేనే. నన్ను యథార్థముగ తెలియనివారు కామ్యకర్మముల నాచరించి, స్వర్గలోకమును బొంది యచ్చట చాలకాలము దివ్యసుఖముల ననుభవించుట చేతఁ బుణ్యఫలమంత మొందగ మరల మనుష్యలోకమందుఁ బుట్టుచున్నారు.

శ్లో. యాంతి దేవవ్రతా దేవాన్
పితౄన్ యాంతి పితృవ్రతాః,
భూతాని యాంతి భూతేజ్యా
యాంతి మద్యాజినోఽపి మామ్. 25

గీ. దేవతలఁ గొల్చువారలు-దేవలోక
ములను, బితృదేవతలఁ గొల్చు-పురుషులు పితృ
లోకమును, భూతములను గొ-లుచు పురుషులు
భూత గణలోకమును, దగఁ-బొందుదు రిఁక
భక్తియును శ్రద్ధయును గల్గి-పరఁగ నన్నుఁ
బూజసేయు వారలు నన్నె-పొందగలరు.

తా. దేవతలను పూజించు వారా యా దేవతల యొక్క లోకములను బొందుచున్నారు. పితృ దేవతలను పూజించువారు పితృ లోకమును పొందుచున్నారు. భూతములను పూజించు వారా భూతగణ లోకములను పొందుచున్నారు. నన్ను పూజించువారు నన్ను పొందుచున్నారు.





శ్లో. పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః. 26

గీ. పత్రమైనఁ బుష్పమయిన-భక్తి నెవ్వఁ
డర్పణ మొనరుచునొ నాకు;-నటుల వాడు
భక్తితో సమర్పించు నా-వస్తు వేనె
యారగించుచున్నాను, పృ-థాత్మజుండ!

తా. ఎవఁడైనను నాకు భక్తి పూర్వకముగా ఆకును గాని, పుష్పమును గాని ఫలమును గాని ఉదకమును గాని సమర్పించినను, భక్తితో సమర్పింపఁబడిన యా పత్రము మొదలగు వానిని నేను ప్రీతితో భక్షించుచున్నాను.

శ్లో. యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ! తత్కురుష్వ మదర్పణమ్. 27

గీ. నీవు చేయు కర్మములను,-నీవు తినెడి
వస్తువులను, వేల్చెడి హవ్య-వస్తువులను,
సల్పునట్టి దానములను,- సలుపు తపము,
నర్పణ మొనరింపుము నాకు-నేర్పుతోడ.

తా. అర్జునా! నీవు చేయు కర్మములను, భుజించు పదార్థములను, వేల్చు హోమ ద్రవ్యములను, చేయు దానములను, ఆచరించు తపస్సును నాకు సమర్పణ మొనరింపుము.

శ్లో. శుభాశుభ ఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః,
సన్న్యాస యోగ యుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి. 28

గీ. కోరి సన్న్యాసయోగ యు-క్తుండవయినఁ
గర్మఫలము నిన్నెప్పుడు-కట్టఁజాల
దట్లు కర్మఫల విముక్తి-నంది సరగ
నన్నుఁ బొందఁగలవు సుగు-ణమణి జలధి!

తా. ఈ విధముగ నీవు విషయ పరిత్యాగముతో గూడిన యాత్మగల వాఁడవగుదువేని, పుణ్యాపాపములనెడు కర్మబంధము నుండి విముక్తుఁడవై నన్ను (మోక్షమును) బొందఁగలవు.



శ్లో. సమోఽహం సర్వభూతేషు నమే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతితు మాం భక్త్యా మయి తే; తేషు చాప్యహమ్. 29

గీ. సర్వభూతములకు నేను-సముఁడఁ; బ్రియుఁడు
నప్రియుండును లేడు నా-కరయ; నన్నుఁ
గొలుచు పురుషుండు నా యందు-నిలుచువాఁడు;
వాని యందు నిలచి యుందు-నేను పార్థ!

తా. నేను సర్వభూతములకును సముఁడను. నాకిష్టుఁడు గాని అనిష్టుఁడు గాని లేడు. భక్తితో నన్ను భజించుచున్నవారు నా యందున్నవారు. నేను వారి యందున్నాను.

శ్లో. అపి చేత్సు దురాచారో భజతే మా మనన్యభాక్,
సాధురేవ సమంతవ్య స్సమ్యగ్వ్యవసితోహి సః. 30

గీ. ఇల దురాచారుఁడైనను-నితర దేవ
తను గొలువక నన్నె కొలుచు-మనుజుఁ డాత్మ
తత్త్వ విదుఁడైన నాదు భ-క్తవరుఁడగుట
చే, సదాచారుఁడని తెలి-సికొనవలయు.

తా. మిక్కిలి దురాచారము గలవాఁడైను, అన్య దేవతను భజింపక నన్నే భజించుచున్న యెడల, అట్టివాఁడు మోక్షము కొఱకుఁ బ్రయత్నము చేయుచున్నవాఁడగుట వలన సదాచారము గల వాఁడే యని తెలిసికొనుము.

శ్లో. క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వ చ్ఛాంతిం నిగచ్ఛతి,
కౌంతేయ! ప్రతిజానీహి నమే భక్తః ప్రణశ్యతి. 31

గీ. అతఁడు త్వరగ ధర్మనిరతుఁ-డై, పడయును
శాశ్వతంబైన శాంతిని-సవ్యసాచి!
అంతరాత్మను గడఁగి నా-కర్పణం బొ
నర్చువారికిఁ గలుగదు-నాశ మెపుడు.

తా. అట్టి పురుషుఁడు శీఘ్రముగా ధర్మముందాసక్తి గలవాఁడై, నిత్యమైన పరమశాంతిని బొందుచున్నాడు. అర్జునా! నా భక్తుఁడు నశింపడని తెలిసికొనుము.

శ్లో. మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేపిస్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాంతి పరాంగతిమ్. 32





గీ. నీచ జన్మలు గలవారు, - నెలత, లింక
కోమటులు, శూద్రులును, నన్నుఁ-గొలుచువార
యిన యెడల, జన్మరహితమ-యిన పరమ గ
తిని బడయుదురటంచును-దెలియు మీవు.

తా. అర్జునా! నికృష్టజన్మముగలవారును, స్త్రీలును, వైశ్యులును, శూద్రులును నన్నాశ్రయ మొందిన వారగుదురేని, ఉత్కృష్టమైన గతిని బొందుచున్నారు.

శ్లో. కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా,
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వమామ్. 33

గీ. పావనులు భక్తులును నైన-బ్రాహ్మణులును,
క్షత్రియులును నుత్తమమైన-గతిని బొందు
దురని వేఱె చెప్పగనేల?-తుచ్ఛ సుఖయు
తమును, క్షణభంగురమునునై-తనరునట్టి
యీ ప్రపంచము నందు జ-న్మించినట్టి
నీవు నన్ను భజింపుము-నిర్మలాత్మ.

తా. కావున పవిత్రులును భక్తులును నైన బ్రాహ్మణులును, రాజర్షులును ఉత్కృష్టగతిని బొందుదురని చెప్పుటలో సందేహము లేదు. క్షణభంగురమును సుఖవర్జితమును నైన యీ లోకమందు జన్మించిన నీవు నన్ను భజింపుము.

శ్లో. మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః. 34

(రాజవిద్యా రాజగుహ్యయోగో నామ నవమాధ్యాయ స్సంపూర్ణమ్)

గీ. నీ మనస్సును నాయందు-నిలిపి, భక్తి
తోడ నన్నుఁ గొలిచి ప్రణ-తుండవగుము
నా; కీటుల నెల్లవేళల-నన్ను మనసు
నందు ధ్యానింపగను నన్నె-పొందగలవు.

తా. నీవు నాయందు నిశ్చలమైన మనస్సు గలవాఁడవై, నాయందు భక్తి గలిగి నన్ను భజించుచు నన్ను నమస్కరింపుము. ఈ ప్రకారముగా నీవెల్లప్పుడును నాయందు ప్రీతి గలవాఁడవై, నాయందు నిశ్చలముగ మనస్సును నిలిపి యుంచితివేని నన్నే పొందగలవు.

(రాజవిద్యా రాజగుహ్యయోగమనెడి నవమాధ్యాయము సంపూర్ణము)



## దశమోఽధ్యాయః

## విభూతి యోగః

శ్రీ భగవాన్ ఉవాచ :

శ్లో. భూయ ఏవ మహాబాహో! శ్రుణు మే పరమం వచః,
యత్తేహం ప్రీయ మాణాయ వక్ష్యామి హిత కామ్యయా. 1

శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు :

గీ. "నీవు సూపు శ్రద్ధను గాంచి-నీకు మేలు
సేయు తలఁపుతో నేనింకఁ-జెప్పఁబోవు
వాక్యముల నాలకింపుము-ఫల్గున!"యని
పలికె నిట్టుల దానవ-వైరి మరల.

తా. అర్జునా! నా మాటలను ప్రీతితో వినుచున్న నీకు హితము చేయవలెనను కోరికతో నీకు మరల చెప్పబోవుచున్న యీ యుత్కృష్టమైన వాక్యమును వినుము.

శ్లో. న మే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః,
అహ మాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః. 2

గీ. దేవగణములు ఋషులును-దెలియకుంద్రు
నాదు యుత్పత్తి విషయంబు;-నాదితేయు
లకును ఋషులకును, జగము-నకును నేనె
కాదె యుత్పత్తి హేతువు-కనఁగఁ బార్థ!

తా. దేవతలును మహర్షులును నాయొక్క పుట్టుకను దెలియరు. ఆ దేవతలకును మహర్షులకును నేనె యుత్పత్తి కారణమైనవాఁడను గదా!

శ్లో. యో మా మజ మనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్,
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే. 3

గీ. ఆది శూన్యుండననియును,-నజుఁడ ననియు
ను, భువనేశ్వరుండననియు-ను, దగ నన్నుఁ





దెలియు-పురుషుండు మోహ క-శ్మలముఁ బాసి
పాపముల వలన విడువఁ-బడును సుమ్ము.

తా. నే నాద్యంతములు లేనివాఁడననియును, పుట్టుక లేనివాఁడననియును, సర్వలోకములకు నియామకుఁడ ననియును దెలియు పురుషుఁడు, అజ్ఞానమును బాసినవాఁడై, సమస్త పాపములచేత విడువఁబడును.

శ్లో. బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమ శ్శమః,
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాఽభయ మేవ చ. 4

శ్లో. అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽయశః,
భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః. 5

గీ. పుడమి మోహరాహిత్యంబు,-బుద్ధి, యోర్పు,
జ్ఞానము, దమము, సత్యంబు-శమము, శాంతి,
భయము, సుఖ దుఃఖములు, పుట్టు-టయును, జచ్చు
టయును, సమతయు, హింసలే-మియును, దుష్టి,
తపము, కీర్త్యపకీర్తులు,-దాన మనెడి
భావములు గల్గు నాచేత-బ్రాణితతికి.

తా. బుద్ధి, జ్ఞానము, పొరబాటుఁ జెందకుండుట, ఓర్పు, సత్యము, బాహ్యేంద్రియ నిగ్రహము, అంతరింద్రియ నిగ్రహము, సుఖము, దుఃఖము, ఉత్పత్తి, నాశము, భయము, నిర్భయత్వము, అహింస, సమత్వము, సంతోషము, తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి యనెడి నానావిధ భావములు ప్రాణులకు నా వలననే గలుగుచున్నవి.

శ్లో. మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా,
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః. 6

గీ. ఎసఁగ కశ్యపాది మహర్షు-లేడుగురును,
మనువులు నలువురును, నా వ-లన మనస్సు
చేతఁ బుట్టింపఁబడి; రింక-భూతగణము
లన్నియును వీరలకుఁ బుట్టె-నర్జునుండ!

తా. కశ్యపాది సప్త మహర్షులును, స్వాయంభువాది మనువులు నలుగురును నా మనస్సు చేత నాయందు మనస్సు గలవారై పుట్టిరి. వీరికి లోకమందున్న సర్వ చరాచరాత్మక భూతములు పుట్టెను.



శ్లో. ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః,
సోఽవికంపేన యోగేన యుజ్యతే; నాత్ర సంశయః. 7

గీ. అవని నెవఁడు నేను నుడివి-నట్టి నా వి
భూతి యోగ మహిమలను-బొసఁగఁ దెలియు
నో యతండు స్థిరమయిన-యోగసిద్ధిఁ
బొందఁగలడు, సందియము లే-దిందుఁ బార్థ!

తా. ఈ చెప్పఁబడిన నా విభూతి యోగములను యథార్థముగఁ దెలిసికొను పురుషుఁడు నిస్సంశయముగ నిశ్చలమైన యోగముతో గూర్పఁబడుచున్నాడు.

శ్లో. అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే,
ఇతి మత్వా భజంతే మాం బుధా భావ సమన్వితాః. 8

గీ. సృష్టి కారణుండను నేనె; - చేరి నా ప్ర
భావము వలన సకల ప్ర-పంచములును
నిలచియున్న; వివ్విధముగ-దెలిసి పండి
తులు నిరతము నన్నుఁ గొలుతు-రెలమిఁ బార్థ!

తా. నేనే సర్వసృష్టికినిఁ గారణమైనవాఁడను. నా ప్రభావముననే సర్వ ప్రపంచములు ప్రవర్తించుచున్నవి. ఈ విషయము నెఱిఁగిన పండితులు మోక్షమును బొందఁగోరిక కలవారై, నన్ను భజించుచున్నారు.

శ్లో. మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్,
కథయంత శ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ. 9

గీ. మఱియు బుధులు నా యందు-మనసు నుంచి,
ప్రాణములను నాయందు న-ర్పణము చేసి,
నా స్వభావ మహిమల నొ-నరుగఁ దెలిసి
యొకరి కొకరు నా మహిమంబు-నుగ్గడించు
కొనుచు, నన్నుఁ గీర్తించుచు,-ననుభవింపు
చుందురు సతతంబుఁ బరమా-నంద సుఖము.

తా. మఱియు నట్టి పండితులు నాయందు నిల్పఁబడిన మనస్సు గలవారై, తమ





ప్రాణములను నా యందర్పణము చేసి, నా స్వభావ మాహాత్మ్యముల నొండొరులకుఁ జెప్పుకొనుచును, నన్ను కీర్తించుచును, బ్రహ్మానంద సుఖము ననుభవించుచున్నారు.

శ్లో. తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతి పూర్వకమ్,
దదామి బుద్ధియోగం తం; యేన మా ముపయాంతి తే. 10

గీ. ఇటుల నిరతంబు బ్రీతితో-నెసఁగి నన్నుఁ
గొలిచెడు మహాత్ములకు నేనె-కూర్చుచున్న
వాఁడ బుద్ధియోగము; దాని-వలన వారు
నన్నుఁ బొందుచున్నారు వి-జ్ఞాను లగుచు.

తా. ఇటుల నిత్య యుక్తులై విశ్వాస పూర్వకముగ నన్నుఁ గొల్చుచున్న వారికి నేను జ్ఞానయోగమును బ్రసాదించుచున్నాను. ఆ జ్ఞానయోగము చేత వారు నన్నుఁ బొందుచున్నారు.

శ్లో. తేషా మేవానుకంపార్థ మహ మజ్ఞానజం తమః,
నాశయా మ్యాత్మ భావస్థో జ్ఞానదీపేన భాస్వతా. 11

గీ. వారలకు మాత్ర మేను కృ-పాళుఁడనయి,
యెంతటనుఁ బ్రకాశించుచు-న్నట్టి నాదు
జ్ఞాన కాంతిచే వారి య-జ్ఞానతమముఁ
భారదోలుచున్నాఁడను-బాండుపుత్ర!

తా. అట్టి మహాత్ముల యందు మాత్రమే, నేను దయను బూని, నా సర్వ వ్యాపకమైన జ్ఞానమనెడి వెలుతురు చేత వారియొక్క యజ్ఞానమనెడి చీకటిని నశింపఁ జేయుచున్నాను.

అర్జున ఉవాచ :

శ్లో. పరంబ్రహ్మ, పరంధామ పవిత్రం పరమం భవాన్,
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్. 12

శ్లో. ఆహుస్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషిమే. 13



గీ. అవని నిన్నుఁ బరబ్రహ్మ-మనియుఁ బరమ
పావనుఁడనియుఁ బుట్టని-వాఁడనియును,
నిత్యుఁడనియును, నీశుఁడ-నియును, దివ్య
మూర్తియనియును, సురలందు-మొదటివాఁడ
నియు, మఱి, పురాణ పురుషుఁడ-నియును, నార
దుండు, దేవలుండును, నసి-తుఁడును, వ్యాసుఁ
డును మఱియు నందఱు మహర్షు-లును, నుడువుదు
రవ్విధముగ నీవును నీ మ-హత్తునుఁ బ్రక
టించుచున్నావు నా కిపు-డెలమి గృష్ణ!

తా. ఓ కృష్ణా! నీవు పరబ్రహ్మమనియు, పరంధాముఁడవనియు, పరమ పావనుఁడ వనియు, పరమ పురుషుఁడవనియు, శాశ్వతుఁడ వనియు, ప్రకాశ స్వరూపుఁడ వనియు, ఆది దేవతవనియు, పుట్టుక లేనివాఁడవనియు, ప్రభువువనియు, సర్వాంత ర్యామివనియు, నారదుఁడు, అసితుఁడు, దేవలుఁడు, వ్యాసుఁడు ననెడి మహర్షులు చెప్పుదురు. ఆ ప్రకారముగనే నీవును నీ మహిమను గూర్చి నాకు చెప్పుచున్నావు.

శ్లో. సర్వమేత దృతం మన్యే యన్మాం వదసి కేశవ!
నహి తే భగవన్! వ్యక్తిం విదు ర్దేవా న దానవాః. 14

గీ. పేర్మి నీవు దెల్పిన యట్టి-విషయమంత
సత్యమని నమ్మెదును నేను;-నిత్యుఁడవయి
యొప్పు నీ మహత్త్వమును, ది-వౌకసులును,
దానవులును నెఱుఁగరని-తలఁతుఁ గృష్ణ!

తా. ఓ కృష్ణా! నీవు నాకుఁ జెప్పిన యీ సమస్త విషయములు సత్యమైనవిగ విశ్వసించు చున్నాను. ఓ భగవంతుఁడా! నీయొక్క మహిమను దేవతలుగాని రాక్షసులు గాని యెఱుఁగరు.

శ్లో. స్వయ మే వాత్మనాఽఽత్మానం వేత్థ త్వం పురుషోత్తమ!
భూతభావన! భూతేశ! దేవదేవ! జగత్పతే!

గీ. జీవులను వృద్ధిసేయుదు-వీవు; జీవు
లకు నియంతవు; లోకము-లకు బ్రభుండ,





వింకఁ బురుషోత్తముఁడవు; నీ-వె యెఱుఁగుదువు
నిన్నుఁ; దెలియ రెవ్వ రొరులు-నిన్నుఁ గృష్ణ!

తా. ఓ పురుషోత్తమా! నీవు ప్రాణులను వృద్ధి పొందించువాఁడవు. భూతములకు నియామకుఁడవు. లోకనాయకుఁడవు. దేవతలకు దేవుఁడైన వాఁడవు. నీ మాహాత్మ్యమును నీవే యెఱుఁగుదువు కాని మఱి యెవ్వఁడును నెఱుఁగడు.

శ్లో. వక్తు మర్హ స్యశేషేణ దివ్యాహ్యాత్మ విభూతయః,
యాభి ర్విభూతిభి ర్లోకాని మాం స్త్వం వ్యాప్య తిష్ఠసి. 16

గీ. ఎట్టి మహిమలచేత నీ-వెసఁగి లోక
ములను వ్యాపించి వానిని-వెలయఁజేయు
చుందువో, యా మహిమలను-నిందు నాకు
వివరముగఁ దెలుపుము కృష్ణ!-ప్రేమతోడ.

తా. నీయొక్క మాహాత్మ్యము లనేకములై యున్నవి. నీ వే మాహాత్మ్య విస్తారము చేత సమస్త లోకములను వ్యాపించి యున్నావో, వాని నన్నిటిని సవిస్తరముగఁ దెలుపుటకు నీవే తగుదువు.

శ్లో. కథం విద్యా మహం యోగిన్! త్వాం సదా పరిచింతయన్,
కేషు కేషు చ భావేషు చింత్యోఽసి భగవన్మయా! 16

గీ. ఎల్లవేళల ధ్యానించు-చెటుల నిన్నుఁ
దెలిసికొందు? నెట్టి స్వరూప-ములు వహించు
వాఁడవుగ నీవు ధ్యానింపఁ-బడఁదగుదువు?
కరుణతోడ జెప్పుము నాకుఁ-గంసవైరి.

తా. ఓ కృష్ణ స్వామీ! నిన్నెప్పు డే విధముగ ధ్యానము చేసి తెలిసికొనఁగలము? నీ వే స్వరూపములు కలవాఁడవుగ ధ్యానింపఁబడఁదగినవాఁడవు?

శ్లో. విస్తరేణాత్మనో యోగ విభూతిం చ జనార్దన!
భూయః కథయ; తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్. 18

గీ. మరల నీదు యోగంబును,-మహిమనుఁ గృప
తోడ నుడువుము నాకు, చ-తుర్భుజుండ!



అమృత సమమైన నీదు వా-క్యముల నెంత
వినినను గలుగ నేరదు-తనివి నాకు.

తా. ఓ జనార్దన! నీ యోగమును గూర్చియు, ఐశ్వర్యమును గూర్చియు సవిస్తరముగ నాకు మరలఁ జెప్పుము. అమృతపానము వలె మహానందము గలిగించు నీ వాక్యము నెంతగా విన్నను నాకు తృప్తి కలుగదు.

శ్రీ భగవాన్ ఉవాచ :

శ్లో. హంత! తే కథయిష్యామి దివ్యా హ్యాత్మ విభూతయః
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ! నాస్త్యంతో విస్తరస్య మే. 19

గీ. సవ్యసాచి! నా మహిమలు-చాల గలవు;
చేరి లెక్కపెట్టుటకైనఁ-జేతఁగా; ద
యినను, వానిలో ముఖ్యమ-యినవి చెప్పె
దనని హరి పల్కసాగె న-ర్జునుని తోడ.

తా. అర్జునా! దివ్యములైన నా మాహాత్మ్యము లసంఖ్యాకములుగ నున్నవి. అయినను వానిలో ముఖ్యములైనఁ గొన్నిటిని నీకుఁ జెప్పెదను.

శ్లో. అహ మాత్మా గుడాకేశ! సర్వభూతాశయ స్థితః,
అహ మాది శ్చ మధ్యం చ భూతానా మంత ఏవ చ. 20

గీ. భూతవర్గముల హృదయం-బులను నిలచి
యుండునట్టి యాత్మ స్వరూ-పుండు నేనె;
భూతముల సృష్టికర్తయుఁ-బోషకుఁడును,
నాశకర్తయు నేనె, ధ-నంజయుండ!

తా. ఓ యర్జునా! సమస్త భూతముల హృదయములందున్న పరమాత్మ స్వరూపుఁడను నేనే. మఱియు వానియొక్క సృష్టికర్తయు, రక్షకుఁడును, లయకర్తయును నేనే.

శ్లో. ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్.
మరీచి ర్మరుతా మస్మి, నక్షత్రాణా మహం శశీ. 21

గీ. ద్వాదశాదిత్యులందు వి-ష్ణ్వాఖ్యుఁడనగు
దేను; జ్యోతిర్గణముల యం-దినుఁడ నేను;





పవనములలో మరీచి ప-వనము నేను;
చందురుఁడ నేను నక్షత్ర-బృందమందు.

తా. ద్వాదశాదిత్యులలో విష్ణువనెడి యాదిత్యుఁడును, జ్యోతిస్స్వరూపములలో కిరణములు గల సూర్యుఁడును, సప్తవాయువులలో మరీచియను వాయువును, నక్షత్రములలో చంద్రుఁడును నేనె యై యున్నాను.

శ్లో. వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః,
ఇంద్రియాణాం మన శ్చాస్మి, భూతానా మస్మి చేతనా. 22

గీ. వేదములలో నగుదు సామ-వేద మేనె;
యమరగణములం దింద్రుఁడ-నగుదు నేనె;
యింద్రియంబులలో మన-స్సనె యగుదుఁ;
బ్రాణి జాలమందలి బుద్ధి-పార్థ! నేనె.

తా. వేదములలో సామవేదమును, దేవతలలో నింద్రుఁడును, ఇంద్రియములలో మనస్సును, ప్రాణులలోని చైతన్యమును నేనె యై యున్నాను.

శ్లో. రుద్రాణాం శంకర శ్చాస్మి, విత్తేశో యక్ష రక్షసామ్,
వసూనాం పావక శ్చాస్మి; మేరు శ్శిఖరిణా మహమ్. 23

గీ. పదునొకంౘు రుద్రులలోఁ గ-పర్ది నేనె;
యక్షరాక్షసులందు ధ-నాధిపుండు
నేనె; వసువులలో నగ్ని-నేనె; భూధ
రంబులందు మేరు మహీధ-రంబు నేనె.

తా. ఏకాదశ రుద్రులలో శంకరుఁడును, యక్షరక్షో గణములలో కుబేరుఁడును, అష్ట వసువులలో నగ్నియును, పర్వతములలో మేరు పర్వతమును నేనె యై యున్నాను.

శ్లో. పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ! బృహస్పతిమ్,
సేనానీనా మహం స్కంద స్సరసా మస్మి సాగరః. 24

గీ. మఱి, పురోహిత గణమంద-మర పురోహి
తుండయిన బృహస్పతి నేనె;-దండనాయ



క గణమందుఁ గుమారుండ-నగుదు నేనె;
మడుగు లన్నిటిలో *నపాం-పతియు నేనె.

తా. ఓ యర్జునా! పురోహితులలో దేవపురోహితుఁడైన బృహస్పతియు, సేనాధిపతులలోఁ గుమారస్వామియు, మడుగులలో సముద్రమును నేనె యై యున్నాను.

శ్లో. మహర్షీణాం భృగు రహం, గిరా మస్మ్యేక మక్షరమ్,
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి, స్థావరాణాం హిమాలయః. 25

గీ. పేరు గాంచిన ఋషులలో-భృగువు నేనె;
వాగ్గణ-మునందగుదుఁ బ్రణ-వంబు నేనె;
సవన జాలమందు జపయ-జ్ఞంబు నేనె;
యచలముల యందగుదుఁ **దుహి-నాద్రి నేనె.

తా. పేరు గాంచిన ఋషులలో భృగు మహర్షిని నేనె, వాక్ గణమందు ఓంకారమును నేనె, యజ్ఞములలో జప యజ్ఞమును నేనె, పర్వతములలో హిమవత్పర్వతమును నేనె.

శ్లో. అశ్వత్థ స్సర్వవృక్షాణాం, దేవర్షీణాం చ నారదః
గంధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః. 26

గీ. వృక్షములలోన నశ్వత్థ-వృక్ష మేనె;
నారదుండు దేవర్షి గ-ణమున నేనె;
చిత్రరథుఁడను గంధర్వ-శేఖరుండు
నేనె; సిద్ధులందు కపిలుఁ-డేనె సుమ్ము.

తా. వృక్షములలో నశ్వత్థవృక్షము, దేవర్షులలో నారదుఁడు, గంధర్వులలో చిత్రరథుఁడు, సిద్ధులలో కపిల మహామునియు నేనె యై యున్నాను.

శ్లో. ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్,
ఐరావతం గజేన్ద్రాణాం, నరాణాం చ నరాధిపమ్. 27

గీ. హయములలోన నుచ్చైశ్శ్ర-వంబు నేనె;
దంతిబృందమం దైరావ-తంబు నేనె

---

* అపాంపతి = సముద్రుఁడు; ** తుహినాద్రి = హిమవత్పర్వతము





యగుదు; మఱియు మానవులయం-దగుదు నేనె
యధిపుఁడనని తెలిసికొను-మర్జునుండ!

తా. అశ్వములలో ఉచ్చైః(శ్రవము, దిగ్గజములలో ఐరావతము, మనుష్యులలో రాజును నేనె యై యున్నాను.

శ్లో. ఆయుధానా మహం వజ్రం, ధేనూనా మస్మి కామధుక్,
ప్రజన శ్చాస్మి కందర్ప స్సర్పానా మస్మి వాసుకిః. 28

గీ. ఆయుధములందు నేనె వ-జ్రాయుధంబు;
ధేనువులయం దగుదుఁ గామ-ధేను వేనె;
ప్రాణిభవ కారణుఁడగు ద-ర్పకుఁడు నేనె;
వ్యాలముల యందు వాసుకి-నగుదు నేనె.

తా. ఆయుధములలో వజ్రాయుధము, గోవులలో కామధేనువు, ప్రాణుల పుట్టుకకు కారణమైన మన్మథుఁడు, ఒక్క తలగల సర్పములలో వాసుకియు నేనె యై యున్నాను.

శ్లో. అనంత శ్చాస్మి నాగానాం, వరుణో యాదసా మహమ్,
పితౄణా మర్యమా చాస్మి, యమ స్సంయమతా మహమ్. 29

గీ. అరయ నాగుపాముల యందఁ-నంతు డేనె;
వరుణుఁ డగుదు నేనె జలదే-వతల యందు;
అర్యముఁడ నేనె పితృదేవ-తాళియందు;
దండన మొనఁగు వారిలో-ధర్ముఁ డేనె.

తా. బహు శిరస్సులు గల సర్పములలో అనంతుఁడు, జలదేవతలలో వరుణుఁడు, పితృదేవతలలో అర్యముఁడు, దండించువారిలో యముఁడును నేనె యై యున్నాను.

శ్లో. ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం, కాలః కలయతా మహమ్,
మృగాణాం చ మృగేంద్రోఽహం, వైనతేయ శ్చ పక్షిణాం. 30

గీ. అసురగణముల యందుఁ బ్ర-హ్లాదుఁ డేనె;
కాలరూప మృత్యువు నేనె-గణికులందు;
మృగ గణములలోన పంచాస్య-మగుదు నేనె;
మఱియుఁ బక్షులలో గరు-త్మంతుఁ డేనె.



తా. రాక్షసులలో ప్రహ్లాదుఁడును, గణికులలో మృత్యువును, మృగములలో సింహమును, పక్షులలో గరుత్మంతుఁడును నేనె యై యున్నాను.

శ్లో. పవనః పవతా మస్మి, రామ శ్శస్త్ర భృతా మహమ్,
ఝషాణాం మకర శ్చాస్మి, స్రోతసా మస్మి జాహ్నవీ. 31

గీ. గమనము గల వస్తువులందు-గాలి నేనె;
శస్త్రధారుల యందు దా-శరథి నేనె;
మహి ని జల జంతువుల యందు-మకర మేనె;
నిర్ఝరిణులందు జాహ్నవి-నేనె సుమ్ము.

తా. గమన స్వభావము గల వారిలో వాయువు, విలుకాండ్రలో రఘురాముఁడు, జల జంతువులలో మొసలి, నదులలో గంగానదియు నేనె యై యున్నాను.

శ్లో. సర్గాణా మాదిరంత శ్చ మధ్యం చైవాహ మర్జున!
అధ్యాత్మ విద్యా విద్యానాం, వాదః ప్రవదతా మహమ్. 32

గీ. సృష్టులకు మొదలు, నడుము,-చివర, నేనె;
విద్య లన్నిఁటిలో బ్రహ్మ-విద్య నేనె,
వాద మాడు వారలయందు-వాద మేనె;
యంచుఁ దెలియుము శ్వేతవా-హనుఁడ నీవు.

తా. అర్జునా! సృష్టుల యొక్క ఆది స్థితి లయములును, విద్యలలో బ్రహ్మ విద్యయును, వాదించెడి వారి వాదమును నేనె యై యున్నాను.

శ్లో. అక్షరాణా మకారోఽస్మి, ద్వంద్వ స్సామాసి కస్య చ,
అహ మేవా క్షయః కాలో, ధాతాఽహం విశ్వతో ముఖః. 33

గీ. అక్షర గణమున 'అ'కార-మగుదు నేనె;
ద్వంద్వ మేనె సమాస బృం-దంబు నందు;
క్షయము లేని కాలము నేనె;-కర్మఫల మొ
సంగు బ్రహ్మదేవుఁడ నేనె;-సవ్యసాచి!

తా. అక్షరములలో 'అ' కారమును, సమాసములలో ద్వంద్వ సమాసమును, అంతము లేని కాలమును, అన్ని దెసలందు ముఖములు గల బ్రహ్మదేవుఁడును, నేనె యై యున్నాను.





శ్లో. మృత్యు స్సర్వహరశ్చాహ ముద్భవ శ్చ భవిష్యతామ్,
కీర్తి శ్రీర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా. 34

గీ. సర్వనాశ మొనర్చెడి-చావు నేనె;
పుట్టఁబోయెడి వారల-పుట్టు కేనె;
స్త్రీలయందుఁ గీర్తియును, ల-క్ష్మియును, దెలివి,
వాక్కు, ధైర్య, మోరుపు, బుద్ధి-పార్థ! నేనె.

తా. సర్వమును నశింపఁ జేయు మృత్యువు, ముందు పుట్టఁబోవు వారి యొక్క ఉత్పత్తి స్థానములు, స్త్రీల యందు లక్ష్మి, కీర్తి, వాక్కు, జ్ఞాపకశక్తి, బుద్ధి, ధైర్యము, ఓర్పు, నేనె యై యున్నాను.

శ్లో. బృహత్సామ తథా సామ్నాం, గాయత్రీ ఛందసా మహమ్,
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః. 35

గీ. సామవేదములో బృహ-త్సామ మేనె
యగుదు; ఛందస్సులందు గా-యత్రి నేనె;
మాసముల యందగుదు నేనె-మార్గశిరము;
ఋతువులం దగుదు వసంత-ఋతువు నేనె.

తా. సామములలో బృహత్సామము, ఛందస్సులలో గాయత్రీ ఛందస్సు, మాసములలో మార్గశిర మాసము, ఋతువులలో వసంత ఋతువు నేనె యై యున్నాను.

శ్లో. ద్యూతం ఛలయతా మస్మి, తేజ స్తేజస్వినా మహమ్,
జయోఽస్మి, వ్యవసాయోఽస్మి, సత్త్వం సత్త్వవతా మహమ్. 36

గీ. జూదమేనె వంచించు వ-స్తువుల యందు;
తేజము గల వారలయందు-తేజ మేనె;
జయము గల పూరుషులయందు-జయము నేనె;
ఉర్వి యుద్యోగి జనుల యు-ద్యోగ మేనె;
బలము గల పురుషులయందు-బలము నేనె;
బుద్ధి శాలుర యందలి-బుద్ధి నేనె.

తా. వంచకములగు వానిలో జూదము, తేజోవంతుల యొక్క తేజస్సు, జయించువారి



యొక్క జయము, ఉద్యోగవంతుల యుద్యోగము, బలముగల వారియొక్క బలము నేనె యై యున్నాను.

శ్లో. వృష్ణీనాం వాసుదేవోఽస్మి, పాండవానాం ధనంజయః,
మునీనా మప్యహం వ్యాసః, కవీనా ముశనాః కవిః. 37

గీ. వాసుదేవుండు యాదవ-వంశమందు
నేనె; పాండుపుత్రుల యందు-నీవు నేనె;
వ్యాసుఁడగుదు నేనె మునిచ-యంబు నందు;
పండితులయందు శుక్రుండు-పార్థ! నేనె.

తా. యాదవులలో వాసుదేవుఁడు, పాండవులలో అర్జునుఁడను పేరుతో నొప్పు నీవు, మునులలో వ్యాసుఁడు, పండితులలో శుక్రుఁడు నేనె యై యున్నాను.

శ్లో. దండో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్,
మౌనం చై వాస్మి గుహ్యానాం, జ్ఞానం జ్ఞానవతా మహమ్. 38

గీ. దండన సలుపు వారల-దండనీతి
నేనె; గెల్చువారల రాజ-నీతి నేనె;
మౌనమగుదు నేనె రహస్య-మైనవాని
యందు; జ్ఞానంబు జ్ఞానుల-యందు నేనె.

తా. దండించు వారియొక్క దండనీతి, జయింపఁగోరు వారియొక్క రాజనీతి, గోప్య వస్తువులలో మౌనము, జ్ఞానము గల వారి యొక్క జ్ఞానము నేనె యై యున్నాను.

శ్లో. యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున!
న త దస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్. 39

శ్లో. నాం తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప!
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా. 40

గీ. సర్వభూతౌఘమునకుఁ బీ-జంబు నేనె;
ఏనుగానట్టి భూతంబు-లెందు లేవు;
నాదు మహిమంబునకు మేర-లేదు; నీకుఁ
గాను దెలియఁజెప్పితిని సం-గ్రహముగాను.





తా. అర్జునా! సమస్త భూతములకు ఆదికారణము నేనె యై యున్నాను. నేను కానట్టి జంగము స్థావర రూపమయిన భూతములు లేవు. ప్రకాశమానములైన నా యొక్క మాహాత్మ్య విస్తారముల కంతము లేదు. వానిని నీకిప్పుడు సంక్షేపముగాఁ జెప్పితిని.

శ్లో. యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జిత మేవ వా,
తత్తదేవా వగచ్ఛ త్వం మమ తేజోఽంశ సంభవమ్. 41

గీ. ఉర్విలోపల నైశ్వర్య-యుతము, కాంతి
యుతమును, మఱియు నుత్సాహ-యుతమునైన
వస్తు వేది కలదొ దాని-బరఁగఁ దెలిసి
కొనుము నా యంశ చేత పు-ట్టిన దటంచు.

తా. లోకమం దైశ్వర్య యుక్తమైనట్టియు, కాంతి యుక్తమైనట్టియు, ఉత్సాహయుక్త మైనట్టియు, వస్తువులన్నియు నాయొక్క తేజో భాగము వలన సంభవమైనవిగాఁ దెలిసికొనుము.

శ్లో. అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున!
విష్టభ్యాహం మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్. 42

(విభూతియోగోనామ దశమోధ్యాయ స్సంపూర్ణమ్)

గీ. ఇంత వివరించి చెప్పంగ-నేల నీకు?
జగము సర్వంబు నాదు య-సంఖ్యములగు
నంశములలోన నొక్క సూ-క్ష్మాంశము వల
నఁ దగ వ్యాపింపఁబడిన ద-నంగ నొప్పు.

తా. అర్జునా! నా మాహాత్మ్య విస్తారములను వేత్వేఱుగ వివరించి చెప్ప నవసరము లేదు. నే నీ సమస్త జగత్తును, ఒక యంశము చేత వ్యాపించి యున్నానని తెలిసికొనుము.

(విభూతియోగ మనెడి దశమాధ్యాయము సంపూర్ణము)



# ఏకాదశోఽధ్యాయః

## విశ్వరూప సందర్శన యోగః

అర్జున ఉవాచ :

శ్లో. మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మ సంజ్ఞితమ్,
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ. 1

అర్జునుఁడు చెప్పుచున్నాడు :

గీ.. "న న్ననుగ్రహింప నీవు–నాకుఁ జేసి
నట్టి సర్వోత్తమమును, గు–హ్యమును, నాత్మ
యనఁగ నేమొ! మఱి, యనాత్మ–యనఁగ నేమొ!
తెలిసికొనఁజేయఁగలిగిన–దియును నైన
జ్ఞాన విషయోపదేశ తే–జంబువలనఁ
బోయె, వాసుదేవుండ! నా–మోహతమము.

తా. నా యందనుగ్రహమువలన నీవు నా కుపదేశించిన, ఉత్కృష్టమును, గోప్యమును నైన యాత్మానాత్మ వస్తువివేచన విషయమైన వాక్యమువలన నా యజ్ఞానము నశించినది.

శ్లో. భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా,
త్వత్తః కమలపత్రాక్ష! మాహాత్మ్య మపి చావ్యయమ్. 2

శ్లో. ఏవ మేత ద్యథాఽఽత్థత్వ మాత్మానం పరమేశ్వర!
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ! 3

గీ. పరఁగ భూత గణముల యు–త్పత్తి నాశ
ములు, పదపడి నీదు మహిమం–బు వివరముగఁ
దెలిసికొంటిని; మరి, వాసు–దేవ! నీదు
విశ్వ రూపంబుఁ జూడంగ–వేడ్క గలదు.

తా. ఓ కృష్ణా! నీవలన భూతముల యొక్క యుత్పత్తి ప్రళయముల విషయమును, అక్షయమైన నీ మాహాత్మ్యమును సవిస్తరముగాఁ దెలిసికొంటిని. నీవు చెప్పినదంతయు యథార్థమని విశ్వసించుచున్నాను. నీ యాత్మస్వరూప మెట్టిదిగ నీవు చెప్పితివో,





అట్టి జ్ఞానైశ్వర్య బల శక్తి వీర్య తేజస్సులతో గూడిన నీయొక్క రూపమునుఁ జూడఁగోరుచున్నాను.

శ్లో. మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో
యోగేశ్వర! తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్. 4

గీ. కమలనాభ! నీ రూపంబుఁ-గాంచ నాకు
సాధ్యమని తలంచెదవేని-చనవుతోడ
నవ్యయంబును మఱియు వి-శ్వాత్మకంబు
నైన నీరూపమునుఁ జూపు-మయ్య, నాకు."

తా. ఓ ప్రభూ! అట్టి నీ దివ్యరూపమును నేను జూడ గలుగుదునని నీవు తలఁతువేని, దానిని (శాశ్వతమైనట్టి నీయొక్క విశ్వరూపమును) నాకుఁ జూపుము.

శ్రీ భగవా నువాచ :

శ్లో. పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః
నానావిధాని దివ్యాని నానా వర్ణాకృతీని చ. 5

గీ. అని కిరీటి పల్క హరియు-తనికిఁ జెప్ప
సాగె నిట్టులఁ; బలు విశే-షంబులు గల
వియును, దివ్యములును, బలు-విధములును, న
నేక వర్ణయుతములు, న-నేకములును
నైన నాదు రూపంబుల-నర్జునుండ!
చూపెదను వాని వేవ్వేఱఁ-జూడు మిపుడు.

తా. అర్జునా! అనేక విధములును, దివ్యములును, అనేక వర్ణావయవస్థితి విశేషములు గలిగినవియు, అసంఖ్యాకములునునైన నా యొక్క యాకారములను జూడుము.

శ్లో. పశ్యాఽదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుత స్తథా,
బహూ న్యదృష్ట పూర్వాణి పశ్యా శ్చర్యాణి భారత! 6

గీ. ద్వాదశాదిత్యులను, నష్ట-వసువులను, బ
దునొకరగు రుద్రుల, నదితి-తనయ వైద్యు
లైన యాశ్వినేయులను, నే-డైన వాయు
వులను వీక్షింపు మిప్పు డ-బ్బుర మెసంగ.



తా. అర్జునా! ద్వాదశాదిత్యులను, అష్టవసువులను, ఏకాదశ రుద్రులను, అశ్వినీ దేవతలను, సప్త వాయువులను, నీవిదివర కెప్పుడును జూడని యసంఖ్యాకములైన యద్భుతములను జూడుము.

శ్లో. ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్,
మమ దేహే గుడాకేశ! యచ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి. 7

గీ. చరము నచరంబునగు ప్రపం-చంబు నంత
యును, జయాపజయముల, న-ర్జునుఁడ! యింకఁ
జూడదలచిన యట్టి వ-స్తువుల నెల్లఁ
జూడు మిట నా తనువు నందు-వేడు కలర.

తా. అర్జునా! నీవిప్పుడు చరాచరాత్మకమైన సమస్త జగత్తు నాశరీరమందొక ప్రదేశములో నుండుటను గాంచుము. ఇంకను నీ వే యంశములను జూడదలతువో, వానిని జూడుము.

శ్లో. నతు మాం శక్యసే ద్రష్టు మనే నైవ స్వ చక్షుసా,
దివ్యం దదామి తే చక్షుః, పశ్యమే యోగమైశ్వరమ్. 8

గీ. ప్రాకృతములైన నీదు నే-త్రముల తోడ
నాదు దివ్యరూపమునుఁ గాం-చంగ లేవు;
గాన దివ్యదృష్టి నొసఁగు-దేను నీకుఁ,
గాంచుదువు దాన నాదు యో-గ మహిమమును.

తా. ఈ ప్రాకృతములైన నీనేత్రములతో నన్నుఁ జూడ జాలవు. నీకు దివ్యదృష్టి నొసగెదను. దాని సహాయమున, ఈశ్వర సంబంధమైన నా యోగశక్తి యొక్క ఐశ్వర్యమును జూడుము.

సంజయ ఉవాచ :

శ్లో. ఏవ ముక్త్వా తతో రాజన్! మహాయోగేశ్వరో హరిః,
దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరమ్. 9

గీ. అని మహాయోగియగు జనా-ర్దనుఁడు పలికి,
యంత పరమంబు మఱియు ది-వ్యంబునైన
తనదు విశ్వరూపము నర్జు-నునకుఁ జూపె
ననియె ధృతరాష్ట్రుతో సంజ-యార్యుఁ డెలమి.





తా. ఓ ధృతరాష్ట్రా! మహాయోగేశ్వరుఁడైన శ్రీకృష్ణుఁడిట్లు పలికి ఉత్కృష్టమైనట్టియు, ఈశ్వర సంబంధమైనట్టియు తన విశ్వరూపమును అర్జునునకుఁ జూపెను.

శ్లో. అనేక వక్త్ర నయన మనే కాద్భుత దర్శనమ్,
అనేక దివ్యాభరణం దివ్యా నేకో ద్యతాయుధమ్. 10

గీ. అది యనేక ముఖములు, స-యనము, లద్భు
తములు, దివ్యాభరణ సమూ-హములు, శస్త్ర
ములును గలిగి, కండ్లు మిఱుమి-ట్లులు వహించు
నటులఁ గరము చెన్నొందె, భ-యంకరముగ.

తా. ఆ రూప మనేక ముఖములు, అనేక నేత్రములు, అనేకాద్భుత దృశ్యములు, అనేక దివ్యాభరణములు, ఎత్తబడి యున్న యనేక దివ్యాయుధములు గలిగి యుండెను.

శ్లో. దివ్యమాల్యాంబర ధరం, దివ్యగంధానులేపనమ్,
సర్వాశ్చర్య మయం దేవ మనంతం విశ్వతో ముఖమ్. 11

గీ. మఱియు దివ్యహారములను,-మంచిపుట్ట
ములను, బరిమళ లేపన-ములను దాల్చి
యంతటను ముఖములు గల్గి,-యది చెలంగె;
నట్టి రూపంబు వీక్షించె-నర్జునుండు.

తా. దివ్యములైన హారములను వస్త్రములను ధరించినట్టియు, దివ్యగంధ లేపనము గల్గినట్టియు మిక్కిలి యాశ్చర్యకరముగ నున్నట్టియు శ్రీకృష్ణుని స్వరూపము నర్జునుఁడు చూచెను.

శ్లో. దివి సూర్య సహస్రస్య భవే ద్యుగప దుత్థితా
యదిభా స్సదృశీ సా స్యాద్భాస స్తస్య మహాత్మనః. 12

గీ. ఏకకాలము నందు వే-యి గ్రహపతులు
గగనమం దుదయించినఁ-గాంతి యెటుల
నుండు; నవ్విధమున వెలు-గొందె దివ్య
మైన యా రూపకాంతి మ-హాద్భుతముగ.

తా. ఆ దివ్య స్వరూపమాకాశము నం దేకకాలమున సహస్రసూర్యులు ప్రకాశించిన నెంతకాంతి యుండునో, అంత కాంతి గలిగియుండెను.



శ్లో. తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా,
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాండవ స్తథా. 13

గీ. పలుతెఱంగులుగఁ గర మే-ర్పఱుపఁబడిన
యెల్ల జగమును దేవుఁ డ-యిన యుపేంద్రు
యొడలియం దొక్క ప్రక్కన-నుండుటను, ద
గఁ గనుఁగొనియె బీభత్సుండు-కౌరవేంద్ర!

తా. అర్జునుఁ డప్పుడు సూర్యచంద్రాది గోళములు, దేవతలు, రాక్షసులు, యక్షులు, గంధర్వులు, మనుష్యులు, తిర్యగ్జంతువులు మొదలైన బహు ప్రకారములుగ నేర్పఱుపఁబడియున్న సమస్త జగత్తు, శ్రీకృష్ణుని యొక్క యా దివ్య స్వరూప మందొక్క స్థానమందుండుటను జూచెను.

శ్లో. తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః,
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత. 14

గీ. అంతఁ బార్థుండు చిత్త వి-భ్రాంతి నొంది
దేహము పులకరింపఁగఁ-దివిరి విశ్వ
రూపధరుఁడైన పీతాంబ-రునకు మ్రొక్కి
చేతులు మొగిచి, యిటుల ప-లించె నధిప!

తా. అప్పు డర్జునుఁ డాశ్చర్యముతో గూడుకొనిన వాఁడై, గగుర్పాటు చెంది, విశ్వరూప ధరుఁడైన శ్రీకృష్ణునికి నమస్కరించి, చేతులు మోడ్చి యిట్లు పలికెను.

అర్జున ఉవాచ :

శ్లో. పశ్యామి దేవాం స్తవ దేవ! దేహే
సర్వాం స్తథా భూత విశేష సంఘాన్,
బ్రహ్మాణ మీశం కమలాసనస్థం
ఋషీం శ్చ సర్వా నురగాం శ్చ దివ్యాన్. 15

గీ. "నీ శరీరమున సకల-నిర్జరులను,
ప్రాణికోట్లను, గముల సం-భవుని, ఋషుల
నందఱ, నిక, వాసుకి మొద-లైన దేవ
నాగములను, వీక్షించుచు-న్నాను, దేవ!





తా. ఓ దేవా! నీ దేహమందు దేవతలను, బహు విధములైన భూత సంఘములను, కమలాసనమందున్న చతుర్ముఖ బ్రహ్మను, సమస్త ఋషులను, దేవ సర్పములను జూచుచున్నాను.

శ్లో. అనేక బాహూదర వక్త్ర నేత్రం పశ్యామి త్వాం సర్వతోఽనంత రూపమ్,
నాంతం న మధ్యం న పునస్త వాదిం పశ్యామి విశ్వేశ్వర! విశ్వరూపమ్. 16

గీ. నీదు విశ్వరూప మనేక-నేత్రములు, ము
ఖము, లుదరములు, సేతులు-గలిగి యెల్లె
డలను వ్యాపించి, యీశ! మొ-దలు, దుదయును
మధ్యమును లేకయున్నది-మహిమ మెసఁగ.

తా. ఓ విశ్వేశ్వరా! అనేక బాహువులు, ఉదరములు, ముఖములు, నేత్రములు గలిగి, అంతట ననంత రూపములతో వ్యాపించియున్నట్టియు, ఆది మధ్యాంతములు లేనట్టియు నీ విశ్వరూపమును జూచుచున్నాను.

శ్లో. కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తి మంతమ్,
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతా ద్దీప్తానలార్క ద్యుతి మప్రమేయమ్.17

గీ. గదయు మకుటంబు, చక్రంబు-గలిగి, కాంతి
పుంజమును, నగ్ని సూర్యులఁ-బురుడు సేయు
నదియు, నప్రమేయంబయి-నదియు నైన
నీ స్వరూపంబు గనజాల-నీరజాక్ష!

తా. కిరీటమును, గదను, చక్రమును ధరించినట్టియు, అంతటను ప్రకాశము గలిగి చూడనలవి కాని యగ్ని సూర్యుల కాంతివంటి కాంతి గలిగిన తేజోరాశి వైనట్టియు, అపరిచ్ఛేద్యమైనట్టియు నీ విశ్వరూపమును చూచుచున్నాను.

శ్లో. త్వ మక్షరం పరమం వేదితవ్యం
త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్,
త్వ మవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే.

గీ. ప్రభువ! పరమంబయిన పర-బ్రహ్మ మీవె
యనియు, సకల జగంబుల-కాశ్రయుండ



నీవె యనియును, నాశర-హితుఁడ వనియు,
స్థిరమయిన ధర్మములను ర-క్షించు వాఁడ
వనియును, బురాణ పురుషుండ-వనియు, మఱియుఁ
దెలియఁదగు వాఁడవనియు, మ-దిని దలంతు.

తా. నీవు పరమోత్కృష్టమైన పరబ్రహ్మమనియు, తెలియఁదగిన వాడవనియు, ఈ జగత్తున కుత్కృష్టాశ్రయమనియు, నాశరహితుఁడవనియు, శాశ్వత ధర్మముల యొక్క రక్షకుఁడవనియు, పురాణ పురుషుఁడవనియు నేనుతలచుచున్నాను.

శ్లో. అనాది మధ్యాంత మనంత వీర్య
మనంత బాహుం శశి సూర్య నేత్రమ్,
పశ్యామి త్వాం దీప్త హుతాశ వక్త్రం
స్వ తేజసా విశ్వ మిదం తపంతమ్. 19

గీ. ఆది మధ్యాంతములు లేక,-యపరిమిత బ
లంబు గల వాఁడవయి, యనం-తంబులైన
బాహువులు గలిగి, హరిద-శ్వ శశధరుల
నయనములుగ వహించి, య-నలము ముఖము
నందు బడసి, ప్రపంచ గ-ణమును నీదు
ద్యుతుల చేత తపింపఁజే-యుదువు నీవు.

తా. ఆది మధ్యాంతములు లేనట్టియు, అపరిమిత పరాక్రమము గలిగినట్టియు, అసంఖ్యాకము లైన బాహువులు గలిగినట్టియు, సూర్యచంద్రులు నేత్రములుగా గలిగినట్టియు, ప్రజ్వలించుచున్న యగ్ని వంటి ముఖము గలిగినట్టియు నిన్ను, నిజ తేజస్సు చేత సమస్త లోకములను దపింపఁ జేయుచున్నవానిగాఁ జూచుచున్నాను.

శ్లో. ద్యావా పృథివ్యో రిద మంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశ శ్చ సర్వాః
దృష్ట్వాద్భుతం రూప ముగ్రం త వేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్! 20

గీ. నీ యొకని మూర్తి చేతనే-నింగి, పుడమి,
సకలదిశలు, సర్వావకా-శమును నిండె;





సద్వృతంబును నుగ్రంబు-నైన నీదు
యాకృతినిఁ గాంచి సంభ్రమ-మందు జగము.

తా. ఓ మహానుభావా! నీయొక్కని రూపము చేతనే భూమ్యాకాశముల యంతరమును, సమస్త దిక్కులును వ్యాపింపఁబడియున్నవి. ఆశ్చర్యముగను మిగుల భయంకరముగను నున్న నీయొక్క యీ రూపమును జూచి ముల్లోకములు (స్వర్గ మర్త్య పాతాళ లోకములు) ను భయపడుచున్నవి.

శ్లో. అమీహి త్వాం సురసంఘా విశంతి
కేచి ద్భీతాః ప్రాంజలయో గృణంతి,
స్వస్తీ త్యుక్త్వా మహర్షి సిద్ధ సంఘాః
స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః. 21

గీ. శరణు పొందుచున్నవి నిన్ను-సురగణములు;
భీతితో నందుఁ గొందఱు-చేతులొగ్గి
పొగడుచున్నారు నిన్ను; చె-లఁగి ఋషులును,
సిద్ధులును భక్తితోడ 'స్వ-స్తియగు గాక'
యనుచు గరము సంపూర్ణంబు-లైన స్తోత్ర
ములఁ దగ బొగడుచున్నారు-పొసఁగ నిన్ను.

తా. దేవతలు గుంపులు గుంపులుగ నీ విశ్వరూపము నందుఁ బ్రవేశించుచున్నారు. వారిలో గొందఱు భయముతో చేతులు మోడ్చి నిన్ను స్తుతించుచున్నారు. మహర్షులును, సిద్ధులును 'క్షేమము గలుగుగాక' యని పలుకుచు సంపూర్ణమైన స్తోత్రముల చేత నిన్ను స్తోత్రము చేయుచున్నారు.

శ్లో. రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుత శ్చోష్మపా శ్చ,
గంధర్వ యక్షాసుర సిద్ధ సంఘా
వీక్షంతే త్వాం విస్మితా శ్చైవ సర్వే. 22

గీ. వసువు లాదిత్యు లశ్వి దే-వతలు, సప్త
వాయువులు, రుద్రులు, పితృ దే-వతలు, సిద్ధ
సాధ్య, గంధర్వ,యక్షరా-క్షస సమూహ



ములును, మఱియు విశ్వే దేవ-తలును, నీదు
యాకృతిని యచ్చెరువుతోడ-నందఱు దగఁ
గాంచుచుండుట నేనిటఁ-గాంతు నిపుడు.

తా. ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, సాధ్యులు, విశ్వే దేవతలు, అశ్వినీ దేవతలు, సప్తవాయువులు, పితృ దేవతలు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, సిద్ధులు, ఆశ్చర్యముతో నిన్ను జూచుచున్నారు.

శ్లో. రూపం మహత్తే బహు వక్త్ర నేత్రం
మహాబాహో! బహు బాహూరుపాదమ్,
బహూదరం బహుదంష్ట్రా కరాళం
దృష్ట్వా లోకాం ప్రవ్యథితా స్తథాఽహమ్. 23

గీ. వదనములు, కండ్లు సేతులు,-పాదము, లుద
రములు, తొడలు, కోఱలు గల్గి-త్రాస మొసఁగు
నీ స్వరూపంబు, ప్రాణుల-న్నియును, నేను
నిపుడు వీక్షింపలేము, లో-కేశ్వరుండ!

తా. ఓ కృష్ణస్వామీ! అనేకములైన ముఖములు నేత్రములు గలిగినట్టియు, అనేకములైన తొడలు, పాదములు గలిగినట్టియు, అనేకములైన కడుపులు గలిగినట్టియు, భయంకరమైన యనేక దంష్ట్రలు (కోఱలు) గలిగినట్టియు నీ గొప్ప రూపమును జూచి సమస్త ప్రాణులును నేనును మిక్కిలి భయము బొందియున్నాము.

శ్లో. నభ స్స్పృశం దీప్త మనేక వర్ణం
వ్యాత్తాననం దీప్త విశాల నేత్రం,
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విందామి శమం చ విష్ణో! 24

గీ. గగనమును దాకునట్టియుఁ,-గరము మండు
నట్టియు, పలురంగులు గల్గి-నట్టియుఁ, దెఱ
వబడియుండెడు భీకర-వదనచయము
గలిగినట్టియు, వెడదలై-కరము వెలయు





నే(త్రములు గల్గినట్టియు,-నీ స్వరూప
వీక్షణమున గల్గ మిగుల-వెఱపు నాకు.

తా. ఓ కృష్ణ స్వామీ! ఆకాశమును దాకుచున్నట్టియు, మండుచున్నట్టియు, నానా వర్ణములు గలిగినట్టియు, తెఱవఁబడిన వక్త్రములు గలిగినట్టియు, ప్రకాశించుచున్న విశాల నేత్రములు గలిగినట్టియు, నీ విశ్వరూపమును జూచి మిగుల భయముం జెందిన మనస్సుతో గూడిన నేను ధైర్యమును మనశ్శాంతిని బొందకున్నాను.

శ్లో. దంష్ట్రా కరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానల సన్నిభాని,
దిశో నజానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ! జగన్నివాస! 25

గీ. దంష్ట్రలుండుటచే భయ-దాయకంబు
ను, ప్రళయాగ్ని సంకాశము-ను నగు, నీవ
దన సమూహ వీక్షణంబుచే-త, దిశల నెఱుఁ
గంగఁ జాల; బదపడి సు-ఖంబు లేదు
నాకు, జగదీశ! కృపతోడ-నాకు వేగ
సుముఖుఁడవయి పూర్వాకృతిఁ-జూపుమయ్య.

తా. కోఱల చేత భయంకరములై, ప్రళయాగ్నితో సమానమైన నీ ముఖములను జూచి నేను దిక్కులను దెలియజాలకున్నాను. సుఖము బొందకయున్నాను. జగదాధారుఁడ వైన యో స్వామీ! కృపతో నాకుఁ బ్రసన్నుఁడవగుము.

**శ్లో. అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రా**
**స్సర్వే సహై వావనిపాలసంఘైః,**
**భీష్మో ద్రోణ స్సూతపుత్ర స్తథాఽసౌ**
**సహా స్మదీయై రపి యోధ ముఖ్యైః.** 26

శ్లో. వక్త్రాణి తే త్వరమాణా విశంతి
దంష్ట్రాకరాళాని భయానకాని,
కేచి ద్విలగ్నా దశనాంతరేషు
సందృశ్యంతే చూర్ణితై రుత్తమాంగైః. 27



గీ. ధార్తరాష్ట్రులును, నృపతి-తతియు, ద్రోణ
కర్ణ భీష్ములును, మఱియుఁ-గరము నాదు
వాహినీపతులును, గడు-త్వరితముగ, భ
యంబు గొలుపు నీ వక్త్రచ-యంబునందుఁ
జొచ్చుచున్నారు గుమికూడి; - శౌరి! దిఁ గొంద
ఱందు నీ పండ్ల సందుల-యందుఁ జిక్కి-
చూర్ణితంబులయిన శిర-స్సులుగలిగి, క
నఁబడుచున్నారు దేవేశ! -నాకు నిపుడు.

తా. దుర్యోధనాదులును, రాజ సమూహములును, భీష్మ ద్రోణ కర్ణులును, నా సంబంధులైన ధృష్టద్యుమ్నాది యోధాగ్రేసరులును త్వరతో గూడినవారై, కోఱల చేత మిక్కిలి వికృతములును భయంకరములును నైన నీ వక్త్రములందు ప్రవేశించుచున్నారు. వారిలో గొందరు నీ దంతముల సందుల యందుఁ జిక్కి నలిగి పోయిన తలలతోఁ గనఁబడుచున్నారు.

శ్లో. యథా నదీనాం బహవోఽంబు వేగాః
స్సముద్ర మేవాభిముఖా ద్రవంతి,
తథాతవామీ నరలోక వీరా
విశంతి వక్త్రా ణ్యభి విజ్వలంతి. 28

గీ. వేగమున సముద్రము నందుఁ-బెకుృ నదులు
చొచ్చుచుండు విధమున, నీ-శూరవర్యు
లందఱును నీదు వక్త్రంబు-లందు వేగ
మున ప్రవేశించుచున్నారు-భువనభర్త!

తా. ఎటుల నదీ ప్రవాహములు మిక్కిలి వేగముతో సముద్రమందుఁ బ్రవేశించుచున్నవో, అటుల నీ శూరులు మంటలతో గూడియున్న నీయొక్క వక్త్రములందుఁ బ్రవేశించి నశించుచున్నారు.

శ్లో. యథా ప్రదీప్తం జ్వలనం పతంగా
విశంతి నాశాయ సమృద్ధ వేగాః,





తథైవ నాశాయ విశంతి లోకా
స్తవాపి వక్త్రాణి సమృద్ధ వేగాః. 29

గీ. మండు నిప్పులో మిడుతల-దండు, వేగ
మున ప్రవేశించి నాశమొం-దునటులఁ, గడు
రయముతోడ నీ ముఖగహ్వ-రముల జొచ్చి
మడియుచున్నారు ప్రాణులు,-మాధవుండ!

తా. ఎటుల మిడుతలు మిక్కిలి వేగముతోఁ బ్రజ్వలించుచున్న యగ్నిలో బ్రవేశించి నశించుచున్నవో, అటులఁ బ్రాణులు మిక్కిలి వేగముతో నీ వక్త్రములందుఁ బ్రవేశించి నశించుచున్నారు.

శ్లో. లేలిహ్య సే గ్రసమాన స్సమంతా
ల్లోకాన్ సమగ్రాన్ వదనై ర్జ్వలద్భిః,
తేజోభి రాపూర్య జగ త్సమగ్రం
భాస స్తవోగ్రాః ప్రతపంతి విష్ణో! 30

గీ. ప్రజ్వలించుచున్నట్టి నీ-వక్త్రచయము
తోడఁ బ్రాణులను గ్రసించు-వాఁడవై, ది
శలను నాకుచున్నావు నా-ల్కలను జాపి;
వెలుపు పుట్టించునట్టి నీ-వెలుగు సకల
భువనములు నిండి వానికిఁ-బొసఁగ జేయు
చున్న దత్యంత తాపంబు-సురవిభుండ!

తా. నీవు మండుచున్న వక్త్రముల చేత సమస్త ప్రాణులను మ్రింగుచు, అంతటను నాలుకతో నాకుచున్నావు. ఓ కృష్ణస్వామీ! నీయొక్క భయంకర కాంతులు తేజస్సుల చేత సమస్త లోకములను నిండించి తపింపఁజేయుచున్నవి.

శ్లో. ఆఖ్యాహి మేకో భవా నుగ్రరూపో
నమోఽస్తు తే దేవవర! ప్రసీద,
విజ్ఞాతు మిచ్ఛామి భవంత మాద్యం
నహి ప్రజానామి తవ ప్రవృత్తిమ్. 31



గీ. దండమిడుదు ప్రభుఁడ! ప్రస-న్నుఁడ వగుము
నాకు; నీ ప్రవృత్తికిఁ గార-ణంబు నాకు
దెలియరా; దుగ్రరూపంబు-గలిగినట్టి
నీవెవండ? వాద్యుఁడవైన-నిన్నుఁ దెలిసి
కొనఁగఁ గోర్కెగలదు నాకు;-మనవి చేసె
దఁ దెలుపుము నాకు దేవేశ!-దయ చెలంగ.

తా. ఓ దేవోత్తమా! నీకు నమస్కారము చేయుచున్నాను. నాకుఁ బ్రసన్నుఁడవగుము. నేను నీ ప్రవృత్తి నెఱుఁగను. ఈ భయంకరాకారము గల నీవెవ్వఁడవు? ఆద్యుఁడవైన నిన్ను దెలిసికొనఁగోరుచున్నాను; నాకుఁ దెలుపుము.

శ్రీ భగవా నువాచ :

శ్లో. కాలోస్మి లోకక్షయ కృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః,
ఋతేఽపి త్వా నభవిష్యంతి సర్వే
యేఽ వస్థితా ప్రత్యనీకేషు యోధాః. 32

గీ. అంత భగవంతుఁడనియె ని-ట్లు తని తోడ,
"నీ ప్రపంచంబునంతయు-నెస, నశింపఁ
జేయు ప్రబల కాలము నేను;-చేరి యిపుడు
లోకములను నాశము సేయ-నీక సిద్ధ
మయితి; నీ శత్రు సైన్యము-నందు నిలచి
యున్న వారిలో నీ వూర-కున్నను సవ
నంబు సలుపక, బ్రతుకఁ గ-లట్టివారె
వరును లేరని యెఱుఁగుము-ఫల్గునుండ!

తా. నేను లోకములను నాశము చేయునట్టి ప్రబలమైన కాలస్వరూపుఁడను. నేనిప్పుడు లోకమును సంహరించుట కుద్యుక్తుఁడనై యున్నాను.ఎదిరి సేనల యందు యుద్ధము చేయుటకై వచ్చినవారిలో, నీవు చంపకున్నను, బ్రతుకు వారెవ్వరును లేరు.





శ్లో. తస్మా త్త్వముత్తిష్ఠ యశోలభస్వ
మయై వేతే నిహతా పూర్వ మేవ
జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్,
నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్! 33

గీ. కాన యుద్ధంబు సలుపంగఁ-గడఁగు మీవు;
శత్రువుల గెల్చి కనుము య-శము; సమృద్ధ
మైన రాజ్య మనుభవింపు-మవనియందు;
మునుపె నీ పగ వారంద-ఱును వధింపఁ
బడిరి నాచేత; నీవిందుఁ-బరఁగ హేతు
మాత్రుఁడవుగ మెలగుము, ప-విత్రచరిత!

తా. కావున నీవు లేచి యుద్ధము చేయుము. శత్రువులను గెల్చి కీర్తిని బొందుము. నిష్కంటకమైన రాజ్యము ననుభవింపుము. ఈ నీ శత్రువులందఱును నా చేత మునుపే చంపఁబడిరి. ఓ యర్జునా! నీవు నిమిత్తమాత్ర కారణముగా నుండుము.

శ్లో. ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాఽన్యా నపి యోధ వీరాన్,
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా
యుద్ధ్యస్వ జేతాఽసి రణే సపత్నాన్. 34

గీ. పార్థ! మునుపె, నాచేఁ జంపఁ-బడిన ద్రోణ
భీష్మ సైంధవాదులయిన-వీరశేఖ
రులను జంపుము; దిగులొంద-వలదు; రణము
సలుపుము; విజయంబు బడయ-గలవు నీవు.

తా. నాచే బూర్వమే చంపఁబడిన ద్రోణ భీష్మ జయద్రథ కర్ణులను, ఇక నితర యోధవీరులను జంపుము. దుఃఖింపకుము. యుద్ధము చేయుము. యుద్ధమందు శత్రువులను జయింపగలవు.

సంజయ ఉవాచః

శ్లో. ఏత చ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలి ర్వేపమానః కిరీటీ,



నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
స గద్గదం భీతభీతః ప్రణమ్య. 35

గీ. అచ్యుతుని వాక్యమును విని-యర్జునుండు
వణకుచుఁ బ్రణామ మొనరించి,-భయముతోడ
నంజలి ఘటించి హరితోడ-ననియె నిట్టు
లని వచించెను సంజయుఁ-డధిపుతోడ.

తా. అర్జునుఁడు శ్రీకృష్ణుఁడు చెప్పిన యీ మాటలు విని, శరీరము వణకుచుండ నమస్కరించి, చేతులు మోడ్చి, మాటిమాటికి భయపడుచు, శ్రీకృష్ణునికి మరల మరల నమస్కరించి తొట్రుపాటుగల కంఠస్వరముతో నిట్లు పలికెను.

అర్జున ఉవాచ :

శ్లో. స్థానే హృషీకేశ! తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్య త్యను రజ్యతే చ,
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి
సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః. 36

గీ. "ఇంతటి మహాపురుషుఁడవ-యి తగ వెలయు
నిన్ను సకల లోకంబు ల-నిశము పొగడు
చును, మిగుల సంతసము బొందు-చును ముకుంద!
భక్తిఁ జూపుచున్నవి నీకు;-భయముతోడ
పరుగులెత్తుచున్నార ల-సురులు నిన్నుఁ
గాంచి; పదపడి సిద్ధ సం-ఘములు కేలు
మోడ్చి నీకు నమస్కార-ము లొనరించు
చున్నవి భయము తోడ, న-చ్యుతుఁడ! కరము.

తా. ఓ హృషీకేశా! సమస్త లోకములు నిన్ను స్తుతించుచు సంతోషించుచున్నవి. రాక్షసులు నిన్నుఁ జూచి భయముఁ జెంది నలుదెసలకుఁ బాఱిపోవుచున్నారు. సమస్త సిద్ధ సంఘములు నీకు నమస్కరించుచున్నవి.

శ్లో. కస్మా చ్చ తే న నమేరన్ మహాత్మన్!
గరీయసే బ్రహ్మణోఽప్యాది కర్త్రే,





అనంత! దేవేశ! జగన్నివాస!
త్వమక్షరం సదస త్తత్పరం యత్. 37

గీ. నీవు మిక్కిలి శ్రేష్ఠుండ-వై విధాత
కాది కారణభూతుండ-వగుట నీకు
సకల లోకములు దగఁ బూ-జ సలుపుట స
హజ; మనంతుఁడవు; జగతి-కాశ్రయుండ;
వవ్యయుండవు; సదసద్వ్య-యాతిరేకుఁ
డవు; పరబ్రహ్మరూపుండ-వవుదు వీవు.

తా. ఓ మహానుభావా! శ్రేష్ఠుఁడవైనట్టియు, బ్రహ్మ కాదికారణ భూతుఁడవైనట్టియు నీకు జను లేల నమస్కరింపకుందురు; (సహజముగా నమస్కరింతురని భావము) నీ వనంతుఁడవు. దేవదేవుఁడవు. జగత్తున కాధారభూతుఁడవు; నాశము లేనివాఁడవు. సదసత్తులు రెంటికిని విలక్షణుఁడవైన పరబ్రహ్మ స్వరూపుఁడవు.

శ్లో. త్వ మాది దేవః పురుషః పురాణ
స్త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్,
వేత్తాఽసి వేద్యం చ పరం చ ధామం
త్వయా తతం విశ్వ మనంతరూప! 38

గీ. ఆదిదేవుండవు; జగతి-కాశ్రయుఁడవు;
వేద్యుఁడవు; విశ్వవేత్తవు;-విశ్వమంత,
భళిర! నీచేత వ్యాపింపఁ-బడి చెలఁగు; ప
రమపదంబును నీవె, పు-రాణపురుష!

తా. ఓ కృష్ణస్వామీ! నీవాదిదేవుఁడవు; పురాణ పురుషుఁడవు, సమస్త జగత్తున కాధారభూతుఁడవు. అంతయు దెలిసినవాఁడవు. ప్రాణులచే దెలియఁదగినవాఁడవును, జ్ఞానులచేఁ బొందబడునట్టి మోక్షమును నీవే. విశ్వమంతయు నీచేత వ్యాపింపఁబడి యున్నది.

శ్లో. వాయు ర్యమోఽగ్ని ర్వరుణ శ్శశాంకః
ప్రజాపతి స్త్వం ప్రపితామహ శ్చ,



నమో నమస్తేఽస్తు సహస్ర కృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే. 39

గీ. వాయువు, యముండు, వహ్నియు, -వరుణుఁడును, శ
శాంకుఁడును, బ్రహ్మయు, గమల-సంభవు పిత
యైన చక్రపాణియు నీవె;-యందుకొనుము
తడవ తడవకు నే జేయు-దండములను.

తా. వాయువు, యముఁడు, అగ్ని, వరుణుఁడు, చంద్రుఁడు, బ్రహ్మదేవుఁడు, బ్రహ్మయొక్క తండ్రియైన విష్ణువు నీవె యైయున్నావు. నీకు వేయి నమస్కారములు. నీకు మరల మరల నమస్కారములు చేయఁబడును గాక!

శ్లో. నమః పురస్తా దథ పృష్ఠత స్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ!
అనంత దివ్యామిత విక్రమ స్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః. 40

గీ. నీ యెదుటను వెనుకను, స-న్నిదిశలందు
నేను దండంబు లొసరింతు-నీకు నమిత
బలపరాక్రమములతోఁడ-బరఁగు నీవు
విశ్వమంతయు వ్యాపించి-వెలయుచుంట
విశ్వరూపుఁడనెడి పేరఁ-బేర్మి నొప్పు
చున్నవాఁడవు కై టభ-సూదనుండ!

తా. ఓ కృష్ణస్వామీ! నీకు ముందును వెనుకను, అన్ని దిక్కులందును, నమస్కారము చేయఁబడును గాక! నీవపరిమితమైన సామర్థ్య పరాక్రమములు గలిగి, జగత్తంతయు వ్యాపించి యుండుట వలన సర్వస్వరూపుఁడవై యున్నావు.

శ్లో. సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ! హే యాదవ! హే సఖేతి.
అజానతా మహిమానం త వేదం
మయా ప్రమాదా త్ప్రణయేన వాఽపి. 41





గీ. నీ ప్రభావంబు దెలియక-నేను నిన్నుఁ
బరిచయంబున నో కృష్ణ!-వాసుదేవ!
ఓయి చెలికాడ! యాదవా-చ్యుత యటంచుఁ
బిలిచిన పలుకులు క్షమింప-వలయు దేవ!

తా. నీయొక్క స్వభావ ప్రభావముల నేనింతకు మునుపు తెలియని వాఁడనగుట వలన, అజ్ఞానము చేతను పరిచయము చేతను నిన్ను స్నేహితునిగఁ దలచి, ఓయి కృష్ణుఁడా! ఓయి యాదవుఁడా! ఓయి మిత్రుఁడా! యని సామాన్యబుద్ధితోఁ బిలుచుచు పలికిన పలుకులను దయతో క్షమింపుము.

శ్లో. యచ్చావహాసార్థ మసత్కృతోఽసి
విహార శయ్యాసన భోజనేషు,
ఏకోఽథవా ప్యచ్యుత! తత్సమక్షం
త త్క్షా మయే త్వా మహ మప్రమేయమ్. 42

గీ. అప్రమేయుండవగు నిన్ను-హాస్యముగను,
నొంటరిగనున్న వేళల,-నొరుల యెదుట,
విహరణ శయన భోజన-వేళలందు,
నాడిన పరుషముల సైచు-మయ్య, యీశ!

తా. నీ వప్రమేయుఁడవని తెలియక, విహార శయ్యాసన భోజన కాలములందును, చాటునను, ఎదుటను నేను నిన్ను గూర్చి పరిహాసముగ తిరస్కారపు మాటల నాడిన నా యపరాధమును క్షమింపఁ బ్రార్థించుచున్నాను.

శ్లో. పితాఽసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్య శ్చ గురు ర్గరీయాన్,
నత్వ త్సమోఽ స్త్యభ్యధి కః కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమ ప్రభావ! 43

గీ. నిరుపమ ప్రభావుండ! ప్రాణితతి కీవు
జనకుఁడవు, పూజ్యుఁడవు, ప్రశ-స్త గురుఁడవు; స
ముఁ డధికుండు లేడయ్యె యె-వ్వఁడును నీకు
మూఁడు లోకములందును-గూడ, దేవ!



తా. నీ వసమానమైన ప్రభావము గలవాఁడవు. జంగమస్థావరాత్మకములైన సమస్త భూతములకుఁ దండ్రివియు, పూజింపఁదగినవాఁడవును, శ్రేష్ఠుఁడవును, గురుఁడవును అయియున్నావు. ముల్లోకములందును నీకు సమానుఁడు లేడు. ఇక నీ కంటె నధికుఁ డెక్కడుండును?

శ్లో. తస్మా త్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహమీశ మీడ్యమ్,
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ! సోఢుమ్. 44

గీ. స్తుత్యుఁడ వయిన నీకుఁ జే-తును నమస్కృ
తులను సాష్టాంగముగ; నేను-సలిపిన యప
రాధముల సైచు మీవు, పు-త్రకృత లోప
ములను దండ్రిమాడ్కి, చెలి త-ప్పులను సఖుఁడు
వలెను, బ్రియురాలి యపరాధ-ములను బ్రియుఁడు
వోలెఁ గరుణతోడఁ బురాణ-పురుషుండ!

తా. అందువలన నీకు సాష్టాంగ నమస్కారముచేసి, సర్వ జగత్తునకు నియామకుఁడవై నట్టియు, స్తోత్రార్హుఁడవై నట్టియు నిన్ను ప్రసన్నుఁడవగు మని ప్రార్థించుచున్నాను. ఓ దేవా! కుమారుని తప్పులను తండ్రివలెను, స్నేహితుని తప్పులు స్నేహితుఁడు వలెను, ప్రియురాలి తప్పులను ప్రియుఁడువలెను నీవు నా తప్పులను మన్నించి క్షమింపుమని నిన్ను వేడుకొనుచున్నాను.

శ్లో. అదృష్ట పూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే,
తదేవ మే దర్శయ దేవ! రూపం
ప్రసీద దేవేశ! జగన్నివాస! 45

గీ. ఇంతకు మును పెప్పుడును వీ-క్షింపనట్టి
నీదు విశ్వరూపముఁ గాంచి-నేను హృషితుఁ
డనయితిని గర,మయిన నా-మనము మిగుల
భయము చెందియున్నది కృష్ణ!-దయ వహించి





పూర్వ రూపంబుఁజూపి, సు-ముఖుఁడవగుము
నాకు; బ్రణతు లొనర్చుచు-న్నాఁడ నీకు.

తా. ఓ కృష్ణస్వామీ! ఇంతకు మునుపెప్పుడును జూడని నీ విశ్వరూపమును జూచి నేను మిక్కిలి సంతోషించు చున్నాను. నా యొక్క మనస్సు భయముచే మిగుల కలతఁజెంది యున్నది. నీపూర్వరూపమునే నాకుఁజూపుము. ఓ దేవ దేవ! నాకు ప్రసన్నుఁడ వగుము.

శ్లో. కిరీటినం గదినం చక్రహస్త
మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ,
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్ర బాహో! భవ విశ్వమూర్తే! 46

గీ. గద కిరీటంబు, చక్రంబు-గలిగియుండు
నీ సహజరూపమునుఁ జూడ-నాసగొన్న
వాఁడఁ గానఁ గరుణతోడ-వాసుదేవ
రూపమును వహింపుము విశ్వ-రూప! వేగ.

తా. సహస్ర బాహువులుగల యో విశ్వమూర్తీ! కిరీటమును, గదను చక్రమును ధరించి నట్టియు, నాల్గు భుజములు గలిగినట్టియు శ్రీ కృష్ణావతార స్వరూపుఁడ వగుము.

శ్రీ భగవాన్ ఉవాచ :

శ్లో. మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శిత మాత్మ యోగాత్,
తేజో మయం విశ్వ మనంత మాద్యం
యన్మే త్వదన్యేన న దృష్ట పూర్వమ్. 47

గీ. ఆది మధ్యావసాన శూ-న్యమును, గాంతి
మయమునయి, నీవు దక్క నే-మనుజుఁ డింత
వఱకుఁ గనని నా విశ్వరూ-పంబు నిటులఁ
జూపితిని గృప తోడ, న-ర్జునుఁడ! నీకు.

తా. తేజస్స్వరూపమైనట్టియు, అంతములేనట్టియు, సర్వజగత్కారణమైనట్టియు,



ముందెప్పుడును నీ కంటె నే యితరుని చేతఁ జూడ బడనట్టియు, పరమోత్కృష్ట మైనట్టియు నా విశ్వరూపమును నేను నీ యందు గల దయచేత నా యాత్మ యోగ సామర్థ్యము వలన నీకుఁ జూపితిని.

శ్లో. న వేద యజ్ఞాధ్యయనై ర్న దానై
ర్న చ క్రియాభి ర్న తపోభి రుగ్రైః,
ఏవం రూప శ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వ దన్యేన కురుప్రవీర! 48

గీ. మర్త్యలోకంబునందుండు-మనుజు కెవ్వ
నికిని నా విశ్వరూపంబు-నేను జూపి
యుండలే దర్జునుండ! వే-ఱొక్కఁడెవ్వఁ
డైన నాగమములచేతఁ-గాని యజ్ఞ
మలవలననైనను, నధీతి-వలన నైన
నా స్వరూపంబు బుఁడమిఁ గాం-చంగ లేడు.

తా. ఓ యర్జునా! ఈ మనుష్యలోకమందు నేను నీ కొక్కనికి మాత్రమే నా విశ్వరూపముతో దర్శన మిచ్చితిని. వేద యజ్ఞాధ్యయనముల చేతనైనను, దానముల చేతనైనను మఱియెవ్వరును నా విశ్వరూప దర్శన భాగ్య మొందజాలరు.

శ్లో. మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోర మీదృఙ్మమేదం;
వ్యపేతభీః ప్రీత మనాః పునస్త్వం
తదేవ మే రూప మిదం ప్రపశ్య. 49

గీ. విడువు మయ్య నా భీకర-విశ్వరూప
దర్శనము చేతఁ గలిగిన-త్రాస మర్జు
నుండ! నిర్భయుండవయి, క-ను మరుసంబు
చెలఁగ నా పూర్వరూపంబుఁ-జేరి యిపుడు.

తా. భయంకరమైన యీ నా విశ్వరూపమును గాంచుటవలన నీకు గలిగిన భయమును మనస్సంక్షోభమును వీడి సంతోషముతో గూడిన మనస్సుగలవాఁడవై, మరల నా పూర్వ రూపమునే చూడుము.





సంజయ ఉవాచ ;

శ్లో. ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః,
ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వా పున స్సౌమ్య వపుర్మహాత్మా. 50

గీ. ఇవ్విధముగఁ బలికి కృష్ణుఁ-డెలమి సవ్య
సాచికిఁ దన పూర్వాకృతి-సరగఁజూపి
యాతని భయముఁ దొలగింప-ననునయించె
శాంత కరుణరసయుత ప్ర-సంగములను.

తా. ఓ ధృతరాష్ట్రా! శ్రీ కృష్ణుఁడిటుల బలికి తన పూర్వరూపమును జూపి, భయముతో గూడుకొని యున్న యర్జునుని నూరడించెను.

అర్జున ఉవాచ ;

శ్లో. దృష్ట్వేదం మానుష రూపంతవ సౌమ్య జనార్దన!
ఇదానీమస్మి సంవృత్త స్సచేతా ప్రకృతిం గతః 51

గీ. ఓ జనార్దన! సౌమ్యమై-యొప్పు నీదు
మానవాకృతిఁ జూడ,నా-మానసంబు
స్వస్థత వహించెను; భయము-వాసె; మగుడ
సహజవైఖరి చేకూరె-సరగ నాకు.

తా. ఓ కృష్ణా! సౌమ్యమైన నీ మానుషరూపమును జూచి, యిప్పుడు భయ వ్యాకుల తలు వీడి మనస్స్వస్థతను బొందితిని..

శ్రీ భగవా నువాచ ;

శ్లో. సు దుర్దర్శ మిదం రూపం దృష్టవానసి యన్మమ,
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శన కాంక్షిణః. 52

గీ. నా స్వరూపంబు నెవరు గాం-చంగలేరు;
సురలు నా విశ్వరూపంబుఁ-జూడ నెపుడు



గోరుచుంద్రు;నీ యందు నా-కుగల ప్రేమ
చేతఁ దీనినిఁ బార్థ!కాం-చితివి నీవు.

తా. నీవు చూచిన నా విశ్వరూప మెవ్వరికిని జూడ శక్యము కాదు. దేవతలును ఈ రూపము నెల్లప్పుడు చూడఁగోరు చుందురు.

శ్లో. నాహం వేదై ర్నతపసా న దానేన న చేజ్యయా,
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా. 53

గీ. తపము సల్పుటచేత, వే-దపఠనంబు
చేత, యజ్ఞంబు సల్పుట-చేత, వితర
ణంబుచేతను, జూడ శ-క్యంబుగాదు,
నాదు విశ్వరూపంబు, ధ-నంజయుండ!

తా. నీవు చూచిన విశ్వరూపమును వేదములు చదివినవారు కాని, తపస్సు చేసిన వారుకాని, దానములు చేసినవారుకాని, యజ్ఞములు చేసిన వారుకాని చూడ శక్యము కాదు.

శ్లో. భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధోఽర్జున!
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప! 54

గీ. అన్య విషయములం దిసు-మంత సక్తి
లేక నిశ్చల భక్తి గ-లిగి నిరతము
నన్నుఁ బూజించునట్టి మా-నవుఁడు మాత్ర
మే తెలిసికొనగలడు న-న్నిహమునందు.

తా. ఓ యర్జునా! అనన్య భక్తిచేత మాత్రమే జనులు నావిశ్వరూపమును గాంచఁగలుగుదుఁ., తెలిసికొనగలరు, పొందగలరుకాని, మఱి యే యితర మార్గమువలనను గాదు.

శ్లో. మత్కర్మ కృన్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః,
నిర్వైర స్సర్వ భూతేషు య స్స మామేతి పాండవ! 55

(విశ్వరూప సందర్శన యోగోనామ ఏకాదశోధ్యాయ స్సంపూర్ణమ్)

గీ. ఎవఁడు సత్కర్మలను జేయు-నెలమి నన్నుఁ
గూర్చి; యుత్కృష్టగతి నే న-గుదునటంచు





నమ్మి నన్నె తలచుచు, ధ-న సుత బంధు
మిత్ర భార్యాది విషయ స-మ్మేళనంబు
నందుఁ దవులక, సర్వ భూ-తాళియందు
వైర భావంబులేని ప్ర-వర్త నంబుఁ
గలిగి మెలఁగు చుండు; నతఁడె-కాంచఁగలడు
నన్నటంచుఁ దెలియుము ధ-నంజయుండ!

తా. ఓ యర్జునా! నా కొఱకు సత్కర్మములను జేయువాఁడును, నన్నే యుత్కృష్టగతిగ విశ్వసించు వాఁడును, నన్నే సర్వప్రకారములచేత భజించువాఁడును, 'నేను, నాది' యను భావము లేనివాఁడును (ధన బంధు పుత్ర మిత్ర కళత్ర గృహారామ క్షేత్రాదుల యందాసక్తిలేని వాడు ననుట), సమస్త భూతములయందు విరోధము లేనివాఁడును నైన పురుషుఁడు నన్నుఁ బొందు చున్నాడు.

(విశ్వ రూప సందర్శన యోగమనెడి యేకాదశాధ్యాయము సంపూర్ణము)



# ద్వాదశోఽధ్యాయః
## భక్తి యోగః

అర్జున ఉవాచ :

శ్లో. ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే,
యే చాఽప్యక్షర మవ్యక్తం, తేషాం కే యోగవిత్తమాః. 1

గీ. ఎపుడు భగవ దర్పితముగ-నెలమిఁ గర్మ
ల న్నొనరించుచు నెల్లప్పు-డు నిను దలఁచు
వారి యందు; నవ్యక్తమౌ-బ్రహ్మమును ని
రతముఁ దలఁచుచుండెడు మను-జతతియందు,
యోగివరు లెవ్వరో తగ నా-కుగ్గడింపు
మనఁ గిరీటి, కృష్ణుం డిట్టు-లనియె నపుడు.

తా. ఓ కృష్ణా! సత్కర్మముల నాచరించుచు నిన్ను భక్తితో ధ్యానించునట్టియు, ఇంద్రియములకు గోచరము కాని పరబ్రహ్మము ననుసంధానము చేయునట్టియు, నీ రెండు తెఱఁగులైన యోగులలోను శ్రేష్ఠు లెవ్వరు?

శ్రీ భగవా నువాచ :

శ్లో. మ య్యావేశ్య మనో, యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః. 2

గీ. ఎలమి నా యందుఁ జిత్తంబు-నెపుడు నిలిపి,
మిగుల శ్రద్ధతోడను నన్నుఁ-దగఁ దలంచు
చుండునట్టి యుత్తమ పురు-షులు, ధనంజ
యుండ! ప్రియులు నాకు మిగుల-నుర్వియందు.

తా. ఎవరు నా యందు మనస్సును నిలిపి, నిరంతర సమాహిత చిత్తులై, ఉత్కృష్టమైన భక్తితో నన్ను ధ్యానించుచున్నారో, అట్టివారు నాకు మిక్కిలి యిష్టులు.

శ్లో. యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగ మచింత్యం చ కూటస్థ మచలం ధ్రువమ్. 3





శ్లో. సన్నియ మ్యేంద్రియ గ్రామం సర్వత్ర సమబుద్ధయః,
తే ప్రాప్నువంతి మా మేవ సర్వభూత హితే రతాః. 4

గీ. ఇంద్రియ నియమనముతోడ-నెల్ల భూత
గణములందును సమబుద్ధి-గలిగి, నాశ
రహిత, మవ్యక్తము, చలన-రహితము, ధ్రువ
మూహకందని, దంతట-నుండునది, స్వ
భావమందుండునది యైన-బ్రహ్మమును గొ
లుచు జనులు పడయుదురు, ఫ-ల్గునుఁడ! నన్నె.

తా. ఎవ్వరు ఇంద్రియములను నిగ్రహించి, సమస్త ప్రాణుల యందు సమబుద్ధి గలిగి వారికి మేలు గోరువాఁడై, నిర్దేశింప శక్యము కానట్టియు రూపరహితమైనట్టియు, అంతటను వ్యాపించియున్నట్టియు, నిత్య ప్రకృతియందున్నట్టియు, చలింప నట్టియు, నిత్యమైనట్టియు, నాశరహితమైనట్టియు పరబ్రహ్మమును ఉపాసన చేయుచున్నారో వారును నన్నే పొందుచున్నారు.

శ్లో. క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్త చేతసామ్,
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భి రవాప్యతే. 5

గీ. జగతి దేహాభిమానులై-సాధక బల
ముఁ బడయక పరబ్రహ్మంబుఁ-బొందగోరు
జనులకు, మిగుల కష్టంబు-సంభవింప
కయె, పరబ్రహ్మ నిష్ఠ సం-గతము కాదు.

తా. దేహాభిమానము గలవారికి నాశరహితమైన పరబ్రహ్మము నుపాసించుట యందు చాల కష్టములు కలుగకుండ బ్రహ్మనిష్ఠ సిద్ధింపదు.

శ్లో. యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యే నైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే. 6

శ్లో. తేషా మహ సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్,
భవామి న చిరా త్పార్థ! మయ్యావేశిత చేతసామ్. 7

గీ. అవని నేనె యుత్తమ గతి-యని తలంచి,
యన్ని కర్మల నెలమి నా-కర్పణంబు



సేసి యోగంబుచే నన్నుఁ-జిత్తమందు
నిలిపి, ధ్యానంబు సేయు జ-నులను, మృత్యు
వనెడి సంసార జలధి మ-జ్జనము నుండి
సరగ రక్షించెదను నేను-సవ్యసాచి!

ఓ యర్జునా! ఎవరు నేనే యుత్కృష్ట గతియని విశ్వసించుచు, సమస్త కర్మములను నాయందు సమర్పించి, నాకంటె నితరాశ్రయము లేని సమాధి (చిత్తైకాగ్ర్యత) తో నన్ను ధ్యానించుచున్నారో, యట్టి స్థిరచిత్తులైన వారి నతి శీఘ్రముగా మృత్యు రూపమైన సంసారమనెడి సముద్రము నుండి ఉద్ధరించుచున్నాను. (అట్టివారు జనన మరణములు లేని మోక్షమును బొందుచున్నారని యర్థము)

**మయ్యేవ మన ఆధత్స్వ; మయి బుద్ధిం నివేశయ,**
**నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం, న సంశయః.** 8

నీదు మానసమును, బుద్ధి-ని, నిరతంబు
నిలిపి యుంచుము నాయం; ద-టు లొనరింతు
వేని, నన్నె పడయఁ గల-వీ శరీర
మును వదలిన పిదప, నిక్క-ముగఁ గిరీటి!

నీవు నాయందే మనస్సును బుద్ధిని యుంచుము. అటుల జేసితివేని ఈ దేహము నశించిన తరువాత నన్నే పొందగలవు. ఇందు సందేహము లేదు.

**అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్,**
**అభ్యాసయోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనంజయ!** 9

నిలుకడగ నట్లు నా యందు-నిలుపఁజాల
వేని మనసును, నన్నొంద-నిచ్ఛ గలిగి
శ్రద్ధతోడ నభ్యాసంబు-సలుపు; మటులఁ
జేయ నన్నుఁ బొందగలవు-శీఘ్రముగను.

ఓ యర్జునా! ఇట్లు నా యందు మనస్సును బుద్ధిని స్థిరముగ నిలుపుటకు శక్తుఁడవు కాకపోతివేని, నన్ను బొందవలెననెడి కోరికతో, పట్టుదల కలిగి యభ్యాసము చేయుము.





శ్లో. అభ్యాసేఽప్య సమర్థోఽసి మత్కర్మ పరమో భవ,
మదర్థ మపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి. 10

గీ. అతుల నభ్యాసమైనఁ జే-యుటకు నీ వ
శక్తుఁడవయియున్న యెడల-సంతసము చె
లఁగ, మదర్థంబు సత్కర్మ-లను సలుపు, మి
టులయినను నీకు మోక్షంబు-గలుగుఁ బార్థ!

తా. అట్లభ్యాసము చేయుటకును నీవశక్తుఁడవై తివేని నా విషయమైన కర్మముల నాచరింపుము. నా కొఱకు సత్కర్మములు చేసితివేని, నీవు మోక్షమును బొందగలవు.

శ్లో. అథైత దప్య శక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః,
సర్వకర్మ ఫల త్యాగం తతః కురు యతాత్మవాన్. 11

గీ. అందుకును నీవశక్తుఁడ-వై తివేని,
నన్నె యాశ్రయించి, స్థిరము-నస్కుఁడవయి,
సర్వకర్మఫలము సంత-సమున నర్ప
ణంబు సేయుము నాకు, ధ-నంజయుండ!

తా. ఇట్లు చేయుటకును నీవు శక్తుఁడవు కాకపోతివేని, నన్నాశ్రయించి నియమింపబడిన మనస్సుతో నీవు చేయు సమస్త కర్మల ఫలమును నాయందర్పణ మొనరింపుము.

శ్లో. శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్, జ్ఞానాద్ధ్యానం విశిష్యతే,
ధ్యానా త్కర్మ ఫల త్యాగ స్త్యాగా చ్ఛాంతి రనంతరమ్. 12

గీ. కనఁగ నభ్యాస యోగంబు-కంటె జ్ఞాన
మగును మిన్న; జ్ఞానము కంటె-ధ్యానమగును
మిన్న; ధ్యానంబు కంటెను-మిన్న కర్మ
ఫల పరిత్యాగ;మద్దాని-వలన నుడుగు
సంస్మృతి; మఱి సంసార నా-శంబు వలన
ప్రాప్తమగును మోక్షంబు; బీ-భత్స! వినుము.

తా. అభ్యాసయోగము కంటె జ్ఞానము శ్రేష్ఠమైనది. జ్ఞానము కంటె ధ్యానము శ్రేష్ఠమైనది. ధ్యానము కంటె కర్మ ఫల పరిత్యాగము శ్రేష్ఠమైనది. కర్మఫల పరిత్యాగము కంటె దాని వలన గలుగు చిత్తోపరతి శ్రేష్ఠమైనది. ఈ చిత్తోపరతి వలన మోక్షముప్రాప్తించును.



శ్లో. అద్వేష్టా సర్వభూతానాం, మైత్రః కరుణ ఏవ చ,
నిర్మమో నిరహంకార స్సమదుఃఖ సుఖః క్షమీ. 13

శ్లో. సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢ నిశ్చయః,
మయ్యర్పిత మనోబుద్ధి ర్యో మద్భక్త స్స మే ప్రియః. 14

గీ. సర్వ భూతంబులందు ద్వే-షంబు లేక,
స్నేహ కారుణ్యముల తోడఁ-జెలఁగుచును, మ
మత్వమును నహంకృతియును-మనసుచేత
విడిచి, సుఖదుఃఖముల నొక్క-విధముగ దల
పోయుచు క్షమయు, నిత్యతృ-ప్తుఁడును, ధ్యాన
పరుఁడును, స్థిరచిత్తుండును, నా-భక్తుఁడునయి
సందియము లేక నెలమి నా-యందు బుద్ధి
మానసములుంచు వాఁడిష్టుఁ-డౌను నాకు.

తా. సమస్త భూతములందును ద్వేషము లేనట్టియు, వానియందు దయగలిగి మిత్రుఁడుగ నుండునట్టియు, అహంకార మమకార భావములు లేనట్టియు, సుఖ దుఃఖముల యందు సమబుద్ధి గలిగినట్టియు, ఓర్పు గలిగినట్టియు, నిత్య సంతోషియైనట్టియు, ధ్యానపరుఁడై నట్టియు, నిశ్చలమైన మనోవృత్తి గలిగి నట్టియు, సంశయ రహితుఁడై నట్టియు, నాయందుంచబడిన మనోబుద్ధులు గలిగినట్టియు, నా భక్తుఁడై నట్టియు పురుషుఁడు నాకు ప్రియుఁడు.

శ్లో. యస్మాన్నో ద్విజతే లోకో, లోకాన్నో ద్విజతే చ యః,
హర్షా మర్ష భయో ద్వేగై ర్ముక్తో య స్స చ మే ప్రియః. 15

గీ. ఎల్ల జనులకు భయము లే-దెవని వలన,
నెల్ల జనుల భయంబు లే-దెవని కిలను;
హర్ష శోక భయముల క-మర్షమున క
తీతుఁ డెవ్వఁ డతని యందు-ప్రీతి నాకు.

తా. ఎవని వలన జనులకు భయము లేదో, ఎవనికి జనుల వలన భయము లేదో, ఎవఁడు సంతోషమునకును అసూయకును భయమునకును అతీతుఁడై యుండునో, అట్టి పురుషుఁడు నాకు ప్రియుఁడు.





శ్లో. **అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గత వ్యథః,**
**సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః.** 16

గీ. వినుము వాంఛలేక పవిత్రుఁ-డును సమర్థుఁ
డును, భయరహితుఁడును, గర్మ-రుఁడును నగుచుఁ,
గర్మఫల మపేక్షింపక-కరము నాకు
భక్తి సేయువాఁడు ప్రియుఁడు-పార్థ! నాకు.

తా. కోరికలు లేనట్టియు, పవిత్రుఁడై నట్టియు, సమర్థుఁడై నట్టియు, పక్షపాతము లేనట్టియు, భయము లేనట్టియు, సర్వ సంకల్ప రహితుఁడై నట్టియు, నాకు భక్తుఁడై నట్టియు పురుషుఁడు నాకు ప్రియుఁడు.

శ్లో. **యో న హృష్యతి, నద్వేష్టి, నశోచతి, నకాంక్షతి,**
**శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ య స్స మే ప్రియః.** 17

గీ. సవ్యసాచి! యెవ్వాఁడు ద్వే-షంబునకును,
దుఃఖమునకు, వాంఛలకు, సం-తోషమున క
తీతుఁడగుచు, నాయందు భ-క్తి గలిగి మెల
గునెపు, డాతఁడు నాకు మి-గుల ప్రియుండు.

తా. సంతోష భయ ద్వేషములు లేనట్టియు, కోరికలు లేనట్టియు, శుభాశుభములను బరిగణింపనట్టియు, నాకు భక్తుఁడై నట్టియు, పురుషుఁడు నాకు ప్రియుఁడు.

శ్లో. **సమ శ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః,**
**శీతోష్ణ సుఖదుఃఖేషు సమస్సంగ వివర్జితః.** 18

శ్లో. **తుల్య నిందా స్తుతి ర్మౌనీ, సంతుష్టో యేన కేన చిత్,**
**అనికేతః స్థిర మతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః.** 19

గీ. అరులయందును స్నేహితు-లందు సుఖము
నందు, దుఃఖంబునందు, మా-నావమాన
శీత వాతా తపములందుఁ-జేరి సమత
తో మెలఁగుచు, సంగ వివర్జి-తుఁడును, వాఙ్ని
యమధరుండును, యాదృచ్ఛి-కముగ నెంత



దొఱకినను దానిచేత సం-తుష్టిఁ జెందు
వాఁడును, నివసనములేని-వాఁడును, చల
నంబు లేక నొప్పెడు మాన-సంబు గల య
తఁడును, నా భక్తుఁడును నయి-తనరువాఁడు
నాకు మిగుల బ్రియుండు, ధ-నంజయుండ!

తా. శత్రువులయందును, స్నేహితులయందును, మానావమానములయందును, శీతోష్ణములందును, సుఖదుఃఖములందును సమబుద్ధి గలిగినట్టియు, విషయములందాసక్తియు కోరికయు లేనట్టియు, మౌనము గలిగియుండునట్టియు; స్వల్ప లాభమునకును సంతోషించునట్టియు, నివాసరహితుఁడైనట్టియు, నిశ్చయ బుద్ధి గలిగినట్టియు, నాయందు భక్తి గలిగినట్టియు పురుషుఁడు నాకు ప్రియుఁడు.

శ్లో. యేతు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే,
శ్రద్ధధానా మత్పరమాః భక్తాస్తేఽతీవ మే ప్రియాః. 20

(భక్తియోగోనామ ద్వాదశోధ్యాయ స్సంపూర్ణమ్)

గీ. ఏనె పరమగతి యటంచు-నెంచి మోక్ష
దాయకంబగు నా వాక్య-తతిని విశ్వ
సించి నేను జెప్పినటులఁ-జేయు నాదు
భక్తులు ప్రియతములు నాకు-ఫల్గునుండ!

తా. నేనే పరమగతియను దృఢభావముతో మోక్షప్రదములై అమృతప్రాయములుగనున్న యీ వాక్యములను విశ్వసించుచు నేను జెప్పిన విధముగఁ బ్రవర్తించునట్టి నా భక్తులు నాకు మిక్కిలి ప్రియులు.. (ఈ యధ్యాయమందు 13 వ శ్లోకము మొదలుకొని కడపటి శ్లోకము వరకును గల 8 శ్లోకములలో 'భక్తుఁడు' అను శబ్దమునకు 'పరమార్థ జ్ఞానమనెడి భక్తి గలవాఁడనెడి యర్థము అద్వైత సంప్రదాయార్థము.)

(భక్తియోగమనెడి ద్వాదశాధ్యాయము సంపూర్ణము)





# త్రయోదశోఽధ్యాయః

## క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగః

అర్జున ఉవాచ :

శ్లో. ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ,
ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ! 1

అర్జునుఁడు చెప్పుచున్నాడు :

గీ. ప్రకృతియన నెద్ది? పురుషుఁ డె-వ్వండు; క్షేత్ర
మనగ నెట్టిది? క్షేత్రజ్ఞుఁ-డనగ నెవఁడు;
జ్ఞానమెద్ది? జ్ఞేయమన నె-ద్దానికగును
గుఱుతు? తెల్పుము కృష్ణ! నా-కెఱుకపడఁగ.

తా. ఓ కృష్ణా! ప్రకృతి, పురుషుఁడు,క్షేత్రము, క్షేత్రజ్ఞుఁడు, జ్ఞానము, జ్ఞేయము-అను నీ విషయములను గూర్చి పూర్ణముగ దెలిసికొనఁ గోరుచున్నాను.

శ్రీ భగవా నువాచ :

శ్లో. ఇదం శరీరం కౌంతేయ! క్షేత్ర మిత్యభిధీయతే,
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః. 2

శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాడు :

గీ. శ్వేతవాహన! దేహంబు-క్షేత్రమనియు,
దేహ విషయంబునంతను-దెలిసికొను న
తండు క్షేత్రజ్ఞుఁడనియును-దత్వవేత్త
లైన పండితులు వచింతు-రవనియందు.

తా. ఓ యర్జునా! ఈ దేహము క్షేత్రమనియును, ఈ దేహమును (క్షేత్రమును) దెలియువాఁడు క్షేత్రజ్ఞుఁడనియును, పండితులు చెప్పుదురు.

శ్లో. క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తత్ జ్ఞానం మతం మమ. 3



కం. క్షేత్రంబులలో నుండెడు
క్షేత్రజ్ఞుఁడు నేనె యగుదు;-క్షేత్రజ్ఞుఁడనన్
క్షేత్రమనఁగఁ దెలియుట, ప
విత్ర జ్ఞానమనియంద్రు-విదులు ధరిత్రిన్.

తా. ఓ యర్జునా! సర్వక్షేత్రముల యందుండు క్షేత్రజ్ఞుఁడు నేనేయని తెలిసికొనుము. క్షేత్రమును గూర్చియు క్షేత్రజ్ఞుని గూర్చియు దెలిసికొనుటయే జ్ఞానమని నా యభిప్రాయము.

శ్లో. తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ, యద్వికారి, యతశ్చయత్,
స చ యో యత్ప్రభావ శ్చ తత్సమాసేన మే శృణు. 4

గీ. క్షేత్ర మెద్దియొ? యెట్టి వి-శేషములు గ
లిగినదియొ? యే వికృతులఁ బ-రఁగునొ? యెట్టి
హేతువు వలనఁ బుట్టెనొ?-యెవఁడొ యెట్టి
వాఁడొ, క్షేత్రజ్ఞుఁడు? తెలుపు-వాఁడ నీకు.

తా. ఓ యర్జునా! ఆ క్షేత్రమేదియో, ఎట్టిదియో, ఎట్టి వికారముగలదియో, ఏ కారణము వలన పుట్టినదో, క్షేత్రజ్ఞుఁ డెవ్వఁడో, ఎట్టి ప్రభావము గలవాఁడో, సంక్షేపముగఁ జెప్పెదను, వినుము.

శ్లో. ఋషిభి ర్బహుధా గీతం ఛందోభి ర్వివిధైః పృథక్,
బ్రహ్మసూత్రపదై శ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః. 5

గీ. అరయ క్షేత్రజ్ఞుఁడన, క్షేత్ర-మనగఁ జెప్పఁ
బడెను బలు తీరులుగఁ దొలి-పలుకుల వల
నను, ఋషుల వలనను; నయి-న, ననుమాన
రహితముగ జెప్పె బ్రహ్మ సూ-త్రములు, పార్థ!

తా. ఈ క్షేత్ర క్షేత్రజ్ఞ స్వరూప విషయములు వసిష్ఠాది మహర్షులచేతను వేదముల చేతను బెక్కు రీతులుగ జెప్పఁబడియున్నవి. బ్రహ్మసూత్ర వాక్యముల చేత నీ విషయములు నిస్సంశయముగను సహేతుకముగను జెప్పఁబడియున్నవి.

శ్లో. మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్తమేవ చ,
ఇంద్రియాణి దశైకం చ పంచచేంద్రియ గోచరాః. 6





శ్లో. ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనా ధృతిః,
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్. 7

గీ. వాయువు, వెలుగు, జలము, న-భంబు, పృథివి
యనెడి పంచభూతంబు; ల-హంకృతియును,
బుద్ధి, మాయ; జ్ఞానేంద్రియం-బులయి; దింక
నయిదయిన యట్టి కర్మేంద్రి-యములు; మనసు,
స్పర్శ శబ్ద రూప రస వా-సన లనంగఁ
బరగు పంచతన్మాత్రలు;-వాంఛ, ద్వేష,
మింక సుఖము, దుఃఖంబు, దే-హేంద్రియాది
బృందమును, ధైర్యమును, మనో-వృత్తి; యను వి
కృతులతోఁ గూడి యున్నదీ-క్షేత్రమని ను
డువఁబడినది క్లుప్తముగఁ, బాం-డు తనయుండ!

తా. భూమి, ఉదకము, తేజస్సు, వాయువు, ఆకాశము - అనెడి పంచభూతములు; అహంకారము, బుద్ధి, మాయ; శ్రోత్రము, చక్షుస్సు, త్వక్కు, జిహ్వ, ఘ్రాణము - అనెడి పంచ జ్ఞానేంద్రియములు; వాక్కు, పాదము, పాణి, పాయువు, ఉపస్థ - అనెడి పంచ కర్మేంద్రియములు, మనస్సు, పంచేంద్రియ విషయములైన శబ్ద స్పర్శ రూప రస గంధములు; కోరిక, ద్వేషము, సుఖము, దుఃఖము, దేహేంద్రియాది సమూహము (అనగా, దేహేంద్రియముల యొక్క సమష్టి వ్యాపారమని యర్థము), మనోవృత్తి, ధైర్యము - అను వికారములతో గూడినట్టిది క్షేత్రమని సంగ్రహముగఁ జెప్పఁబడినది.

శ్లో. అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్,
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మ వినిగ్రహః. 8

శ్లో. ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ,
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషానుదర్శనమ్. 9

శ్లో. అసక్తి రనభిష్వంగః పుత్రదార గృహాదిషు,
నిత్యం చ సమచిత్త త్వ మిష్టానిష్టోపపత్తిషు. 10

శ్లో. మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ,
వివిక్త దేశ సేవిత్వ మరతి ర్జన సంసది. 11



శ్లో. అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం తత్త్వ జ్ఞానార్థ దర్శనమ్,
ఏతద్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా. 12

గీ. దంభరహితుఁడై యుండుట;-తన్నుఁ దాను
పొగడుకొనకయుండుట; యహిం-స; గురుసేవ;
క్షమ; కృత్రిమము లేకుండుట;-చంచలత్వ
రహితుఁడై యుండు; టాత్మ ని-గ్రహము గలిగి
యుండుట; శుచిత్వముఁ గలిగి-యుండు; టింద్రి
యంబుల విషయంబుల యందు-నాశ లేక
యుండు; టనహంకృతి గలిగి-యుంట, జన్మ
మరణ రోగ జరా దుఃఖ-మత్సరాది
దోషములను యోచించి, కు-దురుగఁ దెలిసి
కొనుట; దార గృహారామ-తనయులందు
సక్తి లేకుంట; వీనికి-సంభవించు
మంచి చెడుగులు తనవి కా-వంచుఁ దలఁచు
టయు, ననిష్టంబు దనకుఁ ద-టస్థమైన,
ఇష్టముఁ దటస్థమైనను-నెపుడు సమత
గలిగియుంట; యితర దేవ-తలను గొల్చు
టందు మనసు చలింపక,-సందియంబు
లేక నేనె గతియని తె-లిసి యహర్ని
శంబు నా యందు భక్తి భా-వంబు సుస్థి
రముగఁ గలిగి యుండుట; విజ-నమయినట్టి
స్థలమునందు వసించుట; - జనసమూహ
మందుఁ బ్రీతి లేకుండుట;-యాత్మ విషయ
మైన జ్ఞానంబునందు ని-త్యత్వ భావ
ముంట; ముక్తి బొందుటయె ప్ర-యోజనంబ
టంచు దృష్టి యుంచుట; యివి-యన్ని జ్ఞాన
మనియు, మఱి వీని కన్యంబు-లైన యట్టి
వన్ని యజ్ఞానమనియును-నెన్నఁబడును.





తా. ఆత్మస్తుతి, తన ధర్మమును తాను గొప్పగా జెప్పుకొనకుండుట (గర్వము లేకుండుట), అహింస, క్షాంతి (ఓర్పు), ఋజువర్తనము, గురుసేవ, బాహ్యాంతరశుద్ధి, స్థైర్యము, మనోనిగ్రహము, ఇంద్రియ విషయములం దాసక్తి లేకుండుట, అహంకారము లేకుండుట, జన్మము, మృత్యువు, ముసలితనము, రోగము, దుఃఖము-అను నీ యారింటియందలి దోషముల నాలోచించి తెలిసికొనుట, పుత్ర దార గృహాదుల యందాసక్తి లేకుండుట, ఇంద్రియవిషయములం దాసక్తి లేకుండుట, ఇష్టానిష్ట ప్రాప్తులయందు సమబుద్ధి గలిగియుండుట, ఆత్మజ్ఞానమందు నిత్యభావముండుట, తత్త్వ జ్ఞానమును బొందించు మార్గము నందు చింతచేయుట-ఇవి యన్నియు గలసి జ్ఞానమని చెప్పఁబడును. దీని కన్యమైనది, అజ్ఞానమని చెప్పఁబడును.

శ్లో. **జ్ఞేయం యత్త త్ప్రవక్ష్యామి యత్జ్ఞాత్వాఽమృత మశ్నుతే,**
**అనాది మత్పరం బ్రహ్మ నసత్త న్నాస దుచ్యతే.** 13

గీ. ఇంకను దెలియవలసిన-దెద్దియొ నుడి
వెదను విను; మేది దెలిసిన-వెనుక మోక్ష
మబ్బునొ యదియె నిరతిశ-యమయినట్టి
బ్రహ్మమని వచియింతు; రా-బ్రహ్మమునకు
లేదు మొదలు; సత్తైన ఘ-టాదులకు, న
సత్తగు శశ శృంగాభ్ర పు-ష్పములకు *వి
లక్షణమును, మఱియు సక-లంబు కంటె
శ్రేష్ఠమైనదియును నది,- శ్వేతహయుఁడ!

తా. ఏది తెలియదగినదో, దేనిని తెలిసికొనిన మోక్షము గలుగునో, అదిలేని యా పరబ్రహ్మము సదసత్తులు రెండును గాక, వానికి విలక్షణమై యున్నది.

శ్లో. **సర్వతః పాణి పాదం తత్సర్వతోఽక్షి శిరోముఖమ్,**
**సర్వతః శ్రుతిమల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి.** 14

గీ. ఎల్ల దిక్కులందా బ్రహ్మ-మెసఁగి కాలు
సేతులు, తలలు, ముఖములు,-చెవులు, కండ్లు,
గలిగి, యాశ్చర్యమొప్ప లో-కంబునంత
యును నిబిడముగ వ్యాపించి-యున్న దనఘ!

* విలక్షణము = వేఱైనది



తా. ఆ బ్రహ్మమంతటను హస్తములు, పాదములు, నేత్రములు, శిరస్సులు, ముఖములు, శ్రోత్రములు గలిగియుండి, జగత్తంతయు వ్యాపించి యున్నది.

శ్లో. సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్
అసక్తం సర్వభృ చ్చైవ, నిర్గుణం గుణభోక్తృ చ. 15

గీ. పరఁగ నది యింద్రియంబుల-పనుల చేత
వెలయునటులున్న, వాని ప-నులకు దాని
కెట్టి సంబంధమును లేదు;-నెట్టన భువ
నంబునంత భరించుచు-న్న నది యెందు
నంటకుండు; మఱియుఁ ద్రిగు-ణాత్మకంబు
గాక, గుణము లనుభవించు-వీక నెపుడు.

తా. ఆ బ్రహ్మము సర్వేంద్రియ వ్యాపారముల చేతఁ బ్రకాశించుచున్న దానివలె నున్నను సర్వేంద్రియరహితమైనది. సర్వమును ధరించినదయ్యును దేనికి నంటనట్టిది. త్రిగుణాత్మకము గానిదయ్యును, త్రిగుణముల ననుభవించుచున్నది.

శ్లో. బహిరంత శ్చ భూతానా మచరం చరమేవ చ,
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థం చాంతి కేచ తత్. 16

గీ. అది సకల చరాచరముల-యందు లోప
లను బయటను నుండుఁ; దెలిసి-కొనఁగ దుర్ల
భంబది మిగుల సూక్ష్మ రూ-పంబు గలిగి
యుంట; జ్ఞానికి దాపుగ-నుండు, నైన
నద్ది యజ్ఞానికిఁ బడయ-నలవి కాని
యంత దూరముగను నుండు-నరసి చూడ.

తా. ఆ బ్రహ్మము స్థావర జంగమాత్మకమైన భూతముల యొక్క లోపలను వెలుపలను నున్నను మిక్కిలి సూక్ష్మరూపము గలిగియున్నది. అందువలన నది తెలిసికొనుట కశక్యమై యున్నది. అజ్ఞానికి దూరముగాను (పొంద నశక్యమైనదిగాను) జ్ఞానికి సమీపముగాను (పొంద శక్యమైనది గాను) నున్నది.

శ్లో. అవిభక్తం చ భూతేషు విభక్త మివ చ స్థితమ్,
భూత భర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ. 17





గీ. అరయ నా బ్రహ్మ మవిభక్త-మయ్యు సకల
భూతముల యందును విభక్త-మువలె నుండు;
నెసఁగి భూతగణముల భ-రించుచుండుఁ
జంపుచుండు, మరల సృష్టి-సలుపుచుండు.

తా. ఆ బ్రహ్మ మపరిచ్ఛిన్నమైనను, సమస్త ప్రాణులయందు పరిచ్ఛిన్నమైన దానివలె నున్నది; భూతములను భరించునట్టిదియు, గ్రహించునట్టిదియు, ఉత్పత్తి చేయు నట్టిదియు నని తెలియదగియున్నది.

శ్లో. జ్యోతిషా మపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే,
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్. 18

గీ. దినకరాదులైనట్టి జ్యో-తిస్స్వరూపు
లను ప్రకాశింపఁ జేయుచుం-డునది, జ్ఞాన
గోచరము, మఱి యజ్ఞత-కు వ్యతిరిక్త
ము, తెలియఁదగినది, సకల-భూతముల మ
నస్సులందు నెలకొని యు-న్నదని తత్త్వ
విదులు చెప్పుదురు పుడమి-శ్వేతహయుఁడ!

తా. ఆ బ్రహ్మము సూర్యుఁడు మొదలుగా గల జ్యోతిర్గోళములను ప్రకాశింపఁజేయు నదియనియు, అజ్ఞానమునకు వ్యతిరిక్తమైనదనియు, జ్ఞానరూపమైనదనియు, తెలియఁ దగినదనియు, జ్ఞానగోచరమైనదనియు, సమస్త ప్రాణులయొక్క మనస్సులందున్న దనియు చెప్పఁబడుచున్నది.

శ్లో. ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః,
మద్భక్త ఏత ద్విజ్ఞాయ మద్భావా యోప పద్యతే. 19

గీ. క్షేత్రమనఁగ, జ్ఞానమనఁగ,-జ్ఞేయమనఁగ
దెలిపితిని సూక్ష్మముగ నీకు;-దీని నెఱుఁగు
నట్టి నా భక్తుఁ డర్హుఁడు-ప్రాకటముగఁ
బొంద నా స్థానమై యొప్పు-మోక్షపదవి.

తా. ఈ ప్రకారముగా క్షేత్రమును గూర్చియు, జ్ఞానమును గూర్చియు, జ్ఞేయమును గూర్చియు సంక్షేపముగ నీకుఁ జెప్పితిని. నా భక్తుఁ డీ విషయమును దెలిసికొని, నా స్థానమైన మోక్షమును బొంద నర్హుఁడగుచున్నాఁడు.



శ్లో. ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభా వపి,
వికారాం శ్చ గుణా శ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్. 20

గీ. క్షేత్రమునకుఁ బేరొప్పుఁ బ్ర-కృతి యటంచు,
బొసఁగ క్షేత్రజ్ఞుఁ డొప్పును-బురుషుఁడనఁగఁ;
దెలిసికొను మీ ప్రకృతి పురు-షుల ననాదు
లుగ; మనసుకు బుద్ధికిని గ-లుగు వికార
ములును, సత్త్వంబు, రజము, త-మో గుణమును
గలుగుఁ బ్రకృతి వలన నని-తెలిసికొనుము.

తా. ప్రకృతి (క్షేత్రము), పురుషుఁడు (క్షేత్రజ్ఞుఁడు), ఉభయులును నిత్యములని తెలిసికొనుము. మనోబుద్ధుల వికార రూపములును, త్రిగుణములును ప్రకృతివలనఁ బుట్టినవని తెలిసికొనుము. (పురుషుఁడు, క్షేత్రజ్ఞుఁడు, జీవుఁడు, భోక్తయను నీ నాలుగు పదము లొకే యర్థమును గలిగియున్నవి.)

శ్లో. కార్య కారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే,
పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే. 21

గీ. మాయ యనియుఁ బ్రకృతికి నా-మంబు గలదు;
తెలియుము శరీర సుఖ దుఃఖ-ములు గలుగుట
కుఁ బ్రకృతియు, ననుభవమున-కు, బురుషుఁడును,
గారణంబు లటంచు, నా-ఖండలసుత!

తా. ప్రకృతి (మాయ) శరీర సుఖ దుఃఖాదులను బుట్టించుటయందు కారణమనియు, పురుషుఁడు సుఖ దుఃఖముల ననుభవించుటయందు గారణమనియుఁ జెప్పఁబడు చున్నది.

శ్లో. పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్,
కారణం గుణ సంగోఽస్య సదసద్యోని జన్మసు. 22

గీ. ప్రకృతి యందుండి పురుషుండు-ప్రకృతి వలన
గలుగు గుణము లనుభవించు,-నిలఁ బురుషున
కు సుఖ దుఃఖ రూపములైన-గుణములందు
రుచి పరఁగుట, పుణ్యాపుణ్య-రూపములగు





యోనులందును జన్మంబు-లొంద గార
ణమగునని నీవు తెలిసికొ-నుము, కిరీటి!

తా. పురుషుఁడు ప్రకృతి యందుండి ప్రకృతి వలన బుట్టిన గుణముల ననుభవించు చున్నాడు. ఈ పురుషునకు సుఖ దుఃఖాది గుణముల యందు గల యాసక్తియే, అతఁడు పుణ్యాపాపయోనులయందు జన్మించుటకుఁ గారణమగుచున్నది.

శ్లో. ఉపద్రష్టాఽనుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః,
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః. 23

గీ. వినుము, పురుషుం డుపద్రష్ట-గ, ననుమంత
గాను, భోక్తగ, మఱి, భర్త-గను, నియంత
గాను, బరమాత్మగాను నీ-కాయమున నె
లకొని యుండు నుత్కృష్టుఁడ-యి, కురువీర!

తా. దేహమందున్న కార్యకారణ వ్యాపారముల యందు 'ఉపద్రష్ట'యైనట్టియు, అనుమోదకుఁడై నట్టియు, భరించువాఁడై నట్టియు, అనుభవించు వాఁడై నట్టియు, నియామకుఁడై నట్టియు పురుషుఁ డుత్కృష్టమైన పరమాత్మయై యున్నాడు.

శ్లో. య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణై స్సహ,
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభి జాయతే. 24

గీ. ఇటులఁ బురుషుని, మఱియు ప్ర-కృతిని, దాని
ధర్మములను నెఱుఁగువాఁడు-తన స్వభావ
మునకు దగిన యటుల మెలఁ-గినను, దిరిగి
జన్మమొందడు జగతిని-సవ్యసాచి!

తా. ఎవఁడీ ప్రకారముగ పురుషుని, ప్రకృతిని గుణములతో గూడ తెలియుచున్నాడో, ఆ మనుష్యుడు స్వాభావికముగ బ్రవర్తించినను మరల జన్మింపడు.

శ్లో. ధ్యానే నాత్మని పశ్యంతి కేచి దాత్మా న మాత్మనా,
అన్యే సాంఖ్యేన యోగేన కర్మ యోగేన చాపరే. 25

కం. కొందఱు ధ్యానము చేతను,
గొందఱు జ్ఞానము వలనను,-గొందఱు మఱియుం



బొందుగఁ గర్మలఁ జేసియు,
నొందుదురు తగఁ బరమాత్మ-నుర్విం బార్థా!

తా. కొందఱు ధ్యానము చేతను, కొందఱు జ్ఞానయోగము చేతను, మఱికొందఱు నిష్కామకర్మయోగముచేతను, మనస్సు చేత తమలో నున్న పరమాత్మను జూచుచున్నారు.

శ్లో. అన్యే త్వేవ మజానంతః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే,
తేఽపి చాతి తరం త్యేవ మృత్యుం శ్రుతి పరాయణాః. 26

కం. పరమాత్మ నిటుల దెలియక
గురువుల యుపదేశమునను-గొందఱు పూజా
పరులై వేదాంతంబుఁ గు
దురుగ విని భవరహితులగు-దురు ధరఁ బార్థా!

తా. మఱికొందఱు పరమాత్మ నీ మార్గముచే దెలిసికొనక, తమ గురువుల వలన నుపదేశము బొంది, ఉపాసనము చేయుచున్నారు. వారును వేదాంత శ్రవణపరులగుట వలన సంసారబంధము నుండి విముక్తిని బొందిన వారై, పునర్జన్మమును బొందరు.

శ్లో. యావ త్సం జాయతే కించి త్సత్వం స్థావర జంగమమ్,
క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగా త్తద్విద్ధి భరతర్షభ! 27

గీ. ఇల చరాచరవస్తువు-లెంత వఱకుఁ
బుట్టుచుండు, నంతవఱకు-బురుషునకును
బ్రకృతికిని, రజ్జు సర్ప వి-భ్రాంతివోలెఁ
గలుగు సంసర్గమని నీవు-తెలిసికొనుము.

తా. అర్జునా! ప్రపంచమున చరాచరాత్మకమైన వస్తు వెంత వఱకుఁ బుట్టుచున్నదో, ఆ వస్తువంతవఱకుఁ బ్రకృతి పురుషుల సంయోగము వలనఁ బుట్టుచున్నదని తెలిసికొనుము.

శ్లో. సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్,
వినశ్య త్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి. 28

గీ. ప్రాణులు క్షయము బొందంగ-వానియందు
సమముగా నుండెడు పరమే-శ్వరుఁడు నాశ





మొందదని తెలియు నతండె-యుర్వి జ్ఞాని
యు, మఱియు, నితరుఁ డజ్ఞాని-యును, గిరీటి!

తా. సమస్త భూతముల యందు సమముగా నున్న పరమేశ్వరుఁ డా భూతములు నశించుచున్నను నశింపడని యెఱుగు నతఁడే తెలిసినవాఁడు.

శ్లో. సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్,
నహి నస్త్యాత్మనాऽऽత్మానం తతో యాతి పరాంగతిమ్. 29

గీ. అట్టి జ్ఞానులు సకల భూ-తాళి యందు
నున్న పరమాత్మ యొకటియై-యున్నదని గ్ర
హించి, యా పరమాత్మను-హింస చేయ
రందు వలన మోక్షంబునుఁ-బొందగలరు.

తా. సమస్త ప్రాణులయందున్న పరమాత్మ ఒక్కటియే యని తెలిసినవాడు యథార్థమున దెలిసినవాఁడు. కావున నా పరమాత్మను హింస చేయడు. అందువలన నత డుత్కృష్ట మైన మోక్షమును బొందుచున్నాడు. (పరమాత్మను హింస చేయుట యన పరమాత్మ యొక్క యాథార్థ్యమును దెలియక పొరబాటుగ దలచుట.)

శ్లో. ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః
యః పశ్యతి తదాऽऽత్మాన మకర్తారం న పశ్యతి. 3(

గీ. సకలకర్మలు ప్రకృతిచే-సలుపఁబడు న
టంచెఱుంగు నతఁడు తన-యందు దాగి
యున్న క్షేత్రజ్ఞని నుపాధి-నొందనట్టి
వానిగ నెఱుఁగుచున్నాడు-పాండుతనయ!

తా. ఎవడు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములచేఁ జేయఁబడుచున్న కర్మములు ప్రకృ సంబంధములైన రజ స్సత్త్వ తమో గుణముల చేతఁ జేయఁబడుచున్న తెలియుచున్నాడో, అతఁడు తనలోనున్న క్షేత్రజ్ఞుఁ డుపాధి రహితుఁ డగుట వల అకర్తయని తెలియుచున్నాడు.

శ్లో. యదాభూత పృథగ్భావ మేకస్థ మనుపశ్యతి,
తత ఏవ చ విస్తారం, బ్రహ్మ సంపద్యతే తదా. 3



గీ. పెక్కు రూపములు గలిగి-వెలయు సకల
భూతగణ మాత్మ లోపలఁ-బొసఁగియున్న
దనియు, నాత్మవలననె, భు-వనములన్ని
యుద్భవించిన వనియును-నుర్విఁ దెలియు
పూరుషుఁడు పరబ్రహ్మ రూ-పుండగునని
సందియము లేకఁ దెలియుము-సవ్యసాచి!

తా. వేర్వేఱు రూపములుగ నున్న సమస్త భూతము లాత్మయందున్నవనియును, ఆ యాత్మ వలననే చరాచరాత్మకమైన సర్వజగత్తు కలుగుచున్నదనియును దెలియు పురుషుడు పరబ్రహ్మ స్వరూపుఁడగుచున్నాడు.

శ్లో. అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాఽయ మవ్యయః,
శరీరస్థోఽపి కౌంతేయ! న కరోతి న లిప్యతే. 32

గీ. ఆది శూన్యుండు, నాశంబు-నందనట్టి
వాఁడు, త్రిగుణరహితుఁడైన-వాఁడునగుట
వలనఁ, బరమాత్మ యొడలి లో-పల నెలకొని
యున్న వాఁడయ్యుఁ గర్మల-నొనరుచు నతఁ
డును, మఱియుఁ గర్మఫలముల-ననుభవించు
నాతఁడును గాడని తెలియు-మర్జునుండ!

తా. ఓ యర్జునా! పరమాత్మ మొదలులేని వాఁడును, నాశము లేనివాఁడును, గుణములు లేనివాఁడును నగుట వలన, శరీరమందున్న వాఁడైనను కర్మములను జేయడు; అందువలన కర్మఫలముల ననుభవించువాఁడు కాడు.

శ్లో. యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే,
సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే. 33

గీ. గగనమతి సూక్ష్మరూపంబు-గలిగియుంట
విశ్వమంతయుఁ జెలగి వ్యా-పించియున్న
దయ్యు వస్తువుల నెటుల-నంటకుండు;
నటుల క్షేత్రంబులైన దే-హంబులందు
సొరిది క్షేత్రజ్ఞుఁడగు పురు-షుఁడు నెలకొని
యున్న నతఁడు గర్మల కంట-కుండు సుమ్ము.





తా. ఎటు లాకాశమంతటను వ్యాపించి యున్నను, సూక్ష్మ రూపము గలిగియుండుట వలన వస్తువులచేత నంటబడదో, అటుల పరమాత్మయైన క్షేత్రజ్ఞుఁడు శరీరము లందంతటను వ్యాపించియున్నను, శరీరములచే జేయఁబడుచున్న కర్మములచే నంటఁబడడు.

శ్లో. యథా ప్రకాశ యత్యేకః కృత్స్నం లోక మిమం రవిః,
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత! 34

గీ. భాస్కరుఁ డొక్కఁ డెటుల స-ర్వ ప్రపంచ
ములను వెలయంగఁ జేయు; న-టుల వెలయఁగ
జేయుచుండు భువి సకల-క్షేత్రములను
బురుషుఁడని తెలిసికొనుము-పుణ్యచరిత!

తా. ఓ యర్జునా! ఎటుల ఒక్కఁడైన సూర్యుఁడు సమస్త జగత్తును ప్రకాశింపఁ జేయు చున్నాడో, అటుల క్షేత్రజ్ఞుఁడు (పురుషుఁడు) సమస్త శరీరములను (క్షేత్రములను) బ్రకాశింపఁ జేయుచున్నాడు.

శ్లో. క్షేత్ర క్షేత్రజ్ఞయో రేవ మంతరం జ్ఞాన చక్షుసా,
భూత ప్రకృతి మోక్షం చ యే విదుర్యాంతి తే పరమ్. 35

(క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగోనామ త్రయోదశాధ్యాయ స్సంపూర్ణమ్.)

గీ. ధరణి క్షేత్రజ్ఞునకును క్షే-త్రంబునకును
గలిగెడి విభేదమును, భూత-ములను, బ్రకృతి
నింక మోక్షంబు నిటుల గ్ర-హించువారు,
పొందగలరు పరబ్రహ్మ-మును, గిరీటి!

తా. ఎవ్వ రివ్విధముగ క్షేత్రక్షేత్రజ్ఞుల (ప్రకృతిపురుషుల) విలక్షణత్వము (వేఱుపాటు)ను, భూతముల ప్రకృతిని మోక్షమును జ్ఞానదృష్టి చేతఁ దెలియుచున్నారో, వారు పరబ్రహ్మమును బొందుచున్నారు.

(క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగమనెడి త్రయోదశాధ్యాయము సంపూర్ణము)



## చతుర్దశోఽధ్యాయః

## గుణత్రయ విభాగ యోగః

శ్రీ భగవానువాచ :

శ్లో. పరంభూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్,
యజ్ఞాత్వా మునయ స్సర్వే పరాం సిద్ధి మితో గతాః. 1

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు :

గీ. ఎట్టి జ్ఞానమును బడసి-యెసఁగి మును ల
నేకులు పడయ గలిగి రు-త్కృష్ట మోక్ష
పదవి, నట్టి జ్ఞానమును బీ-భత్స నీకుఁ
దెలుపుదును మరల; వినుము-కలితపోవ.

తా. ఏ జ్ఞానము వలన సమస్తర్షులు ఉత్కృష్టమైన మోక్షమును బొందిరో, జ్ఞానములలో మిక్కిలి శ్రేష్ఠమైన యా జ్ఞానమును మరల నీకు చెప్పుచున్నాను.

శ్లో. ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః,
సర్గేఽపి నోపజాయంతే, ప్రళయే న వ్యథంతి చ. 2

గీ. సరగ నీ జ్ఞానముఁ గని నా-సామ్యమును బ
డయఁగలుగువారు, సృష్టి స-మయమునందు
జన్మమును మఱియుఁ, బ్రళయ-సమయమందు
నాశమును బడయరు సుగు-ణమణి జలధి!

తా. ఈ జ్ఞానము బొందిన వారు నాయొక్క స్వరూపమును జెందినవారై, సృష్టి కాలమందు జన్మింపరు; ప్రళయ కాలమందు నాశమొందరు. (వారికి పునర్జన్మ ముండదనియు, అందువలన పునర్మరణ ముండదనియు నర్థము.)

శ్లో. మమ యోని ర్మహద్బ్రహ్మ, తస్మిన్ గర్భం దదా మ్యహమ్,
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత! 3

గీ. త్రిగుణ సంయుతమగు ప్రకృ-తి యనునదియె
హేతువు చరాచరాత్మక-భూత సృష్టి





కా; ప్రకృతియందు నేను నా-యంశములను
నుంచఁ, బుట్టును భూత ప్ర-పంచగణము.

తా. ఓ యర్జునా! భూతములను సృష్టించుట కొఱకు 'మాయ' యనబడునట్టి త్రిగుణాత్మకమైన నా ప్రకృతి యేర్పడియున్నది. నే నా ప్రకృతి యందు నా యంశము నుంచుచున్నాను. అందువలన సర్వ భూతప్రపంచములు పుట్టుచున్నవి.

శ్లో. సర్వ యోనిషు కౌంతేయ! మూర్తయ స్సంభవంతి యాః,
తా సాం బ్రహ్మ మహద్యోని, రహం బీజప్రదః పితా. 14

గీ. ఈ ప్రపంచమునను బుట్టు-నెల్ల చరస
మూహమునకు నచరస-మూహమునకుఁ
బ్రకృతి తల్లి; మఱియుఁ బర-బ్రహ్మ రూపుఁ
డనగు నేనగుదుఁ జనకుఁ-డను, గిరీటి!

తా. అర్జునా! సమస్తయోనులందుఁ బుట్టు దేహములకును ప్రకృతి తల్లి; పరమాత్మ స్వరూపుఁడనైన నేను, బీజప్రదుఁడనైన తండ్రిని.

శ్లో. సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః,
నిబధ్నంతి మహాబాహూ! దేహే దేహిన మవ్యయమ్! 5

గీ. ప్రకృతి సంభవములగు స-త్త్వంబు, దమము,
రజము ననెడి త్రిగుణములు,-ప్రకృతి కంట
కుండునట్టి వాఁడును, నవ్య-యుండు నైన
దేహినరికట్టు నవిగ బు-ద్ధికిని దోచు.

తా. ఓ యర్జునా! ప్రకృతి వలన బుట్టిన సత్త్వరజస్తమో గుణములు, నాశరహితుఁడైన క్షేత్రజ్ఞుని దేహమందు బంధించు చున్నవాని వలె నున్నవి.

శ్లో. తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్,
సుఖ సంగేన బధ్నాతి జ్ఞాన సంగేన చానఘ! 6

గీ. సత్త్వ గుణము నిర్మలము, స్వ-చ్ఛం బుపద్ర
వ రహితంబునై యొప్పుచుఁ-గరము చేర్చు



చుండును నెపుడు దేహి ని-సుఖముతోడ
ను, మఱి, జ్ఞానంబుతోడను-విమలచరిత.

తా. ఓ యర్జునా! ఈత్రిగుణములలో స్వచ్ఛమును, ప్రకాశింపఁజేయు నదియును, ఉపద్రవ రహితమును నైన సత్త్వ గుణము క్షేత్రజ్ఞుని సుఖముతోను జ్ఞానముతోను గూర్చుచున్నది.

**శ్లో. రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సంగ సముద్భవమ్,**
**త న్నిబధ్నాతి కౌంతేయ! కర్మసంగేన దేహినమ్. 7**

గీ. తనకు లేని వస్తువును బొం-దగఁ దలఁపును,
ప్రాప్త విషయములం దను-రక్తియుఁగర
ముగలుగు రజోగుణము చేతఁ-బురుషు నద్ది
కర్మఁజేయ నాసక్తి చేఁ-గట్టివైచు.

తా. ఓ యర్జునా! రజోగుణము కోరికలను, అనురాగమును బుట్టించునది యగుట వలన రాగ స్వరూపమైనది. ఇది క్షేత్రజ్ఞుని (దేహిని) కర్మా సక్తి చేత బద్ధుని జేయుచున్నది.

**శ్లో. తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వ దేహినామ్,**
**ప్రమాదాలస్య నిద్రాభి స్తన్నిబధ్నాతి భారత! 8**

గీ. ధర *నెఱుఁగమి వలనఁ బుట్టు-తమము గలుగఁ
జేయుచున్నది మోహంబు-జీవులకును;
మఱియు నాలస్య నిద్రాప్ర-మాదము లను
దుర్గుణంబుల చేతఁ బ-ద్ధులుగఁజేయు.

తా. ఓ యర్జునా! సమస్తప్రాణులయందును మోహకరమైన తమోగుణము అజ్ఞానమువలన బుట్టుచున్నది. అది క్షేత్రజ్ఞుని (దేహిని) ప్రమాదాలస్య నిద్రలతోఁగూర్చి, బద్ధుని జేయుచున్నది. (ప్రమాదమనగా 'అజాగ్రత').

**శ్లో. సత్త్వం సుఖే సంజయతి, రజః కర్మణి భారత!**
**జ్ఞాన మావృత్యతు తమః ప్రమాదే సంజయ త్యుత. 9**

---

* ఎఱుఁగమి = అజ్ఞానము





గీ. పరఁగజేయు సుఖమున స-త్త్వంబు;కర్మఁ
జేయుటందు వర్తింపగఁ-జేయు రజము;
తమ మరయఁ గప్పివైచి జ్ఞా-నమును బరఁగఁ
జేయును *బ్రమాదకర్మము లొ-**చెయువులందు.

తా. ఓ యర్జునా! సత్త్వ గుణము సుఖమందు ప్రవర్తింపఁజేయుమ. రజోగుణము కర్మమునందు ప్రవర్తింపఁజేయును. తమోగుణము జ్ఞానమును కప్పివైచి, అజాగ్రత యందు బ్రవర్తింపఁజేయును.

శ్లో. రజ స్తమ శ్చాభిభూయ, సత్త్వం భవతి భారత!
రజ స్సత్త్వం తమ శ్చైవ, తమ స్సత్త్వం రజ స్తథా. 10

గీ. పూన్కితోడ, రజ స్తమ-ములను నణగఁ
జేయ, నపుడు సత్త్వ గుణంబు-స్థిరముగా ని
లుచుఁ; దమమును సత్త్వమును న-ణచఁగ నిలుచు
రజము నిలుకడగను;సత్త్వ-రజముల నణ
చంగఁ దిరపడును దమంబు-సవ్యసాచి!

తా. ఓ యర్జునా! రజ స్తమోగుణముల నణచుటవలన సత్త్వ గుణము స్థిరముగా నుండును. రజ స్సత్త్వ గుణముల నణచుట వలన తమో గుణము స్థిరముగా నుండును. సత్త్వ తమోగుణముల నణచుట వలన రజోగుణము స్థిరముగా నుండును.

శ్లో. సర్వ ద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే,
జ్ఞానం యదా, తదా విద్యా ద్వి వృద్ధం సత్త్వ మిత్యుత. 11

గీ. ఎపుడు దేహమందెసఁగి జ్ఞా-నేంద్రియముల
వలన జ్ఞాన స్వరూపమౌ-తెలివి పుట్టు;
నపుడు సత్త్వగుణంబు హె-చ్చయిన దంచుఁ
బాండుసుతుఁడ! తెలిసికొన-వలయు నీవు.

తా. ఓ యర్జునా! ఎప్పుడు దేహమందు జ్ఞానేంద్రియ మార్గమున జ్ఞానస్వరూపమైన ప్రకాశము పుట్టుచున్నదో, అప్పుడు సత్త్వగుణము వృద్ధి బొందినదని తెలిసికొనుము.

* ప్రమాదము = అజాగ్రత; **చెయువు = పని



**శ్లో. లోభః ప్రవృత్తి రారంభః కర్మణా మశమస్స్పృహా,**
**రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ! 12**

గీ. రజము హెచ్చంగ నీ శరీ-రమునఁ, బరధ
నేచ్ఛ, సామాన్య చేష్టయు,-నింద్రియ నియ
మనము లేకుండుటయును, గ-ర్మ సలపంగ
సక్తియును గల్గునని యెంచు-సవ్యసాచి!

తా. ఓ యర్జునా! రజోగుణము వృద్ధి బొందుచున్నప్పుడు, లోభము (ద్రవ్యమందత్యాశ), సామాన్య చేష్ట, కర్మాచరణము, ఇంద్రియ నిగ్రహము లేకపోవుట, కోరిక-ఈ లక్షణములు పుట్టుచున్నవి.

**శ్లో. అప్రకాశోఽప్రవృత్తి శ్చ ప్రమాదో మోహ ఏవ చ,**
**తమ స్యేతాని జాయంతే వివృద్ధే కురునందన! 13**

గీ. పాలుమాలి, కజ్ఞానంబు,-వ్యాధి, మోహ
ము మొదలైన లక్షణములు-పుట్టు నెపుడు.
తమ మను గుణం బపుడు ప్రవృ-ద్ధమయినదని
తెలిసికొనఁగఁదగును సద-మల చరిత్ర!

తా. తమోగుణము వృద్ధి పొందుచున్నప్పుడు, వివేకము లేకపోవుటయు, ప్రాలుమాలు (పనిచేయుట యందు ప్రవృత్తి గలుగకుండుట), జడత (శరీరము యొక్కయు మనస్సు యొక్కయు మాంద్యము), మోహము-ఈ లక్షణములు పుట్టుచున్నవి.

**శ్లో. యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రళయం యాంతి దేహభృత్,**
**తదోత్తమ విదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే. 14**

గీ. సత్త్వ గుణము హెచ్చగ నున్న-సమయమందుఁ
బురుషునకుఁ గాల ధర్మంబు-బొసఁగె నేని
యతఁడు స్వచ్ఛంబులైన, బ్ర-హ్మాది లోక
ములను బొందుచున్నాడు, వి-మలచరిత్ర!

తా. సత్త్వ గుణము వృద్ధి బొందుచున్నప్పుడు మరణము బొందిన దేహి స్వచ్ఛమైన బ్రహ్మవేత్తలయొక్క లోకములను (బ్రహ్మవేత్తలు పొందునట్టి బ్రహ్మాదుల యొక్క లోకములను) పొందుచున్నాడు.





శ్లో. రజసి ప్రళయం గత్వా కర్మ సంగిషు జాయతే,
తథా ప్రలీన స్తమసి మూఢ యోనిషు జాయతే. 15

గీ. రజము హెచ్చైన యపుడు మ-రణముఁ బొందె
నేని కర్మలం దాసక్తి-యెసఁగు పుడమి
యందుఁ బుట్టును; దమము హెచ్చైన యపుడు
చచ్చెనేని, యెత్తును నీచ-జన్మములను.

తా. రజోగుణము వృద్ధి పొందుచున్నప్పుడు మరణము పొందిన దేహి మనుష్యలోకమందు, కర్మాచరణ మందాసక్తి గల వాఁడుగఁ బుట్టుచున్నాడు. తమము వృద్ధిపొందినపుడు మరణించి నీచజన్మము పొందును.

శ్లో. కర్మణ స్సుకృత స్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్,
రజసస్తు ఫలం దుఃఖ, మజ్ఞానం తమసః ఫలమ్. 16

గీ. జ్ఞానము ఫలము సత్త్వ గు-ణంబు వలనఁ
[illegible]ట్ట కర్మకు; రజముచేఁ-బుట్టునట్టి
కర్మకును ఫలమరయ దుః-ఖంబు; తమము
నఁ గలిగెడు కర్మమున కజ్ఞా-నంబు ఫలము.

తా. సత్త్వ గుణము వలన బుట్టిన కర్మముయొక్క ఫలము ప్రకాశ రూపమైన జ్ఞానమనియు, రజోగుణము వలన బట్టిన కర్మము యొక్క ఫలము దుఃఖ ప్రాప్తి యనియు, తమోగుణము వలన బుట్టిన కర్మము యొక్క ఫలము అజ్ఞానమనియు పెద్దలు చెప్పుదురు.

శ్లో. సత్త్వా త్సంజాయతే జ్ఞానం, రజసో లోభ ఏవ చ,
ప్రమాద మోహౌ తమసో భవతోఽ జ్ఞాన మేవ చ. 17

గీ. జ్ఞానము జనించు సత్త్వ గు-ణంబు వలనఁ;
బరగ రజముచేఁ బుట్టు లో-భంబు; మఱియుఁ
గనఁగ నజ్ఞానమును, మోహ-మును బ్రమాద
మును జనించుఁ, దమోగుణం-బున, గిరీటి!

తా. సత్త్వ గుణము వలన జ్ఞానమును, రజో గుణము వలన లోభమును, తమో గుణము



వలన ప్రమాద మోహములును పుట్టుచున్నవి. (ప్రమాదమనగా - అలసత; మోహమనగా - అజ్ఞానము)

శ్లో. ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా, మధ్యే తిష్ఠంతి రాజసాః,
జఘన్య గుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః. 18

గీ. పొందుదు రరయ స్వర్గాది-భువనములను
సాత్త్వికులు; రాజసులు మాను-ష ప్రపంచ
మును బడయుదురు; నారక-ము, నిక, నీచ
జన్మముల నందుదురు తామ-స జను లనఘ!

తా. సత్త్వ గుణ ప్రవృత్తి గలవారు బ్రహ్మలోకము, ఇంద్రలోకము మొదలైన ఉత్తమ లోకములను బొందుచున్నారు. రజోగుణప్రవృత్తి గలవారు మనుష్య లోకమందు బుట్టుచున్నారు. తమో గుణ ప్రవృత్తి గలవారు నీచయోనులయందు జన్మించు చున్నారు.

శ్లో. నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి,
గుణేభ్య శ్చ పరం వేత్తి మద్భావం సోఽధి గచ్ఛతి. 19

గీ. కార్యములకు గుణంబులే-కర్తలనియుఁ,
దాను గుణములకంటె వే-ఱైన వాఁడ
ననియు, మఱి సాక్షిభూతుండ-ననియు నెఱుఁగు
వాఁడు, నా స్వరూపంబును-బడయఁగలడు.

తా. సత్త్వ రజ స్తమో గుణములే సమస్త వ్యాపారములకును కర్తలనియును, తా నా వ్యాపారముల సాక్షిమాత్రుఁడుగ నుండి చూచుచున్నాఁడనియును దెలిసికొను పురుషుఁడు నా స్వరూపమును బొందుచున్నాడు.

శ్లో. గుణా నేతా నతీత్య త్రీన్ దేహీ దేహ సముద్భవాన్,
జన్మ మృత్యు జరా దుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే. 20

గీ. దేహము వలనఁ బుట్టు నీ-త్రిగుణములను
మీరు నట్టి నరుఁడు దగ-మృత్యు జన్మ
వార్ధకాది వ్యసనపరం-పరలచేత
విడువఁబడి మోక్షమొందును-శ్వేతహయుఁడ!





తా. జన్మహేతువులైన యీ మూఁడు గుణముల నతిక్రమించునట్టివాఁడు జన్మ మృత్యు జరా దుఃఖములచే విడువఁబడిన వాఁడై మోక్షమును బొందుచున్నాడు.

అర్జున ఉవాచ :

శ్లో. కైర్లింగై స్త్రీన్ గుణా నేతా నతీతో భవతి ప్రభో!
కి మాచారః కథం చైతాం స్త్రీన్ గుణా నతివర్తతే. 21

గీ. ఈ త్రిగుణములను నతిక్ర-మించువాని
కెట్టి గుఱుతులుండును? వాని-కెవ్విధమయి
నట్టి యాచారముండును?-హరి! యతిక్ర
మించుటకు మార్గమెట్టిది?-యెలమి జెపుమ.

తా. ఓ కృష్ణా! త్రిగుణముల నతిక్రమించిన వాని లక్షణము లేవి? వాఁడెట్టి యాచారము గలవాఁడుగ నుండును? ఈ త్రిగుణముల నతిక్రమించుటెట్లు?

శ్రీ భగవా నువాచ :

శ్లో. ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ!
న ద్వేష్టి సంప్రవృత్తాని, న నివృత్తాని కాంక్షతి. 22

గీ. త్రిగుణములకును దివిరి య-తీతుఁడైన
వాఁడు, సత్త్వగుణంబుచేఁ-బ్రాప్తమయిన
జ్ఞాన నిష్ఠ గలిగినవాఁ-డైన, నెప్పు
డును రజోగుణ ప్రాబల్య-మునను లోభ
కార్యము దనచేఁ గలిగినఁ-గాని, తమము
కతన నేదైన యజ్ఞాన-కార్యము గలి
గినను గాని, ద్వేషింపకుం-డు; నిక నా ప
నులు గుణములం దణగి పోవఁ-దలఁపకుండు.

తా. ఓ యర్జునా! త్రిగుణాతీతుఁడైన వాఁడు సత్త్వగుణ ప్రవృత్తి వలన జ్ఞాననిష్ఠ గలిగినను, రజోగుణ ప్రవృత్తి వలన లోభ కార్యము గలిగినను, తమోగుణ ప్రవృత్తి వలన నజ్ఞానకార్యము గలిగి నను ద్వేషింపఁడు. ఆయాగుణములందా యా కార్యము లణగినప్పుడు వానిని గోరఁడు.



శ్లో. ఉదాసీ నవదాసీనో గుణై ర్యోన విచాల్యతే,
గుణావర్తంత ఇత్యేవ యోఽవ తిష్ఠతి నేం గతే. 23

గీ. త్రిగుణములను మీరి నతఁడు-దగ గుణముల
యందు, మఱి వాని కార్యంబు-లందు, లక్ష్య
మెంతయును లేక, గుణములె-యెల్ల పనులు
సలుపునని పొందకుండును-చలన మెపుడు.

తా. త్రిగుణముల కతీతుఁడైనవాడు, ఆ త్రిగుణములను లక్ష్యముచేయక, తటస్థునివలె నుండి, సమస్త వ్యాపారములు గుణముల వలన జరుపఁబడుచున్నవను భావము కలిగి చలింపకుండును.

శ్లో. సమదుఃఖ సుఖస్స్వస్థ స్సమలోష్టాశ్మ కాంచనః,
తుల్య ప్రియాప్రియో ధీర స్తుల్య నిందాత్మ సంస్తుతిః. 24

గీ. అతఁడు సుఖ దుఃఖములను స-మతఁ గనుచును;
నిరత మాత్మావలోకన-నిష్ఠఁ గలిగి,
కనక పాషాణ మృత్తిక-లను, ననిష్ట
జనుల, నిష్ట జనులను, నిం-దను, స్తవమునుఁ,
బ్రియము నప్రియమును, నొక్క-విధముగఁ దగఁ
గాంచుచును; ధృతి గలిగి వ-ర్తించుచుండు.

తా. అతఁడు సుఖదుఃఖములందు సమబుద్ధి గలవాఁడుగను, ఆత్మావలోకనపరుఁడుగను, మట్టిగడ్డను ఱాతిని బంగారమును సమానముగఁ జూచువాఁడుగను, ప్రియాప్రియములందును నిందాస్తుతులయందును సమబుద్ధి గలవాఁడుగను నుండును.

శ్లో. మానావమానయో స్తుల్య స్తుల్యోమిత్రారి పక్షయోః,
సర్వారంభ పరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే. 25

గీ. అవని మానావమానంబు-లందు, మిత్రు
లం, దమిత్రులందును సమ-మైన మనసు
గలిగి, సర్వకార్యారంభ-ములను విడిచి
నట్టి నరుని, గుణాతీతుఁ-డంద్రు బుధులు.





తా. మానావమానములందు సమబుద్ధి గలిగినట్టియు, శత్రువుల యందును, మిత్రుల యందును సమభావము గలిగినట్టియు, సర్వకార్యములను విడిచినట్టియు మనుష్యుఁడు త్రిగుణాతీతుఁడని చెప్పఁబడుచున్నాడు.

శ్లో. మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే,
సగుణాన్ సమతీ త్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే. 26

గీ. కరము స్థిరమైన భక్తియో-గంబు చేత
నన్ను సేవించుచుండెడి-నరుఁ డిలఁ ద్రిగు
ణంబులను మీరి, బ్రహ్మభా-వంబు బొంద
గను సమర్థుఁడని తెలిసి-కొనుము పార్థ!

తా. నన్ను నిశ్చలమైన భక్తి యోగము చేత సేవించువాఁడు, ఈ త్రిగుణముల నతిక్రమించి బ్రహ్మభావము కొఱకు సమర్థుఁడగుచున్నాడు.

శ్లో. బ్రహ్మణోహి ప్రతిష్ఠాఽహ మమృతస్యా వ్యయస్య చ,
శాశ్వతస్య చ ధర్మస్య సుఖ స్యైకాంతికస్య చ. 27

(గుణత్రయ విభాగయోగోనామ చతుర్దశోధ్యాయ స్సంపూర్ణమ్)

గీ. ఒనర నాశ రహితుఁ డవ్య-యుఁడునగు పర
మాత్మకును, శాశ్వతంబగు-నట్టి ధర్మ
మునకును, జలనరహితమౌ-మోక్షమునకు
నాలవాలము నేనె క-దా, కిరీటి!

తా. నేను నాశరహితుఁడును, నిర్వికారుఁడును నగు పరమాత్మకును, శాశ్వతమైన ధర్మమునకును, చలనము లేని మోక్షమునకును ఆశ్రయమైన వాఁడను.

(గుణత్రయ విభాగయోగమనెడి చతుర్దశాధ్యాయము సంపూర్ణము)



# పంచదశోఽధ్యాయః

## పురుషోత్తమ ప్రాప్తియోగః

శ్రీ భగవాన్ ఉవాచ :

శ్లో. ఊర్ధ్వ మూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్,
ఛందాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్. 1

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు :

గీ. తనరు మాయాంశ సంజని-తమగు బ్రహ్మ
మే మొదలుగాను, మరియు ని-కృష్టములగు
మహదహంకారము లెసఁ గొ-మ్మలు గను గల
పిప్పలంబను సంసార-వృక్ష మవ్య
యంబని వచియింతురు బుధు; - లాగమములు
పర్ణములగు నీ వృక్షరూ-పంబు నెఱుఁగు
పురుషుఁడు సకల వేదార్థ-ముల నెఱింగి
నట్టి వాఁడటంచుఁ దెలియు-మర్జునుండ!

తా. బ్రహ్మము మూలముగా గలిగినట్టియు, మహదహంకారములు శాఖలుగా గలిగినట్టియు యశ్వత్థమనెడి సంసారవృక్ష మనాదియని తత్త్వజ్ఞులు చెప్పుదురు. ఈ సంసారాశ్వత్థమునకు వేదము లాకులు. ఆ వృక్షమును దెలిసినవాఁడు వేదార్థములు దెలిసిన వాఁడు.

శ్లో. అధ శ్చోర్ధ్వం చ ప్రసృతా స్తస్యశాఖా-గుణప్రవృద్ధా విషయ ప్రవాళాః,
అధ శ్చ మూలా న్యనుసంతతాని-కర్మానుబంధీని మనుష్యలోకే. 2

గీ. కనఁగ నజ్ఞాన విషయము-లనెడి యీ త
రువు విటపములు త్రిగుణము-ల వలనఁ బెను
పఁబడి, యూర్ధ్వముగను, దిగు-వగను విస్తృ
తంబులై యుండు; నా విట-పంబులకును
మర్త్యలోకంబునందుఁ గ-ర్మఫలముల వ
లన జనించిన ద్వేషము-రాగము మొద
లైనవి మొదళ్లు గాను, శ-బ్దాదులైన
విషయములు చిగుళులుగాను-బేర్మి నొప్పు.





తా. ఆ సంసార వృక్షము యొక్క కొమ్మలువలె నున్న యవ్యక్తాదులు త్రిగుణములచేత స్థూలముగాఁ జేయఁబడినవై, శబ్దాది విషయములు చిగుళ్లుగా గలిగి పైకిని క్రిందికిని వ్యాపించియున్నవి. ఆ కొమ్మలకు మనుష్యలోకమందు కర్మఫలముల వలన గలిగిన రాగద్వేషాదులు ఊడలుగ నున్నవి.

**శ్లో. న రూప మస్యేహ తథోపలభ్యతే–నాంతో న చాది ర్నచ సంప్రతిష్ఠా,**
**అశ్వత్థ మేనం సువిరూఢ మూల–మసంగ శస్త్రేణ దృఢేన ఛిత్వా. 3**

గీ. ఇట్టి సంసార పిప్పల–వృక్ష తత్త్వ
మును, మఱియు దాని యాద్యంత–ములను దెలిసి
కొనఁ దరము కాదు కాన, దీ–నిని విరక్తి
యను పరశువుచే నఱుకవ–లెను గిరీటి!

తా. ఈ సంసారవృక్షము యొక్క స్వరూపము తెలియబడదు. అటులనే దాని యాది మధ్యాంతములును దెలియబడవు. మిక్కిలి దృఢమైన వేళ్లు గలిగిన యీ సంసారాశ్వత్థమును విరక్తి యనెడి దృఢమైన యాయుధముచేత ఛేదింపవలెను.

**శ్లో. తతః పదం తత్పరిమార్గితవ్యం–యస్మిన్ గతా ననివర్తంతి భూయః,**
**తమేవ చాద్యం పురుషం ప్రపద్యే–యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ. 4**

గీ. అటుల నొనరించి, యే పర–మాత్మచే, న
నాదియైన సంసారంబు–ప్రాప్తమయ్యెఁ;
నెట్టి పరమాత్మను బడసి–నట్టి పూరు
షులకు మరల జన్మంబులు–గలుగకుండు.
నట్టి పరమాత్మయే, శర–ణ్యమని మదిని
నమ్మి, తిరముగ యత్న మొ–నర్పవలయు.

తా. అనంతర మే పరమాత్మను బొందినవారు మరల జన్మములు బొందరో, యే పరమాత్మవలన ననాదియైన సంసార మేర్పడెనో, యా పరమాత్మను బొందుటకు ప్రయత్నింపవలెను.

**శ్లో. నిర్మానమోహా జిత సంగదోషా–అధ్యాత్మ నిత్యా వినివృత్త కామాః,**
**ద్వంద్వై ర్విముక్తా స్సుఖ దుఃఖ సంజ్ఞై–ర్గచ్ఛంత్య మూఢాః పద**
**మవ్యయం తత్. 5**



గీ. మాన మోహములు విడిచి-జ్ఞానులు, సుత
దార మిత్రులందును మమ-త్వంబు లేక,
జ్ఞాన విద్యారతులయి, వాం-ఛలను విడిచి,
యుష్ణ శీతంబు లాదిగ-నొప్పు ద్వంద్వ
ములను సమత వీక్షించుచుఁ-బుడమి నవ్య
యమగు మోక్షంబుఁ బొందుదు-రర్జునుండ!

తా. మాన మోహములు లేని వారును, దార సుత ధనారామ క్షేత్రములందు సంగమును వీడినవారును, జ్ఞాన విద్యయం దాసక్తిగలవారును, కామక్రోధాదులు లేనివారును, శీతోష్ణ సుఖ దుఃఖాది రూపములైన ద్వంద్వముల యందు సమబుద్ధి గలవారును నైన జ్ఞానులు నాశరహితమైన మోక్షస్థానమును (పరమాత్మను) బొందుచున్నారు.

**శ్లో. న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః,**
**యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ.** 6

గీ. అట్టి యవ్యయపదమును-నంశుమాలి
యైనఁ జంద్రుఁడయిన నగ్ని-యైనను వెల
యింపఁజేయఁజాల రరయ;-నే పదమును
బడసిన వెనుక మరల భ-వములు లేవొ,
యట్టి యుత్కృష్టమగు పద-మగును నాదు
స్థానమని తెలిసికొనుము-సవ్యసాచి!

తా. ఆ స్థానమును సూర్యచంద్రులు కాని, అగ్నికాని ప్రకాశింపఁ జేయఁజాలరు. ఏ స్థానమును బొందిన పిమ్మట తిరిగి జన్మింపరో, ఆ యుత్కృష్టమైన స్థానమే నా స్థానము.

**శ్లో. మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః,**
**మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతి స్థాని కర్షతి.** 7

గీ. అరయ ననాదియైన నా-యంశమే, ప్ర
పంచమందు జీవ స్వరూ-పమయి వెలయు
చుండు; నైన యా జీవుని-సొరిది ప్రకృతి
జమయి యొప్పు జ్ఞానేంద్రియ-చయము, మఱియు





మనసు పెనగొని లాగుచుం-డును విషయము
లందు మిగుల బలముగా న-హర్నిశంబు.

తా. అనాదియైన నాయంశమే సంసారమందు (ప్రపంచమందు) జీవస్వరూపమై యున్నది. మనస్సును పంచేంద్రియములును ఆ జీవస్వరూపుని విషయములందు బలాత్కారముగ లాగుచున్నవి.

శ్లో. శరీరం య దవాప్నోతి యచ్చా ప్యుత్క్రామతీశ్వరః,
గృహీత్వైతాని సంయాతి వాయు ర్గంధా నివాశయాత్. 8

గీ. జీవుఁడు శరీరముల యందు-జేరునప్పు
డును, శరీరము ల్విడుచు త-ఱిని, బవనము
పుష్పవాసనలను గొని-పోవునటుల
నింద్రియములను గైకొని-యేగుతెంచు.

తా. జీవుఁడు శరీరమందు ప్రవేశించునప్పుడును విడుచునప్పుడును, వాయువు వాసనలను తీసికొను పోవునట్లే మనస్సును ఇంద్రియములను దీసికొని పోవుచున్నాడు. (అనగా మనస్సు యొక్కయు, ఇంద్రియముల యొక్కయు ప్రవృత్తిని తీసికొని పోవుచున్నాడని యర్థము.)

శ్లో. శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ,
అధిష్ఠాయ మనశ్చాయం విషయా నుపసేవతే. 9

గీ. పరగు జ్ఞానేంద్రియములైన-స్పర్శన, రస
న, నయన, శ్రోత్ర, చక్షువు-లను, మనసును
దవిలి, స్పర్శ రూప రస గం-ధ స్వసముల
ననుభవించుచునుండు, జీ-వాఖ్యుఁ డెసఁగి.

తా. ఈ జీవుఁడు పంచ జ్ఞానేంద్రియములైన శ్రోత్ర చక్షు స్స్పర్శన రస నాఘ్రాణములను మనస్సును అధిష్ఠించి శబ్ద రూప స్పర్శ రస గంధములను విషయముల ననుభవించుచున్నాడు.

శ్లో. ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్,
విమూఢా నాను పశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః. 10



మూఢు లీ జీవుని, శరీర-మును విడుచు న
పుడయినను, నింద్రియ విషయ-ములను ననుభ
వించు నపుడయినను, గుణా-న్వితుడుగా వ
ఱలు సమయము నందైనను-దెలిసికొనఁగ
జాల; రైన సర్వంబును-జ్ఞానదృష్టి
గల జనులు చూచుచుందు ర-మలచరిత్ర!

అవివేకులు జీవుఁడు దేహమును విడిచిపోవుచున్న వానిగను, త్రిగుణములతో గూడుకొనియున్న వానిగను దెలిసికొనజాలరు. జ్ఞానదృష్టి గల వారు మాత్రమే యీ విషయమును దెలిసికొనుచున్నారు.

**యతంతో యోగిన శ్చైనం పశ్యం త్యాత్మ న్యవస్థితమ్,**
**యతంతో౽ప్య కృతాత్మానో నైనం పశ్యం త్యచేత సః.** 11

తగిన యత్నము లొనరించి-తమ శరీర
మున నెలకొను నాత్మ స్వరూ-పుఁడగు జీవు
ని గనుచున్నారు యోగులు-నిర్మల హృద
యంబు తోడ; నయిన, నకృ-తాత్ములైన
జనులు బరమాత్మను గనంగఁ-జాల రెంత
యత్న మొనరించినను, గలు-షాత్ములగుట.

యోగులు ప్రయత్నము చేయుచు దేహమందున్న పరమాత్మ స్వరూపుఁడైన జీవుని దెలిసికొనుచున్నారు. ఆత్మజ్ఞానము లేని యవివేకులు ప్రయత్నము చేసినను దెలిసికొనజాలరు.

**యదాదిత్య గతం తేజో జగ ద్భాసయతే౽ఖిలమ్,**
**య చ్చంద్రమసి య చ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్.** 12

ఇన శశాంక పావకుల యం-దే ప్రకాశ
ము నెలకొనియుండి వెలయఁ జే-యునో సమస్త
లోకములను నెనఁగి, యా వె-లుంగు మామ
కం బటంచును నీ వెరు-గంగవలయు.

సమస్త జగత్తును బ్రకాశింపఁజేయుచున్న సూర్యునియందున్న ప్రకాశమును,





చంద్రుని యందును అగ్నియందును గల ప్రకాశమును నా సంబంధమైన ప్రకాశమని తెలిసికొనుము.

శ్లో. గామా విశ్య చ భూతాని ధారయా మ్యహ మోజసా,
పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః. 13

గీ. పరగ ధరయందుఁ జొచ్చి, నా-బలము చేత
మోయుచున్నాఁడను సకల-భూతములను;
బొసఁగి, నేనె, రసస్వరూ-పుఁడగు కుముద
బంధువునయి, యోషధులఁ గా-పాడుచుందు.

తా. నేను భూమియందుఁ బ్రవేశించి నా బలము చేత సమస్త ప్రాణులను భరించుచున్నాను; రసస్వరూపుఁడైన చంద్రుఁడనై సర్వౌషధులను (వరి, గోధుమ, జొన్న మొదలగు పైరులను) పోషించుచున్నాను.

శ్లో. అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః,
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్. 14

గీ. అరయఁ బ్రాణులందును జఠ-రాగ్ని రూప
మున నెలకొని, ప్రాణాపాన-ములను వాయు
వులను గూడి చతుర్విధ-భోజ్యములను
జీర్ణ మొనరించుచున్నాఁడ-జెలఁగి నేను.

తా. నేను దేహధారుల యొక్క దేహము లందు జఠరాగ్నిగనుండి, ప్రాణాపాన వాయువులతో గూడి వారు భుజించునట్టి చతుర్విధాహార పదార్థములను (భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యములను) జీర్ణింపఁజేయుచున్నాను.

శ్లో. సర్వస్య చాహం హృది సన్నివిష్టో-మత్త స్స్మృతిర్జ్ఞాన మపోహనం చ,
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో-వేదాంత కృ ద్వేదవిదేవ చాహమ్. 15

గీ. ఎల్లజీవుల మనసులం-దేనె గలను;
నావలను బుద్ధిమాంద్యంబు,-జ్ఞానమును, స్మృ
తియును సంభవమగును; శ్రు-తి ప్రభవుఁడ,
వేదవేద్యుఁడ, వేదాంత-విదుఁడ నేను.



తా. నేను సమస్త ప్రాణులయొక్క మనస్సులందు వసించుచున్నాను. నా వలన వారికి స్మృతియును (తెలిసికొను శక్తి) వివేకమును, పొరబడుటయును గలుగుచున్నవి. నేను సర్వవేదముల చేత దెలియఁదగిన వాఁడను, వేదాంతములను జేసినవాఁడను, వేదములను దెలిసినవాఁడను.

శ్లో. ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవ చ,
క్షర స్సర్వాణి భూతాని, కూటస్థోఽక్షర ముచ్యతే. 16

గీ. సర్వలోకములందు, న-క్షరుఁ డొకఁడును,
క్షరుఁ డొకండును, నిర్వురు-గలరు; క్షరుఁడు
సకల భూతంబులనియు, న-క్షరుఁడు జీవుఁ
డనియును వచియింతురు బుధు-లర్జునుండ!

తా. లోకమునందు క్షరుఁడనియు, అక్షరుఁడనియు నిద్దఱు వ్యక్తులున్నారు. క్షరుఁడు సమస్త భూత సమూహమనియును, అక్షరుఁడు జీవుఁడనియును దెలిసికొనవలెను.

శ్లో. ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః,
యో లోకత్రయ మావిశ్య బిభర్త్య వ్యయ ఈశ్వరః. 17

గీ. ఈ ద్వయంబున కన్యుఁ డు-త్కృష్టుఁడు, పర
మాత్మ; యతఁడె ముల్లోకము-లందుఁ జొచ్చి
వానిని భరించుచుండును;-బరఁగ నవ్య
యుండయిన జగదీశుఁ డ-తండె సుమ్ము.

తా. ఈ యిద్దరి కంటెను విలక్షణుఁడై యున్న పురుషుఁడు పరమాత్మయని చెప్పఁబడు చున్నాడు. ఈపరమాత్మ మూఁడులోకములందు ప్రవేశించి వానిని భరించుచున్నాడు. ఆ పరమాత్మయే నాశరహితుఁడైన యీశ్వరుడు.

శ్లో. యస్మాత్క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః,
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః. 18

గీ. అర యక్షర పురుషుని మీఱి-నట్టివాఁడ,
నక్షరుని కంటె వరుఁడను-నగుట, శ్రుతుల
యందును, సకల లోకంబు-లందును బురు
షోత్తముండటంచుఁ బ్రసిద్ధి-నొందినాఁడ.





తా. నేను క్షర పురుషుని యతిక్రమించిన వాఁడనై, అక్షర పురుషుని కంటెను శ్రేష్ఠునై యుండుట వలన, లోకమందును వేదములందును పురుషోత్తముఁడని ప్రసిద్ధి వహించియున్నాను.

శ్లో. యో మా మేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్,
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత! 19

గీ. మోహమును వీడి, పురుషోత్త-ముండనైన
న న్నెవఁ డిభుల నెఱుఁగు-మన్నవాఁడొ,
కనఁగ సర్వవిదుఁడయి, స-కల విధముల
చేత నా పురుషుఁడు నన్నుఁ-జెందు సుమ్ము.

తా. ఓ యర్జునా! వివేకము చేత నీ విధముగా పురుషోత్తముఁడనైన నన్ను దెలిసికొనునట్టి మనుష్యుఁడు సర్వజ్ఞుఁడై సమస్త విధముల చేత నన్ను బొందుచున్నాడు.

శ్లో. ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయాఽనఘ!
ఏత ద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్కృత కృత్య శ్చ భారత! 20

(పురుషోత్తమప్రాప్తియోగోనామ పంచదశోధ్యాయ స్సంపూర్ణమ్)

గీ. పాసఁగ గుహ్యమౌ నీ శాస్త్ర-మును నుడివితి
నీకు వివరముగను; దీని-ని గ్రహియించి
బుద్ధిమంతులు జ్ఞానంబుఁ-బొంది, విహిత
కర్మముల నొనరింతురు-ధర్మనిరత!

తా. ఓ యర్జునా! మిక్కిలి రహస్యమైన యీ శాస్త్రమును నీకుఁ జెప్పితిని. ఈ శాస్త్రమును దెలిసికొనిన జనుఁడు బుద్ధిమంతుఁడై, చేయఁదగిన కార్యములను జేయును.

(పురుషోత్తమ ప్రాప్తి యోగమనెడి పంచదశాధ్యాయము సంపూర్ణము)



## షోడశోఽధ్యాయః

## దైవాసుర సంపద్విభాగ యోగః

శ్రీ భగవా నువాచ :

శ్లో. అభయం సత్త్వ సంశుద్ధిర్జ్ఞానయోగ వ్యవస్థితిః,
దానం దమ శ్చ యజ్ఞ శ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్. 1

శ్లో. అహింసా సత్య మక్రోధ స్త్యాగశ్శాంతి రపైశునమ్
దయా భూతే ష్వలోలత్వం మార్దవం హ్రీ రచాపలమ్. 2

శ్లో. తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతి మానితా,
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత! 3

శ్రీ కృష్ణుడు చెప్పుచున్నాడు :

గీ. అభయమును, జిత్తశుద్ధియు నార్జవంబు
దమము,దానంబు, యజ్ఞంబు,-తపము,వేద
పఠనము, నహింస, సత్యంబు,-పరుల దోష
ములను జెప్పకుండుట, లజ్జ,-భూతదయయు
విషయములు ప్రాప్తమైనను-వికృతి లేక
యుండుటయు, చపలత లేక-యుండుటయును,
మార్దవంబు, తేజంబు, క్ష-మమును ధృతియు,
శౌచ, మొరులకు ద్రోహంబు-సలుపకుండు
టయును, గర్వంబులేకుండు-టయును,సనెడి
యీ గుణములు గలిగియుండు-రిలను దేవ
తాంశ సంభూతులగు జను-లర్జునుండ!

తా. నిర్భయత్వము, మనశ్శుద్ధి, జ్ఞానయోగమందుండుట, దానము, దమము,(బాహ్యేంద్రియ నిగ్రహము), యజ్ఞము, వేదాధ్యయనము, తపస్సు, ఋజువర్తనము, అహింస, సత్యము, క్రోధము లేకుండుట, విషయాసక్తి లేకుండుట, మనశ్శాంతి, పరుల దోషముల నెన్నకుండుట, భూతదయ, ఇంద్రియ విషయము లెదుట నున్నప్పుడు వానిని బొందవలెనను తత్తఱపాటు చెందకుండుట, మృదుత్వము,





సిగ్గు, చాపల్యము లేకుండుట, ప్రతిభ గలిగియుండుట, ఓర్పు, ధైర్యము, పారిశుద్ధ్యము, పరులకు ద్రోహము చేయకుండుట, గర్వము లేకుండుట-ఈ గుణములు దేవతాంశ సంభూతులైన వారికిఁ గలుగుచున్నవి.

శ్లో. దంభో దర్పోఽభిమాన శ్చ క్రోధః పారుష్య మేవ చ,
అజ్ఞానం చాభిజాతస్య పార్థ! సంపద మాసురీమ్. 4

గీ. దర్పము, నభిమానమును, క్రో-ధంబును, బరు
ష వచనంబులు,డంబ, మ-జ్ఞానము, మొద
లయిన దుర్గుణంబులు, రాక్ష-సాంశ సంభ
వులగు జనులకుండు నటంచుఁ-దెలిసి కొనుము.

తా. అర్జునా! పటాటోపము, గర్వము, అభిమానము, క్రోధము, పారుష్యము (కఠినపు మాటలాడుట), అవివేకము, అను నీ గుణములు రాక్షసాంశ సంభూతులైన వారి యందుండును.

శ్లో. దైవీ సంప ద్విమోక్షాయ నిబంధా యాసురీమతా,
మా శుచ స్సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ! 5

గీ. దేవతాంశమునను జగ-తిఁ బ్రభవంబు
మోక్షసాధకంబు; మఱియు-రాక్షసాంశ
భవము చావు పుట్టులకు హే-తువగు; నీవు
దేవతాంశుండ వగుటఁ జిం-తిల్లవలదు.

తా. అర్జునా! దేవతాంశమునందు జన్మించుట మోక్షసాధకమై యున్నది. రాక్షసాంశమునందు జన్మించుట జనన మరణ రూపమైన సంసారబంధమును గలిగించు చున్నది. నీవు దేవతాంశమునందు జన్మించిన వాఁడవు కావున దుఃఖింపకుము.

శ్లో. ద్వౌ భూత సర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ,
దైవో విస్తరశః ప్రోక్త, ఆసురం పార్థ! మే శృణు. 6

గీ. అర్జునుఁడ! దేవతాంశా సు-రాంశములను
ద్వివిధములగు జన్మములు గ-లవు ప్రపంచ
మందుఁ బ్రాణుల; కందు దే-వాంశ జన్మ
గుణములు దెలిపితిని నీకుఁ-గుదురుగను; ని



క, నసురాంశమయిన పుట్టు-క గొనములను
దెలిపెదను, శ్రద్ధతో విని-తెలిసికొనుము.

తా. అర్జునా! ఈ లోకమందు ప్రాణులకు దేవాంశ జన్మ మనియును, రాక్షసాంశ జన్మమనియును రెండు విధములైన జన్మములున్నవి. దేవతాంశ జన్మమువలన గలుగు గుణములను నీకు సవిస్తరముగఁ జెప్పితిని. ఇక రాక్షసాంశ జన్మమువలన గలుగు గుణములను సవిస్తరముగ దెల్పెదను, వినుము.

శ్లో. ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా, న విదురా సురాః
న శౌచం నాపి చాచారో, న సత్యం తేషు విద్యతే. 7

గీ. విహిత కర్మలయందు ప్ర-వృత్తియును, వి
కర్మలందు నివృత్తియు,-గౌరవంబు,
బాహ్యశుద్ధి, యంతశ్శుద్ధి,-భక్తి, సత్య
ము పలుకుట, సదాచారంబు,-మొదలగు సుగు
ణములను గలిగి యుండరు -విమల చరిత!
యిలను రాక్షసాంశమున జ-న్మించు జనులు.

తా. రాక్షసాంశమునందు జన్మించినవారు విహిత కర్మములందు ప్రవృత్తిని, నిషిద్ధకర్మము లందు నివృత్తిని గలిగి యుండరు. వారి యందు శుచిత్వమును, సదాచారమును, సత్యమును నుండవు.

శ్లో. అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరమ్,
అపరస్పర సంభూతం కి మన్య త్కామ హైతుకమ్. 8

గీ. ప్రాణిజాతమంతయు సత్య-వర్జితం బ
నియును, ధర్మ మధర్మము-నెడి ప్రతిష్ఠ
లేనిదనియు, ప్రభు వెవండు-లేని దనియుఁ,
ప్రకృతిజంబగు కామంబు-వలన గలిగె
ననియు, నిక వేఱేమి లే-దనియును వచి
యింతు రసురాంశమందు జ-న్మించు జనులు.

తా. రాక్షసాంశ సంభూతులు, జగత్తు అసత్యమైన దనియును, ధర్మాధర్మ ప్రతిష్ఠారహితమైన దనియును, నియామకుఁడు లేనిదనియును, స్త్రీ పురుషుల పరస్పర సంబంధము





వలన బుట్టినదనియును, అందువలన కామమే హేతువుగా గలిగినదనియును చెప్పుదురు.

శ్లో. ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్ప బుద్ధయః,
ప్రభవం త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః. 9

గీ. అల్పబుద్ధిచే వీరు న-ష్టాత్ములగుచు,
నిట్టి భావంబు వహియించి-యొసఁగి క్రూర
కర్మముల నొనరుచుచు, జ-గతికి శత్రు
వులయి లోకనాశంబుకై-పుట్టుచుంద్రు.

తా. నష్టాత్ములును, అల్పబుద్ధి గలవారును నైన రాక్షసాంశ సంభూతు లిట్టి యభిప్రాయము గలిగియుండి, హింసాది క్రూరకర్మములు చేయుచు, లోకమునకు శత్రువులై, లోకము యొక్క నాశము కొఱకు పని చేయుచుందురు.

శ్లో. కామ మాశ్రిత్య దుష్పూరం దంభమాన మదాన్వితాః,
మోహా ద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః. 10

గీ. అట్టివారు పూరింప శ-క్యంబు కాని
వాంఛలను, దంభమాన ద-ర్ప మదములను
గలిగి, వశ్య నిధ్యంజన-కాయసిద్ధి
పరజనాకర్షణాది సం-ప్రాప్తియందు
మిగుల నాసక్తితోడ నా-మిష సురాది
క్షుద్ర వస్తువులఁ దవిలి-క్షుద్ర దేవ
తలఁ గొలుచుచు, శాస్త్ర నియమ-ములను సరకు
గొనక, మూఢులుగను మెలఁ-గుదురు భువిని.

తా. వారు పొందశక్యము కాని కోరికలు గలిగి, అజ్ఞానము వలన చెడ్డ వస్తువులను గ్రహించుచు, అశాస్త్రీయములైన నియమములు గలిగియుండి, దంభమాన మదములతో ప్రవర్తించుచుందురు.

శ్లో. చింతా మపరిమేయాం చ ప్రళయాంతా ముపాశ్రితాః,
కామోపభోగ పరమా ఏతావదితి నిశ్చితాః. 11

గీ. మృత్యువును బొందువఱకును-మిగుల చింత
గలిగి, కామోపభోగంబు-కంటెను బర



మార్థ మెద్దియు లేదని-మదిని నమ్మి,
పశువుల వలె చరింతురు-వసుధయందు.

తా. వారు మరణము బొందువఱకును మిక్కిలి విచారము గలిగియుండి, కోరికల ననుభవించుట కంటెఁ బరమార్థ మేదియు లేదను విశ్వాసముతో బ్రవర్తించుచుందురు.

శ్లో. ఆశాపాశ శతై ర్బద్ధాః కామ క్రోధ పరాయణాః
ఈహంతే కామభోగార్థ మన్యాయే నార్థ సంచయాన్. 12

గీ. పలుతెఱఁగుల యాశాపాశ-ముల వలన ని
బద్ధులై, క్రోధ కామ లో-భములఁ బరఁగి
కామభోగార్థ మన్యాయ-కార్యముల వ
లన ధనము సేకరింపఁ ద-లంచుచుంద్రు.

తా. వారు పలు విధములగు కోరికలు గలిగియుండి కామక్రోధములకు లోనగుచు, కామోపభోగము కొఱకు, అన్యాయ ప్రవర్తనము చేత ధనార్జనము చేయుచుందురు.

శ్లో. ఇద మద్య మయా లబ్ధ మిమ ప్రాప్స్యే మనోరథమ్,
ఇద మస్తీద మపి మే భవిష్యతి పునర్ధనమ్. 13

గీ. ఇంతవఱ కింత ద్రవ్యమా-ర్జించి యుంటి;
మింత సేకరింపఁగలార-మింకమీద;
నింత గలదింతవఱ; కింక-నీ ధనంబుఁ
బొందగలమని తలతురు-డెందమందు.

తా. "మేమింత ధనము సంపాదించితిమి. ఈ కోరికను పొందగలము. ఇప్పుడింత ధనము కలదు. ఇంక నింత ధనమును సంపాదించగలమ"ని వారు తలఁచుచుందురు.

శ్లో. అసౌ మయా హత శ్శత్రు ర్హనిష్యే చాపరా నపి,
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ. 14

గీ. ఈ పగతురను మేము ప-ధించియుంటి;
మింక నితరవైరులను జ-యింపఁగలము;
బలము గలవార మింక సం-పత్కరులము;
భోగులము; సుఖులమటంచు-భువిఁ దలంత్రు.





తా. "ఈ శత్రువులు మాచే సంహరింపఁబడిరి. ఇతర శత్రువులను సంహరింపగలము. మేమితరులకు నియామకులము, భోగులము, సంపన్నులము, బలవంతులము. సుఖపడువారము" అని వారు తలచుచుందురు.

శ్లో. **ఆఢ్యోఽభి జనవా నస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా,**
**యక్ష్యే దాస్యామి మోదిష్య ఇ త్యజ్ఞాన విమోహితాః.** 15

గీ. మిగుల ధనవంతుల మిలను-మేము; శ్రేష్ఠ
వంశజులము; మాకు సము లె-వ్వరును లేరు;
సవనములను దానములను-సలుపు వార;
మరుసము గలవార మని యెం-తురు కరంబు.

తా. "మేము ధనము గల వారము; సద్వంశమందు జన్మించినవారమని, మాకు సమాను లెవ్వరును లేరు; మేము యజ్ఞములు చేయువారము, దానములు చేయువారము, సంతోషించు వారము" అని వా రవివేకముతో తలచుచుందురు.

శ్లో. **అనేక చిత్త విభ్రాంతా మోహజాల సమావృతాః,**
**ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ.** 16

గీ. పలుతెఱఁగులైన విషయ-ములను దవిలి
యుంట, చిత్తవైకల్యంబు-నొంది, మోహ
పాశములఁ జిక్కి, కామాను-భవము లందు
మునిగి పడుదురు నారక-మునను వారు.

తా. అట్టి వా రనేక విధములైన చిత్తవైకల్యము గలిగియుండి, మోహపాశముల చేతఁ జుట్టుకొనఁబడిన వారలై, కామానుభవమం దాసక్తి గలవారలై, నరకమునందు పడుచున్నారు.

శ్లో. **ఆత్మ సంభావితాః స్తబ్ధా ధనమాన మదాన్వితాః,**
**యజంతే నామ యజ్ఞై స్తే దంభేనా విధిపూర్వకమ్.** 17

గీ. అట్టి మూఢు లాత్మ స్తవ-మందుఁ బరఁగి
పెద్దలను సరకుగొనక-పెల్లుగ ధన
మాన మదములు గలిగి, డం-బంబు కొఱకు
సలుపుదు, రవిధి పూర్వక-సవనములను.



తా. ఆ యవివేకులు తమ్ము తామే స్తోత్రము చేసికొనుచును, పెద్దలను నిరాకరించుచును, ధన మాన మదములతోఁ గూడుకొని యుండి, డాంబికముగ శాస్త్ర సమ్మతము కాని యజ్ఞములను జేయుచుందురు.

శ్లో. అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః,
మా మాత్మ పరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః. 18

గీ. మఱియు దర్పంబు, బలము, గా-మంబు, గ్రోధ
మును నహంకారమును గల్గి-యనవరతము
బరుల శ్రేయస్సును సహియిం-పకను, నెల్లె
డలను వ్యాపించియుండువాఁ-డనగు నన్ను
జడమతులయి ద్వేషింతు రె-పుడును రాక్ష
సాంశ సంభూతులైన వా-రవని యందు.

తా. మఱియు వారు అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధము గలిగియుండి, అంతటను వ్యాపించియున్న నన్ను ద్వేషించుచు, ఇతరుల శ్రేయస్సును సహింపని వారై యుందురు.

శ్లో. తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీ ష్వేవ యోనిషు. 19

గీ. ఇట్లు నన్ను ద్వేషించెడి-యీ నరాధ
ములను, జన్మ జరా మృత్యు-వులను దుఃఖ
ములు గలవియును, నసురాంశ-ములును నగు ని
కృష్ట భవము లొందఁగఁ జేయు-దేను సుమ్ము.

తా. నన్ను ద్వేషించునట్టియు, క్రూరులైనట్టియు, శుభరహితులైనట్టియు నా మను ష్యాధముల నెల్లప్పుడు రాక్షససంబంధములైన నీచయోనులయందుఁ బుట్టించు చున్నాను.

శ్లో. ఆసురీం యోని మాపన్నాః మూఢా జన్మని జన్మని,
మా మప్రాప్యైవ కౌంతేయ! తతో యాం త్యధమాం గతిమ్. 20

గీ. సవ్యసాచి! యట్టి నికృష్ట-జన్మములను
బొందు మూఢులు ప్రతి జన్మ-మందు నీచ





మగు గతిఁ బరగుచును, నంత-కంతకును ని
కృష్టులగుదురు; మఱి పొంద-రెపుడు నన్ను.

తా. అర్జునా! అట్టి యవివేకులు నీచ జన్మము లెత్తుచు, నికృష్ట గతిని బొందుచుందురే కాని, నన్నుఁ బొందఁజాలరు.

శ్లో. త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః,
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేత త్త్రయం త్యజేత్. 21

గీ. కనఁగ గ్రోధంబు, లోభంబు-కామ మనఁగఁ
బరఁగెడి గుణము లాత్మను-బాడు చేయు
నవియు, నరకహేతువులును-నగుట నీ గు
ణములను విడువవలయుఁ, బు-డమి నరుండ!

తా. కామ క్రోధ లోభము లాత్మను నాశము చేయునవియును, నరకమును బొందించు నవియును గనుక వానిని విడువవలయును.

శ్లో. ఏతై ర్విముక్తః కౌంతేయ! తమో ద్వారై స్త్రిభి ర్నరః,
ఆచర త్యాత్మ నశ్శ్రేయ స్తతో యాతి పరాంగతిమ్. 22

గీ. నరకహేతువులగు నీ గు-ణములు విడిచి,
యాత్మకు శుభము గలిగించు-నవియు, శాస్త్ర
విహితములు నైన కర్మలఁ-బేర్మి సలుప
మోక్షమొందును బురుషుండు-భువిని బార్థ!

తా. అర్జునా! నరకద్వారములైన యీ మూఁడు గుణములను విడిచిన వాఁడు తనకు శ్రేయస్సును గలిగించునట్టి విహిత కర్మముల నాచరించి మోక్షమును బొందుచున్నాడు.

శ్లో. య శ్శాస్త్ర విధి ముత్సృజ్య వర్తతే కామకారతః,
న సంసిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిమ్. 23

గీ. వినుము శాస్త్ర నియమముల-ననుసరింప
కెవఁడు స్వేచ్ఛగా నిలఁ బ్రవ-ర్తించుచుండు;
నట్టివానికి సిద్ధి లే-దరయ, సుఖము
లేదు, మోక్షపదవియును-లేదు, పార్థ!



తా. శాస్త్ర విధిని విడిచి, తన కిష్టమగు నటుల వర్తించువాఁడు, సిద్ధిని, సుఖమును, మోక్షమును బొందఁడు.

శ్లో. తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మ కర్తు మిహార్హసి. 24

(దైవాసుర సంపద్విభాగయోగోనామ షోడశోధ్యాయ స్సంపూర్ణమ్)

గీ. పొసఁగ శాస్త్రములు ప్రమాణ-ములని నమ్మి,
శాస్త్ర సమ్మత కర్మల,-శాస్త్ర బాహ్య
కర్మల నెఱింగి, శాస్త్రోక్త-కర్మములనె
సలుపుచుండుము శ్రద్ధతో-సవ్యసాచి!

తా. అందువలన నీవు శాస్త్రమును ప్రమాణముగ విశ్వసించి, చేయఁదగిన కార్యములను, చేయఁదగని కార్యములను దెలిసికొని, శాస్త్ర విహితమైన కర్మములను జేయుము.

(దైవాసుర సంపద్విభాగయోగమనెడి షోడశోధ్యాయము సంపూర్ణము.)





# సప్తదశోఽధ్యాయః

## శ్రద్ధాత్రయ విభాగ యోగః

అర్జున ఉవాచ :

శ్లో. యే శాస్త్ర విధి ముత్సృజ్య యజంతే శ్రద్ధయాఽన్వితాః,
తేషాం నిష్ఠాతు కా? కృష్ణ! సత్త్వ మాహో రజ స్తమః. 1

గీ. శాస్త్ర సమ్మతమైన యా-చారమునుఁ త్య
జించి సంప్రదాయాచార-సరణి నర్చ
నలను భక్తితో నొనరించు-నరుని నిష్ఠ
తెలుపు మెట్టిదో; మఱియు సా-త్త్వికమొ, రాజ
సంబొ, తామసంబో; ఫలి-తంబు విషయ
మేమొ; విస్తరంబుగ నాకు-నో ముకుంద!

తా. ఓ కృష్ణా! శాస్త్ర విహితమైన యాచారమును విడిచి వృద్ధాచార సంప్రదాయానుసారముగ, ఆస్తిక్యబుద్ధితో వ్రతములు, పూజలు చేయుచున్న వాని నిష్ఠ యెట్టిది? సాత్త్వికమా? రాజసమా? తామసమా? తెలుపుము.

శ్రీ భగవా నువాచ :

శ్లో. త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా,
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శ్రుణు. 2

గీ. పుడమి దేహధారుల శ్రద్ధ-పూర్వజన్మ
వాసనను బట్టి యుండును-సాత్త్వికంబు,
తామసంబు, రాజసమనఁ-దనరు త్రివిధ
ములుగ; వివరింతు వానిని-దెలిసికొనుము.

తా. దేహధారుల యొక్క శ్రద్ధ, వారి పూర్వజన్మ సంస్కారము ననుసరించి సాత్త్విక, రాజస, తామసములను ముత్తెరగులుగ నున్నది. వానిని గూర్చి చెప్పెదను, వినుము.

శ్లో. సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత!
శ్రద్ధామయోఽయం పురుషో, యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః. 3



గీ. పొసఁగ జీవుల కిలఁ దొలి-పుట్టుకలను
నొనరిచిన కర్మఫలముల-ననుసరించి
పొడము శ్రద్ధ; త్రివిధ గుణ-ముల నలవడు
నెద్ది, దానికిఁ దగు శ్రద్ధ-యే జనించు.

తా. అర్జునా! సమస్త ప్రాణులకును, తాము పూర్వ జన్మములయందుఁ జేసిన కర్మముల యొక్క ఫలముల ననుసరించి యీ శ్రద్ధ కలుగుచున్నది. అందువలన, ఆస్తిక్యబుద్ధి గల జీవులం దీ గుణములలో నెవ్వాని కే గుణము ప్రధానముగ నుండునో, వాని కా గుణము ననుసరించి శ్రద్ధ యేర్పడును.

శ్లో. యజంతే సాత్త్వికా దేవాన్, యక్ష రక్షాంసి రాజసాః,
ప్రేతాన్ భూతగణాం శ్చాన్యే యజంతే తామసా జనాః. 4

గీ. సాత్త్వికులు దేవతలను, రా-జసులు యక్ష
రాక్షసులను, దమోగుణ-ప్రభవులైన
జనులు ప్రేత భూతములను,-శ్రద్ధతో య
జించుచుందురు, విను మీ ప్ర-పంచమందు.

తా. సత్త్వగుణము గలవారు దేవతలను, రజోగుణము గలవారు యక్ష రాక్షసులను, తమోగుణము గలవారు ప్రేతభూతములను బూజించుచున్నారు.

శ్లో. అశాస్త్ర విహితం ఘోరం తప్యంతే యే తపోజనాః,
దంభాహంకార సంయుక్తాః కామ రాగ బలాన్వితాః. 5

శ్లో. కర్శయంత శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః,
మాం చైవాంత శ్శరీరస్థం తాన్ విద్ధ్యాసుర నిశ్చయాన్. 6

గీ. పుడమి డాంబికాహంకార-ములను గలిగి,
కామరాగ ద్వయము తోడ-నే మనుజులు
శాస్త్రబాహ్యమైన తపంబు-సలుపుచు, నవి
వేకులై, యింద్రియములను,-వెండియుఁ దమ
యందు సాక్షి స్వరూపుండ-నై నెలకొని
యున్న నన్నుఁ గృశింప జే-యుదురొ, యట్టి





వారిని బొసఁగ రాక్షస-ప్రకృతి సంభ
వులని నిశ్చయముగ నీవు-తెలిసికొనుము.

తా. దంభాహంకారములు గలిగి, కామ రాగ బలములతో గూడుకొనిన వారై యే జనులు శాస్త్రోక్తములు కానట్టియు, పీడాకరమైనట్టియు తపస్సును జేయుచు వివేకరహితులై శరీరమందున్న యింద్రియ సమూహమును, సాక్షి భూతుఁడనై యున్న నన్ను కృశింపఁ జేయుచున్నారో, వారు రాక్షసాంశ సంభూతులని తెలిసికొనుము.

శ్లో. ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః,
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శ్రుణు. 7

గీ. ప్రాణులు భుజించు యాహార-వస్తువులును,
సలుపు దానంబు, తపము, య-జ్ఞంబును, త్రిగు
ణాత్మకంబులయి పరంగు-నర్జున! వివ
రింతు వాని భేదంబుల-నిపుడు నీకు.

తా. సమస్త ప్రాణుల కాహార మీ త్రిగుణముల ననుసరించి ప్రియముగ నుండును. అటులనే వారికి యజ్ఞము, తపస్సు, దానము కూడ ప్రియములుగ నుండును. వాని భేదమును జెప్పెదను వినుము.

శ్లో. ఆయు స్సత్త్వ బలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనాః,
రస్యా స్స్నిగ్ధా స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్విక ప్రియాః. 8

గీ. ఆజ్యసంయుతములును, ర-సాన్వితములు
ను, జిరకాలముండునవియు-ను, ప్రియములును,
నాయురారోగ్య బల సత్త్వ-హర్షవర్ధ
కములును, భుజింత్రు సాత్త్వికు-లమలచరిత!

తా. రసయుక్తములైనట్టియు, చమురుతో గూడియున్నట్టియు, చాలకాలము చెడకుండ నుండునట్టియు, ప్రియములైనట్టియు, ఆయుస్సత్త్వములను, బలమును, ఆరోగ్యమును, సుఖమును, ప్రీతిని, వృద్ధి చేయునట్టియు భోజన పదార్థములు సత్త్వగుణము గలవారికి ప్రియములైనవి.

శ్లో. కట్వామ్ల లవణా త్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః,
ఆహారా రాజస స్యేష్టా దుఃఖ శోకామయ ప్రదాః. 9



కరము దుఃఖ శోక రుజలఁ-గలుగఁ జేయు
నవియు, నామ్ల తిక్త లవణ-సంయుతము
లును, మిగుల నుష్ణ జనకము-లును నయిన ప
దార్థములు రాజసులకు సం-తసముఁ గూర్చు.

దుఃఖ శోక రోగములను గలుగఁజేయునట్టియు, మిక్కిలి చేదు, పులుపు, ఉప్పుతోఁగూడి నట్టియు, మిక్కిలి వేడి చేయునట్టియు, మిక్కిలి కారము గలిగినట్టియు, కఠినములై నట్టియు, అతిదాహము గలిగించు నట్టియు భోజన పదార్థములు రజోగుణముగల వారికి ప్రియమైనవి.

**యాత యామం గతరసం పూతి పర్యుషితం చ యత్,**
**ఉచ్ఛిష్ట మపి చామేధ్యం భోజనం తామస ప్రియమ్. 10**

పచితమై జాము గడచిన-వస్తువులను,
సార శూన్య వస్తువులను-జలిదివైన
వాని,దుర్గంధ భూయిష్ఠ-మైన వస్తు
వులను, నపవిత్రమగు వస్తు-వులను, దినిన
వెనుక మిగిలిన వానిని,-ప్రీతితో భు
జించు చుందురు, తామసు-లెలమిఁ బుడమి.

పచనము చేయఁబడిన తరువాత నొకజాము గడచి చల్లారి నట్టియు, రసవర్జితమై నట్టియు, దుర్గంధము గలిగినట్టియు, చలిదియైనట్టియు, భుక్తావశిష్ట మైనట్టియు, అపవిత్ర మైనట్టియు, భోజన పదార్థములు తమోగుణము గల వారికి ప్రియములైనవి.

**అఫలా కాంక్షిభి ర్యజ్ఞో విధి దృష్టో య ఇజ్యతే,**
**యష్టవ్య మేవేతి మన స్సమాధాయ స సాత్త్వికః. 11**

శాస్త్రమున విధింపఁబడిన-సవనములను
ఫలము గోరక చేయుట-భావ్యమంచుఁ
బరఁగ నిశ్చయింపఁబడి స-ల్పఁబడునట్టి
యజ్ఞములు సాత్త్వికంబు ల-టంచు నెంచు.

శాస్త్రోక్తములై, ఫలకాంక్ష లేక, విధిగా జేయవలసినవను నిశ్చయ భావముతోఁ జేయఁబడునట్టి యజ్ఞములు సత్త్వగుణ ప్రధానములైనవి.





శ్లో. **అభిసంధాయ తు ఫలం దంభార్థ మపి చైవ యత్,**
**ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్.** 12

గీ. ఫలము బొందంగ నొనరింపఁ-బడునవియును,
గడఁగి లోకమునఁ బ్రతిష్ఠఁ-బడయుట కయి
సలుపఁ బడునట్టివియు నైన-సవనకర్మ
ములను రాజసంబులటంచుఁ-దెలిసికొనుము.

తా. ఓ యర్జునా! ఫలకాంక్షతో గాని, పటాటోపము కొఱకు గాని చేయఁబడునట్టి యజ్ఞములు రజోగుణ ప్రధానములైనవి.

శ్లో. **విధి హీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణమ్,**
**శ్రద్ధా విరహితం యజ్ఞం తామసం పరిచక్షతే.** 13

గీ. ఎన్న శాస్త్ర బాహ్యంబులు,-నన్నదాన
రహితములు, నుక్త దక్షిణ-రహితములును,
శ్రద్ధలేనివియునయిన-సవనములు త
మోగుణ ప్రధానములౌను-బుడమిఁ బార్థ!

తా. శాస్త్ర విహితములుగానట్టియు, అన్నదాన రహితములైనట్టియు, మంత్రరహితమైనట్టియు, శాస్త్రమందుఁ జెప్పఁబడిన దక్షిణలేనట్టియు, శ్రద్ధలేకుండఁ జేయబడునట్టియు యజ్ఞములు తమోగుణ ప్రధానములైనవి.

శ్లో. **దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్,**
**బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే.** 14

గీ. దేవ విప్ర గురు ప్రాజ్ఞ-సేవనమును,
ఆర్జవంబును, శుచియును-నన్యదార
గమనవర్జనము, నహింస,-కరము దేహ
విషయమైన తపంబంద్రు-వేదవిదులు.

తా. దేవతలను బ్రాహ్మణులను గురువులను పండితులను బూజించుట, శుచిత్వము, ఋజువర్తనము, పరస్త్రీ గమన వర్జనము (అన్య స్త్రీలతో వ్యభిచారము సలుపకుండుట), అహింస, శరీర ప్రధానమైన తపస్సులని చెప్పఁబడుచున్నవి.



శ్లో. అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్,
స్వాధ్యా యాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే. 15

గీ. ఒరుల మనసును నిసుమంత-నొవ్వఁజేయ
కయును, బ్రియముగను, హితము-గాను మాట
లాడుటయు, వేదపఠన స-త్యవ్రతంబు
లౌను వాగ్రూపతపము ప్ర-థాత్మజుండ!

తా. ఇతరులకు సంతాపము గలిగింపనదియు, యథార్థమైనదియు, ప్రియహితమైనదియు నైన భాషణము, వేదము నభ్యసించుట, వాగ్రూపమైన తపస్సని చెప్పఁబడుచున్నది.

శ్లో. మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మ వినిగ్రహః,
భావ సంశుద్ధి రిత్యే తత్తపో మానస ముచ్యతే. 16

గీ. చిత్తనైర్మల్యమును, సాధు-వృత్తి, వాఙ్ని
యమము, భావసంశుద్ధియు,-నాత్మనిగ్ర
హమును, మానససంబంధ-మైన తపమ
టంచును వచింపఁబడును ప్ర-పంచమందు.

తా. మనస్సు యొక్క నిర్మలత్వము, సద్వర్తనము, మితభాషణము, మనోనిగ్రహము, కపటము లేకుండుట, మనస్సంబంధమైన తపస్సని చెప్పఁబడుచున్నది.

శ్లో. శ్రద్ధయా పరయా తప్తం తపస్త త్రివిధం నరైః,
అఫలాకాంక్షిభి ర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే. 17

గీ. ఫల మపేక్షింప కాస్తిక్య-భావ సంయు
తమగు శ్రద్ధతోడను నిర-తంబు, యోగు
లాచరించు నీ త్రివిధంబులైన తపము
లగును సత్త్వ ప్రధానంబు-లర్జునుండ!

తా. ఫలకాంక్షారహితులైన యోగులచేత మిక్కిలి శ్రద్ధతోఁ జేయఁబడునట్టి శారీరక వాఙ్మానసికములైన యీ త్రివిధ తపస్సులు సత్త్వగుణ ప్రధానములని చెప్పఁబడుచున్నవి.





శ్లో. సత్కారమాన పూజార్థం తపో దంభేన చైవ యత్,
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్. 18

గీ. పొసఁగి సత్కార సమ్మాన-పూజలందఁ
డంబము కొఱకు సలుపు త-పం బరయ, ర
జోగుణ ప్రధానం; బది-సొరిది చంచ
లమని యందురు పండితో-త్తములు ధరణి.

తా. ఇతరుల చేత పూజా సత్కార గౌరవములు పొందుట కొఱకును, పటాటోపము కొఱకును చేయఁబడునట్టి తపస్సు రజోగుణ ప్రధానమైనదనియు, నాశమొందు ననియు, చంచలమైనదనియు చెప్పఁబడుచున్నది.

శ్లో. మూఢ గ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః,
పర స్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్. 19

గీ. తనకు దుఃఖంబుఁ గలుగఁ జే-యునదియుఁ, బర
నాశనంబుకై కడఁగి య-జ్ఞాన నిశ్చ
యమున సలుపఁబడునదియు-నైన తపము
తామసమని చెప్పఁబడును-ధర్మనిరత!

తా. తనకు దుఃఖము గలిగించునట్టియు, ఇతరులను నాశనము చేయుట కుద్దేశింపఁబడి నట్టియు, అవివేకము వలన నిశ్చయింపఁబడినట్టిదియునగు తపస్సు తమోగుణ ప్రధాన మైనదని చెప్పఁబడుచున్నది.

శ్లో. దాతవ్య మితి యద్దానం దీయతేఽనుపకారిణే,
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్. 20

గీ. దానము విధియని మదిని-దలఁచి, పుణ్య
సమయమున దిర్గి యుపకృతి-సలుపలేని
సత్పురుషు కిచ్చు దానంబు-సాత్త్వికంబ
టంచుఁ జెప్పఁబడును ధర-నర్జునుండ!

తా. శాస్త్రోక్తమగుట వలన జేయవలసినదను భావముతో, దేశ కాల పాత్రములు దెలిసి, ప్రత్యుపకార మొనరింపఁజాలని యోగ్యునకిచ్చు దానము సత్త్వగుణ ప్రధానమైనదని చెప్పఁబడుచున్నది.



**శ్లో. యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్య వా పునః,**
**దీయతే చ పరిక్లిష్టం తద్రాజస ముదాహృతమ్. 21**

గీ. ఫలము నొందదలఁచియైనఁ-బ్రత్యుపకృతి
నొంద దలఁచియైన, మనసు-నందు నొచ్చు
కొనుచుఁ గావింపఁబడు ధర్మ-మును, రజోగు
ణ ప్రభవమని యంద్రు ధ-నంజయుండ!

తా. ఫలము నపేక్షించి కాని, ప్రత్యుపకారము బొందు తలంపుతో కాని, మనః క్లేశముతో గాని చేయఁబడు దానము రాజసగుణ ప్రధానమైనదని చెప్పఁబడుచున్నది.

**శ్లో. అదేశకాలే యద్దాన మపాత్రేభ్య శ్చ దీయతే,**
**అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్. 22**

గీ. ఇల నపాత్ర జనులకు, ని-కృష్ట దేశ
కాలముల, నవిధిగను, స-త్కారరహిత
ముగను, నవమాన సంయుత-ముగను, నొసఁగు
నట్టి దానంబు తామసం-బగును పార్థ!

తా. నికృష్ట దేశ కాల పాత్రములందు, సత్కార రహితముగను, అవమానముతోను చేయఁబడు దానము తమోగుణ ప్రధానమైనదని చెప్పఁబడుచున్నది.

**శ్లో. ఓం తత్స దితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధ స్స్మృతః,**
**బ్రాహ్మణా స్తేన వేదా శ్చ యజ్ఞా శ్చ విహితాః పురా. 23**

గీ. పుడమి బార్థ! 'ఓం, త, త్స, త్త'-నెడి త్రివిధము
లుగఁ బరబ్రహ్మమును శ్రుతు-లు వచియించుఁ
బొసఁగ; మఱి యీ పరబ్రహ్మ-ము వలననె, వి
నిర్మితము లాహవములును, - నిగమములును.

తా. 'ఓం, తత్, సత్' అను త్రివిధములుగ పరమాత్మ యొక్క నామ ముచ్చరింపఁ బడుచున్నది. ఆ పరబ్రహ్మము చేత పూర్వకాలమందు బ్రాహ్మణ వర్ణమును, వేదములును, యజ్ఞములును, నిర్మింపఁబడినవి.





శ్లో. తస్మాదో మిత్యుదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః,
ప్రవర్తంతే విధానోక్తా స్సతతం బ్రహ్మ వాదినామ్. 24

గీ. అందువలననె శాస్త్రోక్త-యజ్ఞ దాన
తపము లాచరించు తఱిఁ బ్ర-థమమునఁ, దగ,
'నో'మ్మనెడి బ్రహ్మనామంబు-నుచ్చరించి,
పిదప నొనరింతురు, బ్రహ్మ-విదులు భువిని.

తా. ఆ కారణము వలన వేదవాద శీలురు శాస్త్రోక్తములైన యజ్ఞ దాన తపః క్రియలను మొదలుపెట్టునపుడు, ఓంకారమును మొట్టమొదట నుచ్చరించుచున్నారు.

శ్లో. తది త్యనభిసంధాయ ఫలం,యజ్ఞ తపః క్రియాః,
దానక్రియా శ్చ వివిధాః,క్రియంతే మోక్ష కాంక్షిభిః. 25

గీ. 'త' త్తనఁగ బరగు 'పరమా-త్మ స్వరూప
మట్టి' దని చెప్పు పదమును,-యజ్ఞ దాన
తపములైన యాగము విహి-త క్రియాచ
రణ విధానములకు ముందు-రహిని నుచ్చ
రించి యా కర్మముల నాచ-రింతు రవని
ఫలముఁ గోరకయె, ముముక్షు-వులగు జనులు.

తా. మోక్షమును గోరువారు 'తత్' అను పరబ్రహ్మ నామమును మొదట నుచ్చరించి, ఫలమును గోరక, యజ్ఞ దాన తపస్సులను జేయుచున్నారు.

శ్లో. సద్భావే సాధుభావే చ సదిత్యే తత్ప్రయుజ్యతే,
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే. 26

గీ. 'స'త్తను పదము, విజయ! ప్ర-శస్తమైన
వానిని, బొగడఁ దగినట్టి-వానిని బ్రక
టించు సంజ్ఞ; కాన నుపయో-గింపఁ బడును
*శస్త కర్మములందు నా-సత్పదంబు.

* శస్తము-శ్రేష్ఠము



తా. అర్జునా! 'సత్' అను శబ్దము, కలదను భావమును శ్రేష్ఠమను భావమును దెలియఁజేయు గుర్తుగానున్నది. అందువలన నది ప్రశస్తమైన కర్మములందుఁ బ్రయోగింపఁబడుచున్నది.

శ్లో. యజ్ఞే తపసి దానే చ స్థితి స్స దితి చోచ్యతే.
కర్మ చైవ తదర్థీయం సదిత్యే వాభిధీయతే. 27

గీ. యజ్ఞమందును, దానమ్ము-నందుఁ, దపము
నందు నెట్టి నిష్ఠకలదొ-యదియు, భగవ
దర్థముగను సలుపఁబడు-నట్టి కర్మ
లన్నియు వచింపఁబడును, స-త్తంచు భువిని.

తా. యజ్ఞమందును తపస్సునందును దానమునందును గల నిష్ఠ 'సత్' అని చెప్పఁబడుచున్నది. భగవత్ప్రీతిగఁ జేయఁబడుఁ గర్మములన్నియు 'సత్' అని చెప్పఁబడుచున్నవి.

శ్లో. అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్,
అస దిత్యుచ్యతే పార్థ! న చ తత్ప్రేత్యనో ఇహ. 28

(శ్రద్ధాత్రయ విభాగయోగోనామ సప్తదశోధ్యాయ స్సంపూర్ణమ్)

గీ. అరయ నశ్రద్ధతోఁ జేయు-నట్టి హోమ
ములును దానములును దప-ములు 'నస' త్త
టంచుఁ జెప్పఁబడును; మఱి-యెంచఁ, గావ
వి సుఖదములు స్వర్గమునైన-వసుధనైన.

తా. అర్జునా! అశ్రద్ధగాఁ జేయఁబడిన హోమములు, దానములు, తపస్సులు 'అసత్' అని చెప్పఁబడును. అవి యీ లోకమందుగాని, పరలోకమందు గాని సుఖము నొసఁగవు.

(శ్రద్ధాత్రయ విభాగయోగమనెడి సప్తదశాధ్యాయము సంపూర్ణము.)





# అష్టాదశోఽధ్యాయః

## మోక్షసన్న్యాస యోగః

అర్జున ఉవాచ :

శ్లో. సన్న్యాసస్య మహాబాహో! తత్త్వ మిచ్ఛామి వేదితుమ్,
త్యాగస్య చ హృషీకేశ! పృథక్కేశి నిషూదన! 1

గీ. అంత సన్న్యాస మననేమి?-త్యాగమనఁగ
నేమి వాని తత్త్వంబుల-నెఱుఁగఁదలచి
వివరముగఁ దెలుపు మటంచు-విజయుం డడుగ
నాతని కిటుల వాక్రుచ్చె-నచ్యుతుండు.

తా. ఓ కృష్ణా! సన్న్యాసము యొక్కయు త్యాగము యొక్కయు తత్త్వమును వేఱ్వేఱుగఁ దెలిసికొనఁ గోరుచున్నాను.

శ్రీ భగవాన్ ఉవాచ :

శ్లో. కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః,
సర్వకర్మ ఫల త్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః. 2

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు :

గీ. అవని సన్న్యాస మనఁగఁ గా-మ్యంబులయిన
కర్మలను విడుచుటగును;-గర్మ లాచ
రించుచును వాని ఫలమును-నీశ్వరార్ప
ణ మొనరుచుట త్యాగమగును;-విమల చరిత!

తా. కామ్య కర్మముల యొక్క పరిత్యాగము సన్న్యాస మనియు, సమస్త కర్మములను జేయుచు వాని ఫలమును పరిత్యజించుట త్యాగమనియు విద్వాంసులు చెప్పుదురు. (కర్మముల ఫలమును పరిత్యజించుట యనగా, కర్మములను జేయుచు వాని ఫలమును ఈశ్వరార్పణము చేయుట).

శ్లో. త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః,
యజ్ఞ దాన తపః కర్మ నత్యాజ్య మితి చాపరే. 3



గీ. కర్మ లన్నియు దోషయు-క్తంబులగుటఁ
ద్యాజ్యములని కొందఱును, గొం-దఱు శ్రుతి విహి
తంబులయిన తపో యజ్ఞ-దానములను
విడువఁదగదనియు, వచింత్రు-విదులు పుడమి.

తా. కొందఱు పండితులు కర్మములు దోషములు కలవి కావున వానిని త్యజింపవలయునని చెప్పుదురు. మఱి కొందఱు పండితులు యజ్ఞ దాన తపః కర్మములను విడువఁదగదని చెప్పుదురు.

శ్లో. నిశ్చయం శ్రుణు మే తత్ర త్యాగే భరత సత్తమ!
త్యాగో హి పురుష వ్యాఘ్ర! త్రివిధ స్సంప్రకీర్తితః. 4

గీ. కర్మ కర్తృత్వము విడుట, కర్మల ఫల
మును విడుచుట, కర్మత్యాగ-మనఁగ బరఁగు
ముత్తెఱంగులయిన త్యాగ-ములు గల; విది
త్యాగమును గూర్చి నా నిశ్చ-యంబు పార్థ!

తా. అర్జునా! ఆ త్యాగమును గూర్చి నాకు గల నిశ్చయ భావమును జెప్పెదను, వినుము. త్యాగము-కర్మ త్యాగమనియు, కర్మఫల త్యాగమనియు, కర్తృత్వ త్యాగమనియు మూఁడు విధములుగఁ జెప్పఁబడినది.

శ్లో. యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్,
యజ్ఞో దానం తప శ్చైవ పావనాని మనీషిణామ్. 5

గీ. యజ్ఞ దాన తపోరూప-మైన కర్మ
వర్గ మిల పండితాళికిఁ-బావనంబు;
గనుక నా కర్మ లన్నిటి-ని నొనరింప
వలయుఁగాని విసర్జింప-వలదు సుమ్ము.

తా. యజ్ఞ దాన తపః కర్మములు తప్పక చేయవలసి నట్టివి. అవి పండితులకుఁ బవిత్రములైనవి కావున వానిని విడువఁదగదు.

శ్లో. ఏతా న్యపితు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ,
కర్తవ్యా నీతి మే పార్థ! నిశ్చితం మత ముత్తమమ్. 6





ధరణి నీ త్రివిధములైన-దాన యజ్ఞ
తపము లనెడి నిగమ విహి-తంబులైన
కర్మముల, నహంకృతి మమ-కారములును
ఫలముఁ బొందఁ గోర్కెయు, లేక-సలుపవలయు.

అర్జునా! ఈ యజ్ఞ దాన తపః కర్మములను మమకారము ఫలకాంక్షలు విడిచి చేయవలెను. ఇది నా యొక్క నిశ్చితాభిప్రాయము.

**నియతస్యతు సన్న్యాసః కర్మణో నోపపద్యతే,**
**మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః** 7

నిత్యనైమిత్తికములైన-నిగమవిహిత
కర్మములను ద్యజింపక-కరము సలుప
వలెను; వీని నజ్ఞానంబు-వలన సలుప
కుంట తామస త్యాగము-గును కిరీటి!

నియత కర్మములను విడువ దగదు. వాని నజ్ఞానమువలన విడుచుట తామస త్యాగమని చెప్పఁబడినది.(నియత కర్మములనగా-వేదోక్తములైన నిత్య నైమిత్తిక కర్మములు.)

**దుఃఖ మిత్యేవ యత్కర్మ కాయ క్లేశ భయా త్త్యజేత్,**
**సకృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్.** 8

దేహ కష్టమగునని మ-దిని దలంచి
కర్మల ద్యజించు నతని త్యా-గంబు గనఁగ
రాజస త్యాగ; మట్టి క-ర్మపరిహృతివ
లనను గాంచడు మోక్షఫ-లం బతండు.

దేహమునకు కష్టము గలుగునను భయము చేత కర్మలను విడుచుట రాజసత్యాగ మనఁబడును. దీనివలన కర్మఫల త్యాగము వలన గలుగు మోక్షము గలుగదు.

**కార్య మిత్యేవ యత్కర్మ నియతం క్రియ తేఽర్జున!**
**సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగ స్సాత్త్వికో మతః.** 9



గీ. సంగమును మఱియు ఫలవాంఛయును లేక
నాగమ విహిత నియత క-ర్మాచరణ మ
వశ్యమని యెంచి-సలుపు నె-వండు,వాని
త్యాగము, విజయ! సాత్త్విక-త్యాగమగును.

తా. అర్జునా! ఆసక్తిని, ఫలమును విడిచి, నిత్య నైమిత్తిక కర్మములు తప్పక చేయవలసినవని వానిని చేయుట సాత్త్విక త్యాగమగును.

శ్లో. న ద్వేష్ట్య కుశలం కర్మ కుశలే నానుషజ్జతే,
త్యాగీ సత్త్వ సమావిష్టో మేధావీ ఛిన్న సంశయః. 10

గీ. సంశయం బెంతయును లేక,-సంతసంబు
గలిగి, సుఖ దుఃఖదాయక-ములగు నియత
కర్మలఁ బ్రియాప్రియములులే-క, ధర, మెలఁగు,
సాత్త్విక త్యాగియగు నాత్మ-తత్త్వవిదుఁడు.

తా. సత్త్వగుణప్రధానుఁడైన యాత్మజ్ఞాని సందేహములు లేనివాఁడును, కర్మఫలమును విడిచిన వాఁడును నగుటవలన కామ్య కర్మములయందు ద్వేషమును గాని, నిత్మకర్మముల యం దాసక్తిని గాని కలిగి యుండడు.

శ్లో. న హి దేహ భృతా శక్యం త్యక్తుం కర్మా ణ్యశేషతః,
యస్తు కర్మఫల త్యాగీ సత్యాగీ త్యభి ధీయతే. 11

గీ. కర్మలను వీడి, ధర, మెలఁ-గంగలేడు
పూరుషుఁడు; కాన కర్మలఁ-బొసఁగ నాచ
రించుచును గర్మ ఫలముఁ ద్య-జించు నెవ్వఁ
డతఁడె కర్మ పరిత్యాగి-యని వచింత్రు.

తా. దేహధారి కర్మములను సంపూర్ణముగా విడిచి జీవింపఁజాలడు. కావున నియత కర్మముల నాచరించుచు వాని ఫలమును త్యజించువాఁడు కర్మత్యాగియని చెప్పఁబడు చున్నాడు.

శ్లో. అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్,
భవత్య త్యాగినాం ప్రేత్య; నతు సన్న్యాసినాం క్వచిత్. 12





గీ. ప్రియము లప్రియంబులు, ప్రియా-ప్రియము లనెడి
ముత్తెఱంగులని వచింత్రు-బుధులు కర్మ
ఫలము; లివ్వసుధను గర్మ-ఫల విసర్జ
నము సలుపని జనులను, జ-న్మ శతములను
నా ఫలము పొందును; ఫలముఁ-ద్యాగ మొనరు
చు జనులను ఫల మంటదు-సుమ్ము, పార్థ!

తా. ఇష్టము కానివనియు, ఇష్టమైనవనియు, ఇష్టానిష్ట మిశ్రమములనియు కర్మముల ఫలములు త్రివిధముగనున్నవి. కర్మఫలమును త్యజింపనివారు జన్మాంతరములందు కర్మఫలము ననుభవించుచున్నారు. కర్మఫల త్యాగము చేసిన వారికి కర్మఫలములుండవు.

శ్లో. పంచైతాని మహాబాహో! కారణాని నిబోధ మే,
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వ కర్మణామ్. 13

గీ. సర్వ కర్మల సిద్ధికై,-సాంఖ్య మనఁగ
నొప్పు వేదాంతమునఁ దగఁ-జెప్పఁబడిన
పంచహేతువులను నీకుఁ-బరఁగ నెఱుక
పఱచెద, వినుము శ్రద్ధగా-వాని నిపుడు.

తా. అర్జునా! సిద్ధాంతమందును, సాంఖ్యశాస్త్ర మందును సమస్త కర్మముల సిద్ధికొఱకు చెప్పఁబడిన ఐదు హేతువులను చెప్పెదను;తెలిసికొనుము.

శ్లో. అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్,
వివిధా చ పృథ క్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్. 14

గీ. ఇల, శరీర మ, హంకార,-మింద్రియము ల
యిదును, ప్రాణంబు లైదింటి-కృత్యములును,
వీని యధిదైవతంబుల-ప్రేరణములు
నైన యీ యైదు, హేతువు-లై చెలంగు.

తా. దేహము, అహంకారము, పంచేంద్రియములు, పంచప్రాణముల వ్యాపారము, వీని యధి దేవతలు-అను నైదుహేతువు లున్నవి.



శ్లో. శరీర వాఙ్మనోభి ర్యత్కర్మ ప్రారభతే నరః
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్యహేతవః. 15

.. వాఙ్మనః కాయములచేత,-వరమయినది
కాని, యవరమైనట్టిది-కాని కర్మ
మేది సలుప మొదలిడునో-యిలను మాన
వుండు, దాని కివియె హేతు-వులు కిరీటి!

తా. మానవుఁడు మనో వాక్కాయముల చేత సత్కర్మమును గాని దుష్కర్మమునుగాని ప్రారంభించుట కీ యైదును కారణములుగ నున్నవి.

శ్లో. తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః,
పశ్య త్యకృత బుద్ధిత్వా న్నసపశ్యతి దుర్మతిః. 16

గీ. ఇటులఁ గర్మకుహేతువు-లీ యయిదయి
యుండ, గర్మకుఁ గర్తనై-యున్నవాఁడ
నని తలఁచు వాఁ డపండితుఁ-డగుట వలన
నాత్మ తత్త్వంబు నెఱుఁగలే-డతఁడు పార్థ!

తా. పైనఁ జెప్పఁబడిన విధముగ కర్మాచరణమున కైదుకారణములుండగా నెవఁడు కర్మమునకుఁ దానే కర్తయని భావించుచున్నాడో, అట్టి విపరీత బుద్ధిగలవాఁడు శాస్త్రముచే సంస్కరింపఁబడిన బుద్ధి గలవాఁడు కాకుండుట వలన కర్తను యథార్థముగాఁ దెలియఁజాలడు.

శ్లో. యస్య నాహంకృతో భావో, బుద్ధి ర్యస్య నలిప్యతే,
హత్వాపి స ఇమాన్ లోకాన్ న హంతి న నిబధ్యతే. 17

గీ. కన, నహంకార మొందక,-కర్మఫలము
నందు సక్తి గలిగి యుండ-నట్టివాఁడు
జనుల నందఱఁ జంపినన్-జంపినతఁడు
కాడు; మఱి వాని కంటఁడు-కర్మఫలము.

తా. అహంకారము లేని వాఁడును, కర్మఫలాసక్తి లేని వాఁడును నగు పురుషుఁ డీ లోకమందున్న జనులందఱిని జంపిన వాఁడైనను జంపిన వాఁడుకాడు.





శ్లో. జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మ సంగ్రహః. 18

గీ. వినుము కర్మభావము జ్ఞాన-మనియు, జ్ఞేయ
మనియు, మఱియు, పరిజ్ఞాత-యనియుఁ ద్రివిధ
ము; లటు కర్మ సంగ్రహమును-ముత్తెఱఁగులు,
కర్మ, కరణంబు, కర్తని-నిర్మలాత్మ!

తా. కర్మోపదేశము-జ్ఞానమనియు, జ్ఞానమువలన దెలియఁదగినదనియు (జ్ఞేయము), తెలిసికొనువాఁడనియు (పరిజ్ఞాత) మూడు విధములుగ నున్నది. కర్మ సంగ్రహము-కర్మమనియు, కరణ మనియు, కర్తయనియు మూడు విధములుగ నున్నది.

శ్లో. జ్ఞానం కర్మ చ, కర్తా చ, త్రిధైవ గుణ భేదతః,
ప్రోచ్యతే గుణ సంఖ్యానే యథావ చ్ఛృణుతా న్యపి. 19

గీ. జ్ఞాన, కర్మ, కర్తలు దగ-సాంఖ్యశాస్త్ర
మునను, సత్త్వ రజ స్తమ-ములను ద్రిగుణ
భేదముల నొకటొకటి త్రి-విధములుగఁ దె
లుపఁబడెను; వాని నిపుడు దె-ల్పెదును వినుము.

తా. సాంఖ్య శాస్త్ర మందు 'జ్ఞానము, కర్మము, కర్త' అను నీ మూడును సత్త్వ రజ స్తమోగుణ భేదమువలన నొక్కొక్కటి మూడు విధములుగనున్నటులఁజెప్పఁబడిన విషయమును నీకు యథాతథముగఁ జెప్పెదను, వినుము.

శ్లో. సర్వ భూతేషు యే నైకం భావ మవ్యయ మీక్ష్యతే,
అవిభక్తం విభక్తేషు త జ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్. 20

గీ. జగతి వేఱ్వేఱుగానున్న-సర్వభూత
జాలమం దఖండమును, నా-శరహితమును,
నొక్కటియునైన పరమాత్మ-నొనర జ్ఞాన
దృష్టి చేతఁ గాంచు నెవఁడు-తెలిసికొనఁగ
దగును వాని జ్ఞానంబు స-త్త్వ గుణము వల
న జనియించిన దంచు, ధ-నంజయుండ!



తా. ఎవఁడు తన జ్ఞానము చేత వేఱువేఱు రూపములుగ నున్న సమస్త చరాచర భూతములందు, నాశరహితమైనదియు, ఒక్కటైనట్టియు పరమాత్మ స్వరూపమును జూచుచున్నాడో, వాని జ్ఞానము సాత్త్విక జ్ఞాన మని తెలిసి కొనుము.

శ్లో. పృథక్త్వేనతు యజ్జ్ఞానం నానా భావాన్ పృథగ్విధాన్,
వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్. 21

గీ. పృథివి సర్వ భూతంబులు-భేదభావ
మునను వేఱ్వేఱుగా నున్న-వని తలంచు
చుండు వాని జ్ఞానంబు, ర-జోగుణోద్భ
వం బటంచుఁ దెలిసికొన-వలయు నీవు.

తా. ఎవఁడు భేదభావము చేత సమస్త భూతములు భిన్న ప్రకారములుగను, నానా స్వరూపములుగను, నున్నటుల తలఁచుచున్నాడో వాని జ్ఞానము రాజసమని తెలిసి కొనుము.

శ్లో. యత్తు కృత్స్నవ దేకస్మిన్ కార్యే సక్త మహైతుకమ్,
అతత్త్వార్థవ దల్పంచ తత్తామస ముదాహృతమ్. 22

గీ. మహిని జీవుండు దేహప్ర-మాణుఁడనియు,
నీశ్వరుఁడు విగ్రహం బంత-యే యనియు, నె
ఱుఁగుట యుక్తి హీనంబును,-దగ యథార్థ
బాహ్యమును, నస్థిరం బైన-ఫలముల నొసఁ
గునదియునయిన! తామస-గుణమువలన
సంభవంబైనదని యెంచు-సవ్యసాచి!

తా. జీవుఁడుపాధియైన దేహము యొక్క పరిమాణమంత పరిమాణము గలవాఁడనియును, ఈశ్వరుఁడు కొయ్యతోను ఱాతితోను చేయఁబడి యున్న విగ్రహముయొక్క పరిమాణమంత పరిమాణము గలవాఁడనియును దలఁచు వాని యొక్క అయథార్థ జ్ఞానము తామస జ్ఞానమని తెలిసికొనుము.

శ్లో. నియతం సంగరహిత మరాగ ద్వేషతః కృతమ్,
అఫల ప్రేప్సునా కర్మ యత్త త్సాత్త్విక ముచ్యతే. 23





గీ. శాస్త్రవిహితంబు, నిత్యంబు,-సంగవర్జి
తంబు, ద్వేషరాగ వివర్జి-తముగను ఫల
వాంఛ లేకయును సలుపఁ-బడునదియును
నైన కర్మంబు సాత్త్వికం-బని వచింత్రు.

తా. కర్మిష్ఠియైన వానిచేత, ఫలాపేక్షయును రాగద్వేషములును లేక చేయఁబడునట్టియు, శాస్త్రము చేత నియమింపఁబడునట్టియు, సంగరహితమైనట్టియు కర్మము సాత్త్విక కర్మమని చెప్పఁబడుచున్నది.

శ్లో. యత్తు కామేప్సునా కర్మ సాహం కారేణ వా పునః
క్రియతే బహుళాయాసం తద్రాజస ముదాహృతమ్. 24

గీ. ఫలముఁ బొందంగ నభిలాష-గలిగి, మిగుల
కష్టముఁ గలుగఁజేసెడి-కర్మముల నె
వం డహంకారమున సల్పు-చుండు; నతఁడు
చేయు కర్మ రాజసమని-చెప్పఁబడును.

తా. ఎవ్వని చేత ఫలకాంక్షతోగాని, అహంకారముతోగాని శరీరమునకు మిక్కిలి కష్టము గలిగించునట్టి యేకర్మము చేయఁబడుచున్నదో, అతఁడు చేయునట్టి యా కర్మము రాజస కర్మమని చెప్పఁబడుచున్నది.

శ్లో. అనుబంధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్.
మోహా దారభ్యతే కర్మ తత్తామస ముదాహృతమ్. 25

గీ. శుభము గల్గునో, కాక య-శుభము గలుగు
నో, పరహింస సంప్రాప్తమౌ-నొక్కొ, నాశ
మే కలుగు నొక్కొ, మఱి యాచ-రింపఁదగ
శక్తి గలదొ లేదొ యని య-జ్ఞాన వశము
నఁ దలపోయ కహంకార-మదము లెసఁగ
సలుపఁబడెడి కర్మము, తామ-సంబు భువిని.

తా. అహంకారముతో ముందుఁ గలుగఁబోవు అశుభఫలితములను, నాశమును, ఇతరులకు గలుగు బాధను సామర్థ్య సామర్థ్యములను విచారింపక, యజ్ఞానము వలనఁ జేయఁబడు కర్మము తామస కర్మమని చెప్పఁబడుచున్నది.



శ్లో. ముక్త సంగోఽనహంవాదీ ధృత్యుత్సాహ సమన్వితః,
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే. 26

గీ. దార సుత మిత్ర భవన బాం-ధవజనాది
వివిధ విషయ వర్గమునందుఁ-బ్రీతియును, న
హంకృతియును, గలుగని వాఁ-డగుచు, ధృతియు
మఱియు నుత్సాహమును గల్గి-మహిని సిద్ధ్య
సిద్ధులందు లక్ష్యము లేకఁ-జెలఁగు కర్త
సాత్త్వికుఁడని చెప్పఁబడును-సవ్యసాచి.

తా. లోక విషయములైన పుత్ర మిత్ర కళత్ర ధన ధాన్య క్షేత్రారామములం దాసక్తి లేని వాఁడును, అహంకార రహితుఁడును, ధైర్యోత్సాహములు గలవాఁడును, ప్రాప్త్య ప్రాప్తుల యందు వికారము బొందని వాఁడును (వానిని లక్ష్యము చేయని వాఁడనుట) నైన కర్త సాత్త్వికుఁడని చెప్పఁబడు చున్నాఁడు.

శ్లో. రాగీ కర్మఫల ప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః,
హర్ష శోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః. 27

గీ. రాగియై తానొనరుచు క-ర్మలఫలంబు
నందఁ దలచువాఁడు, పరధ-నాభిరతుఁడు
పరుల హింసించువాఁడు, శౌ-చరహితుండు,
హర్ష శోకంబులు గలిగి-నట్టి వాఁడు
నైన కర్త రాజసుఁడని-యార్యు లంద్రు.

తా. ఇంద్రియ విషయములం దాసక్తి గలవాఁడును, ఫలకాంక్షతోఁ గర్మములను జేయు వాఁడును, ద్రవ్యమం దత్యాశ గలవాఁడును, ఇతరులకు హింస గలుగఁజేయు స్వభావము గలవాఁడును, సదాచారము లేని వాఁడును, దుఃఖ సంతోషములతోఁ గూడిన వాఁడును నైన కర్త రాజసుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో. అయుక్తః ప్రాకృత స్తబ్ధ శ్శఠో నైకృతికోఽలసః,
విషాదీ దీర్ఘ సూత్రీ చ కర్తా తామస ఉచ్యతే. 28

గీ. అనవహితుఁ డవివేకియు-వినయవర్జి
తుండు, మాయావి, నైకృతి-కుం డలసుఁడు,





దుఃఖశీలుండు, దీర్ఘసూ-త్రుండు నైన
కర్త తామసుండగును జ-గతిఁ గిరీటి.

తా. మనో నిగ్రహము లేనట్టియు, అవివేకి యైనట్టియు, పరులను మోసగించునట్టియు, ఇతరుల నవమానించు స్వభావము గలిగినట్టియు, మందుడైనట్టియు, దుఃఖశీలుఁడై నట్టియు, ఆలస్యముగా పనులు చేయునట్టియు కర్త తామసుఁడని చెప్పఁబడును.

శ్లో. బుద్ధే ర్భేదం ధృతే శ్చైవ గుణత స్త్రివిధం శృణు,
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ! 29

గీ. త్రిగుణ భేదములవలనఁ-ద్రివిధములుగ
నుండును ధనంజయుఁడ! బుద్ధి-యు, మఱి, ధైర్య
మును; విశదముగ వాని ని-పు డెఱిఁగింతు
దివిరి సావధానుండవై -తెలిసికొనుము.

తా. అర్జునా! సత్త్వ రజ స్తమోగుణముల వలన మూఁడు విధములుగ నున్న బుద్ధి గూర్చియు ధైర్యమును గూర్చియు చెప్పెదను, వినుము.

శ్లో. ప్రవృత్తిం చ నివృత్తించ కార్యాకార్యే భయాభయే,
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధి స్సా పార్థ! సాత్త్వికీ. 30

గీ. కర్మమార్గంబు, మోక్షమా-ర్గంబు, జేయ
రాని పనులఁ, జేయఁదగు కా-ర్యముల, బంధ
మోక్షముల విశదముగ నే-బుద్ధి యెఱుఁగు
చుండు; నది సత్త్వ గుణజంబు-పాండుపుత్ర!

తా. అర్జునా! కర్మమార్గమును, మోక్షమార్గమును, కర్తవ్యాకర్తవ్యములను, భయాభయము లను, బంధ మోక్షములను దెలిసినవాని బుద్ధి సత్త్వ గుణము వలన గలిగినట్టిది.

శ్లో. యయా ధర్మ మధర్మం చ కార్యం చా కార్య మేవ చ,
అయథావ త్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ! రాజసీ. 31

గీ. ధర్మమనగ నెట్టిదియొ, య-ధర్మమనఁగ
నెట్టిదో, చేయదగు పని-యెద్దియొ, యొన



రింపఁదగని దెద్దియొ గ్రహి-యింపనట్టి
బుద్ధి, రాజసం బనియంద్రు-బుధులు పార్థ!

తా. అర్జునా! ధర్మాధర్మములను, కార్యాకార్యములను యథార్థముగఁ దెలిసికొనజాలని (పొరబాటుగా గ్రహించునట్టి) బుద్ధి రజోగుణమువలన బుట్టినట్టిది.

శ్లో. అధర్మం ధర్మ మితి యా మన్య తే తమసావృతా,
సర్వార్థాన్ విపరీతాం శ్చ బుద్ధి స్సా పార్థ! తామసీ. 32

గీ. కనఁగ నవివేకము వలన-గ్రమ్మఁబడీ, య
ధర్మముల ధర్మములుగను,-ధరణినున్న
వస్తువుల నన్నిటిని, దడ-బాటుగాను
దలఁచునట్టి బుద్ధి, యగును-తామసంబు.

తా. అర్జునా! అజ్ఞానముచేత, అధర్మమును ధర్మముగాను, సమస్త పదార్థములను వ్యత్యస్తముగాను తలఁచు బుద్ధి తమోగుణమువలనఁ బుట్టినట్టిది.

శ్లో. ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియ క్రియాః,
యోగేనా వ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ! సాత్త్వికీ. 33

గీ. అర్జునుఁడ! మనః ప్రాణేంద్రి-యముల క్రియల
నిశ్చలమగు యోగంబుచే-నియమనంబు
సేయుచుండు నెవఁడు భువిఁ-జెలఁగ; యతని
ధృతియగును సాత్త్వికంబని-తెలిసికొనుము.

తా. అర్జునా! మనః ప్రాణేంద్రియ వ్యాపారములను నిశ్చలమైన యోగము చేత నియమించు మనుష్యుని యొక్క ధైర్యము సాత్త్విక ధైర్యము.

శ్లో. యయాతు ధర్మ కామార్థాన్ ధృత్యా ధారయ తేఽర్జున!
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతి స్సా పార్థ! రాజసీ. 34

గీ. ఫలము బొందంగఁ గోరుచు-వసుధ, సవ్య
సాచి! ధర్మార్థ కామ మో-క్షములను ధరి
యించు నే మనుజుఁడు; వాని-ధృతి రజోగు
ణ ప్రభవమని తెలిసికొ-నంగవలయు.





తా. అర్జునా! ఫలమును గోరుచు శ్రద్ధతో ధర్మార్థ కామముల నవలంబించుచున్న పురుషుని ధైర్యము రాజస ధైర్యము.

శ్లో. యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ,
న విముంచతి దుర్మేధా ధృతి స్సా పార్థ! తామసీ. 35

గీ. పుడమి కుత్సితాత్ముఁడయిన-పూరుషుండు
భయము, దుఃఖము, నిద్ర, *కా-వరము, దిగులు
మొదలగు చెడు గుణములను-వదల డే ధృ
తి వలన, నది తామసమని-తెలియవలయు.

తా. అర్జునా! నిద్రను, భయమును, దుఃఖమును, మనః క్షోభమును, మదమును గలిగియుండు నికృష్ట పురుషుని ధైర్యము తామస ధైర్యము.

శ్లో. సుఖం త్విదానీం త్రివిధం శృణుమే భరతర్షభ!
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి. 36

శ్లో. యత్త దగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్,
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మ బుద్ధి ప్రసాదజమ్. 37

గీ. పార్థ! సుఖమును, గుణముల-వలనఁ గల్గి
త్రివిధములుగఁ బరఁగు; వాని-దెలుపుదు నిపు
డాలకింపుము తగ; నే సుఖానుభవము
నందు నభ్యాసము వలన-నవని పూరు
షుండు క్రీడించుచుండు; నే-సుఖము, దుఃఖ
మును నడగఁజేయు; నే సుఖ-ము మొదట విష
ము వలె నుండి తుద కమృత-మువలె నుండుఁ
బొల్పుగను; బుద్ధి నైర్మల్య-మునను గలుగు
నా సుఖము సాత్త్వికంబని-యంద్రు సుమ్ము.

తా. అర్జునా! అటులనే మూడు విధములుగ నున్న సుఖమును గూర్చి చెప్పెదను, వినుము. అనుదినాభ్యాసమందు నిలకడగా సంతోషప్రదముగ నుండునదియు,

---

* కావరము = అశాస్త్రీయ విషయసేవచే గలుగు చిత్తవివశత్వము



దుఃఖమును నశింపఁజేయునదియు, ఆరంభమందు విషమువలె నుండి, అంతమంద మృత తుల్యముగ నుండునదియు, బుద్ధి నైర్మల్యము వలన బుట్టినదియు నైన సుఖము సాత్త్విక సుఖము.

శ్లో. విషయేంద్రియ సంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమమ్,
పరిణామే విష మివ త త్సుఖం రాజసం స్మృతమ్. 38

గీ. ఇంద్రియములు విషయముల-నెనఁగి కలి
కొనఁగ, మొద టమృత సమంబు-గను, గడపట
కాలకూట సమముగను-గానిపించు
నట్టి సుఖము, రాజసమని-యంద్రు సుమ్ము.

తా. విషయేంద్రియ సంబంధము వలన నారంభమం దమృతతుల్యముగను, ఉపభోగాంత మందు విషమువలెను నుండు సుఖము రాజస సుఖము.

శ్లో. య దగ్రే చానుబంధే చ సుఖం మోహన మాత్మనః,
నిద్రాలస్య ప్రమాదోత్థం త త్తామస ముదాహృతమ్. 39

గీ. పార్థ! యాలస్యమున, నిద్రఁ-బరగుటనుఁ, బ్ర
మాదము వలననుఁ గలిగి-యాదియందు
ను బరిణామముననను భ్రమ-ను గలిగించు
నట్టి సుఖము, తమో గుణ-సంభవంబు.

తా. నిద్రవలనను, ఆలస్యమువలనను, అజాగ్రత వలనను బుట్టి, ఆరంభమందును బరిణామమందును మనస్సుకు భ్రమ ప్రమాదములు గలిగించు సుఖము తామస సుఖము.

శ్లో. న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః,
సత్త్వం ప్రకృతిజై ర్ముక్తం యదేభిస్స్యా త్రిభి ర్గుణైః. 40

గీ. ప్రకృతి వలనఁ గలిగిన స-త్త్వము, రజము, త
మంబను త్రిగుణములకు వ-శ్యంబు కాని
ప్రాణిజాతము లేదీ ప్ర-పంచమందుఁ
గాని, దేవలోకమునందు-గాని, చూడ.





తా. ప్రకృతివలన బుట్టు సత్త్వ రజ స్తమో గుణము లనెడి యీ మూడు గుణములకు లోను గాని ప్రాణి భూలోకమందు గాని, దేవలోకమందుగాని లేదు.

శ్లో. బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరంతప!
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవై ర్గుణైః. 41

గీ. బ్రాహ్మణ క్షత్ర వైశ్య శూ-ద్ర కులజులకుఁ
బ్రకృతిజములైన సత్త్వంబు,-రజము, తమమ
నెడి గుణముల ననుసరించి-నిర్ణయింపఁ
బడినవి వివిధ కర్మలు-పాండుపుత్ర!

తా. అర్జునా! బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకు కర్మములు, వారి ప్రకృతి వలన బుట్టిన గుణముల ననుసరించి యేర్పఱుపఁబడి యున్నవి.

శ్లో. శమో దమ స్తప శ్శౌచం క్షాంతి రార్జవ మేవ చ,
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్. 42

గీ. అంతరింద్రియముల నిగ్ర-హంబును, బహి
రింద్రియముల నిగ్రహమును,-నింకఁ దపము,
శౌచ, మోర్పు, ఋజుత్వంబు,-శాస్త్రజన్య
మైన జ్ఞాన, మనుభవజ-న్యమగు జ్ఞాన,
మీశ్వరుఁడు కలడని మది-నెంచుటయును,
బ్రాహ్మణులకు నైజమగు క-ర్మములు పుడమి.

తా. అంతరింద్రియ నిగ్రహము, బహిరింద్రియ నిగ్రహము, తపస్సు, శుచిత్వము, ఓర్పు, ఋజువర్తనము, శాస్త్ర పరిజ్ఞానము, అనుభవజన్యజ్ఞానము, ఆస్తిక్యము (ఈశ్వరుఁడు కలడను నమ్మకము) - ఇవి బ్రాహ్మణులకు స్వభావము వలన బుట్టిన కర్మములు.

శ్లో. శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్,
దాన మీశ్వర భావ శ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్. 43

గీ. శౌర్యము, ధృతియు, తేజంబు,-శక్తియును, *ప్ర
ధనము నందుఁ బారకయుంట,-దానమును, ప్ర

* ప్రధనము = యుద్ధము



జలను బాలించు టనునవి-క్షత్రియులకుఁ
బ్రకృతి వలనఁ గలిగిన క-ర్మంబులగును.

తా. పరాక్రమము, తేజస్సు, ధైర్యము, సామర్థ్యము, యుద్ధమందు పారిపోకుండుట, ఈవి, ప్రజాపరిపాలనము-ఇవి క్షత్రియులకు స్వభావము వలన బుట్టిన కర్మములు.

శ్లో. కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మస్వభావజమ్,
పరిచర్యాత్మకం కర్మ శూద్ర స్యాపి స్వభావజమ్. 44

గీ. పొలము దున్నుట, గోరక్ష-పొసఁగ వర్త
కము సలుపుట, స్వాభావిక-కర్మలగును
వైశ్యులకు; సేవ చేయుట-ప్రకృతి వలనఁ
గలిగినట్టి కర్మంబు, శూ-ద్రులకుఁ బుడమి.

తా. భూమిని దున్నుట, గోసంరక్షణము, వాణిజ్యము-ఇవి వైశ్యులకు స్వభావము వలన బుట్టిన కర్మములు; సేవ శూద్రులకు స్వభావము వలన బుట్టిన కర్మము.

శ్లో. స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మ నిరత స్సిద్ధిం యథా విందతి త చ్ఛృణు.

గీ. మహి ని మనుజులు జాతి ధ-ర్మంబులయిన
కర్మములయందు నాసక్తి-గలిగి సిద్ధి
బొందుచున్న విధమును దె-ల్పుదును నీకు,
సావధానంబుగ వినుము-సవ్యసాచి!

తా. మానవులు తమ తమ కర్మములం దాసక్తి గలవారై, యేవిధముగ సిద్ధిని బొందుచున్నారో, ఆ కర్మ విధానమును జెప్పెదను, వినుము.

శ్లో. యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదమ్ తతమ్,
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః. 46

గీ. ఎవనిచే ప్రాణులన్ని జ-నించు, నెవని
వలన జగమంత వ్యాపింపఁ-బడి చెలంగు
చుండు; నా యీశ్వరుని మను-ష్యులు దమ తమ
కర్మచేఁ గొల్చి సిద్ధిని-గాంచుచుంద్రు.





తా. ఏ యీశ్వరుని చేత సమస్త ప్రాణులు పుట్టుచున్నవో, ఎవనిచే నీ సమస్త జగత్తు వ్యాపింపఁబడి యున్నదో, ఆ యీశ్వరుని మనుష్యులు స్వకీయములైన కర్మముల చేతఁ బూజించి సిద్ధిని బొందుచున్నారు.

శ్లో. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్,
స్వభావ నియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్. 47

గీ. స్వీయ వర్ణ ధర్మంబు కిం-చిద్గుణయుత
మైన, నధిక గుణాన్వితం-బైనదియును
బరఁగ బాగుగా నొనరింపఁ-బడినదియును
నైన పరధర్మమున కంటె-నగును వరము;
ప్రకృతి నియతంబయిన క-ర్మములఁజేయు
మనుజు నంటదు పాపంబు,-వినుము పార్థ!

తా. స్వకుల ధర్మ మల్పగుణము గలిగినదైనను, మంచి గుణములు గలిగినట్టియు, బాగుగా నాచరింపఁబడునట్టియుఁ బరధర్మముకంటెను శ్రేష్ఠమైనది. స్వభావ నియతములైన కులధర్మముల నాచరించు జనులకు పాపము లంటవు.

శ్లో. సహజం కర్మ కౌంతేయ! స దోష మపి నత్యజేత్,
సర్వారంభా హి దోషేణ ధూమే నాగ్ని రివా వృతాః. 48

గీ. అగ్నిని బుడమిఁ బొగ కప్పు-నటులఁ, గర్మ
లన్నిఁటిని జూడఁ గిల్బిష-మలమి యుంట,
ఫల్గున! సదోషమయినను-బ్రకృతి సంభ
వమగు వర్ణధర్మము విడు-వంగఁ దగదు.

తా. అర్జునా! అగ్ని పొగ చేతఁ గప్పఁబడియుండు విధమున సమస్త కర్మములును దోషముచేత గప్పఁబడియున్న వగుట వలన దోషయుక్తములైనను స్వభావ జన్యములైన స్వకుల కర్మములను విడువఁదగదు.

శ్లో. అసక్త బుద్ధి స్సర్వత్ర జితాత్మా విగత స్పృహః,
నైష్కర్మ్య సిద్ధిం పరమాం సన్న్యాసే నాధిగచ్ఛతి. 49

గీ. అరయ సర్వలోకంబునం-దాశ విడిచి,
మనసును వశము గావించు-కొని తలంపు



లుడిగి, కర్మముల ఫలంబు-విడుచు మాన
వుండు నైష్కర్మ్యసిద్ధిని-బొందుఁ బార్థ!

తా. సమస్త విషయములం దాసక్తి లేనివాఁడును, మనోనిగ్రహము గలవాఁడును, ఎట్టియాశలు లేనివాఁడును నైన మనుష్యుఁడు కర్మఫలత్యాగము చేత, ఉత్కృష్టమైన నైష్కర్మ్యసిద్ధిని బొందుచున్నాడు.

శ్లో. సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధమే,
సమాసేనైవ కౌంతేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా. 50

గీ. పార్థ! నైష్కర్మ్య సిద్ధి సం-ప్రాప్తమైన
వెనుక, పరమాత్మ భావంబుఁ-గనఁగ మార్గ
మైనదియు, మఱి యుత్కృష్ట-మయినదియును
నైన జ్ఞాననిష్ఠఁ దెలుపు-దాలకింపు.

తా. అర్జునా! నైష్కర్మ్య సిద్ధిని బొందిన తరువాత పరబ్రహ్మమును బొందుటకు మార్గమైన జ్ఞాననిష్ఠను గూర్చి నీకు సంక్షేపముగఁ జెప్పెదను, వినుము.

శ్లో. బుద్ధ్యా విశుద్ధయా యుక్తో-ధృత్యాఽఽత్మానం నియమ్య చ,
శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా-రాగ ద్వేషౌ వ్యుదస్య చ. 51

గీ. పొసగ మాయారహితమైన-బుద్ధి గలిగి,
ధైర్యమున మనస్సు నిలిపి,-తనర స్పర్శ
శబ్ద రస రూప గంధ వి-షయచయమును,
ద్వేష రాగములనుఁ దగ-విడువవలయు.

తా. పరిశుద్ధమైన బుద్ధి గలిగి, మనస్సును శబ్దాది విషయము లందుఁ బోకుండునట్లు, ధైర్యముతో వశపఱచుకొని, రాగద్వేషములను విడువవలెను.

శ్లో. వివిక్త సేవీ లఘ్వాశీ యత వాక్కాయ మానసః,
ధ్యాన యోగ పరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః. 52

శ్లో. అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్,
విముచ్య నిర్మమ శ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే. 53





గీ. నిర్జన ప్రదేశంబుల-నిరతముండు
వాఁడు, మితముగ భుజియించు-వాఁడు; వాఙ్మ
న శ్శరీరముల నియమ-నం బొనర్చి
సతతమును ధ్యాన యోగాభి-రతిఁ బరంగు
వాఁడు; వైరాగ్యమున నొప్పు-వాఁడు; బలము,
దర్పమును, గావరంబు, గ్రో-ధంబుఁ, గామ
మును, గృహా రామ సుత దార-ధనములందు
సక్తియు మమత శోక హ-ర్షములు గలిగి
యుండనట్టి విజ్ఞాన ని-ష్ఠుఁడును నగు
పురుషుఁ డొందుఁ బర బ్రహ్మ-మును గిరీటి!

తా. ఇట్లు మనోనిగ్రహమును బొందిన మనుష్యుఁడు రహస్యస్థలమందుండి, మితాహారియై, వాఙ్మనశ్శరీరముల యొక్క నియమనము గలిగి, ఎల్లప్పుడు ధ్యానయోగములం దాసక్తి గలిగియుండి, వైరాగ్యమును బూని, అహంకారమును, సామర్థ్యమును,దర్పమును, కామమును, క్రోధమును, పరిగ్రహమును విడిచి, మమకార రహితుఁడై, శోక మోహా దులు లేక జ్ఞాన నిష్ఠయందుండి పరబ్రహ్మమును బొందుటకు సమర్థుఁడగుచున్నాడు.

శ్లో. బ్రహ్మ భూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి,
సమ స్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్. 54

గీ. బ్రహ్మనిష్ఠుఁ డెల్లపుడు ని-ర్మల మనస్సు
గలిగి, నష్టమయిన వస్తు-వులను గూర్చి
దుఃఖమొందక, లేని వ-స్తువుల మదిఁ ద
లంపకయు, సర్వభూతము-లను సమత్వ
భావమున జూచుచు, మిగుల-భక్తితోడఁ
బూజ సేయుచుండును నన్ను-బొసఁగి పార్థ!

తా. బ్రహ్మనిష్ఠయందున్నవాఁడు నిర్మలమైన మనస్సు గలిగియుండి, నష్టమైన వస్తువులను గూర్చి దుఃఖింపకయు, లేని వస్తువులను గోరకయు సమస్త భూతములందు సమబుద్ధి గలవాఁడై, నాయందు భక్తి గలిగియుండి నన్ను బూజించుచున్నాడు.

శ్లో. భక్త్యా మా మభిజానాతి-యావాన్ య శ్చాఽస్మి తత్త్వతః,
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా-విశతే తదనంతరమ్. 55



గీ. భక్తిచే నన్నుఁ గొలుచుచుఁ-బరఁగ నేను
సచ్చిదానంద రూపుండ,-సర్వగతుఁడ
నంచు వాస్తవముగ గ్రహి-యించు నతఁడు
జ్ఞాన పరిసమాప్తి గలుగ-నన్నె పొందు.

తా. భక్తితో నన్ను పూజించువాఁడు నా యథార్థస్థితిని దెలిసికొని, అనంతరము నన్నే పొందుచున్నాడు.

శ్లో. సర్వ కర్మా ణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః,
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్. 56

గీ. ప్రత్యగాత్ముండనగు నన్నుఁ-బడయఁదగిన
స్థానమంచు దలంచుచు,-శాస్త్ర విహిత
కర్మముల నొనర్చు నతఁడు-గాంచు శాశ్వ
తమగు మోక్షంబు, నా ప్రసా-దంబు వలన.

తా. నేనే పొందఁదగిన స్థానమను భావము గలిగి, శాస్త్రోక్తములైన కర్మములను జేయువాఁడు నా యనుగ్రహము వలన శాశ్వతమైన మోక్షమును బొందుచున్నాడు.

శ్లో. చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః,
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ. 57

గీ. కాన జ్ఞానంబుచే సర్వ-కర్మఫలము
నాకు బ్రీతితో నర్పించి,-నన్నె పరమ
గతిగ మది నమ్మి, జ్ఞానయో-గంబు చేత
మనసు నా యందు దగ ని ల్పు-ము నిరతంబు.

తా. కాబట్టి, నీవు వివేకముతో గూడిన మనస్సుతో సమస్త కర్మముల యొక్క ఫలములు నాకు సమర్పణము చేసి నేనే యుత్కృష్ట గతి యని భావించుచు, బుద్ధియోగము చేత నెల్లప్పుడును నాయందు మనస్సు గల వాఁడవుగ నుండుము.

శ్లో. మచ్చిత్త స్సర్వ దుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి,
అథచేత్త్వ మహంకారా న్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి. 58





గీ. నీవు మనసిట్లు నాయందు-నిల్పితేని
దుఃఖములు నీకుఁ దోడ్తోడ-దూరమగును
నా యనుగ్రహమున; నహం-కార మొంది
వినకయున్న నశింతువు-విజయ! నీవు.

తా. నీవు నాయందే మనస్సు నిలిపి యుంచితివేని నా యనుగ్రహము వలన నీ కష్టము లన్నియుఁ దొలఁగి పోవును; అహంకారము వలన నా మాటలను లక్ష్యము చేయక పోతివేని నశింతువు.

శ్లో. య దృహంకార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయ స్తే, ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి. 59

గీ. పార్థ! నీ వహంకారంబు-వలన, నిటు, ల
ని సలుపనని పలుకుదేని,-నీ పలుకులు
వ్యర్థములగును; బరఁగ నీ-ప్రకృతియె నియ
మించు నిన్ను యుద్ధంబునం-దెసఁగి యిచట.

తా. అహంకారముచేత నీవు యుద్ధము చేయనని పల్కెదువేని, నీ మాట వ్యర్థమగును. నీ ప్రకృతియే నీ చేత యుద్ధము చేయించును.

శ్లో. స్వభావజేన కౌంతేయ! నిబద్ధ స్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్య స్య వశోఽపి తత్. 60

గీ. ప్రకృతి జన్య గుణములకు-వశ్యుఁడవగు
నట్టి నీవు, చేయఁదగని-దనుచు నిశ్చ
యించు కర్మను, దెలియక-యె, యవశుండ
వయి సలుపుదువు ప్రకృతి కా-ర్యంబు వలన.

తా. అర్జునా! స్వభావము వలన బుట్టిన స్వకీయ కర్మమున కధీనుఁడవైన నీవు, అవివేకము వలన నే కర్మమును, జేయఁదగనిదని నిశ్చయించెదవో, యా కర్మమును నీ స్వభావగుణమునకు వశుఁడవై చేయుదువు.

శ్లో. ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా. 61



గీ. యాంత్రికుం డిల బొమ్మల-నాడఁజేయు
నటుల, సర్వభూత నియంత-యైన యీశ్వ
రుండు ప్రాణుల మనసులం-దుండి భ్రమయఁ
జేయు మాయయను స్వశక్తి-చేఁ, గిరీటి!

తా. అర్జునా! సర్వభూత నియామకుఁడైన యీశ్వరుఁడు సమస్త ప్రాణులయొక్క హృదయము లందున్న వాఁడై, దేహముల నధిష్ఠించి యున్న సమస్త జీవులను మాయచేత భ్రమింపఁ జేయుచున్నాడు.

శ్లో. తమేవ శరణం గచ్ఛ సర్వ భావేన భారత!
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్. 62

గీ. ఆ జగన్నియంతనె సక-లాత్మ భావ
మున, సకల విషయములందు-బొసగ శరణు
పొందు; మతని యనుగ్రహ-మునను బడయఁ
గలవు చిత్తశాంతియును మో-క్షమును, పార్థ!

తా. అర్జునా! సర్వాత్మభావము చేత నా యీశ్వరునే శరణు పొందుము. ఆ యీశ్వరుని యనుగ్రహము వలన నుత్కృష్టమైన చిత్త నైర్మల్యమును, దాని వలన శాశ్వతమైన మోక్షమును బొందగలవు.

శ్లో. ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యతరం మయా,
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు. 63

గీ. ఇవ్విధమున నీకుఁ గడఁగి-యెఱుకపఱచి
తిని మిగుల గోప్యమగు జ్ఞాన-మును; విమర్శ
నమునఁ దగఁ దాని దలచి, యొ-నర్పుము తరు
వాత యెటు లిష్టమగునొ, యా-పగిది, పార్థ!

తా. ఈ ప్రకారముగా నేను నీకు రహస్యములలో నతిరహస్యమైన జ్ఞానమును దెలిపితిని. ఈ జ్ఞాన విషయమును సాకల్యముగ విమర్శించి నీకిష్టమగునట్లు చేయుము.

శ్లో. సర్వ గుహ్యతమం భూయః శ్శృణు మే పరమం వచః,
ఇష్టోఽసి మే దృఢ మితి తతో వక్ష్యామి తే హితమ్. 64





గీ. అవని నీవు నాకుఁ బ్రియుఁడ-వగుటఁ జేసి
మరలఁ బరమును, గుహ్యత-మమును నైన
యొక్క మాట నిప్పుడు నీకు-నొక్కి చెప్పె
దను వినుము; నీకుఁ దాన హి-తంబు గలుగు.

తా. నీవు నాకు ప్రియుఁడవగుట వలన, నీకు హితముఁ గూర్చుటకు మిక్కిలి రహస్యమైన మఱియొక మాట చెప్పెదను, వినుము.

శ్లో. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామే వైష్యసి సత్యం తే ప్రతిజానే, ప్రియోఽసి మే. 65

గీ. చేరి మనసును నా యందుఁ-జేర్చి, భక్తి
సలుపుము; నమస్కృతులు ప్రీతి-సలుపు నాకు;
నటుల నొనరింపఁ, దగ మోక్ష-మందగలవు;
ప్రియుఁడవగుట నాకీవు, చె-ప్పితిని నీకు.

తా. నాయందు మనస్సు నిలిపి భక్తితో నన్నే పూజింపుము. నాకు నమస్కారములు చేయుము. అట్లు చేసితివేని నన్నే పొందగలవు (మోక్షమును పొందగలవు). నీవు నాకు ప్రియుఁడవగుట వలన నేను నీకు చెప్పినది యథార్థమని ప్రతిజ్ఞ చేయుచున్నాను.

శ్లో. సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి, మా శుచః. 66

గీ. ఒనర సర్వకర్మలను నా-కొప్పగించి,
యన్యదేవతా పూజన-మాచరింప
కెపుడు, నన్ను శరణు పొందు-మెలమి; నిన్నుఁ,
బాపములనుండి తప్పింతు;-వలదు చింత.

తా. నీవు సమస్త ధర్మములను (కర్మములను) పరిత్యజించి (నా కర్పణము చేసి) అన్య దేవతలను పూజింపక, నన్నే శరణు పొందుము. నేను నిన్ను సర్వపాపముల నుండి విముక్తుని చేయుచున్నాను.

శ్లో. ఇదం తే నా తపస్కాయ-నా భక్తాయ కదా చ న,
న చా శుశ్రూషవే వాచ్యం-న చ మాం యోఽభ్య సూయతి. 67



గీ. నీకు జ్ఞానంబు గలుగంగ-నేను చెప్పి
నట్టి యీ గీతలనుఁ, దప-మాచరింప
ని మనుజునకును, భక్తిలే-ని నరునకును
శ్రద్ధలేని వానికిని, ని-రతము నా వి
షయమున నసూయతో నుండు-జనునకును, నె
పు డుపదేశింప కూడ దె-వ్వఁడును బార్థ!

తా. నీకు జ్ఞాన మార్గము తెలియుట కొఱకు నేను చెప్పిన యీ గీతాశాస్త్రము తపస్సులేని వానికిని, భక్తిలేనివానికిని, విన నిచ్ఛ లేని వానికిని, నాయందసూయ గలవానికిని, ఎప్పుడు నుపదేశింపఁ దగినది కాదు.

శ్లో. **య ఇదం పరమం గుహ్యం—మద్భక్తే ష్వభిధాస్యతి,**
**భక్తిం మయి పరాం కృత్వా—మామే వైష్య త్యసంశయః.** 68

గీ. పరఁగ నుత్కృష్టము, మఱియు-బరమ గోప్య
మయిన యీ శాస్త్రమును నెవ్వఁ-డవని నాదు
శిష్యులగు వారల కుపదే-శించు; నతఁడు
నాకు భక్తుఁడై మోక్షమం-దంగఁ గలడు.

తా. ఎవఁడు పరమోత్కృష్టమైనట్టియు పరమ రహస్యమైట్టియు నీ గీతా శాస్త్రమును నా భక్తుల కుపదేశించునో, వాఁడు నాయందు పరమ భక్తి గలవాఁడై నన్నే (మోక్షమును) పొందగలడు.

శ్లో. **న చ తస్మా న్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః,**
**భవితా న చ మే తస్మ దన్యః ప్రియతరో భువిః.** 69

గీ. అటుల నుపదేశ మొనరించు-నతని కంటెఁ
బ్రియము నాకుఁ జేయునతఁడు-వేఱె లేడు;
వానికంటెఁ బ్రియుఁడు నాకు-వసుధఁ గాన
డిపుడు; ముందుఁ బుట్టంగఁ బో-డెపుడు పార్థ!

తా. అట్లు నా గీతాశాస్త్రము నుపదేశించు వానికంటె మనుష్యులలో నాకు మిక్కిలి ప్రియము చేయువాఁడు మఱియొకఁడు లేడు. ఇకముందును నాకు భూమి యందు వానికంటె నధిక ప్రియు డుండఁ బోడు.





శ్లో. అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః,
జ్ఞాన యజ్ఞేన తే నాఽహ మిష్టస్యా మితి మే మతిః. 70

గీ. ఈ పగిది మన సంవాద-రూపమైన
శాస్త్రమునుఁ బ్రతిదినమును-జదువువారు,
జ్ఞానయోగంబుచేఁ దగ-నన్నుఁ గొలుచు
వారలని నేను భావించు-వాఁడఁ, బార్థ!

తా. ధర్మముతోఁ గూడిన మన యిద్దరి యొక్క యీ సంవాదరూపమైన గ్రంథమును పఠించువారు జ్ఞానయజ్ఞము చేత నన్ను పూజించునట్టి వారని నా యభిప్రాయము.

శ్లో. శ్రద్ధా వా ననసూయ శ్చ-శ్శృణు యా దపి యో నరః,
సోఽపి ముక్త శ్శుభాన్ లోకాన్-ప్రాప్ను యా త్పుణ్య కర్మణాం. 71

గీ. ధర ననూయ వహింపకే-పురుషుఁడు దగ
గీత యనెడి యీ శాస్త్రంబుఁ-గెరలి శ్రద్ధ
తోడ వినునొ, యతండు పూ-తుండయి, పుణ్య
కర్మ లొనరించు వారి లో-కముల కరుగు.

తా. అసూయ లేక శ్రద్ధతో నీ గీతా శాస్త్రమును విను వారును, పాపముల చేత విడువఁ బడినవారై, పుణ్యకర్మములు చేసిన వారి లోకములు పొందుదురు.

శ్లో. కచ్చిదేత చ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా,
కచ్చి దజ్ఞాన సమ్మోహః ప్రణష్ట స్తే ధనంజయ! 72

గీ. పార్థ! నేను నుడివిన యీ-పరమ గోప్య
శాస్త్రమును వింటివా, నీవు-శ్రద్ధ తోడఁ?
బోయెనా నీకుఁ గలిగిన-మోహమిప్పు?
డని యడిగి యూరకుండె దై-త్యారి యంత.

తా. ఓ యర్జునా! నేను చెప్పిన యీ గీతాశాస్త్రమును ఏకాగ్రచిత్తుఁడవై వింటివా? అజ్ఞానము వలన గలిగిన నీ యవివేకము పోయినదా? చెప్పుము.



అర్జున ఉవాచ :

శ్లో. నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత!
స్థితోఽస్మి గత సందేహః, కరిష్యే వచనం తవ. 73

గీ. అంత విజయుఁ డిట్లనియె దై-త్యారి తోడ,
"దేవ! నీ యనుగ్రహ సమృ-ద్ధి వలన, గత
మయ్యె నా యవివేకంబు;-చయ్యన నను
మాన మరిగెఁ; గై కొందు నీ-యాన నేను."

తా. ఓ కృష్ణ స్వామీ! నీ యనుగ్రహము వలన నా యవివేకము నశించినది; జ్ఞానము పొందితిని; సందేహము గతించెను. నీవు చెప్పినటులఁ జేయఁగలను.

సంజయ ఉవాచ :

శ్లో. ఇ త్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః,
సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమ హర్షణమ్. 74

సంజయుఁడు చెప్పుచున్నాడు :

గీ. అద్భుతంబు మఱియు రోమ-హర్షణమగు
శ్రీపతి కిరీటి సంవాద-రూపమున నె
సంగు గీత నాఁ బరఁగు శా-స్త్రంబు వింటి
నయ్య, ధృతరాష్ట్ర! ధన్యుండ-నైతినయ్య.

తా. ఓ ధృతరాష్ట్రా! నే నీ విధముగా ఆశ్చర్యకరమైనట్టియు, గగుర్పాటు గలిగించునట్టియు, కృష్ణార్జునుల సంవాద రూపమైనట్టియు గీతాశాస్త్రమును వింటిని.

శ్లో. వ్యాస ప్రసాదా చ్ఛ్రుతవా-నేత ద్గుహ్యతమం పరమ్,
యోగం యోగేశ్వరా త్కృష్ణా-త్సాక్షా త్కథయత స్స్వయమ్. 75

గీ. చేరి యోగేశ్వరుండగు-శ్రీవరుండు
స్వయముగ నతి గోప్యమగు నీ-శాస్త్రమును వి
జయునకుఁ దెలుపుచుండ, వ్యా-స కృప వలన
వినఁ గలిగితయ్య, రాజేంద్ర!-వేడ్క మీర.





తా. ఉత్కృష్టమైనట్టియు, మిక్కిలి రహస్యమైనట్టియు నీ గీతా శాస్త్రమును యోగేశ్వరుడగు శ్రీకృష్ణస్వామి అర్జునునకు ప్రత్యక్షముగా చెప్పుచుండగా వేదవ్యాసుని యనుగ్రహము వలన నాకు గలిగిన దివ్య శ్రవణ శక్తి వలన నేను వింటిని.

శ్లో. రాజన్ సంస్మృత్య సంస్మృత్య–సంవాద మిమ మద్భుతమ్,
కేశ వార్జున యోః పుణ్యం హృష్యామి చ ముహు ర్ముహుః. 76

గీ. తలఁప నద్భుతమును బవి-త్రమును నైన
శ్రీపతి కిరీటి సంవాద-రూప శాస్త్ర-
మును మదిని దలఁచుకొనుచుఁ-బొందుచున్న
వాఁడను నరుసంబు మిగులఁ-బార్థివేంద్ర!

తా. ఓ ధృతరాష్ట్రా! ఆశ్చ్యకరమును పవిత్రమును నైన యీ కృష్ణార్జున సంవాదమును తలచి కొనుచు తలచికొనుచు మరల మరల సంతోషించుచున్నాను.

శ్లో. తచ్చ సంస్మృత్య సంస్మృత్య–రూప మత్యద్భుతం హరేః,
విస్మయో మే మహాన్ రాజన్!–హృష్యామి చ పునః పునః. 77

గీ. కృష్ణదేవుఁడు పార్థున-కెలమిఁ జూపి
నట్టి విశ్వరూపంబును-సంస్మరింప
నచ్చెరువును మఱియుఁ బుల-కాంకురమును
గలుగుచున్నవి నాకు మి-గుల, నరేంద్ర!

తా. ఓ ధృతరాష్ట్రా! మిక్కిలి యాశ్చర్యకరమైన శ్రీకృష్ణ స్వామి యొక్క యా విశ్వ రూపమును ధ్యానింపగా-ధ్యానింపగా నా కాశ్చర్య మధికమగుచున్నది; శరీరము పైన గగుర్పాటు జనించుచున్నది.

శ్లో. యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ. 78

(మోక్షసన్న్యాసయోగోనామ అష్టాదశోధ్యాయ స్సంపూర్ణమ్–సర్వం స్సంపూర్ణమ్)



గీ. చేరి యోగేశ్వరుండగు-శ్రీపతియును,
బరఁగఁ గోదండధారియై-ఫల్గునుఁడును,
నుందు రెచ్చోట; నచ్చోట-నుండును స్థిర
మైన నీతి, సంపద, విజ-య, మని తలఁతు.

తా. ఎచ్చోట యోగేశ్వరుఁడైన శ్రీకృష్ణుఁడును, ధనుర్ధరుఁడైన యర్జునుఁడును నుందురో, అచ్చట సంపదయు, జయమును, స్థిరమైన యైశ్వర్యమును, నీతియు నుండునని నాయభిప్రాయము.

(మోక్షసన్న్యాసయోగమనెడి అష్టాదశాధ్యాయము సంపూర్ణము)

గీ. కౌశికాహ్వయ గోత్రుఁడు-గరికపాటి
వంశజుఁడగు లక్ష్మీకాంత-భావనాముఁ
డిమ్ముగ విబుధవరుల భా-వమ్ముల విని
యిటుల నీపొత్తమును రచి-యించె రహిని.

మంగళమ్ మహత్.

సర్వేజనాస్సుఖినోభవన్తు

ఓమ్ నమో వాసుదేవాయ నమః

ప్రకటించినవారు :

శ్రీ సి. నారాయణ, వికారాబాద్

శ్రీ జె. సదాశివరెడ్డి, వికారాబాద్ (రైల్వే కాంట్రాక్టర్స్)

డా॥ కర్రా సోమశేఖరం

నెం.22-210, రాధాకృష్ణ నగర్

మల్కాజిగిరి- 500 047.

ఫోన్ : 623921

# "శ్రీ గీతా భావార్థ చంద్రిక"
# ఆవిష్కరణోత్సవ దృశ్యాలు

(భగవద్గీత మూల శ్లోకములు, ఆంధ్రపద్యములు-తాత్పర్య సహితము)

(శంకర మతానువాదము)



సభకు విచ్చేయుచున్న- సభాధ్యక్షులు శ్రీ కౌతా లలితా మనోహర్, బ్రహ్మశ్రీ చింతలపాటి సుదర్శన శ్రీనివాసశాస్త్రిగారలకు ప్రచురణకర్త గరికపాటి దక్షిణామూర్తి స్వాగతము పలుకుచున్నారు.

## సభారంభమునకు శుభారంభముగా

"శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణ"ను ప్రారంభించ వలసిదిగా
ప్రచురణకర్త విజ్ఞాపన చేయుట



(ఎడమ నుండి కుడికి ఆశీనులైనవారు) సర్వశ్రీ అన్నంరాజు ఉమామహేశ్వరరావు, కొమ్మరాజు లక్ష్మణరావు, ఇంగువ భాస్కర నారాయణశర్మ, సందుల సుబ్రహ్మణ్యం, (వెనుకవైపు) యడవల్లి శీతారామ శాస్త్రి చింతలపాటి సుదర్శన శ్రీనివాసశాస్త్రిగారలు.



వేదికపై ఆశీనులైన పెద్దలు (ఎడమ నుంచి కుడికి) ప్రచురణకర్త,
బ్రహ్మశ్రీ దాద సుబ్రహ్మణ్య చయనులుగారు, శ్రీ కౌతా లలితా మనోహర్‌గారు

—

"శ్రీ గీతా భావార్థ చంద్రిక" ఆవిష్కరణ దృశ్యము



కృష్ణాజిల్లా ఆకిరిపల్లి సంస్కృత కళాశాల ప్రధానాచార్యులు బ్రహ్మశ్రీ
దాద సుబ్రహ్మణ్య చయనులుగారు గ్రంథావిష్కరణ జరిపి, సభాసదులకు
చూపుచున్న దృశ్యము. వారి ప్రక్కన నిలుచున్నవారు సభాధ్యక్షులు
శ్రీ కౌతా లలితా మనోహర్‌గారు, పద్మారావు నగర్, సికింద్రాబాద్.



గ్రంథావిష్కరణానంతరము శ్రీ చయనులుగారు భాషించుచున్న దృశ్యము. వారిప్రక్కన ఆశీనులైనవారు బ్రహ్మశ్రీ చింతలపాటి సుదర్శన శ్రీనివాస శాస్త్రిగారు



"శ్రీ గీతా భావార్థచంద్రిక" ప్రాశస్త్యాన్ని గురించియు, ముద్రణారంభమునకు జరుపబడిన కృషిని గూర్చియు బ్రహ్మశ్రీ చింతలపాటి సుదర్శన శ్రీనివాస శాస్త్రిగారు సవివరముగా సభాసదులకు వివరించుచున్న దృశ్యము. వారికి కుడివైపున ఆశీనులైనవారు సభాధ్యక్షులు శ్రీ కౌతా లలితా మనోహర్‌గారు

# అధ్యక్షోపన్యాసము



"శ్రీగీతాభావార్థ చంద్రిక" ప్రచురణా ప్రాశస్త్యాన్ని గురించియు, సమకాలీన సమాజంలోని పెద్దలు, పిన్నలు ఆచరించవలసిన సదాచార సాంప్రదాయములను గురించియు ఈనాడు మనం జరుపుకొనుచున్న ఇటువంటి సత్కార్యాచరణలపట్ల భావితరాలవారికిగూడ సమాదరణ భావం కలిగేటట్లుగా మనం నడుచుకొనవలసిన ఆవశ్యకతను గురించియు, మృదుమధుర శైలిలో సభాధ్యక్షులు శ్రీ కౌతా లలితా మనోహర్‌గారు వివరణాత్మకముగా తమ అధ్యక్షోపన్యాసాన్ని కొనసాగించుచున్న దృశ్యము



ఆవిష్కరణోత్సవ సభలో పాల్గొన్న సభాసదులు (దృశ్యము: నెం. 1.)



సభకు విచ్చేసిన పెద్దలలో కొందరు (దృశ్యము నెం. 2)



సభలో ఆశీనులైన కొందరు ప్రముఖులు (దృశ్యము నెం. ౩)

—

అవిష్కరణోత్సవ సభ ముగింపు దృశ్యము



(ఎడమనుండి కుడికి) అవిష్కరణోత్సవ సభకు విచ్చేసిన సహృదయులైన సభాసదులకు, కార్యక్రమాన్ని శోభాయమానంగాను, అర్థవంతంగాను నిర్వహించిన సభాధ్యక్షులకు, ఆవిష్కర్తకు, ఉపన్యసించినవారికి ధన్యవాదములు తెలుపుచున్న ప్రముఖ న్యాయవాదులు శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల సింగరాచార్యులుగారు.

## ఆవిష్కరణోత్సవ సభలో పాల్గొనిన వారిలో ప్రచురణకర్తకు అత్యంత శ్రేయోభిలాషులలో కొందరు



(ఎడమనుండి కుడికి) సర్వశ్రీ యడవల్లి శీతారామశాస్త్రి, ప్రచురణకర్త, నాలుగుదశాబ్దాల నుండియు ప్రచురణకర్తకు అత్యంతాప్త మిత్రుడు, సహృదయుడు, సరళస్వభావి, సికింద్రాబాద్‌లోని మూర్తి ప్రాసెస్ (ఫోటో అండ్ లైన్‌బ్లాక్ మేకర్స్) అధిపతి సోమవరంపేట రామమూర్తి; మృదుస్వభావులు, చిత్రకళా నైపుణ్యధురీణులు, సన్మిత్రులు పోచంపల్లి బ్రహ్మచారి- ఆజన్మ బ్రహ్మచర్య వ్రతనిష్ఠా గరిష్ఠులు, సత్కార్యాచరణాభిలాషులు, నిరాడంబరమూర్తి, ఆవిష్కరణోత్సవ సభా భవన నిర్మాణదాతలు మారెళ్ల కనకరాజు గారలు.

ఆవిష్కరణోత్సవ సభ విజయవంత మగుటకు తోడ్పడిన సహృదయులు



(ఎడమనుండి కుడికి) సర్వశ్రీ అనప్పిండి విశ్వనాథం; ప్రచురణకర్తకు బాల్యమిత్రుడు, శ్రీ గీతా భావార్థ చంద్రిక వ్రాతప్రతి దశనుండి ముద్రింపబడి ఆవిష్కరణ జరుపుకొను వరకు గల అన్ని దశలలోను ప్రచురణకర్త కన్నసు మిన్నగా శ్రమించి, తొలుదొల్తగా మూడు వేలరూపాయల భూరి విరాళమిచ్చుటయేగాక, ప్రచురణ దశలో లోటు పడిన ధనమును ఇచ్చి, ఆవిష్కరణ కార్యక్రమము విజయవంత మగుటకు ప్రధాన సూత్రధారి, అన్వర్థ నామధేయుడు చి॥ కంభంపాటి గోపాలకృష్ణమూర్తి; ప్రచురణకర్త; ప్రచురణకర్త దౌహిత్రి చి॥ పింగళి రమ్యప్రత్యూష; ప్రచురణకర్త పినతల్లి కుమారుడు, ఆవిష్కరణోత్సవ దృశ్యాలను ఫోటోగ్రాఫ్ ద్వారా చిత్రీకరించినవారు, రిటైర్డ్ టీచర్ చెఱుకుపల్లి పూర్ణానందశర్మ గారలు.

# "............అందరికీ వందనములు"

"కాలోచిత కర్మ కరోతి విద్వాన్" అన్న సూక్తిని గుర్తుచేసికుంటే ఇప్పుడు - ఈకాలానికి - ఈ సమాజంలోని వారికి - నేను ప్రచురించిన ఈ గ్రంథం గురించి, వివిధ రకాలయిన అభిప్రాయాలు వ్యక్తీకరింప బడతాయి. కొందరు, నాకృషిని శ్లాఘించినారు, ఇంకొందరు తద్విరుద్ధమైన తమ మనోగతాభిప్రాయాలను వెలిబుచ్చినారు.

కనుకనే "ఎందరో మహానుభావులు - అందరికీ వందనములు" అని 'నాదబ్రహ్మ' త్యాగయ్యగారు పలికిన పసిడి పలుకులనే, నేనుగూడా పలుకుతూ - విభిన్న అభిప్రాయాల మేళవింపు అయిన ఈ సమాజంలోని అందరికీ నా వందన శతాలు తెలుపుకుంటున్నాను.

ఈ సందర్భంగా - గ్రంథారంభంలో 'నా మాటలో' నేను పేర్కొనని సహృదయులైన దాతలకు; బంగారానికి మెరుగు పెట్టిన విధంగా, నేను, ప్రచురించిన ఈ గ్రంథమును సాకల్యంగా పరిశీలించి సుదీర్ఘమైన, సుమధురమైన అభిప్రాయాన్ని ప్రసాదించి, నాకృషికి గుర్తింపు తెచ్చిన మహనీయులైన విద్వత్కవి పండిత శ్రేష్ఠులు, శ్రీమాన్ నల్లదీగ శ్రీనివాసాచార్యుల వారికీ; అత్యంతాప్త హృదయంతో 'చంద్రికా స్నానం' ప్రసాదించిన మధుర కవితావతంసులు శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యుల వారికీ; స్థూల పరిశీలనచేసి, సూక్ష్మార్థ వివరణచేసిన బ్రహ్మశ్రీ చాద సుబ్రహ్మణ్యాచయనులుగారికీ; 'గీత' పై తమకుగల ఎనలేని మక్కువను, తమ అభిప్రాయం ద్వారా ప్రసాదించిన శ్రీ కౌతా లలితా మనోహర్‌గారికీ - ఇంకా ఇంకా ఎందరెందరో సుమనస్కులు, నాకొసంగిన సహాయ సహకారములకు కృతజ్ఞతాంజలి బద్ధుడనై, వారందరికీ శ్రీ మహావిష్ణు అనుగ్రహ ఆశీర్వచనములు లభించాలని ఆశిస్తున్నాను.

ఇతిశమ్.

— గరికపాటి దక్షిణామూర్తి

ప్రచురణకర్త

# నమోవాకములు ....

[“శ్రీ గీతా భావార్థ చంద్రిక” ముద్రణకుగాను తమ తమ యథాశక్తి భూరివిరాళాలు అందించి, అర్థశతాబ్దిగా మరుగున పడియున్న సద్గ్రంథ ప్రచురణకు లోకకల్యాణ కాంక్షతో ప్రచురణకర్తకు ఉత్సాహాన్ని, ప్రోత్సాహాన్ని కలుగజేసిన “దైవీభావ సంపన్నులను” ఎంతగా శ్లాఘించినను, వారి ఉదార హృదయాన్ని గురించి ఎన్ని విధాలుగా కీర్తించినను తక్కువయేనని వినమ్రపూర్వకముగా భావించుచున్నాను. వారి శుభ నామములను ఈ దిగువ ప్రచురించి, రాబోవు తరాలవారు వీరిని ఆదర్శంగా తీసికొని సత్కార్యాచరణకు ముందడుగు వేయుదురని ఆశించుచున్నాను. — ప్రచురణకర్త]

మ॥రా॥శ్రీ మండవల్లి ముత్యాలరావు గారు (తండ్రి: వేంకటరమణమూర్తి గారు), శ్రీమతి మండవల్లి రత్నమాణిక్యాంబ గారు, భుదునుకుల గోత్రము (జననము: రామచంద్రపురం, తూర్పు గోదావరి జిల్లా) ప్రస్తుత నివాసము: ఇం. నెం. 6-1-190/6, వాకర్ టౌన్, సికింద్రాబాదు-500 025, ఫోన్: నెం 615514.

ప్రథమాధ్యాయము “అర్జున విషాద యోగము” ఈ దంపతుల భూరివిరాళముతో ప్రచురింపబడినది,

(మల్కాజిగిరి రాధాకృష్ణనగర్ నివాసులు శ్రీ వెముడుపాటి రామనాథం గారి ద్వారా). రూ. 3000

చి॥ చింతపల్లి జయలక్ష్మి (భర్త కీ.శే. రాధాకృష్ణమూర్తి) హరితసగోత్రము, (తల్లి : కీ.శే. దెందుకూరి మహాలక్ష్మమ్మ, అన్న : కీ.శే. వేంకటకృష్ణయ్య, యాస్క సగోత్రము). పై కీర్తిశేషుల జ్ఞాపకార్థము తనవంతు విరాళాన్ని ప్రకటించి, పంపుటేగాక, నాయందు జ్యేష్ఠసోదర భావముతో గౌరవించుచున్న చి॥ జయలక్ష్మికి శ్రీ కృష్ణ భగవానుడు ఆయురారోగ్యైశ్వర్యముల నొసగి, తన ముగ్గురుకుమారుల వంశము వృద్ధి చెందాలని ఆశీర్వదించుచున్నాను (బ్రాడీపేట, 4వ లైన్, గుంటూరు.) 1116

| | |
|---|---|
| శ్రీ లక్ష్మి నరసింహ ప్రింటర్స్, నెం. 23-204 రాధా కృష్ణ నగర్, మల్కాజ్‌గిరి. ప్రొ॥ జి. ఉపేంద్రరెడ్డి | 1116 |
| మ॥ రా॥ శ్రీ దాచేపల్లి నరసయ్యగారి నాగేందర్‌రావు ప్లాట్ నెం. 2, జవాహర్‌నగర్ కాలనీ, పి. జి. రోడ్, సికింద్రాబాదు-3 | 516 |
| శ్రీ వెలమకన్ని శ్రీరామకృష్ణ; భారద్వాజ సగోత్రము; డిప్యూటీ జనరల్ మేనేజర్ (ఎమ్. ఎమ్.) ఆయిల్ ఇండియా లిమిటెడ్, న్యూఢిల్లీ | 500 |
| చి॥ గౌరిపెద్ది వేంకటలక్ష్మి (భర్త కీ॥ శే॥ రామకృష్ణారావు పేర) | 335 |
| శ్రీ కంభంపాటి రాధాకృష్ణమూర్తి గారు, ఇంటి నెం. 6-4-486, రామ్‌నివాస్, కృష్ణనగర్‌కాలనీ, సికింద్రాబాదు-500 380 | 300 |
| కోట వేంకటరత్నమ్మ గారు (భర్త కీ॥ శే॥ శ్రీ రంగయ్య, తదవర్తి గోత్రము) | 300 |
| శ్రీ ఆర్. వేంకటేశ్వరరావు గారు (తండ్రి: శ్రీ జగన్నాథ రావు గారు) గోరుకంటి గోత్రము | 300 |
| శ్రీ పి. నరసింహారావు గారు (తండ్రి: శ్రీ శ్రీనివాస రావు గారు) (పై ముగ్గురి విరాళములు శ్రీ రామనాథం, రాధాకృష్ణనగర్, మల్కాజిగిరి-వారిద్వారా చేరినవి ) | 300 |
| శ్రీ చామర్తి రత్తయ్యగారు, అకౌంటెంట్, గాడ్రెజ్ ఇండియా లిమిటెడ్, ఆబిడ్స్, హైద్రాబాదు | 300 |
| శ్రీ పంబాగ్నుల సుబ్రహ్మణ్యం వారి సోదరుడు సూర్యనారాయణ (తమ తండ్రి కీ॥శే॥ విశ్వనాథశాస్త్రి భాగవతార్‌గారి స్మృత్యర్థము) | 216 |
| శ్రీ కంభంపాటి గోపాలకృష్ణమూర్తిగారు | 3000 |

("శ్రీ గీతా భావార్థ చంద్రిక" పదునెనిమిదవ అధ్యాయము-మోక్ష సన్న్యాసయోగము-ముద్రణాదాత.)

# కృతజ్ఞతాంజలి

"శ్రీ గీతా భావార్థ చంద్రిక" ప్రచురణకుగాను విరాళములిచ్చి
శ్రీ కృష్ణానుగ్రహప్రాప్తి నందినవారు

(పేరునకు ముందుగా - బ్రహ్మశ్రీ అనిగాని, మ॥ రా॥ శ్రీ అనిగాని, 'శ్రీమాన్' అనిగాని 'శ్రీ' / 'శ్రీమతి' అనిగాని; చివరన 'గారు' అనియు యథోచితముగా చేర్చి చదువుకొన వలసినదిగా ప్రార్థన. —ప్రచురణకర్త)

| | |
|---|---|
| శ్రీ ప్రసన్నాంజనేయస్వామి దేవాలయం, మధురా నగర్ కాలనీ, నేరెడ్‌మెట్ | రూ. 120 |
| మాధవపెద్ది వేంకటరత్నం, మధురానగర్‌కాలనీ, నేరెడ్‌మెట్ (తమ ధర్మపత్ని కీ॥ శే॥ వేంకటలక్ష్మిగారి పేర) | 120 |
| శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణ బృందము హైదరాబాదు. | 116 |
| యడవల్లి కృష్ణమూర్తి (బాబాయి, నెం. 1-10-29, అశోక్‌నగర్, హైదరాబాదు | 116 |
| చతుర్వేదుల మురళీ మోహనశాస్త్రి, దోమల్‌గూడ, హైదరాబాదు. | 116 |
| భైరవభట్ల వేంకట రామ బ్రహ్మశాస్త్రి. దయానంద నగర్, మల్కాజిగిరి | 116 |
| కాజా రాధాకృష్ణమూర్తి, ఆనందబాగ్, మల్కాజిగిరి. | 116 |
| నేతి రామచంద్రరావు (రిటైర్డ్ సబ్‌జడ్జి) న్యూనల్లకుంట, హైదరాబాదు-44 | 116 |

డా॥ రామకృష్ణారెడ్డి (హోమియోవైద్యులు)
చికడపల్లి, హైదరాబాదు. 116

మొక్కపాటి రామారావు, మహేంద్రహిల్స్ 121

డి. విజయ రామారావు అసిస్టెంట్ స్టేషన్ మాస్టర్,
ఎస్. సి. రైల్వే, కైకలూరు, కృష్ణాజిల్లా 141

కంచిభొట్ల హనుమంత రామయ్య, గీతానగర్,
మల్కాజిగిరి 116

విష్ణుభొట్ల అంజనేయశర్మ- అలకాపురి, హైదరాబాదు 116

నల్లాన్ చక్రవర్తుల సింగరాచార్యులు అడ్వొకేట్
ఇంటి. నెం. 22-5౪, రాధా కృష్ణనగర్ మల్కాజిగిరి 116

కొచ్చర్లకోట వీర వేంకట కృష్ణారావు, అడ్వొకేట్
నెం. 23-54, రాధాకృష్ణనగర్, మల్కాజిగిరి 116

మంత్రిప్రగడ సూర్యనారాయణ, మెట్టుగడ్డ,
సికింద్రాబాద్ 11

మంగోలు మానయ్య, సుపర్ణ సగోత్రము
ఇంటి నెం. 3-14, వాణీనగర్, మల్కాజిగిరి 11

చింతలపాటి సుదర్శన శ్రీనివాస శాస్త్రి 11

బెజగం రాధాకృష్ణమూర్తి, బృందావన్ అపార్ట్ మెంట్స్
అడిక్ మెట్, హైదరాబాదు 10

కొండముది చలపతిరావు, వాణీనగర్, మల్కాజిగిరి 10

ముదిగొండ వీరభద్రయ్య, హౌసింగ్ బోర్డ్ కాలనీ,
మౌలాలి. 1

కె. వెంకటేశ్వరరావు (శర్మగారు, ఎన్. ఎఫ్. సి) 1

డి. ఎ[illegible]న్. మూర్తి

శ్రీ భగవానువాచః

శ్లో॥ కచ్చిదేత చ్ఛ్రుతం పార్థ, త్వయైకాగ్రేణ చేతసా.
కచ్చి దజ్ఞాన సమ్మోహః, ప్రణష్ట స్తే ధనంజయః (అధ్యా॥ 18-శ్లో. 72)



అర్జున ఉవాచ:

శ్లో. నష్టో మోహః స్మృతిర్లబ్ధా, త్వత్ప్రసాదా న్మయాచ్యుత।
స్థితోస్మి గతసన్దేహః. కరిష్యే వచనం తవ. (అధ్యా॥ 18-శ్లో. 73)